నా దేశం నా ప్రజలు

అనే

# ఆధునిక మహాభారతము

*Published by*
**The Indian Languages Forum**
Goshamahal,
Hyderabad-500 012 (A.P.)

ఆధునిక మహాభారతము

ప్రథమ ముద్రణ : 1985
ద్వితీయ ముద్రణ · 1992
తృతీయ సంస్కరణ 1993



వెల : రూ. 45/–

ఈ పుస్తకం దొరికే చోటు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-4-435 బాంక్ స్ట్రీట్,
హైదరాబాదు – 1 మరియు
వారి బ్రాంచీలు
(1) విశాలాంధ్ర బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్
(2) హనుమకొండ (3) విజయవాడ (4) కాకినాడ (5) విశాఖపట్నం
(6) గుంటూరు (6) తిరుపతి (8) అనంతపురం

ముఖ చిత్రం
PAUL KOUYIOUMTZIS
ప్రఖ్యాత గ్రీకు చిత్రకారుడు,
ఎథెన్స్ (Greece)

ముద్రణ :
భరద్వాజ్ ప్రింటర్స్
రామ్‌కోటి, హైదరాబాద్

# విషయ సూచిక

# ఒక సూచన

కాలానుగతంగా లోకధర్మం పుడుతుంది. లోకధర్మాన్ని చూపించే పురాణ ఇతిహాస కావ్య శాస్త్రాదులు పుడతాయి. వ్యాసమహభారతం ప్రాచీన ప్రజల కోసం పుట్టింది. ఈ ఆధునిక మహాభారతం ఆధునిక యుగీన ప్రజల కోసం పుట్టింది. వ్యాస భారతం ఉత్తరదేశంలో పుడితే ఆధునిక భారతం దక్షిణ దేశంలో పుట్టింది. ప్రాచీన బారతం పండితభాషలో పుడితే ఆధునిక భారతం ప్రజల భాషలో పుట్టింది. తొలుత వ్యాస భారతం ఎనిమిదివేల శ్లోకాలు గల జయం అనే ఇతిహాసం అయితే ఆధునిక భారతం ఎనిమిది సర్గలు గల "నాదేశం నా ప్రజలు" అనే ఇతిహాసంగా అంకురించింది. అది భూమి కోసం జరిగిన యుద్ధమయితే ఇది కూడా భూమి కోసం జరిగిన యుద్ధమే – అక్కడ ఉన్నత కుటుంబాలు భూమిని హస్తగతం చేసుకోడానికి యుద్ధం చేస్తే ఇక్కడ ప్రజానీకం భూమిని హస్తగతం చేసుకోడానికి యుద్ధం చేస్తారు. వ్యాసభారతం లాగే ఇది కూడా క్రమంగా పెరిగి బృహద్గ్రంథం అయింది. దానిలాగే ఇదీ ఇతిహాసము, పురాణము, మహాకావ్యము, పారాయణగ్రంథము, పుణ్యప్రదము –

వర్గ చైతన్యం జ్వలింప జేయడమే ఇక్కడ కావ్య హృదయం. ఆధునిక మహాభారతాన్ని తెలుగు గ్రామాల్లో ప్రతి పూర్ణిమ రాత్రీ గ్రామ చెట్టు క్రిందో, గ్రామ రచ్చబండ దగ్గరో దేవాలయ మంటపంలోనో చిన్న చిన్న జనసముదాయాల్ని సమీకరించి, కావ్య ప్రియుడైన వ్యక్తి శ్రావ్య కంఠంతో గాన ఫక్కిలో వినిపించడం ప్రజావళికి శ్రేయోదాయకము. అదే పురాణ శ్రవణం

ఆధునిక మహాభారతం వింటే, గులాం మనస్తత్వ కారణంగా వంగిపోయిన మోకాళ్ళలో బలం వచ్చి, మనిషి కాళ్ళు నిటారుగా నిలుస్తాయి దాని పైన, వంగి వంగి సలాములు చేసి చేసి వంకర టింకర్లు అయిపోయిన వెన్నెముక ఇనప చువ్వలా నుల్చుంటుంది. సిగ్గు విడిచి తల వంచి వంచి

మెలిగే అలవాటు చేత సదా వేలాడే తల ఒక్కసారి భుజాల మీద లేచి నిర్భయంగా నిలబడుతుంది. మనిషి మనిషిగా మారిపోతాడు; భూగోళానికి ఇరుసు అవుతాడు.

## ఫలశ్రుతి

వర్గచేతన సిద్ధి, ఆత్మగౌరవ వృద్ధి । జనవైరి నిర్మూలన, సమతా సమున్మీలన సత్కాల వర్షాళి, సస్యసంధ్యాకేళి । క్షామ రహిత గ్రామ ప్రాభాత వాహ్యాళి పశుపక్షి వృక్షాది ప్రాణికోట్లకు హాయి । పూర్ణ విగళితరుజ, దేశ దేశ ప్రజ ధన ధాన్య సమృద్ధి, విద్యాన్న గృహలబ్ధి । ఆబాలగోపాలమూ అన్యోన్య భూగోళమూ

* * * * *

స్వస్తి ప్రజాభ్య ః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ జన రాజ్య తంత్రాః
శుభమస్తు పశుపక్షి వృక్షకీటేభ్య ః
లోకా ః సమస్తా ః సుఖినో భవంతు . . . .

# అవతారిక

మానవ హస్తం శ్రమకు మూలస్థానం శ్రమ మానవనాగరికతకు జన్మస్థానం అనే ఆధునిక యుగీన చేతనకు ఇవ్వబడిన కావ్య రూపమే ఈ నాదేశం నా ప్రజలు అనే ఆధునిక మహాభారతం. నిర్విరామ భ్రమణం చేసే కాలమే ఒక నిరంతర శ్రామికుడు ఆ శ్రామికుడి హస్తమే సూర్యుడు అనే శ్రామికలోక వస్తు నిర్దేశంతో సూర్యోదయంతో కావ్యారంభం అవుతుంది. "లేస్తోంది ఉషఃకాంతుల్లో నుంచి ఒక హస్తం ఆ హస్తం నిరంతర శ్రామికుడి సమస్తం" –

ఆధుని మహాభారతం అంటే మన ఆధునిక మహాభారత దేశం. పూర్వకాల దేశం కాదనడానికే ఆధునిక అనబడింది. ఏదేశ కథ కేవలం కర్షకేతిహాసమో ఆ దేశకథ ద్వారా మానవజాతి ఇతిహాసం చెప్పబడుతోంది.

మానవ జీవితం ఒక మహాభారతం. అన్ని జీవితాల్లోనూ ఉంటాయి అరణ్యవాసము అజ్ఞాతవాసము ఆ తర్వాత యుద్ధము. అరణ్యవాస అజ్ఞాత వాసాలు కూడా యుద్ధానికి రూపాంతరాలు. తీవ్ర తీవ్రతర తీవ్రతమ యుద్ధాలు ఆ మూడు దశలు. ఇలా జీవితం అంతా ఏదో ఒకవిధంగా మనిషి జీవించడానికి జరిపే పోరాటమే. యుద్ధ ఫలితంగా లభించిన సింహాసనం, అంటే జీవన సంగ్రామఫలం, మనిషి తృప్తిగా అనుభవించేది కాదు. లాంఛనప్రాయము క్షణ మాత్రము. సింహాసన ప్రాప్తికి ఉత్తర క్షణమే స్వర్గారోహణం. అది కూడా స్వర్గ ఆరోహణం. ఆరోహణ సమతల

గమనం కాదు. స్వర్గారోహణ పర్వతారోహణ; అత్యంత కష్టభరితమైన కంటక శిలామయ దీర్ఘ ప్రయాణము. అట్టి స్వర్గారోహణలో మనిషి శరీరభారాన్ని తెలుసుకోవడం మొదలు పెడతాడు. శరీరాన్ని మోయజాలని దశ చేరుతాడు. అప్పుడు శరీరాన్ని జారవిడుస్తాడు. స్వర్గారోహణలో దేహధారణ అసాధ్యమై మానవుడు దేహత్యాగం చేస్తాడు. లోకంలో శిఖరస్థానం ఎక్కిన అన్ని ఇతిహాసాల్లోనూ ఈ సారాంశం సాక్షాత్కరిస్తుంది.

ఇది మకుటం ధరించి శాసించే రాజునుంచి మడి దున్ని బ్రతికే రైతు వరకూ సమస్త మానవ జాతికి సాధారణంగా సమానమైన జీవన అనుభూతి. అందరికీ సుఖదుఃఖ మిశ్రమపాత్ర జీవయాత్ర.

ఈ జీవన సంగ్రామం నుంచి పారిపొమ్మనే పిరికితనం మనిషిని వెంటాడుతూ ఉంటుంది. పరాజయ బలం అడుగడుగునా బెదిరిస్తూ ఉంటుంది. కాని అంతిమక్షణం వరకూ జీవన పోరాటం సాగించడమే మానవ ధర్మం. మనిషి బ్రతకడమే, బ్రతకడానికి ఉన్న హక్కు స్థాపించడమే మానవ ధర్మం. తన జీవన హక్కును అనుభవించడానికి అవసరమైతే శస్త్రధారణ చెయ్యడం మానవధర్మం. మానవుడు మానవతా గౌరవాన్ని కోల్పోవడం ధర్మం కాదు. కనక తన గౌరవాన్ని తాను గర్వంతో ప్రాణంతో రక్షించుకోని వాడు, ఆత్మహత్య చేసుకునేవాడు. మానవతా హత్య చేస్తున్న నేరస్థుడు.

ఒక్కో యుగంలో ఒక్కో రూపంలో ఈ ధర్మం మనిషిని వెంబడిస్తూ వచ్చింది. ఈ మహాసత్యం చరిత్రలో ఒక కాంతి పుంజంలా యుగయుగాన దర్శనమిస్తూ ఉంటుంది; మనిషి దారుల్ని తేజోమయం చేస్తూ ఉంటుంది ముంచుకొచ్చే అంధకారంతో ముష్టియుద్ధం చేస్తుంది. జీవన సంగ్రామం నుంచి మనిషి ఎన్నడూ పారిపోరాదు. జీవన సంగ్రామంలో మనిషి మనిషిగా నిలబడడానికి కావలసిన ఆత్మస్థైర్యమనే గాండీవాన్ని ధరించాలి. కనక

కాలతత్త్వసారంగా సంక్రమించిన విప్లవ ధర్మాన్ని స్వీకరించి శస్త్రధారణ చెయ్యడమే ఆధునిక యుగధర్మం -

ఇట్టి జీవన తత్త్వ రహస్యాన్ని అన్నియుగాల్లోనూ ద్రష్టలు గ్రహించారు; ఆ రహస్యానికి ఐతిహాసికవాణి ప్రదానం చేశారు.

ఇతిహాస నిర్మాణానికి బాధానుపూర్వక బలికావాలి ! నేనే ఆ బలి ! నా ప్రతిభ నా పాండిత్యము నా అనుభవము ఈ అన్నిటినీ జీర్ణించుకున్న నా ఆయుస్సు సర్వమూ పిండి మాటల గొంతుల్లో పోసిన ప్రక్రియ ఈ ఇతిహాసం. ప్రపంచమానవుల్ని వాళ్ళ చరిత్రల్ని వాళ్ళ జయాపజయాల్ని వాళ్ల భూత భవిష్యద్వర్తమానాల్ని నా ఇంద్రియ వాద మార్గ ఆర్జిత జ్ఞాన నేత్రంతో అవలోకన చేశి విశ్వదృశ్యం నుంచి ఈ తాత్పర్యాన్ని క్రోడీకరించాను - దూరదూరాల కొండల్లో కూర్చుని ఏకాంత గురుత్వాన్ని ఆశ్రయించి ఈ ఆధునిక మహాభారతాన్ని పొందాను.

నేనెప్పుడు గొంతెత్తినా నాకోసం కాదు ఆరుకోట్ల మంది కోసం కాదు. అరవయ్ కోట్ల మందికోసం గొంతెత్తాను. నేను పడుతున్న బాధలే నా దేశమంతా పడుతోంది. మానవజాతి అంతా పడుతోంది. కనకనే నా జ్వాలిక నా దేశపు నాలిక. అదే నా దేశం నా ప్రజలు. అదే ఈ ఆధునిక మహాభారతం.

ఈ దేశానికి నాగలి ప్రతీక. ఈదేశపు ఆకృతి నాగలి ఆకృతి ఒక దాన్ని ఒకటి పోలి ఉంటుంది. దాని జీవన కథానాయకుడు కర్షకుడే. అతడే ఈ దేశపు జీవన దాన ప్రభువు.

కవి ప్రథమతః మనిషి, అంతతః కూడా మనిషే. ఈ సత్యం సచేతన జీవన అనుభవక్రమంలోనే తెలుస్తుంది. ఆ జ్ఞానం కవికి ఒక నేత్రాన్ని ప్రదానం చేస్తుంది. ఆ నేత్రం ఒక మాటని ప్రదానం చేస్తుంది. అదే కవిత్వం అనబడుతుంది. కనక మనిషి మనిషిగా బ్రతకడం చేత పొందబడే

ఫలం కవిత్వం; ఆ ఫలం పొందిన వాడు కవి !

ఇది నా కావ్య సంకలనం కాదు ఇది నా కావ్యం నా సంపూర్ణ కావ్యం. కవి అనేక కావ్యాలు రాయడు. కవి ఒకే మనిషి – ప్రవహిస్తున్న ఒకే జీవితం జీవిస్తాడు. అలాగే ఒకే కావ్యం రాస్తాడు .... జీవితం ఒక యాత్ర; యాత్ర అనేక మజిలీల ప్రయాణం. దీని అర్థాంతరమే, కవి కావ్యయాత్ర అనేక కృతుల సాముదాయిక స్వరూపం. అంటే ఒక కవి తన జీవితంలో ఒకే కావ్యం రాస్తాడు. అయితే దాన్ని అప్పుడప్పుడూ క్రమక్రమంగా రాస్తూ ఉంటాడు. అలా రాయబడే ఒక్కొ కృతి నిజంగా పూర్ణకృతికోసం పుట్టే ఒక్కొ పర్వం. కావ్యయాత్ర అంతిమ చరణంలో అన్ని పర్వాలూ కలిసి ఒక్క కావ్యం మాత్రమే అవుతుంది.

కనక నేను నా జీవితంలో అనేక కావ్యాలు వ్రాయలేదు. రాశింది ఒకే కావ్యం. దానిపేరు నా దేశం నా ప్రజలు దాని వర్తమాననామాంతరం ఆధునిక మహాభారతము. ఆ కావ్యంయొక్క భాగాలు నా జీవితంలో అప్పుడప్పుడూ రాస్తూ వచ్చాను; భిన్నభిన్న నామకరణాలతో ఆ భాగాల్ని అప్పుడప్పుడూ ప్రకటిస్తూ వచ్చాను. ఆ భిన్నభిన్న నామకరణాలతో అప్పుడప్పుడు వచ్చిన అభాగాలే ఈనాడు నా ప్రజలకు సమర్పిస్తున్న సంపూర్ణకావ్యంలో పర్వాలుగా ప్రత్యక్షమవుతున్నాయి. అవి పుట్టినప్పుడు నిజంగా చివరకు రూపొందే సమగ్రకావ్యం కోసం పుట్టిన తొలి అవయవాలే గనుక ప్రతిపర్వాంతంలో ఒక పగ ఉంది. పర్వాంతగద్య. ఈ ఆధునిక మహాభారతానికి జనవంశమనే అనుబంధ కావ్యం ఒకటి ఉంది. ఇంతటితో నా కావ్యయాత్ర ముగిసింది.

నేను 1982లో నేనూ నా నెమిలీ అనే శీర్షికతో రాశిన కవితా సముదాయం ఇప్పుడు మయూరపర్వం అయింది; 1983లో రాశిన అరుస్తున్న ఆద్మీ కవితలు ఇప్పుడు ఆద్మీపర్వమయింది. అవి అప్పుడు కృతులుగా రాలేదు.

కవి నేత్రం చేసే ఇంద్రజాలం మూలంగా కవియొక్క దేశ కాలాల్లో వ్యావహారిక క్రమం ఉండదు. ఎప్పుడో జరగబోయే సంఘటనలు కవి కావ్యంలో ఇప్పుడే వచ్చి చేరుతాయి. నా జీవితంలో నాకు సంబంధించినవన్నీ నా కావ్యాల్లో ముందుగానే వచ్చి చేరాయి. ఈనాడు నేను నా ప్రజలకు సమర్పిస్తున్న నా దేశం నా ప్రజలు నామక ఆధునిక మహాభారతం అందుచేత నా ఆత్మకథ !

త్రికరణ శుద్ధిగా ఉన్న మనిషి తన ఆత్మకథ చెపితే చాలు; అదే తన దేశకథ అవుతుంది. అదే విశ్వమానవ కథ అవుతుంది. విశ్వమానవ కథ ఆత్మకథ కాదనుకుని విశ్వమానవ కథే చెపుతానని బృహద్వానంతో బయలు దేరేవాడు సఫలత పొందడు. అతడు కావ్యతత్త్వం ఎరగని వాళ్ళని చూపించడానికి ఒక ఉదాహరణ.

ఈ ఆధునిక మహాభారతం రూపొందించే అవకాశం నాకు కలగడం నా జీవితాన్ని నా ప్రజలకు సమర్పించే అవకాశం లభించడం అనే అదృష్టంగా భావిస్తున్నాను.

ఉన్నది ఒక్కటే అని నమ్ముతూ దానితోపాటు, తానే అది తెలిసినవాడినని కూడా నమ్ముతూ జీవించే జీవికంటే, రెంటిలో ఏదో ఒక్కటే సత్యమనే సిద్ధాంతాన్ని చేరలేని సంశయగ్రస్తుడే జ్ఞానానికి న్యాయం చేస్తున్నాడు. మూర్ఖుడిలో ఆత్మవిశ్వాసం ఎక్కువ ఆత్మజ్ఞానం తక్కువ; అదే వాడి ధైర్యానికి జన్మస్థానం. అయితే మూర్ఖుడు సుఖి సంశయగ్రస్తుడు దుఃఖి.

వ్యావహారిక లోకంలో దేశకాలాలనే జననీ జనకులకు పుట్టిన ఇతిహాసం జ్ఞానానికీ జీవన సంగ్రామానికి మధ్య ఉన్న సంబంధాన్ని నిర్ణయిస్తుంది. "న కర్తా కస్యచిత్ కశ్చిత్ నియోగేనాపి చేశ్వరః। స్వభావే వర్తతే లోకః తస్య కాలః పరాయణమ్" (కిష్కింధ 5 స – 5 శ్లో) (ఎవడూ

దేనికీ కర్తకాడు, ఒకడ్ని నియోగించడానికి ఎవడో ఒక ఈశ్వరుడూ లేడు, లోకం తన స్వభావం చేతనే నడుస్తుంది, స్వభావానికి కాలం ఆధారము) అన్నప్పుడు రామాయణం ఈ పాత్రే నిర్వహించింది.

జీవితమనే పద్మపత్రం మీద ఉన్న చంచలమైన జలబిందువు జ్ఞానం. అది శాశ్వతం కాదు పరిణామగ్రస్తం. భూగోళం మీద అంకురించిన మానవజన్మలో సహజంగా ఉన్న దోషాలూ సృష్టిసిద్ధమైన హద్దులూ ఉన్నాయి. అవి మానవాతీతమైనది. మానవుడు ఆర్జించే జ్ఞానం మీద వాటి శాసనం ఉంటుంది. కనకనే యుగయుగాన పూర్వపూజిత సిద్ధాంతం అనంతర పూజిత సిద్ధాంతం చేత తోశివేయబడుతుంది. ఇలా ఒక యాతాయాత సిద్ధాంత పరంపరా వలయం మానవ ఇతిహాసంలో నిరంతర భ్రమణం చేస్తూ ఉంటుంది. కానీ ప్రాణికోట్ల జీవన సంగ్రామం మాత్రం యథాతథంగా సాగుతూనే వుంటుంది. వాస్తవంగా ఈ జీవన సంగ్రామాన్ని ఎదుర్కొనే శక్తే మనిషికి కావాలి. జ్ఞాన నిర్ణయం కాదు.

జీవన సంగ్రామాన్ని ఎదుర్కొనే శక్తినిచ్చే గ్రంథమే మానవ తరణోపాయ దర్శకమైన జ్యోతి. కవి మానవుడి మార్గాన్ని తాను సృష్టించిన అలంకారంతో ప్రదీప్తం చేస్తాడు. అందుకే ఆధునిక మహాభారతం ఆదిపర్వంలో అంటుంది.

"కవిత్వం ఒక మెస్మరిజం
కవి కన్ను ఒక ప్రిజం
నేను సృష్టించిన అలంకారం
నీ అంధకారానికి దీపం"

# ప్రజా పర్వము

## ఒకటో సర్గ

లేస్తోంది ఉషఃకాంతుల్లోనించి ఒక హస్తం ! ఆ హస్తం కాలం అనే నిరంతర శ్రామికుడి సమస్తం ; మనిషి పొలాల్లో ప్రవహించే చెమటలో రక్తంలో మునిగి లేస్తోంది. దూర దూరాలకు సిందూర కాంతులు విందుతూ ఉంది –

నేను కళ్లు తెరిచి ఆవులిస్తూ లేస్తా ; నా చిన్ని కిటికీలో నించే పక్షులకూ, మేఘాలకూ సుప్రభాతం చెపుతా, నా కలలన్నీ మీ రెక్కలే అంటూ ఒక నిశ్వాసం విసిరేస్తా. సూర్యుడిచ్చిన ప్రియమైన కానుక, నా దినం, వాటితో కలిసి పంచుకుంటా –

నేను ధాన్యంలో నించి పుట్టాను ధాన్యం కోసమే బ్రతుకుతాను, మరణించి ధాన్యంలోకే వెళ్ళిపోతాను ...

నేను శబ్దాల అణువులతో పద్యాలు చేస్తా ఇసుక రేణువులతో చేసిన గ్లాసుల్లా మధుర ధ్వనులు పలికిస్తా.

నా దేశపు స్త్రీలకు రంగు రంగుల కలలు కనే నూలుతో కోకల్ని, సీతాకోకచిలుకల్ని చేస్తా, జీవన వనసీమల్లో ఎగరేస్తా.

రస్తాలువేస్తా కలల్లోకి, భవనాలు కడతా మబ్బుల్లోకి, ప్రాణాలతో నా దేశపు సరిహద్దుల కుడ్యాలు లేపుతా శత్రువుల గుండెల్లోకి

నావలు చేస్తా సముద్రాల్లోకి విడుస్తా నా దేశపు జెండా లెగరేస్తూ పోండని పంపిస్తా.

రూపులిచ్చి గొంతులిచ్చి శిలల్ని నిశ్శబ్దాల్లోనించి విడుదల చేస్తా

నేను మానవజీవిత పొలాలన్నీ దున్నుతా

ఈ చేత్తో నేను ఏ అందాన్ని సృష్టించలేదు? ఏది ఈ భూమి మీద ఈ చేతికి లొంగలేదు ? కానీ ఈ చెయ్యి ఖాళీగానే ఉండిపోయింది శాశ్వతంగా !

గడచిన చరిత్రలో నాకు తావు లేదు. ఇప్పుడు నడిచే చరిత్రకు నీతి లేదు ...

డాము లెందుకు కడుతున్నానో భూములెందుకు దున్నుతున్నానో నాకే తెలీదు.

నా బ్రతుకొక సున్న కానీ నడుస్తున్నా –

వేళ్ళు కాళ్ళయి నడిచే చెట్టు మనిషి; చెట్టుగా ఉంటే ఏడాదికొక వసంతమన్నా దక్కేది; మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను !

నా బాల్యం నించీ చెట్లు పెరుగుతున్నాయి, రస్తాలు నడుస్తున్నాయి, పల్లెలూ పట్నాలూ సుందరంగా బంధురంగా పరుగులిడుతున్నాయి.

నేను మాత్రం నడుస్తున్నా రిక్తహస్తాలతో నాదేశం కాని దేశంలో నాకేమీలేని ప్రదేశంలో నా జ్ఞాపకాలు అనుచరులుగా నా జ్ఞాపకాల ఊరేగింపుకు నేనే నాయకుడ్నిగా

రగిలే నా ఎర్ర కోరికే ఒక జెండాగా !

క్షణాలు కేవలం కాలాన్ని అనుసరించే పరివారం కాదు. కొన్ని క్షణాలుంటాయి యావత్తు మానవచరిత్రనూ మార్చగల మహత్తు ఉన్నవి.

నా చేతులతో నేనే నన్ను ఒక నిశ్శబ్ద సమాధిలో పాతిపెట్టలేను; ఒక పర్వత బ్రహ్మలా కూర్చొ ఉండలేను; నన్ను చేయెత్తి పిలుస్తున్న క్షణాన్ని వట్టి నిట్టూర్పులకు వదిలేసుకోలేను.

కొండలతో సముద్రాలతో కలిసి బ్రతికేవాడికి తుపానులొక లెఖ్ఖా !

తుఫానులు తుఫానులే ఎగిరిపోతున్నాయి. ఈగల్లా ఎగిరే ఈ క్షుద్ర బాధ లోక లెఖ్క-

చూడు, స్వేదబిందువులు తాగి సూర్యుడు మరింత తేజస్వి అవుతున్నాడుః సుత్తులూ కొడవళ్ళూ లాంటి కిరణాలు మిలియన్లు మిలియన్లు ప్రదానం చేస్తున్నాడు. గాలులు అధ్యాయాలు అధ్యాయాలుగా వీచే చరిత్రలో నేను వాటి బాహువుల్లో విలవిల కొట్టుకునే కొమ్మలా ఉండిపోలేను.

నీకెందుకింత అశాంతి నీకెందుకింత ఆవేశం అంటే ఏం చెప్పను ? సముద్రాన్ని అడుగునీకెందుకింత అశాంతి అని, ఝుంఝూ మారుతాన్ని అడుగు నీకెందుకింత ఆవేశం అని –

కాలాన్ని నా కాగితం చేసుకుంటూ, దానిమీద లోకానికి ఒక స్వప్నం రాసిఇస్తా, దానికింద నా ఊపిరితో సంతకం చేస్తా !

మనిషి కండల్లోనించి ఒక భయకంర రాక్షసశక్తి సృష్టిస్తా; దాన్ని ఒక మహత్తర శిల్పంగా చెక్కి భూమిమీద నిలబెడతా –

నా కోరిక గొంతెత్తి అరుస్తుంది; కాలపు వెన్నెముకని విరగ్గొడుతుంది; దిగంతరేఖల్ని చింపివేస్తుంది; ఒక కొత్త శకాన్ని లోకంమీదికి విసిరేస్తుంది.

మనిషికి అది అశాంతిని విధిస్తుంది, నిదురించే ఊరులదారుల్లో ఉద్రిక్త రక్తంగా ప్రాకుతుంది.

నా చతుర్భుజ పద్యాలతో ఆ స్పృహ నా దేశానికి నేను దానం చేస్తున్నాను. నేను అడువుల కడుపుల్లో నేర్చుకున్న భాషలోనే ఇక శతాబ్దాలు మాట్లాడుకుంటాయి. నా మాట భావితరాలకు వారసత్వంగా సంక్రమిస్తుంది. నా పద్యాలను పొందే అర్హత భూగోళం మీద జాతులకూ దేశాలకే ఉంటుంది.

నిరుడు వసంతం ఎక్కడికి పారిపోయిందో ఒక నదిలా; అలా అలా వెళ్ళి ఏ తోపుల్లో నిదురపోయిందో నాకు తెలీదు.

మళ్ళీ వచ్చింది.. మా దొడ్లో మామిడిచెట్టు వెతుక్కుంటూ – ప్రతిదీ పోతుందీలోకంలో, కాని మళ్ళీ మళ్ళీ వస్తూ ఉంటుంది అందాన్ని వెతుక్కుంటూ.

కొమ్మల్లో ఆకులమాటున చూస్తే, అగుపిస్తాయ్ పక్షుల అడుగులు, నిరుడు ఎగిరిపోయిన నిమిషాల గుర్తులు.

అలసిన నా ప్రయాణంలో ఒక చెట్టు నీడే నా కుటీరం ; రాలిన ఒక పువ్వే నా అతిథి !

ఇది వసంతం, సంవత్సరం కన్న మొదటి కల. ఈ కలలో నేను నాదేశపు శరీరం మీద నడుస్తున్నా ప్రభాత పూర్వ స్వప్నంలా ...

అడవుల్ని కప్పుకుని నదుల్ని తలపాగాలుగా చుట్టుకుని రస్తా ఉత్తరీయంగా వేసుకుని నడుస్తున్నా –

ఏడుస్తున్న పొలాల్ని ఆడిస్తూ పోతున్నా రూపాలకోసం నిరీక్షిస్తున్న నా దేశపు పర్వతాల్ని సింహాలుగా ఏనుగులుగా ఒంటెలుగా శ్రామికులుగా ప్రేమికులుగా వాటి మకుటాల్లాంటి ఇతిహాసాలుగా మలచదలచుకున్నా, మాటలు ఇవ్వదలచుకున్నా.

సూర్యుడు కిరణాల బండ్లు తోలుకుని వస్తున్నాడు.

మొదట నన్ను చూచి కన్నీరు కార్చిన చెట్టు ఇప్పుడు నా కల మీద పూలవాన కురిసింది.

## రెండో సర్గ

కీర్రీలు పెదవులు విప్పాయి నీ కథలుచెప్పడానికి ఆకులు గుసగుస లాడుతున్నాయి నా చెవుల్లో నీ గుండె వ్యధలు విప్పడానికి.

నిద్ర కోల్పోయి నా రాత్రిని అనుభవిస్తాను నీకూ నా దేశానికి మధ్య విరిగిపోయిన గుండెతో నిన్నూ నా జాతినీ మోస్తాను నా కన్నుల్లో రెండు దీపాలుగా నా ఆశల ద్వీపానికి దారి వెతుక్కోడానికి

ఆ ద్వీపంలో నా ప్రజలు సముద్రపు ఇసుకతీరాల్లో నాట్యాలు చేసే సుడిగాలులు.

అక్కడ నా ప్రజలు పళ్ళ మాంసాన్ని దంతాలతో చీల్చుకుని తినే అందమైన క్రూరమృగాలు.

నేను సముద్రాలనించి పారిపోయివచ్చి నీ హృదయపు కొబ్బరి తోపుల్లో తలదాచుకున్న తుఫానుని

అక్కడ నా దేశపు గ్రామాలు రంగుల్లో కలల్లో పరస్పరం మాట్లాడుకుంటాయి

అక్కడ నా జాతి, ఒడల బరువు మోయడం ఎరగని కెరటంలా ఆకాశం మీదికి దూకుతుంది.

అక్కడ ఉదయకిరణం నా ప్రజల కలల జనాభాను పొడిచి చంపదు.

నేను ఒక విశాల హరిత శాద్వలాన్నయ్ వెల్లికిల పడుకుంటాను. నా దేశపు పిల్లలు బాలశీతల వాయువులతో ఆడుతూ పాడుతూ విహరించడానికి.

పోదాం రా

అక్కడ నా దేశపు రస్తాలు చైత్రమాసం పూచిన పువ్వుల్లోకి పరుగులిడుతాయి,

నా ప్రియమైన ప్రజల్ని రైళ్లలా గొప్ప పండుగులకు మోసుకు పోతాయి.

సోమరిగా కూర్చోవద్దు.

పద, మన ప్రియమైన మహాప్రజల్ని కలుద్దాం పద కొడవళ్ళు తీసుకుని పోదాం ఆ వరికోతల పండుగుల్లో కలుద్దాం -

ఒకప్పుడు నన్ను క్రూర నగరాల ఇనప దవడలు నమిలి మింగక పూర్వం నేను విశాలమైన ఇసుక తీరాల మీద కూర్చుని సముద్రపు నీలికెరటాల అలజడి ఆవలికి నా చూపులు ప్రసరించేవాడ్ని ...

నా దృష్టి సంచారపు సరిహద్దులు దాటి ఏ సీమలున్నాయో ఏ వస్తువులున్నాయో అనే అవ్యక్త మధురోహల్లో స్నానం చేస్తూ ఉండే వాడ్ని – రంగూనో, సింగపూరో, బాంకాకో లేక ఆ మహా జలఖండం, ద్రవరూపమెత్తిన ఇంద్రనీలం ఎక్కడో గగనంలో రెక్కలు కోల్పోయి నేలకు రాలిన నా స్వప్నం ఆ పసిఫిక్ సముద్రమో– ఏవో మరి !

భూమి అనే వాక్యంలో నీలిసముద్రాలు కామాలూ సెమికోలన్లూ. అవి పరుగెత్తే నాగరికతలకు పది నిమిషాలు విశ్రాంతి ఇస్తాయి. పాత ఊపిరి విడిచిపెట్టి కొత్త ఊపిరి పీల్చుకోనిస్తాయి. కొత్త ముస్తాబులు చేసి కొత్త తీరాలకు పరిచయం చేస్తాయి.

సముద్రాలు, భూమి ప్రేమలేఖలు రాసుకునే నీలిసిరా గిన్నెలు ఆ సిరాలోనించి గాలులు మోసుకొచ్చే అక్షరాలే సామ్రాజ్యాలు, నాగరకతలు, విజ్ఞాన పరిమళాలు – ఆ పురాతన గాలులు నగరాల్ని వెలిగించాయి దేశాల్ని పాలించాయి ఆ సిరాతో లిఖించినవే మానవ ఇతిహాసాలు ....

కాలం మనిషి రాసిన పద్యాలనుమింగేస్తూ ఉంటుంది- మనిషి ఆరోగ్యం కోసం ! నేను పాత పద్యాలు భుజించి వాటి జీర్ణం కాని అవయవాలను వాంతి చేసుకున్నాను! ఇప్పుడు కొత్త పద్యం కోసం ఆకలి!

కొత్త పద్యాలల్లుతున్నా . . .

నా చూపుల కావల గర్జించే శూన్యంతో నా సముద్రాల కావల గుసగుసలాడే నీలిమతో నా నక్షత్రాలకావల ప్రజ్వలించే "ఉదాత్తం"తో నా చేతులకందని నా లోతులతో నా మూర్ఖ సమకాలికులకు అపరిచితమైన పదార్థాలతో - నా పద్యా లల్లుతున్నా . ..

జీర్ణం కాకుండా నేనున్న ఆ నగరాల కావల నా ఆత్మ తన నులి వెచ్చటి కోర్కెలు పాదుగుతున్న ఆ అడవుల కావల

ఏది తన వర్తులాకార రేఖతో సృష్టిజాలాన్నంతా బంధిస్తుందో దేని ఖండరేఖ మాత్రమే మానవ నేత్రాలకు గోచరిస్తుందో ఆ అనుస్వారాని కావల.

సరిహద్దులన్నీ చీల్చుకుని దేనిలోకి దూకుదామని నా మూడో కన్ను ఉత్కంఠతో ఉరకలు వేస్తుందో, అక్కడ కూర్చో ఉంది ఓపికగా శతాబ్దాల పర్యంతరం, నా కోసం నిరీక్షిస్తూ, నా నీలిసముద్రం !

# మూడో సర్గ

హైదరాబాద్‌ని వెనక విడిచిపెట్టి గాలిలో వెళ్ళిపోవడం ఎంత విశ్రాంతి నా ఆత్మ ఊపిరితిత్తులకు !

"ఆ భయంకర నగరపు విషవాపుల్లో ఈ జీవి ఇన్నాళ్ళు ఎలా బ్రతికాడో మాకే తెలీదు." అంటూ నీలగిరి చెట్లు నన్ను జాలిగా ఒళ్ళోకి తీసుకున్నాయి-

హైదరాబాదు శయ్యలో తెల్లవారి పువ్వులా నిద్రలేస్తా. దాని రోడ్ల మీద నడుస్తూ అప్పుడే ప్రేలబోతున్న అగ్ని పర్వతంలా మారిపోతా.

హైదరాబాదు దినం, రోజూ రోగిలా రోడ్లమీద వాంతి చేసుకునే స్వాతంత్ర్యానంతర నాగరికతా కవిత్వమూ తొక్కుకుంటూ పోతా. పంచ పైకెత్తి పట్టుకుని ;

ఆ రోడ్లమీదనే నడవాలి, కవిత్వం రాయాలంటే.. అడుగడుగునా కనిపించే ప్రభుత్వ మార్కు మొహాలని చూస్తూ నాలో ఉన్న ఫిరంగులన్నీ పేలుతాయి; దీనంగా చెట్లవైపు చూస్తా - "కవిత్వం వద్దు ! వెయ్యి ప్రళయాలు ధట్టించిన ఒక బాంబు ఇవ్వండి - " అని.

నాలాంటి అగ్నిపర్వతాలెన్ని నడుస్తున్నాయో ఈ వీధుల్లో !

ఈ చెట్లు పూలెందుకు పూస్తాయి, ఈ నికృష్టపు నాగరకత విడిచే బొగ్గుపులుసు వాయువు పీలుస్తూ ?

ఇవి బుల్లెట్లెందుకు పూయవు? అని కేక వేస్తా !

విధి నా చేతికిచ్చిన విషపాత్రిక ఈ నగరం; ఇందులోనే ఉన్నాయి. నా విషాలన్నీ నా నిషాలన్నీ; ఇక్కడే వెయ్యిసార్లు నా లోకాల్ని పోగొట్టుకున్నాను పొందాను -

పచ్చి పందెంలాంటి కసాయి బతుకులో . . . ఈ వీధుల్లోనే పరుగులెత్తాను ఒక తుఫానులా.

పడిపోయాను ఒక తెరచాప కోల్పోయిన పడవలా ! కానీ నేను తుఫానుని, క్షుద్ర సలహాలు వినను -

పోతున్నాను నా జ్ఞాపకాలు మోసుకుని ఎక్కడ దొరుకుతాయో మందు ఈ గాయాలకని. ఇక్కడ జీవితం ఎవడ్నీ విడిచిపెట్టదు ; మనిషినించి మనిషికి నిప్పంటిస్తోంది.

ఓ పక్షీ! నీ పాట ఇక్కడ పాడబోకు - ఎగిరిపో నీ వనాలెక్కడున్నాయో వెతుక్కుంటూ .

మనిషి నగరంలో వందలాది మనుషులెందరున్నా కాలానిదే పై చెయ్యి;

దాని గొంతే వినిపిస్తుంది, మనిషి చేసిన అన్ని మిలియన్ల గొంతులూ అధిగమించి !

కోటానుకోట్ల గడియారాల్లో దాని ఉగ్రహస్తాల వేళ్ళు ప్రదర్శిస్తుంది; క్రూరంగా నొక్కి వేస్తుంది మనిషి గొంతును తన అనివార్యపు చేతులతో

మనిషి గుండెమీద వాలుతుంది ఒక బ్రహ్మాండమైన ఇనప గ్రద్దలా !

ఇక్కడ, ఈ కొండల్లో - తిథుల్లేవు, తేదీల్లేవు !

ఇక్కడ ఒక్క మనిషి లేకపోయినా, నన్ను పగబట్టి వెంబడించిన కాలం ఈ ఆకులూ మధురస్వరాలూ క్రిక్కిరిసిన నిమ్నోన్నత మార్గాల్లో నన్ను అనుసరించలేక కాళ్ళు విరిగి కూలబడిపోయింది.

వింత చెట్లూ వింత పక్షులూ శిరస్సులు వంచక మందహాసాలు చిందే వందలాది పర్వతాలూ ఆ పర్వతాల హృదయాల్లో నిదురించే ఏకాంతమూ

ఇవన్నీ ఏకమై అల్లే నిశ్శబ్దపు సాలెగూడులో ఈగలా చిక్కుకుని చస్తుంది కాలం !

ఈ సీమల కోమల భావాలు ఎవ్వరూ వాసన చూడని పూలు;

ఇక్కడ చెట్లతలల్ని చేతులతో ముట్టుకోలేము. చూపులతో తప్ప -

ఆకాశపు కాగితం మీద కుంచెల్లా గీస్తున్న చెట్ల గుంపుల మీదుగా ఒక విశాల ధవళమేఘం దొర్లిపోతూ ఉంటుంది. పెద్ద పెద్ద అంగలేసుకుంటూ-

గాలి అతి సున్నితంగా పరిమళాలల్లుతూ ఉంటుంది నీలి శూన్యంలో;

ఎప్పుడూ ఎరుగని సంతోషపు ఇంద్రజాలంలో మనిషి శబ్దమై పాటై పక్షుల శరీరాల్లో పర్వతాల శరీరాల్లో ప్రవహిస్తాడు; కాలం చేతి వేళ్ళలోనించి కారిపోతాడు మనిషి !

చిన్ని రెక్కల మీద స్వచ్ఛమైన స్వేచ్ఛతో అమాయకత్వంతోఆడుకునే అల్పకీటకం కూడా, ఇక్కడ సృష్టి హృదయపూర్వకంగా దానంచేసే ఆనందాన్ని పరిపూర్ణంగా అనుభవిస్తుంది; మనిషి పొందే అనుభూతికంటే దాని అనుభూతి కించిత్తుకూడా తక్కువ కాదు ! ఈ కొండలు పరిపాలించే భూముల్లో కీటకమూ మనిషీ సమానం ! ఇక్కడ మనిషి మనోబుద్ధ్యహంకారాలకు అధికారం లేదు; కేవలం అకలుషిత ప్రాణావస్థకే హక్కు ! అందుకే నేను కాలాన్ని కొండల్లోకి ఈడ్చుకుని వచ్చి సంహరించాను.

విత్తనంలో ఉన్న నేను ఒక రాగం విన్నాను; బయటికి వచ్చి ఆకాశాన్నీ సూర్యుడ్నీ చూద్దామనీ, చూచి ఆశ్చర్యామృతం తాగుదామనీ కోరిక అంకురించింది ..

నేను చెట్టునయ్యాను : కొమ్మల్లో చెట్టు కలనయ్యాను

అంటే రాగరసగంధాలు మిళితం చేసుకున్న పువ్వునయ్యాను కలగానే నాలో దాగిఉన్న రహస్యాలు నాకు కనిపిస్తాయి గనక ! కలలో నాకు స్ఫురించింది, మట్టీ నీరూ గాలీ ఒకే వస్తువుకు రూపాంతారాలనీ ఆ మూటి తాత్త్విక అంశాలూ నాలోనే ఉన్నాయనీ –

ఈ భావోదయంలో ఒకటిగా ఉన్న నేను మూడుగా మారాను !

ఒకసారి రంగుల రెక్కలు తగిలించుకుని సీతాకోకచిలుకనై నేనే నావెంటపడ్డాను : ఆకుల్లో మునిగి రామచిలుకనై నా పండు నేనే తిన్నాను : జలాల్లోచేపనై నా తీరాల్లేనితనం మరచిపోయి నేనే తీరాల కోసం ఈదాను.

ఇదంతా నా జీవితయాత్ర !

హేమంతం నా ఆకులకు పసుపురాస్తుంది : గాలి నా వలువలు రాల్చివేస్తుంది : హిమపాతం నా నగ్న వృక్షతమీద అభిషేకం చేస్తుంది – చెట్టు పట్టాభిషేకం చేసుకున్న రాజయ్ లోకానికి శీతలచ్ఛాయలు దానాలుచేస్తుంది.

దినం తన ఊహల్ని దూదిపింజల్లాంటి మబ్బుతునకలుచేసి నీలి ఆకాశంలోకి ఎగరవేస్తోంది : మందానిలం మధురశ్వాసయై నా అవయవాలకు జీవం పోస్తోంది.

కొమ్మల్లో వేలాడుతున్న పండు, గాలి తగిలి రాలుతున్న పసిడి వన్నె ఆకుల జల్లుల్లో స్నానం చేస్తోంది : ఆకులు వేస్తూ ఆకులు రాలుస్తూ నిరంతరం ప్రవహిస్తున్న చెట్టు రహస్యాన్ని గురించి ఆలోచిస్తోంది :

రాలే ఆకుల్లో రమణీయత అనుభవిస్తోంది; పండు వట్టి సన్యాసి ! సత్యదర్శనం కోసం తపస్సులో మునిగిపోయిన ఋషి !

మృత్యువులో జీవం చూస్తుంది; లేకపోతే మృత్యువులో ఇంత అందం ఎందుకుంటుంది అని ప్రశ్నిస్తుంది !

ఆకులు కోల్పోయిన నగ్నశాఖ సౌందర్యం వెయ్యి వసంతాలు కలిసి తపస్సుచేసినా పొందలేవు.

ఓహో ! నేను సౌందర్యంలో స్నానం చేస్తున్నాను; అందం రేపే నాజూకుబాధల తుఫానుల్లో మూర్ఛపోతున్నాను.

ఏమిటి ఈ చెట్టు ! నుల్చోఉన్న మహాసౌందర్యం ! దాని రహస్యం ఎక్కడుంది ?

చివరకు రాలేముందు తెలుసుకుంటుంది ఆ పండు, చెట్టుగింజ తన కడుపులోనే ఉందనీ, చెట్టనుకునే "నేను" పండనుకునే "నేను" రెండూ ఒకటే అనీ !

ధరిత్రి ఒక సృష్టి ప్రదర్శనశాల – పశువులు, పక్షులు, వృక్షాలు మట్టిలోకి అస్తమిస్తాయి తరాలు తరాలుగా; రెక్కల్లేని పక్షుల్లాంటి మన పిల్లలు కూడా అందులోకే అస్తమిస్తారు సాంధ్యకిరణాల్లా . . .

కొత్త పిల్లలు ఉదయిస్తారు. కొత్త గర్భాలకూ కొత్త విత్తనాలకు కొత్త కాంతివలయాలు విరిసే ముఖాలతో ... కొత్త నాగరికత అల్లుతారు. చరిత్ర పేజీలకందిస్తారు : పేజీలు పెరుగుతుంటాయి వాటిమీద నిర్దాక్షిణ్యంగా కాలపు గండ్రగొడ్డలి పడేవరకూ.

చరిత్రలో చెమట ఒక శాశ్వత అంతర్వాహి నిలా ప్రవహిస్తూ ఉంటుంది: మానవ యంత్రపు కండరాలు బ్రహ్మాండమైన కొయ్యచక్రాల్లా

తిరుగుతుంటాయి నిర్విరామంగా కీ్రు కీ్రుమంటూ తినటానికి గ్రీజుకూడా లేకుండా – ఈ ధగ ధగ మెరిసే నిరర్థక ఉపరి నిర్మాణాన్ని నిలబెట్టడానికి.

చరిత్ర చాదస్తపు ముసలిది పురాతన గొంతు సవరించుకుంటూ, కంఠస్వరం ఒక గగన ఘంటలా సారించి ఇతిహాసాలంటూ చెపుతుంది మనిషి కథల్ని అనాదికాలంనుంచీ. దాని శ్వేతకేశాలమీది సానుభూతిచేత అన్ని యుగాల్లోనూ ఆ కథలు వినే మనుషులుంటారు.

ప్రదర్శనశాల నిండుతూ ఉంటుంది ఖాళీ అవుతూ ఉంటుంది. గుంపులు వస్తూ ఉంటారు గుంపులూ పోతూ ఉంటారు విశాల ప్రదర్శనశాల హాలుల్లో సాగిపోతున్న గాలుల్లా అగమ్య ప్రయాణం కోసం నిరంతరం తహతహలాడే గాలుల్లా– ఎప్పుడూ దర్శించని ఎన్నడూ ఎరగని, కానీ తరతరాలుగా మనిషినించి పశుపక్షి క్రిమికీటాకాలవరకూ నిరంతరంతెలీకుండా కలలుకంటున్న ఏదో శిఖరాలవైపుకు సాగిపోతున్న తరాల గాలుల్లా – మరోవైపు సైన్యాలు ప్రభుత్వాలు న్యాయస్థానాలు నియంతలు జనతంత్రవాదులు ఇత్యాదులు వారి శూన్యపటాటోప ఢంకాలు బజాయిస్తుంటారు.

ఓహో! ప్రతియుగమూ ఒక వెర్రి ఆకాంక్షకోసం ఆకలితో అరుస్తూ ఉంటుంది. ప్రతియుగమూ ఒక మూర్ఖసిద్ధాంతపు పరిపాలన్ని ఆహ్వానిస్తుంది, దాని సార్వభౌమత్వానికి హృదయ పూర్వకంగా లొంగుతుంది. బౌద్ధికశక్తి మాత్రం అనుమానంతో చూస్తూ ఉంటుంది మరో యుగపు గుడ్లు పొదుగుతూ–

# నాలుగో సర్గ

కవిత్వం ఎర్రగుర్రంలా పరుగెత్తుకు వస్తోంది–రక్తంలో మునిగిన బాణంలా వీరుడు విడిచిన ప్రాణంలా!

నన్ను ఊపిరితిప్పుకోనీడంలా . . . . .

హొటేల్ అశోకా విశాల కిటికీగ్లాసులోనించి

మాటలుగా మారి వస్తున్నాయ్ చెట్లూ, చెట్లగుండా పరుగెత్తే రోడ్లూ, రోడ్లుమోసే జనులూ, జనులుమోసే అకాశాలూ, ఆకాశాల నుంచి హాహాకారాలు చేస్తూ వ్రేలాడే దిగంతాలూ.

నాక్షణం ప్రతిదీ ఒక శిల్పంగా మలుచుకుని వస్తోందీ పోతోందీ ఒకసారి నాజాతిగా ఒకసారి నాగీతిగా ఒకసారి నాకవితగా ఒక్కొక్కసారి నా జ్వలించే సవితగాః

కొత్తకొత్త ముఖాలతో కొత్తకాంతి మండలాలతో వస్తున్నాయి నా నూతన దిగంత రేఖలమీద గంతులేసుకుంటూ . . . .

నారోడ్లమీద స్వాగతాక్షరాలు రాసిఉన్నాయి. నా **అడుగుల** మీద చెట్లు రంగులు వర్షిస్తున్నాయి . . . .

దూరాన ఎవరో పిల్లలు గోలీకాయ లాడుకుంటున్నారు. ఇవాళ ఈ పిల్లలు ఆడుకునే గోలీలే రేపు బందూకు లెక్కుతాయ్, బ్రహ్మాండాలు బ్రద్దలు చేస్తాయ్ః కొత్తబిల్డింగులు కడతాయ్ కొండల్లో కొత్త సూర్యోదయాలు పుడతాయ్ . . . .

పర్వత శ్రేణులు ప్రభాతాన్ని ఆపగలవాః సూర్యుడు వేయి ఖడ్గాలతో ఛేధించకుంటూ దూకుతాడు; అన్ని కొండలమీదా ఎర్రకాంతుల జెండాలు నాటుతాడు –

మెరిసే మోటారుకార్లని వీపులమీద వేసుకుని మోసే రోడ్లన్నీ చెట్లగుంపుల్లోపడి పారిపోతాయ్.

నేను పోతే పోతాను, మళ్ళీ రాకపోవచ్చు కానీ నా జ్ఞాపకాల బారినించి తప్పించుకోలేరు. మీరు; అవి ఈ దేశపు గాలుల్లో పక్షులై పాడుతుంటాయ్, కిరణాలై అల్లుకుంటాయ్.

బాబూ! నీ చిన్ని కన్నీటిబిందువులో ఏ సముద్రం గర్జిస్తూ ఉందో నాకు తెలుసు; అందుకే నేను చెట్లతో మొరపెట్టుకుంటున్నాను, "ఆకులుకాదు తుపాకులు కాయం," డని–

నా దారిలో రాళ్ళు అడుగుతున్నాయ్ "గొంతులు గొంతులు మాకు గొంతులు" అని–

నా గుండెలమీద పరుగులెత్తే అనుభవాల రథచక్రాలక్రింద నా శరీరపు కండలు నలిగిపోతున్నా అవి రేపే భావాల మేఘాలు చూస్తూ నిర్వణ్ణుడుగా ఉండిపోతాను.

నేను నా సర్వస్వాన్ని రాల్చుకున్నాను, చెట్టు తన పువ్వును రాల్చుకున్నట్లు;

పరిత్యాగంలో ఉదయించే అందం ఎంత అందమయినదో చెప్ప లేకున్నాను–

వృద్ధుడ్నయినా యువకుడ్నిగానూ, యువకుడ్నిగా ఉన్నప్పుడు శిశువుగానూ లేక శిశువుగా ఉన్నప్పుడు వృద్ధుడ్నిగానూ మారగలిగి నప్పుడు, నాకిచ్చిన జీవితంలో ఒకదానినించి మరొకదానికి అవస్థలు మార్చే శక్తి నాకుందని తెలుసుకున్నప్పుడు నేను అజేయుడ్ని. అంతకుముందు జీవనమరణ తీరాలమధ్య మునిగిపోతున్న ఓడను, ఓడిపోతున్న జీవిని–

నాకోర్కెలు శిఖరాలమీద నుల్చొని ఉన్న దేవాలయాలు; నేను నేలమీద నడుస్తున్న బాటసారి.

ఎక్కడికో నిశ్శబ్ద నిశీథకుహరంలోకి పోయి ధ్యానం చేసుకుందామని ఉంది, ఎవ్వరూలేని దేవాలయానికి–చివరకి నా ఏకాంతానికి భంగం కలిగించే దేవుడు కూడా లేని దేవాలయానికి!

ఇంత అందమైన ఒక్కమాట పొందడానికి నా ఆత్మను ఇనపగునపాలతో ఎంతలోతులకు త్రవ్వానో నీకు తెలుసా?

ఎగిరే పక్షులవెంబడి పరుగులెత్తాను భూమికి నా కాళ్ళ గాయాలతో రక్తాంకితా లర్పిస్తూ

పూల భిక్షువుల్లో కలిసిపోయి అడవుల రంగుల్లో మునిగి తపస్సులు చేశాను

ఆర్కిటిక్ భూములకు తమ శరీరాల కండరాలు రుద్దుతూ వచ్చిన హోరుగాలులతో భుజాలు కలిపి బొంగురుగొంతులు అభ్యసించాను

కఠోర తుఫానులతో నన్ను కలిపి ఊదేసుకున్నాను సముద్రాల్లోకి

కొండలబడి గుడిగా చేసుకుని చివరకు దేవుడ్నయ్యాను

ఇప్పుడు శబ్దాలు శిరస్సుల్ని వెల్తురు బింబాలతో అలంకరించుకుని గుంపులు గుంపులుగా ఆకాశపు నీలివీధుల్లో నిలిచాయి, నన్ను ఒక వింతసంతోషంతో చూస్తూ–

కానీ నేనిప్పుడు నిశ్శబ్దంలో మునిగిఉన్నాను. ఈనిశ్శబ్దం ఎంత నిశ్శబ్దంగా ఉందో ఎవ్వరికీ తెలీదు; నాకిప్పుడు సూర్యోదయాల్లేవు సూర్యాస్తమయా ల్లేవు రంగులు లేవు రాగాలు లేవు; ఇంద్రియాలెరిగిన అనుభూతులేవీ లేవు–

ఈతరుణం నన్ను [illegible]డి నీకిచ్చినదే ఆ బరువైన అర్థపు వేడిబిందువు!

కిరణాల అడవుల్లో పరుగెత్తుతూంటే అవి గుచ్చుకుని నా ఒంటినిండా ఎర్రటి గాయాలు!

నిండు వసంతంలో ఒంటరిగా ఒక చెట్టు ఒక పెద్ద కన్నీటి బిందువు రాల్చింది; ఆచెట్టు అలసిన నాశరీరంమీద ఒకనాడు ఒక నీడపట్టింది. ఎప్పటికయినా చెట్ల అవయవాలమీద పూలు పూస్తాయి చెట్ల శరీరాలుకోసే కసాయివాడి చేతులు నరకాలి నాదేశం !

చెట్ల భావాల్ని పక్షులు పాడుతాయి, పక్షుల భావాల్ని కవిపాడుతాడు.

వసంతం అంటే అందరికీ తెలీదు ! కోకిలల్ని కోల్పోయిన కొమ్మలకే తెలుసు పాటల్ని కోల్పోయిన పక్షులకే తెలుసు . . . . . .

వసంతం వసంతం కాదు, పూలునిట్టూర్పులు విడుస్తున్న ఋతువు–

పిట్టయితే ఎగిరిపోతుంది, చెట్టు ఎక్కడికి పోతుంది? తుఫానులు చుట్టుముట్టినా ఆ నేలకే అంకితమై ఉంటుంది–వేళ్ళతో ధరిత్రి పట్టుకుని; సెంటు భూమిలేకపోయినా ఈ దేశాన్ని అంటిపెట్టుకొని ఉన్న నాలాగే.

ఎప్పుడు ఆకు రాలిపోతుందో గాలికికూడా తెలీదు.

భ్రమరాలు పూలదగ్గర సెలవు తీసుకొంటున్నాయి.

మా ఊరికాలువ ఎక్కడో పొదల్లోకి పోయి నిద్రిస్తుంది. నేనూ అక్కడికే పోతా–

నీవు తెలి ఉషస్సులు తలలో అలంకరించుకుని వస్తూఉంటే నాలో ఆపాదమస్తకమూ ప్రణయకూలంకషలు పరుగులిడుతాయి. నా రక్తాణువులన్నీ ముందుకు దూకుతాయి, నా నూతన సూర్యుడివైన నీ బాహుమండలంలో లీనం కావడానికి–

మనమిద్దరం కలిసి మన వలపుల్నీ మన ప్రియతమ దేశపు తలపులతో కలుపుదాం; మనం పరస్పరం కనే కలలు మన మహా ప్రజల వక్షస్సీమల్లో ఒక నూతన పరిమాళాల యుగాన్ని ఆవిష్కరింపనిద్దాం;

నేను ప్రజల యుద్ధాల్లో మరణించినా అది నీ ఆశయాల ప్రపంచంకోసం చేసిన ప్రాణదానమే, నా మృత్యువు రేకుల్లోనించి నా అమరత్వాన్ని ఉన్మీలనం చేయడమే-

నిన్నెలా మరచిపోగలను ప్రేయసీ? నీ దేశపు సైనికుడ్నిలా భీకర తుఫానుల్లో పోతున్నా,

దుర్గమ పర్వతపంథాల్లో నడుస్తున్నా శిఖరస్కంధాలు అధిరోహిస్తున్నా,

అరణ్యాల పేగుల్లో దాగిఉన్నా దేశపు చివరి అంచుల్లో ప్రాణాలు విడుస్తున్నా నిన్నెలా మరచిపోగలను?

ప్రియతమా నీ బాహువుల పాఠశాలలో నేను నేర్చుకున్న ప్రేమ నాదేశపు నేలల్నీ, నదుల్నీ, పశువుల్నీ, పక్షుల్నీ, ప్రజల్నీ ఇక్కడి గాలినీ, నీటినీ, ప్రేమించడానికే. నీవు నాకు ఉంటే, అడుగడునా వెయ్యి వీర మరణాలకు నన్ను విసిరేస్తాను అవలీలగా, నా జాతి అభ్యుదయంకోసం అలంకరించిన బలివేదిక చేరడానికి-

నీవక్షస్ శాద్వలసీమ మీద నా కవోష్ణకిరణాల హిరణ్యం వెదజల్లుతాను; నా జనుల జీవిత కుడ్యాలకు మన ప్రేమగాధలతో ఉజ్జ్వల తైలవర్ణచిత్రాలు తగిలిస్తాను-వాళ్ళ పేదబ్రతుకుల కధానికల్లోకి ప్రేమలో తడిపిన హేమతంతువులు అల్లుకుంటారని, ఇతిహాసపు గుమ్మానికి ఇంద్రధనస్సులు వ్రేలగడతారనీ-

చూడు ప్రేమరాశీ! ఆకాశంలో ఆ మేఘాల సమూహాలు . . . . . అవి ప్రాచీన కావ్యాల్లోవలె ప్రేమసందేశాలు మోసుకు రావడంలేదు, నవ పవనాల శ్వాస మోసుకువస్తున్నాయి. మన జనులు పిల్చడానికి-

మన చూపులు కలిశాయి, నాకన్నులు నిదుర విడిచాయి నా ప్రజల కలల్లో కాంక్షల్లో కలిశాయి.

ఈ భూమండల మార్గాల్లో ఒంటరిగా నడవలేను;

నా బ్రతుకు వెయ్యి విధాలుగా నీవనే ఒక నాజూకు నూలు పోగుల జాలంతో అల్లిన దుకూలం-

భార్యగా, నెచ్చెలిగా,

ప్రేయసిగా,

మాతృదేవతగా, చంటిబిడ్డగా,

ఒక టేమిటి నా సర్వస్వంగా-

నాముందున్న దూరాలు దాటడానికి కావలసిన బలాన్ని ఇస్తావు నీవు; మనిద్దరమూ కలిసి మన ప్రజల అంతిమ సమరాన్ని గెలుస్తాము.

# ఐదో సర్గ

ఓ గీతికా! విను –

ఏ పుణ్యం చేసుకున్నానో ఉల్కలా వచ్చిన

ఒక్క క్షణం కాంతిలో

జీవన కఠోర సత్యదర్శనం చేసుకుంటున్నాను;

నీ మోహినీత్వంతో నన్ను మోసంచెయ్యకు

నా అపూర్వసంపదలాంటి ఈ క్షణాన్ని దొంగిలించుకునిపోకు.

నా బాధల్ని మరచిపోనీకు.

మరచిపోతే, నీచేత బ్రద్దలుకావలసినవన్నీ క్షేమంగా ఉండి పోతాయ్

హేయ్! పువ్వులూ పక్షులూ! మీ గొంతులు కట్టిపెట్టండి

నా తుపాకీ నన్ను తీసుకోనీండి

అసహ్యతని సహిస్తూ నిద్రిస్తున్న మనస్సుల్ని మేల్కొల్పనీండి వాటిని భయంకర ఝంఝూమారుతాలుగా మార్చనీండి

ద్వేషించే విద్య నేర్పనీండి

ద్వేషం ఎంత పవిత్రమైన వస్తువో బోధించనీండి; ద్వేషించడానికి కావలసిన స్పృహని నారక్తంతో దానం చెయ్యనీండి–

గాలిలోఉన్నా కాగితా లెక్కినా ఈ మాటలు వాళ్ళలో అగ్ని పర్వతాలు నాటనీండి.

నా అగ్ని పర్వతాలు పగలనీండి

## ఈ పవిత్ర ఆత్మవిస్ఫోటని ఆపకండి

నేను ఇక్కడ పద్యాల సిల్కుదారాలతో పట్టుకుందామనే చిలకలగుంపులు, తుఫానుల చేతుల్లో గాయపడ్డ వృక్షాల కుటుంబాల్లో వాలుతున్నాయి; ఇక్కడ జీవితానికి గర్భస్రావమై, కలలు అసహ్య రూపాలతో అసమగ్ర అవయవాలతో బయటపడిపోతున్నాయి.
ఎవడో పద్యాలు రాశే షక్షి వాటిని ముక్కున కరిపించుకుని పోయి కొండ శిఖరాల మీద పెట్టుకుని తింటున్నాడు!

ఇక్కడ గర్భంలో ఉన్న శిశువు గర్భంలోనే ఉండిపోవాలి

ఈ దేశంలోకి వచ్చి ఆకలి అని ఏడిస్తే ఫుట్ పాత్ లు చూపిస్తారు పొలాలు కాదు-

ఇక్కడ సూర్యుడే రోజూ రాత్రుల గర్భంలోనించి మూకూ మొహమూలేని రక్తపిండంలా ఊడి పడుతుంటాడు

ఇక్కడ నా దినాలు కుష్ఠురోగుల్లా కుంటుతున్నాయి నాభవిష్యత్ స్వప్నాలు నా ప్రస్తుత రాత్రుల్ని కాటువేస్తున్నాయి-

నాదేశపు దినాలు రాళ్ళకు తగిలి పగులుతున్న పడవలు :

నాదేశపు రాత్రులు గుండెకుతగిలి రగులుతున్న గొడవలు . . . .

ఈనాడు నేను నాదేశపు పుండ్లనించి కారుతున్న చీము తయారుచేసిన ఒక పగబట్టిన పాము!

ఆ ఎర్రనక్క ఎప్పుడూ మెదలుతూ ఉంటుంది నా మది పొదల్లో- ఏదో ఒక లక్ష్యంమీదకి దూకుదామని ఉద్యమిస్తూ ఉంటుంది; కనపడని గమ్యంకోసం కళ్ళు కణకణ లాడుతుంటాయి చింత నిప్పుల్లా

అది నా ఆలోచనల్లో కామాలు పెడుతుంది సెమికోలన్లు ఇరికిస్తుంది. కానీ ఫులుస్టాపులు మాత్రం పెట్టదు. అడవుల గొడవల్లో నించీ పచ్చికబయళ్ళలోనించీ కొత్త కొత్త భావాల్ని తీసుకొస్తుంది. ఉద్రేకంతో వాటికి ఊపిరిపోసి అస్త్ర శస్త్రాలు చేతికిచ్చి నా ఊహల సమూహాల ఊరేగింపును మరింత ఉధృతం చేస్తుంది; ఆ ఊరేగింపు సంకెళ్లు తెంచుకున్న సముద్రంలా గర్జిస్తూ మైదానాల్లోకి దూకాలని చూస్తూ ఉంటుంది.

నామనసుకు మంటల ఆహారం వేసే ఆ ఎర్రనక్క రెపరెపలాడే ఒక ఎర్రగుడ్డపేలికలా ముందుకు నడుస్తుంది తన బలిష్ఠమైన కాళ్ళమీద : ఎదుర్కొంటుంది ఖండాలు దేశాలు జాతుల మీద వీచే శాత్రవతుఫానుల్ని-

ఎవరు సృష్టించారు ఈ ఎర్ర నక్కని? జుట్టూ జుల్ఫాలూ గడ్డమూ మీసాలూ దట్టంగా అవరించిన పొదలాంటి ఒక మొహంలో నించి మెరిసే రెండు నిప్పుకణికలా?

ఇంగ్లండులో ఉన్న డౌల్టన్స్ మాత్రం కాదు-

ఒకపక్షి ఎక్కడ్నించో వస్తుంది రెక్కలమీద, ఈ బాటసారి చెవిలో ఒక పాట పడేసి వెళ్ళిపోతుంది.

ఒక నిజమైన అనుభూతినిమోసే వాక్యం పాటా ప్రాణమూ మోసుకొస్తున్న పక్షిలా నీ దగ్గర వాలుతుంది తెలుసా!

ఇది కండల్ని కోల్పోయిన కోట్లాది రాళ్ళు నివసిస్తున్న నేల
ఇది ఎండల ఇనుప మడమల క్రింద నలుగుతున్న నేల

తన గాయాల రక్తజ్వాలల్ని ఎండమావులుగా ఉమ్మివేస్తున్న నేల

ఇది ఎండల క్రోధాగ్నికి నర్తనశాల; దిశనించి దిశవరకూ వ్యాపించిన శూన్యానికి తనని వదిలివేసి సకలప్రాణులూ పారిపోయిన నేల-

ఇక్కడ ఒక పిట్టా చెట్టూ తప్ప మరేమీ లేవు

పరభూములకు నీళ్ళకోసం వెతుక్కుంటూ వలసపోయిన చెట్ల కుటుంబాలనించి తప్పిపోయిన చెట్టేమో అది.

ఆ ఒంటరి చెట్టు కార్చిన కన్నీటిబొట్టులా నేళదున్నుతున్నా డొకడు, రాతినేలలో నించి జీవనధాతువు పిండుతున్న వీరుడు . . . .

చెట్టు చెక్కిటిమీద రుద్దుతుంది తనకండ ఇక్కడి పొగరు బోతు ఎండ;

ఏ దేశాలనించి వస్తాయో ఈ సుడిగాలులు ఇక్కడే తలదాచుకుంటాయి-

అవి రాళ్ళని ఎవరన్నారు నోళ్లు మూసుకున్న అంతరాత్మలు;

అవి ఎండలని ఎవరన్నారు, రాళ్ళమీద దండయాత్రలు చేస్తున్న మంటల సైన్యాలు;

నాతోపాటు ఈరాళ్ళూ గత చరిత్రకు రక్తమిచ్చాయి.

ఈనాడు అవి వట్టి శిలలే; కానీ ఒకనాటి సామ్రాజ్య శిల్పాలు అవి కన్న కలలే!

ఇక్కడ దున్నుతున్న ఓ అన్నా !

నీవు ఒంటరివాడివి కావు. నీవు కన్నీటి బొట్టువుగా ఆగిపోవు.

ఈ రాళ్ళలో నీవు పెట్టే ప్రతి అడుగుతో అడుగుకలిపే సోదరుడు మరొక డున్నాడని మరచిపోకు ఈ భూగోళంమీద- ఇరాక్‌లో ఇరాన్‌లో మెక్సికోలో మంగోలియాలో . . .

రాళ్ళ కన్నీళ్లు వ్యాపించిన ఈ భూములమీద లేస్తాడు ఒకడు, ఇనప కండరాలు దేహం మీద సుళ్ళు తిరుగుతున్న మనిషి-

అవిగో ఎండల కండువాలు ధరించి దూరాన నిశ్శబ్దంగా వెళ్ళుతున్న కొండలు! అవి ఆకాశాల లోతుల్ని నీకు తెలీని ఉచ్చై స్వరంతో వ్యాఖ్యానిస్తున్న ప్రవక్తలు-

నేను ఒంటరిగా ఉన్నాను-శూన్యంలో నిశ్శబ్దాలు పోగు చేసుకుంటూ, దూరాన్ని భుజాన వేసుకుని మోస్తున్నాను రస్తామీద పోతూ; నా చేతులు నిష్క్రియాభారంతో వ్రేలాడుతున్నాయి.

రా, మనం ఇద్దరమవుదాం; భూమిమీద పాటల జలపాతంలా దూకుదాం. మన ప్రజల కలల పువ్వుల్ని పడవల్లా మోసుకుపోదాం. వాటి గమ్యాలకు చేరుద్దాం. ఈ ప్రగాఢ ప్రేమమయసమయంలో మన మిద్దరమూ ఒకే బాష్ప బిందువవుదాం, మానవత పాదాలమీద రాలుదాం.

నా కళ్ళకూ నా చెవులకూ ముందు తెరవాల్చు నాప్రేమరాశీ! నీ స్నిగ్ధ హృదయంతో వాటిని కప్పవోయ్.

పువ్వులు ప్రక్కిలించే మన ప్రియభూమిలో రక్తబిందువులు రాలుతున్నాయి.

పక్షులు గీతికలల్లే మన గాలిలో పళ్ళు నిట్టూర్పులు విడుస్తున్నాయి.

మన దినాలను చెట్లకుకట్టి ఉరిదీస్తున్నారు: ఉదయించే సూర్యుడ్ని ఊడబీకి పశ్చిమాద్రికి విసిరేస్తున్నారు మహోగ్ర దౌర్జన్యంతో; ప్రతి ఉషస్సూ రక్తం వాంతిచేసుకుంటోంది కానీ నా ప్రజలు చేతులు ముడుచుకుని కూర్చొనున్నారు!

అరే! ఈ కొండలరవ్వేం?

ఈ రాత్రుల కపాలాలు పగలవేం?

ఈ నక్షత్రాలు చచ్చి నేలకు రాలవేం-

ఈ గుంపు వినరేం నా మాట-

అరే నా దేశంలోనే నా గొంతు పరాయిదయిపోయింది. ఇక్కడ నేను అరచిన అరుపు ఆకాశంలోకి వెళ్ళి ఎక్కడో ఇరుక్కు పోతుంది. తిరిగి రానేరాదు-

అరే! ఈ గుంపుకు ఎలా మేల్కోవాలో తెలీదు. ఎలా బాహువులు జాపి తన ఇనపకాళ్లు ఇలాతలంమీద మోపాలో తెలీదు.

కానీ నా ప్రేమరాశీ!

వాళ్లు మన ప్రియమైన ప్రజలు; మన బలాన్నంతా వాళ్ళకిద్దాం

మనం పరస్పరం ఎంతగా ప్రేమించుకుందామంటే మన ఇద్దరి జీవితాల సారాన్నంతా పిండి వాళ్లకు ఇవ్వగలిగేంతగా-

వాళ్ళు మన దేశాన్ని చేస్తారు,

మన చరిత్రను రాస్తారు,

మన స్వప్నాల్ని నెరవేరుస్తారు.

# ఆరో సర్గ

మీరు నన్ను పిలిచారు.

కానీ పిలవకపోయినా మిమ్మల్ని వెతుక్కుంటూ నేనే వచ్చే వాడ్ని!

మీ గొంతులు వెతుక్కుంటూ - చెవులతో కళ్ళతో చర్మంతో ముక్కుతో, ఒకటేమిటి.

సర్వేంద్రియాలతో అన్వేషిస్తూ దేశం నలుదిక్కులా . . . .

నేను వచ్చింది, మీకు తెలీదనీకాదు నాకు తెలుసనీకాదు; మనంమందరమూ కలిసి ఒక్క దిక్కుకు నడుద్దామని:

మనమంతా ఒకేమాట చెప్పాలనికాదు మనమాట వట్టి మాటకు బదులుగా మనుషులదారుల్ని ప్రజ్వలితం చేసే ఒక కిరణం కావాలనీ, అది మనలోనే ఉందనీ, దాన్ని మనం తెలుసుకోవాలనీ-

బాబూ! నా భావాలూ, నాశబ్దాలూ ఎప్పుడూ ఎవరికాళ్ళూ నడవని దేశాలు.

నాచేతన మానవచరిత్రకు తెలిసిన ఏ హద్దులూ తెలీని దేశ ద్రిమ్మరి.

నా నడకలు అడవుల్లో నిర్భయంగా తిరిగే సింహాలు; నేను పూలతో పోట్లాడుతాను పూలతోటలతో పోట్లాడుతాను; మేఘాల సేనలతో పోట్లాడుతాను తుఫానులతో పోట్లాడుతాను; పోట్లాట నేను బతకడానికి పీల్చే ఊపిరి!

నా అవయవాలకు నీచంగా వంగే భంగిమలు తెలీవు - నేను సత్యాగ్రహి! సత్యం నాగుండెల్లో బ్రద్దలవుతున్న అగ్నిపర్వతం: నా గొంతులో గర్జిస్తున్న జలపాతం;

నేను నా కశ్మలశరీరాన్ని దగ్ధంచేసుకుని తప్త హిరణ్య ద్రవంగా ప్రవహిస్తున్నాను నా దేశపు రహదారుల్లో-

రండి నాతోకలిసి . . . . .

భయమెందుకు, నీకోసం నీవు భయపడటంకంటే నీ దేశం కోసం భయపడు; నీవు పొందే చిన్న నష్టాలంటే నీ దేశంనీ ప్రజలు పొందే నష్టాలు ఎంత పెద్దవో తెలుసుకో - ఈజరుగుతున్న సర్వనాశనంలో నిద్రాహారా లెలా రుచిస్తున్నాయి నీకు!

కావాలి నాకు వేడి వేడి చేతన తొణికిసలాడే కొత్త గొంతులు- వాటితో నా తుపాకులూ నా శతఘ్నులూ తయారుచేసుకుంటా ! నా దేశం కార్చే కన్నీరు తుడుస్తా.

నీకు తెలీదు నీ గొంతులో గంధకపు గనులున్నాయి సుమా! నీవు చేసే ప్రతి పద్యమూ ఒక తుపాకి, నీవు మోసే ప్రతి వాక్యమూ ఒక శతఘ్ని - నాగొంతు నా ప్రజలకు దానం చేశాను; నా జాతే నా భాషకు ప్రాణవాయువు, నా దేశం నా శిల్పానికి ఆయువు, నేను రక్త ప్రవక్తను!

నాదేశంలో నాయకత్వం నాదే; దాన్ని రాజకీయాలబారికి అప్పగించను.

రండి పద్యాలు బందూకులుగా ధరించి, సేనల్లా తుఫానుల్లా రండి-

సమయంకోసం మీరు మబ్బుల్లో దాచుకున్న పిడుగులు తీసుకుని రండి!

నేను ఝుంఝూమారుతాన్ని-నేను వచ్చాను. అశాంతిని పంచి

పెట్టడానికి, అరుస్తున్నాను ఆర్తిని తరిమేద్దామని; రండి నాతో, నా ప్రజలారా! రండి . . . . నాతో రావాలంటే, సొంతం కోల్పోవాలి; నీ కంఠంలోనించి నీ సొంత పాట పీకెయ్యాలి. అడుగడుగునా ప్రజలపాట పిడుగులు కురిపించాలి ఆకాశం ఉరిమినట్లు . . . . . . నీ యుద్ధాగ్నులు నీ దేశపు యుద్ధాగ్నుల్లో కలపాలి, నీ పిడికెడుబ్రతుక్కి ఎంత ప్రేమ కావాలి?

పీడితప్రజలకే ఈ భూమి సంక్రమిస్తుంది! రండి, పాతిపెట్టిన ఉషస్సును బయటికి తీద్దాం, ఉషస్సు ఉషస్సు అంటూ పరుగిడుదాం పదండి రండి నా ప్రజలారా! మీ నాగళ్ళు భుజాన వేసుకురండి, మీ భార్యల్నీ మీ పిల్లల్నీ మీ అందర్నీ తీసుకు రండి. ఇళ్ళలోనించి వాకిళ్ళలోనించి స్కూళ్ళలోనించి ఆఫీసులనించి అసెంబ్లీలనించి అకాడమీలనించి రండి-కాలపు గాలి దుమారంలో శతాబ్దా లెగిరిపోతున్నాయి చూద్దాం పదండి . .

నడవండి నాతో-పల్లెల గుండా పట్నాలగుండా, ప్రవహిస్తూ రండి గర్జిస్తూ రండి!

చూడండి! ఆ పొలాల్లో ఆ అరణ్యాల్లో కొండల్లో గోడల్లో, మన ఉషస్సును పాతిపెట్టిన గోరీలు కనబడడంలేదా? నాగళ్ళు తీసుకోండి నా సోదరులారా! పుస్తకాలు పారెయ్యండి నా దేశపు పిల్లల్లారా? మన ఉషస్సును పాతిపెట్టి మన దేశంలోనే మనల్ని బానిసలుచేసిన వాళ్ళ ప్రాణ వాయువులు పీలుద్దాం పదండి.

మానవ జీవితవ్యవసాయంలో సుఖాలు నిర్మిస్తూ దుఃఖాల దండలు వేసుకున్న శ్రామిక కోట్ల అడుగులు ఈ నేలలో వెతుకుదాం పదండి, భూమిని చీల్చి దున్నుదాం పదండి; నాగళ్ళకు తగిలే ఆ కోట్లాది గొంతుల్ని ఏరుకుందాం పదండి : ఈ ఎర్రకోరిక జెండాగా పట్టుకుని ఎగరేద్దాం రండి-

ఈ ప్రయాణంలో ఆవిష్కరిద్దాం మనిషికి మృత్యువులేదనీ, జీవితం ఎన్నటికీ చావదనీ-రండి, చాలాదూరం నడవాలి, సొంత గోడల్ని దాటిరండి,

ప్రజాసముద్ర తరంగాల్లో క్రీడిద్దాం. పదండి, మరోలోకపు తీరాలకు కొట్టుకుపోదాం పదండి–

నీకు తెలుసా ఆకలి ఉందనీ, నీకు తెలుసా దప్పిక ఉందని; అవి రెండూ నీ విలువైన స్వేచ్ఛ మాంసం తిని బ్రతికే క్రూర మృగాలని

నేను నీ జాతీ గొంతునై చెపుతున్నాను, విను! వాటి బారినుంచి నీవు తప్పించుకోవాలంటే, మీనాన్న బొమ్మలూ బొమ్మల పుస్తకాలూ తెచ్చి యిస్తే తీసుకోకు. తిరస్కరించు! పొలాలిమ్మను ప్యాక్టరీలిమ్మను. అవే నీ ఆటవస్తువులని చెప్పు. మీనాన్న తేలేక పోతే దేశంలో ఉన్న నాన్నలందర్నీ ఏకం కమ్మను.

నీవు కాలేజీకి పోతుంటే బాబూ! నిన్ను పొలాలు బిక్క మొహంతో చూస్తున్నాయి. ప్రతిరోజూ ఈ పుస్తకాల ఊరేగింపు ఎందుకు ఈ దేశపు వీధుల్లో, దేశం మొహం చూస్తే అవి చేసే ఉపకారం అవగాహన కాలేదా? అంటున్నాయ్–నీవు కాలేజి గోడల్లోకి పోతావు. అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు అక్కడ్నించి ఎప్పుడూ ఎవ్వరూ తిరిగిరాని గోడల్లోకి పోతావు. ఇక నీవు బ్రతికిందెప్పుడు? మీనాన్నలతరం అదేచేసింది, మీకు ఆ ప్రశ్నేవారసత్వంగా ఇచ్చిపోయింది!

మీరు పలకా పుస్తకాలు పట్టుకుని పోతుంటే బాబూ! మీరు శిలువలు మోసుకుపోతున్న బాల క్రీస్తుల్లా కనిపిస్తారు నాకళ్ళకు–

లే బాబూ! లే, నీ బాల్యంలోనించి లే! పుస్తకాలవతల పారెయ్! నాగలి భుజాన వేసుకో! ఈ కులాలు విడిచిపెట్టు ఆ పొలాల్లో కలువ్, గతకాలపు దారులకు కఠినంగా వీడ్కోలు చెప్పు.

ఇదిగో మీకు నా గుండెల్లో పదిలంగా దాచుకున్న దావాగ్ని దానం చేస్తున్నా. ఈ లోకాన్ని దహించండి మీ లోకాన్ని సృష్టించుకోండి! అరవండి హెూరుగాలులై. ఊరికే తిండితిని, గాలిపీల్చి, శ్వాస వదిలేసి శాశ్వతంగా వెళ్ళిపోయేవాళ్ళం కాదని చెప్పండి, మీరు అడవులు విడిచిన అగ్నిజ్వాలలు కట్టలు తెగిన సముద్రాలు–

చరిత్రలో ఈ క్షణం శిఖరాలెక్కి పిలిచింది; నా నుదుట ప్రయాణం స్వేద బిందువై నిలిచింది–ఇప్పుడు ఈ సత్యం మీకు నా రక్తంతో ధారబోస్తున్నా!

స్వేచ్ఛ మనిషికి మొదటిశ్వాస; అది నీ రక్తపు సజీవభాష; భూమినించి నీవు నీ చివరి అడుగు తీసేవరకూ నిలుపుకోవలసిన ఒకేధ్యాస

పొలాలు మీ పాఠశాలలు, అడవులూ నదులూ ఉదయాస్త మయాలూ మీ గురువులు! హృదయపూర్వకంగా వాటి భాషకు లొంగండి, వాటి శిక్షణ పొందండి.

పొలాలు మీకు స్వేచ్ఛాదానం చేస్తాయ్. హాయిగా పీల్చే ఊపిరి కానుకగా ఇస్తాయ్, పీఠభూమిలాంటి ఛాతీ ఇస్తాయ్, ఇనప ఊచల్లాంటి కాళ్ళిస్తాయి . . . .. . పదండి మీ నూతన గురువుల పాదాల దగ్గరకు; ధైర్యంగా నడవండి, దేశం మీదే!

ఎందుకు నీకా గుండె నీవు దాన్ని బాధలతో నింపుకోలేకపోతే!

ఎందుకు నీకా కళ్ళు నీవు వాటిని కన్నీటితో తడుపుకో లేకపోతే-

రోజూ నేను వెయ్యిసార్లు ఏడుస్తాను నీకు తెలుసా?

మీతో ఐక్యం అయితేనే నాకు నామోక్షం దొరికినట్లు? మీరే నా సముద్రం, మీలోకి ప్రవహించడానికే నేను మబ్బుల్లోనించీ కొండల్లోనించీ అడవుల్లోనించీ దేశం నాలుగు దిక్కులనించీ పరుగెత్తుకు వస్తున్నాను. . .

నేను పరుగెత్తే ప్రవాహాన్ని , నన్నాపకండి, స్వల్ప లాభాల కోసం పంటకాల్వలుగా మలుద్దామని మీ క్షుద్ర విద్యలు నా మీద ప్రయోగించకండి.

నా గంభీరవేగాన్ని చూడండి, మీ కన్నులు పండుగు చేసుకుంటాయి; నా భయంకర గర్జన వినండి, మీ వీనులు ఆనందపు విందులు చేసుకుంటాయి. నా మహాప్రస్థానం చదవండి-రండి నాశబ్ద జ్వాలల మీద మీ హృదయాల్ని రొట్టెల్లా కాలుస్తా, మీ రెటు నడవాలో చూపిస్తా-

నేను, చెట్టును పిడుగు చీల్చినట్లు. సమాజాన్ని చీలుస్తా; లోకంలో గాలినంతా పీలుస్తా . . . .

నా కాగితాలన్నీ కాల్చేస్తా నా పర్వతాలన్ని పేల్చేస్తా; నా శరీరపు ఇల్లంతా రక్తంతో అలుకుతా నాకిటికీలన్నిటిలో పాలికేకల దీపాలు వెలిగిస్తా నా నరనరాలన్నిటినించీ కాంతి పిండిఇచ్చేస్తా; నా రక్తమంతా కారిపోవాలి. నాశక్తి అంతా ధాన్యంగా పళ్ళుగా మారి పోవాలి; నా పంటలతో చేలు నిండిపోవాలి-నా దేశానికి ఒక ఉద్యమ విద్యుత్తు ఇచ్చాననే తృప్తిలో నా ఆత్మ వెచ్చదనం అనుభవించాలి.

నీకు ఈ తిండిగింజలు ఎలా వస్తున్నాయో తెలుసా

ఈ నేల ఎవరు దున్నుతున్నారో తెలుసా

ప్రాణదానసాధనం, ఈనాగలి,ఎవరు చేస్తున్నారో తెలుసా! మట్టిశక్తి అవగాహన చేసుకో బిడ్డా!

ఇనుము జ్వాలల్లో మండుతోంది; గుండె ఎండల్లో పండుతోంది; ఉదయ భాస్కరుడులా జ్వలిస్తున్న ఇనుపముద్దమీద సమ్మెటపోటు పడుతోంది.

ఉక్కు బాహువుల వీరులు తుఫానులు ఊదుతున్నారు, పాత లోకాల్ని భస్మం చేస్తున్నారు, కొత్త లోకాలు సృష్టిస్తున్నారు కర్మాగారపు కొలిమిలో-

ఒకప్పుడు జీవన వ్యవసాయంలో శ్రమించిన ఈ గొంతులేని మిలియన్ల భూమి అడుగున్నే అదృశ్యమై పోయారు. ఈనాడు ఆ గొంతును లెమ్మను తమ్ముడా! వాళ్ళ రొట్టె వాళ్ళకిమ్మను ఓ సహోదరా! చెమట పరిమళాలుమిసే వాళ్ళ పవిత్ర శరీరాలనించి మానవజ్వాల త్రవ్వి తీయరా!

ఎడ్లకళ్లల్లో కుంపట్లు రాజుతున్నాయ్ నాగటి భ్రుకుటిలో క్రోధాగ్నులు రేగుతున్నాయ్

సూర్యుడా! మండు ఇంకా మండు! మా అంధకారం శాశ్వతంగా నశించేవరకూ మండు-

నేను దేశాన్ని దున్నేవాడ్ని; ధాన్యానికి కాళ్ళురావాలనీ ఆ కాళ్ళలో పేదల ముంగిళ్ళకు నడుద్దామనే కలలు రావాలనీ వ్యూహాలు పన్నేవాడ్ని-

దున్నిందంతా చూస్తూ దూరంగా కూర్చుంటూ, గాలికి నా నిట్టూర్పులు మేళవేస్తూ, బంగారు బస్తాలు మోసే వంగిన వృద్ధకూలీలా ఉన్న పశ్చిమాన్ని చూస్తు-

మట్టి పిసుకుతాను; మట్టిలోనే చెట్లతో పైర్లతో పెరుగుతాను; పళ్ళతో ధాన్యంతో బతుకుతాను-నా దేశంలో-

చేతులనిండా పని ముంచి పోస్తాను. తెల్లవారగానే మళ్ళీ పని కోసం ఖాళీగా ఉంటాయి నాచేతులు;

నాతో దినమంతా నా మిత్రుడు శ్రమిస్తాడు గగనంలో ఎండ నింపుతాడు; తెల్లవారగానే మళ్ళీ గగనం ఖాళీగా ఉంటుంది ఎండకోసం . .

భూమిని బుజ్జగిస్తాను లలితంగా లాలిస్తాను వెన్నలాంటి మన్నుతో గోరుముద్దలు చేసి పైర్ల పసినోళ్ళ కందిస్తాను.

నా శరీరం పృధివి గ్రీష్మంలో రెండూ నీటికోసం తపిస్తాయి చిక్కటి రక్తమాంసాలతో మిస మిసలాడే వర్షబిందువు నా ఊహల పాడిమన్నులోకి జారినప్పుడు గుప్పున ఏవో కలల పరీమళాలు చెలరేగుతాయి.

నేను విరిగిన కలలోనించి పుట్టాను, విరిగిన ఇంద్రధనస్సు కార్చే రంగుల్లో స్నానం చేస్తాను-

నా పక్షులు గాలిలో స్నానంచేస్తాయ్ కొమ్మల్లో ఇళ్ళు కడతాయ్ ఆకాశంలో రస్తాలు వేస్తాయ్.

నా కలల దేశంలో నాకున్నది ఒక్క గుడిసే! నేను ఎందుకు బ్రతకాలో ఒక సున్నలో, నాకే తెలీదు.

అందరూ వరికోతలకు పోతున్నారు; నేనూ పోదామని నా గుండెలో ముత్యాలు గలగల్లాడుతున్నాయి : నా కొడవలి విరిగి పోయింది; దాన్ని బాగుచేసేవాళ్ళే లేరు ఈ ప్రియమైన నా దేశంలో-

నేను గుప్పెడు వెల్తురుకూడా నోచుకోని గుడిసెల్లో నడిచి పోతున్నాను . . . .

కాళ్ళు నరికివేసినా దూరాన్ని తొక్కుతూ నడిచిపోతున్నా

చేతులు నరికివేసినా నా కలల శిల్పాలు చెక్కుతూ నడిచి పోతున్నా

నాలిక కోసివేసినా నిశ్శబ్దమే పుచ్చుకొని నడిచిపోతున్నా సముద్రంలోకి పోయే ప్రవాహంలా

దిశల్లోకిపోయే ఝంఝూమారుతంలా

క్రూరాంధకారంలో గోరంత దీపంకూడా లేదు పిడికెడు కిరణపు తునకలైనా భిక్షంవెయ్యడానికి!

ఏ గుడిసెల్లో పగలు మనుషుల్లేరో ఏ గుడిసెల్లో రాత్రి వెల్తుర్లేదో ఆ గుడిసెల్లో నడిచిపోతున్నా–

ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకు పోతున్నాడో

ఎక్కడ పసితనంకూడా బతకడానికి పనిచెయ్యాలో అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి.

నా చేతులు నిజంగా రాలిపోయాయి నా నాలిక పడిపోయింది;

అక్కడ నేను మహా ప్రవాహాన్నికాదు,

అక్కడ నేను ఝంఝూమారుతాన్ని కాను,

ఆ పసివాడి కాళ్ళముందు !

కడివెడు కన్నీళ్ళు పోశాను ఆ కాళ్ళమీద; నా ఆత్మలో ముత్యాలదండ తెగి అతని ముందు పడిపోయింది; నాపద్యం అటు వైపు చూడలేక ఏడ్చింది; ఇక్కడ్నించి నన్నొక స్వర్గంలాంటి కలలోకి రమ్మన్నా నేను రానని చెప్పింది,

శాశ్వతంగా ఆ నేలకే అంకితమైపోయింది.

ఉషస్సు వచ్చిందని కేకవేస్తే డుఃళ్ళో

అందరూ బయటికివచ్చారు.

పిల్లలందరూ వీధుల్లోకి పరుగులెత్తారు

ఇళ్ళతలుపులూ కిటికీలతలుపులూ మేడల తలుపులూ మిద్దెల తలుపులూ-డుఃరితలుపులన్నీ తెరుచుకున్నాయ్ ఉత్కంఠతో-

కానీ చూచింది సూర్యుడికి బదులు, సూర్యగ్రహణం!

మనుషుల్నే కాదు, దేశపు పొలాల్నీ అడవుల్నీ నదుల్నీ మోసం చేశారు

. . . . .

ఓహో! ఇక్కడ జీవితం కుళ్ళిన పండులా శిథిలమై పోయింది,. ఈ విషవృక్షపు అంటు మరొకచోట స్వాదుఫలాలు కాయదు. దీన్ని నిర్మూలించడమే కర్తవ్యం!

నీటిగాయాలు చెట్ల గాయాలు పైర్లగాయాలు మీకు కనిపించవు. పొలాలూ నదులూ అరణ్యాలూ వీరమరణం పొందిన ఆత్మలు!

ఎవరు దేశమంతా దున్ని తమ దేహపుకండలు మట్టికిచ్చారో,

ఎవరు నేలగొంతు ఆలించి దాన్ని లాలించి తమ చెమటతో రక్తంతో వెన్నలా జున్నులా మృదువు చేశారో,

పెరిగే పైర్ల వంపూ సొంపూ అందమూ గంధమూ లాలసతో చూస్తూమూచూస్తూ, ఉదయించబోయే ధాన్యంకోసం ఉదయాస్తమయాలూ కలలుకన్నారో,

కానీ అంతిమసమయంలో ఒక్క గింజకూడా దక్కకుండా అంతా విడిచి నిష్క్రమించారో,

ఆ మృతవీరులు, మానవ ఇతిహాసంలో అమృతమీరులు, ఆ కోట్లాది పేరులేని శ్రామికజీవులు భూమిని వదల్లేక మట్టిలో కలిసి నిరీక్షిస్తుంటారు.

గింజ దిగగానే చినుకు పడగానే వారు ప్రేమించిన గింజల గర్భంలో ప్రవేశిస్తారు; చెట్లవుతారు పైర్లవుతారు; పళ్లయ్ పంటలయ్ మనుషుల్లో ప్రవేశిస్తారు, మనుషుల జన్మలకు మళ్ళీ బీజాలవుతారు.

కనుకనే చెట్లు ఈ దేశంలో తమ పిల్లలు ఎందుకు స్కూళ్ళకు పోతున్నారని కన్నీళ్లుకారుస్తాయి, పైర్లు రోదిస్తాయి.

అవి నోరు విప్పలేక కాదు – నోరు విప్పిననాడు దేశాలు ఖండాలు ఖండాంతరాలు తట్టుకోలేవని!

ఒక చెట్టు గనక, పర్వతాగ్రాలెక్కి కేకవేస్తే చెట్లు గుంపులు, గుంపులుగా వస్తాయి. తోటలైపాటలై అడవులై అరణ్యాలై అన్ని దిక్కుల్నించీ వస్తాయి.

అవి తీర్మానిస్తాయి, మా పిల్లల్ని ఈడ్చుకుపోయి బానిసలుగా చేసేవాళ్ళ ఇళ్ళల్లో, ఆఫీసుల్లో,విశ్వవిద్యాలయాల్లో ఊడిగం చేయకూడదని

తిరస్కార సూచకంగా తలుపులు దూలాలు ద్వార బంధాలు కుర్చీలు బల్లలు అన్నీ చెట్లుగా మారి బయటికి వచ్చేస్తాయి; అరణ్యాల్లోకి పోతాయి, నీళ్లు నదుల్లోకి పోతాయి గాలి ఆకాశంలోకి పోతుంది.

బానిసల్ని తయారుచేసే కర్మాగారాలన్నీ కూలిపోతాయి, కర్మ ఆగిపోతుంది, కర్త పారిపోతాడు !

స్కూళ్ళ జైళ్ళలోనించి పిల్లలు విముక్తులవుతారు – మళ్ళీ మబ్బులు వర్షిస్తాయి నదులు ప్రవహిస్తాయి, అడవులు ఆకాశాల వైపు బాహువులు

ఊపుతాయి; పిల్లలు పూల మిలియన్లయ్ పొలాల్లో గంతులేస్తారు.

దేశం మళ్ళీ శ్వాస పీలుస్తుంది -

నవ్వు మొహాన రాసినవాళ్ళని చూస్తే నా చెయ్యి బాంబు కోసం వెతుకుతుంది!

వాళ్ళకు నవ్వేంతటి సుఖం ఎలా దొరికింది ? ఎవడికి లంచమిచ్చి కొనుక్కున్నారు ? అని నా లోపలి అడవుల్లో ఆకలి దహిస్తున్న వెయ్యి తోడేళ్ళు పరవళ్ళు తొక్కుతాయ్

పాపం అమాయకులూ నీతిపరులూ ఈ దేశంలో అంత ఖరీదైన నవ్వుని కొనుక్కోలేరు -

అందమైన వస్తువులు ఎదురైతే నాకు అసహ్యం ! అందం ఎంత అప్రస్తుతం నా సందర్భంలో; ఆనందం అందపు రూపాంతరం, అందుకే ఆ రెండూ నా శత్రువులు -

నా కెందుకీ అందం - నా తండ్రి మొహాన ఉమ్మేస్తుంటే మీ ఆఫీసర్లు, పిల్లవాణ్నిగా నా కళ్ళు చూచాయి నిప్పులు కక్కలేక నీళ్ళు కక్కాయి, ఇప్పుడు రక్తం కక్కుతున్నాయి -

నా కెందుకీ అందం - అగ్నిపర్వతమంతటి శక్తి ఉన్నవాణ్ని నన్ను అసమర్థుడన్నారే, మీ గాడిదలు !

మానవత్వంతో మనిషి గౌరవంతో చెర్లాడుతారు; అవి వాళ్ళ ఆటవస్తువులు - లంజాకొడుకులు !

నీశబ్దాలంకారాలు నన్ను ఓదార్చగలవా ఒరే "ఆస్థాన" కవీ !

నా ఉష్ణోగ్రత చూచి నాగరక భాష ఎప్పుడో నా పెదవులు వదలి

పరారయిపోయింది; ఇప్పుడు తిట్లుకాదు – నా శరీరం ఆపాద మస్తకమూ అగ్నిచ్ఛటల వర్షపాతం వీస్తోంది.

ఆ పెద్దబిల్డింగుని ఒక్క గుద్దుతో బద్దలు చేద్దామని నా హస్తం లేస్తోంది.

ఒరే! మీ మొహాలు చూస్తే నా పూల ప్రపంచపు ఆశలు మండి మసి అయిపోతాయి. మీ మొహాల క్రూరత్వంనించి నన్ను నే నెప్పుడు రక్షించుకుంటాను అన్నదే నా ఏకైక కోరిక

మీరు ఒకర్నొకరు మంచిగా అవగాహన చేసుకుని హాయిగా నిర్మించుకున్న మీ బకాసుర సంస్థ ఎప్పుడు భస్మీపటలం అవుతుంది అన్నదే నా ఏకైక స్వప్నం- .

అన్ని అందాలనూ నాశనం చేసే దురాత్ములారా!

మీరు అందాలమీదే అధ్యక్షత వహిస్తారా ?

చెట్లన్నీ, తమ కడుపుమంట వెలిబుచ్చడానికి వసంతరుతువనే పేరుతో ఏటేటా మంటల హార్తళ్ జరుపుతుంటాయి. పూలమంటలు ఒంటినిండా పూసుకుని వాటి మొహాలమీద అసమ్మతి సంతకాల్లా పక్షుల బారులుంటాయి.

నన్నిలా చూస్తే ఏముంటుంది? బతికి ఉంటే పామరుడ్ని, చస్తే అమరుడ్ని–

మనుషులు తపస్సు చేసి చేసి ఒక పామును పుట్టించారు. విరివిగా ఓట్లనే ధాన్యపుగింజలు వేసి పెంచారు. దాని పడగల నీడల్లో హాయిగా బ్రతకవచ్చునని ఊహించారు. ఆ పాము చట్టాలనే గుడ్లు సక్రమంగా పెడుతుంది; తరచూ, తన గుడ్లు తానే తింటుంది. కానీ తన జాతిని పెంచుకుంటుంది – నాగస్వరం ఊదే వాళ్ళ ముందే శిరస్సు ఆడిస్తుంది లేకపోతే కస్సుమని కాటు వేస్తుంది –

అనతికాలంలోనే, నాలుగు ముష్టి గింజలకోసం నాగస్వరం ఊదే తెగ తెగ పెరిగింది దేశంలో; మామూలు మనుషులకు మసలే చోటే లేదిప్పుడు నా దేశంలో ! ఈనాడు ఇదే నా దేశచరిత్ర -

బాబూ! ఈ దేశాన్ని ఈ పాలార్నీ చూస్తే కన్నీళ్ళు రావడం లేదా ? నీ పంటల గుండెల్లో బాకులుదింపిన వాళ్ళమీద ద్వేషోద్రేకం రేకెత్తడం లదా ?

ప్రజాస్వామ్యం పేరు చెప్పి ఎందరి ప్రాణాలు తీశారో ఆ లెక్కలు వేయాలి; నీచంగా ఇంకా బతుకుతున్న గతుకుతున్న జనాభా లెక్క లెందుకు?

పాముకాటుతో భస్మవుతున్న ఓ నా ప్రజలారా ! రండి, మీకో కొత్త పద్యం ఇస్తా ; ఈ పద్యం మీకో కొత్త ప్రాణం ఇస్తుంది, ఒక కొత్త ప్రయాణం ఇస్తుంది -

నాగస్వరం ఊదే క్షుద్రవిద్య నేర్చుకోకండి, పామునుచంపే ఉన్నత విద్య నేర్చుకోండి -

ఈ దేశంలో, ఒంగేవాడికి ఒంగి సలాం చేసేవాడు పుడుతున్నాడు, జాగ్రత్త! ఈ లక్షణం తలయెత్తిందంటే ఆకాశంలో తోకచుక్క పుట్టిందన్నమాటే-

వాడ్ని చంపెయ్యండి, పాములు వాటంతటఅవే చస్తాయి. అసలు వాడ్ని మాతృగర్భంలోనే పసిగట్టి సంహరించండి. ఈ దేశపు గాలి పీల్చడానికిగానీ, ఈ దేశపు నీరు తాగడానికి గానీ, వాడికి హక్కు లేదు -

వాడి దుర్గంధపు ఊపిరితో నా దేశపు వాతావరణం మలినం చెయ్యనివ్వను..

వినండి ! వాడు మన నిజమైన శత్రువు -

నా గుండెల్లో బంధించిన క్రూర రాక్షసుల్నందర్నీ వాడి మీదికి విడుదల చేస్తాను; వాడి విధ్వంసం కోసమే నిద్ర మేల్కొ ఉంటాను.

దినం సూర్యుడ్ని పూర్తిగా కొల్లగొట్టి తరిమివేస్తే, పాపం ! కట్టుబట్టతో నిష్క్రమించాడు పడమటి పొలాల మీదుగా –

నాగలి అవతలపెట్టి నేను మిగిలిన నా పేద సాయంకాలపు ముక్కలనించి ఎట్లాగో ఒక పాట పిండుకుంటున్నాను.

నాకు తెలీకుండానేఉదయించిన అర్ధచంద్రుడు అప్పుడే నరికిన శిరస్సులా అకస్మాత్తుగా అస్తమించాడు రక్త కాంతులు కక్కుతూ –

ఎంత ప్రయత్నించినా ఒక్క ఆవులింత కూడా రాత్రిని ఆహ్వానించలేదు. ఒకటి రెండు పేజీలు ద్రాక్షోపనిషత్తు పఠించి, శయ్యతో ఏ తర్కమూ పెట్టుకోకుండా, నా అవయవాల్ని దానికి స్వాధీనం చేశాను.

కానీ ఒక భయంకర స్వప్నం !

లాగులూ బుష్‌కోట్లూ ధరించిన శిరస్సుల్లేని భయంకర మానవాకారాలు నా దేశపు పిల్లల్ని చీమలు చేసి సిరాచెరువుల్లో తోసి వెళ్ళిపోతున్నారు. "దేశం మాదీ" అని అరుస్తూ –

కలలోనించి ఒక గంతువేసి దూకాను బయటికి – గాలిని చూచి కిటికిలో జ్వాల గడగడ వణికింది ; చీకటి ఇంటిని కబళించింది.

నా స్తంభాల్లాంటి పాదాలు బయట వీధుల్లో మోపాను. మనుషుల అడుగుల మీద నిశ్శబ్దం వాలుతోంది, మగతగా నక్షత్ర మండలాలు నిద్దురమత్తులోకి ఒరిగిపోతున్నాయి.

తూర్పు వెతుక్కుంటూ వెళ్ళాను. సూర్యుడి తొలికిరణాలు పోగుచేసుకుందామని ;

ఊరి పొలిమేరల్లోనే ఆగిపోయిందల్లే ఉంది ఉషస్సు ! ఆ తరుణాన్ని ఇక సహించలేకపోయాను !

అరుణాగ్ని ఉమిసే కళ్ళతో నా పిడికిట్లో ఉన్న తుఫానుని ప్రపంచం మీదికి ఊదేశాను.

క్షణంలో తూర్పు గుడిసెమీద గొంతెత్తిన ఎర్రటి కోడిపుంజులా లేచాడు సూర్యుడు ;

ఒక నవోదయ కిరణం గుచ్చుకుని నా అలసిపోయిన శరీరం మూర్ఛపోయింది -

ప్రొద్దుటెండ మా గుమ్మంలోకి వచ్చి తొంగిచూచింది దినంఎందుకో తడబడుతూ ఉంది. పడమట ఉదయాన్నీ తూర్పున అస్తమయాన్నీ ధరించుకుని పరుగెత్తుకు వచ్చింది.

కళ్ళలో ఏదో సంభ్రమం, కాళ్ళలో ఏదో తొట్రుపాటు -

కళ్ళు బెదిరిన పక్షుల్లా ఉన్నాయి, కాళ్ళు రాళ్ళలో ప్రవహించే సెలయేళ్ళలా ఉన్నాయి.

తలవని తలంపుగా చైత్రం బయలుదేరి వచ్చింది - నేనేమో ఆహ్వానించే శక్తి లేని అతిథిని !

దున్ని దున్ని అలసిపోయి ఒక చెట్టునీడలో మేనువాల్చాను తలపులు గాలిపటాలుగా ఎగరవేస్తూ -

చిన్న పసి ఆకు నీడలో ఒక కల అల్లుకుంటూ సేద తీర్చుకుంటున్న పక్షి, నీలిమలో తేలిపోతున్న ఒక తిరుగుబోతు మబ్బును చూపులతో వెంటాడుతోంది; అదెక్కడికి పోయి కరిగిపోతుందో అక్కడికి తానూ పోయి ఆ లోతుల్లో కరిగిపోదామని –

తుంటరి చెట్టు ఒంటరిగా ఉన్న నా మీద ముసలి ఆకులు విసిరేసింది

అది కటిక చీకటి అమావాస్య – అయినా గగనంలో నక్షత్రాల నగరాలు మేల్కొన్నాయి.

నా మెదడులో భావాల అరణ్యాలకు నిప్పంటుకుంది.

నిద్రపక్షి ఐ పారిపోయింది. జ్వలించే శూన్యానికి తన గూడు విడిచిపెట్టి;

నా కిటికీ ఇనప ఊచల కావల ఎక్కడో దూరదూరాల అడవుల్లో వ్యూహాలు పన్నుతున్న చెట్ల సైన్యాలు.

తీవ్రంగా చెలరేగుతున్న తుఫానుల యుద్ధాలు,

క్రోధోద్రేకంతో చతుర్దిశలా పరుగెత్తుతున్న ఉన్మత్తఝంఝా మారుతాలు

కొండల శిఖరాలు దిగి శరీరాలు దిగి ప్రవహిస్తున్న నదుల రుధిర ధారలు–

మనుషుల నగరాలూ, గ్రామాలూ నిశ్చయం కోల్పోయిన అజ్ఞాన ఆకస్మాత్తు దశలో నిలువునా కంపించి పోతున్నాయి.

అప్పుడే ఛేదించుకున్న శిరస్సులు చేతుల్లో పట్టుకుని,

శరీరాలు గుడ్డి కాళ్ళతో పరుగులెత్తుతున్నాయి,

శిరస్సులు నించి వీధుల్లో రక్తం కారుతుండగా,

వాటి భయంకర దంత వక్త్రాలు ఉపద్రవ నాగరకతల్ని శపిస్తూ ఉండగా-

భూగోళం తనని తానే పేల్చుకుని

తన అవయవాల్ని కల్లోల సముద్ర తరంగాల్లోకి విసిరేస్తోంది

సహస్ర బాహువులతో -

నా కిటికీలో రెండు చినుకులు పోట్లాడుకుంటున్న గోల !

# ఏడో సర్గ

ఓరి మిత్రులారా ! మీ నగరాల మీద గద్దలెగురుతున్నాయి చూడండి-

మౌనంగా ఉన్న చెట్లకు మాటలు రావనుకున్నారు కానీ అవి అంతః శక్తి మీద బతికే నిశ్శబ్ద మునీశ్వరులు !

గుడిసెలూ భవనాలూ మేళవించిన మీ కలగూరగంప నాగరకతలో మీరు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఆత్మదర్శనం అంటున్నారు ! మీ ఉపన్యాసాలు మీరు చేస్తున్న బలాత్కార వ్యభిచారాలు –

మండే భూమిలోనించి ఉదయించినా చెట్లు మనిషికి మనఃపూర్వకంగా నీడలిస్తున్నాయి. గాలులు పాలించే అడవుల్లో గౌరవ హాని లేకుండా తపస్సులు చేసుకోవచ్చు. మీ నగరాల్లో, మోయలేని ప్రాచీన భారంగా ఆధునిక రస్తా వీపుమీద ఎడ్లబండి కాళ్ళీడ్చుకుంటూ పోతోంది. మెరిసే మోటారుకార్లు మెరుపుల్లాపరుగు లెత్తుతుంటాయి, నిర్లక్ష్యంగా, దురహంకారానికి చక్రాలు తగిలించినట్లు – ప్రక్కనున్న చెట్లను పట్టించుకోవు; పాతకొత్తలు మీ రస్తాల్లో పరస్పరం హేళన చేసుకుంటున్నాయి. సృష్టి విలువలు దృష్టిపథం నించి గెంటి వేయబడ్డాయి.

గాలిలో విమానంతో పోటీ పడుతున్న ఆ పక్షి వట్టి పక్షి అనుకోకు; అది నీలి ఎత్తులమీద కూర్చుని, లేస్తూ పడుతూ నడిచే మానవ నాగరికతల్ని

పరీక్షిస్తున్న ప్రాచీన పక్షి - ఏ నాగరికతల్ని మనిషి తన గొప్పతనానికి ప్రతీకలుగా పతాకలుగా ఎగర వేస్తున్నాడో చరిత్ర పేజీల్లో, ఆ నాగరికతల్ని పరిశీలిస్తున్న పక్షి!

మనిషి చేస్తున్న శుష్క ఆర్భాటం చూస్తూ కొండలు వికటాట్టహాసం చేస్తున్నాయి. సముద్రం విశ్వాసవాసనలేని హ్రస్వ హాసం చేస్తోంది. ఆకాశం కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతోంది. జ్ఞానకుక్షులైన పురాతన అడవులు మౌనవ్యాఖ్యలతో తలలు పంకిస్తున్నాయి.

మనిషీ! నిన్ను ఎక్కడికి మోసుకుపోతున్నాయో నీ కాళ్ళు ? నీరిక్త నాగరికతల ఆర్భాటధాటిని మోయలేక వంగిపోతున్న నీ రెండు కాళ్ళు -

శతాబ్దాల గోడలమీద కూర్చుని తుఫానులు అరుస్తున్నాయి. విను!

# ఎనిమిదో సర్గ

ఈ గీతిక నన్ను విడిచి ఎన్నేళ్ళయింది ! మళ్ళీ ఇవాళ నా అధరాల గుమ్మంలో అడుగుపెట్టింది. గాలి పరిమళపు కొంగు పట్టుకొని లాగుతోంది; ఈ లోయ మన పాటలల్లుతోంది; చంద్రుడు నా కిటికీలోకి వచ్చాడు; నా గుండెలో మళ్ళీ నిప్పంటించాడు –

నాగలి నాచేతికి నాగుబామయింది; పొలంపనులు నా కాళ్ళకు సంకెళ్ళుగా మారాయి. తేనేలు మోసుకువచ్చే తేనేటీగల్లాంటి నీ పలుకులు వదలవు నన్నెప్పుడూ !

నా హృది ఒక నదివై నీ వైపే పరుగిడుతోంది, నామది ఒక గదివై నీ కొరకే తన తలుపులు తెరుస్తోంది –

ఇదిగో నీ కోసం చేలలో కోసితెచ్చిన పువ్వు; ఆ పువ్వు నీ కురుల్లో గూడుకట్టుకుందామని ఎగిరివచ్చిన రంగుల పక్షి; దానికి నీ నవ్వు అందివ్వు

రాత్రి మనం కలిశిపాడిన పాటలు ఇంకా పొదల్ని వదల్లేదు; కొమ్మల్నించి నేలకు రాలిన పువ్వులు కొమ్మల్లోకి తిరిగి పోనేలేదు –

కొబ్బరి మట్టల్లో కురిసిన వెన్నెల ఇంకా బొట్లు బొట్లుగా కారుతూనే ఉంది. ఆ బిందువులు నీ కోసం నాగుండెల్లో పట్టి తెచ్చాను.

సూర్యుడు భూమిని ప్రేమించినంతగా నిన్ను ప్రేమిస్తున్నాను; రాత్రి పోయినా ప్రొద్దున్నే వస్తాను; నిన్ను చూచి నన్ను మరచిపోతాను–

చెట్టు లేకపోతేపోనీ, ఇల్లు లేకపోతేపోనీ, చెట్టులాంటి నా చేత్తో నీకు నీడ ఇస్తా –

పొలాలమీద ఇంద్రధనుస్సు వంగింది. రా పోదాం. కొడవళ్ళు దాల్చిన చేతులు ఎగరేస్తూ –

అది మన వేడితనువుల కింద నలిగిన విరజాజుల రోజుల మీద మనమిద్దరమూ కలిసి నిద్దురలేచిన మొదటి ఉదయం; ఆ ఉదయం తెచ్చిన నవీన అరవింద సందేశాలను ఆలిద్దాం – నీ అధరాల నుంచీ నీ గర్భం నుంచీ నా శరీరానికి పుట్టిన స్వప్నాల తరం అవయవాల్లో అణువణువునా కర్మణ్యతాశక్తి నిబిడీకృతం ఐ ఉంది. ఆ తరం మానవ దేశాలనించి కార్యహీనతను బహిష్కరిస్తుంది; నాలుగు దిక్కులా పచ్చటి పరిమళాల తోటల్ని పెంచుతుంది. మన ప్రేమఫలాలభారం కొమ్మల్ని వంచుతుంది

మన శరీర క్షేత్రాల్లో పండిన ధాన్యమే మన భావి ఆశా బీజాలు. వాళ్ళే మనకు ఈనాడు కనుపించని సుదూర కాలతీరాలను మన ప్రయాణాన్ని కొనసాగిస్తారు. మన ప్రాణాల పరమాణువులై వాళ్ళే మళ్ళీ మళ్ళీ ఆగామి ప్రత్యూషాల్లో మానవులుగా ఉదయిస్తుంటారు.

ఓ ప్రేయసీ !

నా దేశం నా ప్రజలు యుగ యుగాలుగా అనుభవిస్తున్న బాధల గాధలు, నా కన్నుల్ని అశ్రువులతో అలంకరిస్తున్నాయి. నా శరీరాన్ని వ్యధాస్వర ఝురీవేగంతో ప్రతిధ్వనింపజేస్తున్నాయి.నా క్రోధోన్మత్త ఉత్తమాశ్వాలకు కళ్ళెం వేయగలిగింది ఏదీ లేదు.

నా గుండెలో చిరకాలంగా బంధింపబడ్డ అశాంత నిశ్శబ్దాలు ప్రశాంతి ఎరిగేవేకాదు, నీ బాహువులు నా మండుతున్న దినాలకు ఆశ్రయం ఇవ్వకపోతే, నీ ప్రవహించే శిరోజాలు నా రాత్రుల భగ్న నౌకల్ని మృదువుగా తేల్చి మోసుకుని పోకపోతే -

నాదేశం నా ప్రజలు నా ధరిత్రి అన్నీ నీలో దర్శిస్తున్నాను. నీ కన్నుల్లో కనిపించే నూతన ప్రాచీరేఖలు నా అడుగుల్ని పిలుస్తున్నాయి; ఈ శతాబ్ది నా మీద విసిరేస్తున్న క్రూరమైన సవాళ్ళను ఎదుర్కోమంటున్నాయి. వాటిని నేను జయిస్తాను. నా తర్వాత నా అజరామర వాక్యాలు జయిస్తాయి -

నేను ప్రేమ అగాధలోతుల్లో మానవ పదవీ గౌరవాన్ని పొందాను

ఇది వింశతి తమ శతాబ్ద<br>పంచసప్తతి తమ సంవత్సరాన (1975)<br>విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత<br>బుధజనవిధేయ శేషేంద్రనామధేయ<br>కవివర్యప్రణీత నాదేశం నా ప్రజలు<br>నామాంతర సమేత<br>ప్రజాపర్వము సర్వము<br>సమాప్తము

# సూర్య పర్వము

## ఒకటో సర్గ

నేను చెమట బిందువుని
కండల కొండల్లో ఉదయించే లోకబంధువుని
గుండెలతో నాకు దోస్తీ
నేనుండేది బాధల బస్తీ
సింధువంత చరిత్ర నా పిడికిట్లో ఉన్నా
చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని

వెళ్ళిన పక్షుల గుంపులు వెనక్కిరాలేదని
ఆక్రోశిస్తున్న అడవుల్లో
చిక్కటి నక్షత్రాలుకలుపుకుని
చీకట్లు ఆస్వాదిస్తున్నా
స్మృతులతో అల్లిన పైట చెరగు పట్టుకుని
నాదేశం పాదాలుపెనవేసుకుంటున్నా

చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తున్నయ్
కొమ్మల్లో పూలై
గోలీదూరిన గుండెలు కదులుతున్నాయ్
గుడిలో ఘంటలై
ఎందరు ఎన్ని రాత్రుల రక్తం పిండి ఇచ్చారో

ఈ దినం కోసం
మన పంచల మంచుబిందువులై
ప్రేలాడుతున్నారు . . . . . .
ఇదిగో నా ఇనప పిడికిలి
కాలపు కఠిన శిలల్లోంచి కాంతిజ్వాల
త్రవ్వి తీస్తా ఎదిరించే శతాబ్దాల నిదురకు నిప్పంటిస్తా
సముద్రాల విరహంతో పరుగులెత్తే నదుల్ని
ఆగండని కేకవేస్తా
ఆ రంగులేని బంజర్లకు ఆకుపచ్చ పులమమంటా
దేశంనించి పారిపోయిన నవ్వుని
తిరిగి రమ్మని ఆహ్వానిస్తా
పువ్వుకోసం వెతుక్కుంటున్న సీతాకోక చిలక్కి
ఒక పూలతోట యిస్తా;
పిల్లల్ని రాత్రిముక్కలు వెన్నెట్లో ముంచుకుని
కొరుక్కుంటూ తినమంటా

సూర్యుడు ఈ శుభదినాన్ని
మోసం చెయ్యనివ్వను
ఈ దేశపు ప్రాచీరేఖ మీద
సూర్యుడు ఉదయించకపోతే
మండే నా గుండె చీల్చి దానిమీద పెడతా
ఎర్రటి నాకండలతో
ఎండలు కాయిస్తా . . . . . .

* * * * *

నేను ఒక పాటని
అడవిలో సరిగమ లల్లుతూ
ముత్యాల గుంపుల్లా పరుగులెత్తే
వాగుని

నీలిమలో మధురిమ చల్లుతూ
రెక్కలమీద తేలిపోయే
పక్షిని

తోటలో వసంతం గుండెలో గ్రీష్మం
ఎటు పోవాలో తెలీని
బాటసారిని

నా వాక్యం ఒక పిల్లనగ్రోవి
లోపల గాలితప్ప అర్థం ఉండదు
గొంతు మాత్రం
ఎందుకు తియ్యగా ఉంటుందో తెలీని
దిక్కుమాలిన పాటని –

* * * * *

సముద్రం
హృదయ కుడ్యాల మీద ఏవో గీతలు గీస్తోంది
గాయం కార్చే కాంతిలో జీవితం తిరగేస్తున్నాను
బయట శోకంతో ఆకాశం చుక్కలు రాలుస్తోంది
చంద్రుడు పరచిన వెండి తువాలు మీద పడుకున్నా
ఏ తార ఏరహస్యం చెవుతుందో విందామని
మిణుగురు పురుగు వెన్నెట్లో

చీకటి ప్రయాణాలు చేస్తూ
దారిలో మరచిపోయిం దొక
వాక్యాల మూట

*****

ఒక పావురంలా రాత్రి
నా గుండె మీద వాలింది

బాధల తుఫానుని
ఒక్క నవ్వుతో తుడిచివేశాను

కలల్లో జింకల్ని తరుముకుంటూ
పోయాను కలం ఎక్కు పెట్టి

ఒక అశ్రువు నన్ను మోసం చేసినా
చంద్రుడు లోకంమీద తన తెల్లజెండా
ఎగురవేశాడు

*****

నిద్రనించి బయటికి వస్తాను
స్వప్నంలోకి వెళ్ళిపోతాను

నేను లోకాన్ని చూడలేని
బాధని

రాత్రి నేను కనే కలలు
దినాలమీద కట్టే వంతెనలు
నేను పాట కాలేకపోయిన
స్వరాన్ని

నా భాష తననిండా బాధలు నింపుకుంది
నేను అధరాలమీద మౌనం విధించుకున్న
పర్వతశ్రేణిని

చీకట్ల దాస్యం ఛేదించుకుని
చుక్కలు నా వాక్యాలై
సూర్యుడిలో కలిసిపోతున్న
చిట్టచివరి రాత్రిని
రోజూ ఉదయాద్రి శిఖరంమీద
రక్తకాంతులు చిందే గుండ్రటి పాటని

* * * * *

నోటినిండా సూర్యుడ్ని కొరుక్కుని తింటున్నా
పెదవుల కొసల్నించి ఎర్రకాంతుల రసం జారిపడుతోంది-
అడవుల్లో సంచరిస్తూ దారితప్పిన లంబాడీ ఒంటరితనం
నా యెదుట పడింది . . .
పళ్ళు కాలాన్ని వేటాడే క్రూరమృగాలు

చూపులు గగనంలో ఎగిరే గాలిపటాలు

ముద్దులు నన్ను అద్దుకునే నా ప్రతిధ్వనులు-

వదరుబోతు పువ్వుల్ని శిక్షించాలని
నా నిశ్శబ్దాన్ని వాటిమీదికి రువ్వాను-
మట్టితో జీవశిల్పం మలిచే వాడిముందు
శూన్యంతో రేఖలు వంచే వాడి ముందు!

సున్నలో బంధింపబడ్డ ఆకాశం
ఉదయా స్తమయాల రంగుల్లో స్నానంచేసే
ఋజు రేఖ కోసం కలలు కంటూ
ఉంది-

*****

మనుషుల బజార్లు తరిమివేస్తే
నిశ్శబ్దం కొండల్లోకి పారిపోతోంది
కాలం నీళ్ళలా వేళ్ళనించి కారిపోతోంది
ఋతువులు సాలెపురుగుల్లా కళ్ళ లోయల్లో
గీత అల్లుతున్నాయి
కొండల నిశ్శబ్దాన్ని బొట్టుబొట్టుగా చప్పరిస్తున్నప్పుడు
చప్పుడు చేసే నా గుండెను కూడా క్షమించలేను-
అడవిని పక్షిపాటతో కొలుస్తాను
లేదా
సెలయేటితో కొలుస్తాను.
అడవిలో అగ్ని జ్వాల లు
కాషాయవస్త్రాలు ధరించిన

సన్యాసుల గుంపుల్లా
పరుగులెత్తుతున్నప్పుడు
చెట్ల శరీరాలు గట్టిగా కౌగిలించుకుని
స్పందించే వాటి గుండెలు వింటూ
భోరున ఏడుస్తాను

* * * * *

పోదాం పదమంటుంది నా ఆత్మ-
దూర దూర సీమలకు మనిషిచేతి కందని సీమల కెక్కడికో
కొండల ఒడిలోకి అడవుల గర్భకుహరంలోకి
ఎక్కడికో పదమంటుంది
గాలిరెక్కలోకి దూకుతుంది మేఘాలవిబిడారుల్లో కలుస్తుంది
దిగంత రేఖమీద మెరిసే నిశ్శబ్దం కోసం
పెరుగుతున్న తృష్ణ తీర్చుకోవాలంటుంది
స్వప్నాల్లో కూడా వెంటాడే
నగ్నవృక్షాల వాడల బారినించి-పారిపొమ్మంటుంది
ఒక కలలోకి ప్రయాణం చెయ్యాలని
వెయ్యి కలలు కంటుంది-
ఏ కలలో జీవరాసులు రెక్కలమీద ఎగురుతుంటాయో
గాలిలో తియ్యటి అక్షరాలు వెదజల్లుతూ
ఏ కలలో రాలుతున్న ఆకుకూడా
నేలమీద పడేముందు
ఒకగీతిక పడవలో తేలుతూ పడుతుందో
సూర్యుడు ఆకాశపు నీలిహోలులోకి ప్రవేశించనప్పుడు
కొండలు మేలుకుంటాయో అడవులు మేలుకుంటాయో

దేశద్రిమ్మరిలా తిరిగే సోమరి గాలిలోనించి
కలలు పుప్పొడిలా రాలుతుంటాయో
ఎక్కడ ప్రాణం గుంపుల్ని వీడి
ఒంటరితనంలో ఓలలాడుతుందో
నిశ్శబ్దంతో సోదరత్వం అనుభవిస్తుందో
ఎక్కడ ఎత్తయిన వృక్షాల బారులు
నిశ్శబ్దాల ఊరేగింపులా కదులుతుంటాయో
ఎక్కడ కొండల మండువాలో
భూమ్యాకాశాలు పెళ్ళి చేసుకుంటాయో
ఎక్కడ పేరులేని పక్షి కొమ్మమీద కూర్చున్న మాత్రాన
పరిసరాలు పద్యాలుగా మారుతాయో
ఎక్కడ ఎర్రయూకలిప్టస్ చెట్టు
సంధ్యలో స్నానంచేసి ఆకుల కొసల్లో
ఎర్రపూల బిందువులు వ్రేలాడుతుండగా
ముందుకు వస్తుందో
ఎక్కడముద్దుగా ఇంటి మీదికి ఒరిగిన
జాబిల్లి ముద్ద చేతి-కందుతా డనిపిస్తుందో
అక్కడికి ఆ కల లోయల్లోకి
పోదాం పదమంటుంది ఆత్మ
నగ్న వృక్షాల బారినించి తప్పించుకుని
శాంతియాత్ర చేద్దాం పదమంటుంది-

* * * * *

ఆకాశం రమ్మంటోంది చెట్లసందుల్లోనించి
ఇళ్ళకప్పుల మీదినించి

కొండశిఖరా లెక్కి మేఘాల గుంపుల్లో దూరి
రమ్మంటోంది

ఋతువుల యుద్ధాల్లో
ఎన్ని పూలు నేలకు రాలేయో
చూపిస్తోంది-
చూపుడు వేలులాంటి ఏకాకి చుక్కతో

పక్షిలేని తోటనించి పొమ్మంటోంది
ఒక చంద్రుడ్నిస్తా
నీ ఆత్మ చప్పరించడానికి
రమ్మంటోంది

* * * * *

ఈ మసకచీకటి – ఈమసకవెల్తురు – ఒక దానిలో
ఒకటి మసలే ఈ మసకతనం, శిరస్సుల్లో
నక్షత్రాలు దాల్చి పొడవాటి నీడల్లా నిల్చి ఉన్న
ఈ చెట్లకు మరింత పొడవును సమకూరుస్తోంది-
ఈ నిశ్శబ్దం ఈ చీకటికి మరింత లోతును సంత
రిస్తోంది. చీకటీ నిశ్శబ్దమూ పెనవేసుకున్న
ఈ అద్వైతంలో నిద్ర లేస్తోంది నా మనస్సు;
ఇప్పుడు శబ్దమే కాదు ఒక చిన్న కాంతికిరణం
కూడా ప్రశాంతికి భంగమే. ఈ క్షణంలోనే
సాక్షాత్కరిస్తాయి లోతైన సత్యాలు, ఇప్పుడే

అర్థమయింది శబ్దంలో కాదు నిశ్శబ్దంలో
రాగం నివసిస్తుందని

పువ్వుల్నించీ నిశ్శబ్దాల్నించీ పుట్టిన వాడ్ని.
వెళ్ళేటప్పుడు నా చేయి పూలగుత్తికి తగిలింది;
అయ్యో! దెబ్బతగిలిందేమో అన్నాను. కానీ,
నీకా నాకా అన్నది ఆ పువ్వు నవ్వుతూ.
నా కలం గుండె చిటిలి రక్తం చిందింది.
మరి ఈ కలాన్ని ఏ కాగితం భరిస్తుందో
చెప్పలేను.

ఆకాశాలు ఒరిసే అడవుల నిశ్శబ్దంలో
చెట్ల మ్రాకులు ముక్కుతో కొట్టి శబ్దాలు
ప్రతిధ్వనింపజేసే వడ్రంగిపక్షి క్రోటన్సు
మొక్కల్లో ఏం చేస్తుంది ?

పళ్ళు తిన్నట్లు దినాలు తిన్న నేను ద్రాక్ష
పళ్ళంత కన్నీటి బిందువులు తింటున్నాను.
ఎండలకు భయపడి నీడలు ఆశ్రయించాను.
ఫుట్ పాత్ మీద కూర్చుని కన్నుల్లో కలల్ని
గిన్నెల్లో హిమలేహ్యంలా చంచాల
చంచువులతో అస్వాదిస్తున్నాను.

చీకటి సాయంకాలాలతో జీవితాన్ని
కొలుచుకుంటున్నాను. వృత్తాలతో కొలిచి
పోశా నొకప్పుడు నా ద్రవ్యాన్ని, దోసిళ్ళతో
వెదజల్లు తున్నా నిప్పుడు నా భవితవ్యాన్ని

దశదిశలకు ఎగిరిపోనిమ్మని దాన్ని-
కన్నీటిలో గుండె పిండి కవితమీద ఆర వేశాను.
జనతా శాలువా కప్పుకుని చరచరా వెళ్ళి
పోయాను దేశ దేశాల జ్వాలల సభల్లో
నా దేశద్రిమ్మరి కంఠం విప్పి భూనభోంతరాలు
కలుపుతూ గానం చేశాను.

ఈ దేశం నా ప్రతిభ కొక సమాధి. ఎంత
వడివడిగా నడిచినా ఎప్పుడూ దూరం
అంతే.
ఈ నేల నా రక్తం తాగాలని దప్పి
గొన్నది. ఆముదుపు చెట్ల నీడల్లో
హాయిగా నిద్రిస్తున్న ఈ దేశానికి
సూర్యుడిలో కలం ముంచి గ్రీష్మగీతం
రాద్దామని తెల్లకాగితం పుచ్చుకున్నాను.

* * * * *

ఎక్కడిదో చెట్టు ఒకటి
ఎలుగెత్తి పిలిచింది
చల్లటి తన నీడ పూల
చాపగా పరిచింది-

పిట్ట ఒకటి నీలిమలో
బిందువుగా మారింది

కష్టజీవి కుటీరాన
కంటినీరుజారింది-

చేతు లెత్తి గ్రీష్మానికి
చెమట బొట్టు మొక్కింది
గగనానికి ఇంద్రధనుసు
కలగాలని కోరింది-

తోటల్లో ద్రాక్షపండు
ఎండ తాగి బలిసింది
పన్ను తగిలితే చాలు
రసము తుళ్ళిపడుతుంది

మనసు ఇచ్చి గాయాలను
మమత కొనుక్కున్నది
బ్రతుకు సంతలో చివరకు
బాటసారి అయినది

రాత్రుల్లో వీచే
నక్షత్రాల జల్లుల్లో
కలలు బాలబాలికలై
గంతులు వేస్తున్నవి

తిమిరలహరిలో పడవలు
తేలిపోవుచున్నవి

*****

రాత్రి నేనూ నా దిండూ కలసి కలలుకంటాం
పగలు నేనూ నా కలం వాటిని పంచుకుంటాం
నా కాళ్ళు సంకెళ్ళలో ఉన్నా
నా కలలు కొండలమీద సంచరిస్తాయి

పైన చంద్రుడు
మబ్బుతునక వేలుపట్టుకుని
నడిపించుకుని పోతున్నాడు

కింద నా జీవిక నిశ్శబ్దంగా కురిసే వెన్నెట్లో
నిశ్చలంగా తడిసే అడవిలా నుల్చొంది-

ఒక్క కలని నా ప్రపంచంగా
మలుచుకుందామని కూచుంటే
సముద్రం సహస్ర బాహువు లెత్తి
బెదిరిస్తోంది. నీలి ఆకాశపు లోతుల్లో ఎక్కడో
ఒక్కతార -

* * * * *

అంతరాత్మ కల్లోలంలో
అకస్మాత్తుగా మునిగిపోయింది ఒక ఓడ
మండే సూర్యమండలాలు మోసుకొస్తూ
దూర దూర తీరాలకు చేరి ఉంటాయి
భగ్న నౌకాశకలాలు . . . . .

అస్తమించే నక్షత్రలోకాల్ని ఆవులిస్తూ చూచింది కాలం
పసిఫిక్ సముద్ర మంతటి నోరు తెరుస్తూ
ఆకాశం రాత్రంతా గడిపింది తారల గాలివానల్లో
విరిగిన నా పద్యాల అవయవాల్లో
వెతుక్కుంటున్నాను పచ్చిరక్తం కక్కే భయంకర నేత్రాలతో,
గెలక్సీల శిధిలాలు క్రిక్కిరిసిన ఆకాశపు పేలికల్ని!
విశ్రమింగిన రంగులు ఇంకా ఉదయించలే దంటూ
నా గొంతు ప్రతిధ్వనులే నా మీదికి దూకుతున్నాయి!
ఉద్రూతలూగుతున్నాయి కండరాలు :
నాగీతిక నన్నే చూచి గడగడ వణికింది

హేమంత చంద్రుడు ఏడ్చి ఏడ్చి కృశించాడు.
ఇటుకలు గోడల్లో నిద్రిస్తున్నాయి
వీధిలాంతుర్లు కూడా ఆవులిస్తున్నాయి–
చిన్న నక్షత్రం చేత్తో పట్టుకుని
అంతరాత్మ సందుల్లో ఒక రహస్యాన్ని
తవ్వుతున్నాను
ఎన్నో కోట్ల రాత్రుల పొరల క్రింద బయట పడింది
మనిషి కోల్పోయిన ముఖం వెయ్యి కిరణాలతో–
నేను అన్నాను
"మా నరనరాల్లో రక్తమై
ప్రవహిస్తున్న నీ కాంతిమండలం నిద్రిస్తున్నా ఆగదు
పద మా ఉదయ రేఖా శిఖరాలు అధిరోహించు
ఈ లోకం మనదే
మనిద్దరం
ఒకే ఎర్ర తామర పువ్వు
పంచుకుందాం"

చేతిలో నక్షత్రం చెట్ల కొమ్మల్లోకి ఎగిరిపోయింది
వీధి లాంతర్లలో జ్వాలలు వీధుల్లోకి దూకాయి
ఇటుకలు నిద్రలేచి ఇళ్లు కూలదోశాయి
చంద్రుడు ఆకాశం నించి కిందికి దూకి
అందరికీ
వెన్నెల పంచిపెట్టాడు

* * * * *

సూర్యుడు అస్తమించని నా మాటలదేశాల్లో
చెమటముత్యాల కిరీటాలు దాల్చిన దేవతలు
సూర్య స్నానాలు చేసే దినాలేగానీ
చీకట్లు చెరలాడే నక్షత్రాల అరణ్యాల్లేవు
మూస్తే నా కళ్ళు
నిద్రిస్తున్న ఆపిల్ పళ్ళు
తెరిస్తే నా గుడ్లు
పరివెన్ను కన్న వడ్లు

నేను గురక పెట్టినా విశ్వానికి నిద్రపట్టదు
నా యుద్ధాల పొగల్లోంచి పద్యాల ముఖాలు పుడతాయి
నా గొంతు జలపాతానికి బెదిరి చెదిరిపోతారు కాకుల్లా
కాలపు మేకులకు వ్రేలాడే కవులు–
నడిస్తే నా అడుగులు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగులు
యెత్తితే నాచేయి
మండే అగ్నిజ్వాల

దించితే
వేయికిరణాలు వ్రేలాడే
సాయంసంధ్య

నా శరీరం
ఒక శాశ్వత హోమం
అది సూర్యుడి స్వగ్రామం
నేను ప్రసరించే కాంతుల్లో
మధ్యాహ్నాలు నడుస్తున్న మార్గాల్ని
నీకు వదలిపెట్టి
ప్రశ్నలు చీకటి లోకాలు
వెతుక్కుంటూ పోతాయి
దిగంత రేఖ మీదికి ఎక్కే సూర్యుడ్ని
కావలిస్తే
నీ వేలిమీదికి ఎక్కిస్తా
ఒక ఉంగరంగా

* * * * *

ఎండలజెండాల ఊరేగింపు!
భగ్గున మండే గగనానికి
ఒగ్గిన దోసిట్లో
విప్లవ తుఫాను-

నా దేశం ఎండలవాడ
కొండల శిఖరాల మీదికి

గుండెలాంటి లోయల్లోకి
మండుతున్న పాటలు విసిరి కొడుతాము
ఎండలు తింటాము ఎండలు తాగుతాము

ఎండల్లో మండి మండి
లోహ శరీరాలై నాము
లోహ మనుష్యులం మేము
గుండెలు
ఎండల కంకితం చేశాము

వేదంలా ప్రవహించే స్వేదంలో
మృగత్వం పిండి ఎండలమీద ఆరవేశాము
ఎండల జెండాలు పుచ్చుకుని
ఎడతెగని ప్రయాణంలో చేరాము
మేం వేళ్ళే రస్తాల్లో బస్తీల్లో
నిస్పృహాయ వృక్షాలు పూస్తున్న
రక్తహీన పూల పెదవుల మీద
ఒళ్ళు విరుచుకుంటున్నవి
నగ్నంగా ఏవో నవ్వులు

ఎన్నాళ్ళో పెంచి పోగుచేసిన వాళ్ళు
ఎండల తలపాగాలతో వెళ్ళిపోతూ ఉంటే
మిలియన్ల గొంతులెత్తి
ఏడుస్తున్నవి ధాన్యపు రాసులు–

గుండెలో నాగలి గుచ్చుకుని
కెవ్వున కేక వేసింది

ధరిత్రి-
ఇదిగో! ఆకాశం సవాలుగా
మనిషి మీద ఎండను విసిరి వేస్తే
మనిషి బంతిగా ఎగురగొట్టాడు
సూర్యుడ్ని ఆకాశంలోకి-

*****

అదే నా రస్తా
ఏ రస్తా ప్రజాకోట్ల అడుగులతో
పునీతం అయిందో
అదే నా రస్తా

ఏ రస్తా నా దేశం శరీరలో
పల్లెలగుండా పట్నాలగుండా
మండే రక్తనాళంలా
పరుగెత్తుతోందో
అదే నా రస్తా
ఏ రస్తా
లోకం సుఖం కోసం
తను కష్టాల్ని వరించిందో
అదే నా రాస్తా

ఏ రస్తా యుద్ధాలు చేస్తుందో
ప్రాణాల్ని ఆటబంతుల్లా
విసిరేస్తుందో

గెలుస్తుందో ఓడుతుందో
కానీ ముందుకు పోతుందో
అదే నా రస్తా

ఏ రస్తాలో సంకెళ్ళుకూడా
సవాల్ చేస్తాయో
ఏ రాస్తాలో అపజయం కూడా
అగ్నిజ్వాలై మండుతుందో
ఏ రాస్తాలో మరణం
మహా ప్రబంధంగా ప్రతిధ్వనిస్తుందో
అదే నా రాస్తా . . . . .

## రెండోసర్గ

అవులిస్తూ లేచాను కళ్ళు నులుముకుంటూ
అకలి దిక్కుల్ని దహిస్తోంది
సూర్యుడు ప్రాచీరేఖ మీద ఉన్నాడు
అలమారు మీద ఆపిల్ పండులా-

నా మీదికి నేనే ఎక్కాను
దాన్ని అందుకుని తిందామని!
ఎండ కండల్లా వ్రేలాడుతోంది
ఆకాశపు మండువా అంచుల్నించి;

నేను క్రూరమైన మాంసాహారిని
రోజూ నన్ను తిని
గ్లాసెడు నా చెమట తాగి తేన్చేవాడు
నున్నగా టొమాటోపండులా ఉన్నాడు

వాడ్ని తిమితిమింగలాల్లాంటి వాక్యాలతో తిడతా
వాడ్ని తిని సముద్రాన్ని గటగట తాగేస్తా
ఈ ఎర్రటి ఉదయం

* * * * *

నాముందాక కిటికీ పెట్టు
దానిముందాక పచ్చ లుమిసే
పచ్చికనేల పరుపు
దానిమీద పూలు కురిసే
ఒక పొగడ చెట్టు పెట్టు
దాని మీదికి కెంపు లొలికే
ఒక పూలతీగ అల్లు పెట్టు
దాని మీద  ఒక రంగుల పద్యంలా
సంచరించే సీతాకోకచిలుక
వదలి పెట్టు-అంతే . . .
నా జీవితం
వాక్యంలా పరుగులెత్తుకుపోయి
అక్కడ
తన ఫులుస్టాపును కలుస్తుంది.

* * * * *

వర్షం
వెయ్యి చేతులతో
నా తలుపు కొడుతూ ఉంది

వీధిలో రౌడిగాలి చేతుల్లో
కొమ్మలు
విలవిల కొట్టుకుంటున్నాయి

ఎంత దూరాన్నిం చి

వచ్చిందో
ఏ సందేశం తెచ్చిందో
ఈ వాన
బురదలో మండూక సమూహాలు
యుద్ధాలు చేస్తున్న గోల

వర్షం వెళ్ళిపోయింది
మబ్బుల రథా లెక్కి

వాగలి
భుజాన వేసుకుని
వస్తున్నాడు సూర్యుడు
కొండ శిఖరా లెక్కి

జలదానం చేసిన మేఘాలకి
జోహర్లు చెప్పాయి
చరాచరాలు

భూమిలో ఉన్న
చిన్నారి గింజ
మెడ బయటి పెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది
కృతజ్ఞతతో

*****

చెట్టు పరచిన నీడమీద
ఒక చిన్న పొద నుల్చొని ఉంది
బొద్దుగా ముద్దుగా-
కొమ్మమీద పక్షి వాలింది
పొదమీద పువ్వురాలింది . . . .

పొదపైకి చూచింది
నాకు భయం వేసింది
ఇక వెళ్ళిపోతుందేమో అని
పలకా పుస్తకాలు తీసుకుని-

యెదుట రంగులతో స్పందించే చిత్రంలో చిన్న పొద
ఇప్పుడు నా తలపుల నక్షత్ర బిందువుల్ని
బొట్టు బొట్టుగా చప్పరిస్తూ ఉంది-
దానిమీద ఎగిరే సీతాకోకచిలుక
నా చూపుల శాంతికి భంగం కలిగిస్తోంది

ఈ దృశ్యంలో పక్షికూడా తావులేదు
పూలవాహనాల మీద కింజల్కాలూ
కుసుమపరాగాలూ మాత్రమే ఎక్కుతాయి
పరిమళాలు కూడా గాలి ఊచలు పట్టుకుని
ప్రయాణం చేస్తాయి . . . .

ప్రతి వస్తువూ ఒక వ్యక్తిత్వంతో
మసలుతున్న ఈ చిత్రంలో
దేన్ని కదలించినా మరొక దానికోసం,
నా ఊహల లోకాల్లో

బాధల తుఫాను రేగుతుంది
అప్పుడు నా కళ్ళు మాట్లాడే
భాషల అర్థాలు
ఎవ్వరికీ తెలీవు-

*****

ఈ యుగాన్ని అభినందిద్దామని
మధుపాత్రిక ఎత్తాను ఒక సంధ్యలో
రాలుతున్న ఆకులనీడలు చూచాను అందులో
జీవితం రాలుస్తోంది క్షణాల్ని హేమంతపత్రాల్లా
ఆశలు మాసిపోతున్నాయి ప్రత్యూషనక్షత్రాల్లా

మనం ఆయువుకోసం పీల్చే వాయువులో
హాహాకారాలు పోసింది ఈ యుగం
బలవంతాన చేతికిచ్చిన విషపాత్రిక
ఈ జగం

సూర్యు డిక్కడ కుమ్మరించే తేజస్సు
మండే ఇసుకదిబ్బల్లో పోసే హవిస్సు
ఇది మానవతాలహరి దారికోల్పోయిన ఎడారి

నాగరికత విప్పివేసి నర్తిస్తోంది నా దేశం
కోర్కెల ఆర్కెస్ట్రాలో పెరుగుతోంది ఆవేశం
ప్రశ్నల సైన్యాలు చేస్తున్నాయి
వీధుల్లో విన్యాసం

ఈ భయానక దృశ్యంమీద ఎప్పుడుదయిస్తాడో
సూర్యుడు–
ఉదయిస్తా డొకప్పుడు సహస్ర కిరణాలతో–
ఈ ఆకులు కోల్పోయిన లక్షలాది నగ్నవృక్షాలకు
జీవనదానం చేస్తాడు

స్నేహితుడా, సముద్రంలాంటి
ఆ కన్నీటిబొట్టెందుకు ఈ సాయంకాలంపూట–
తాగు,
ఆశామధు వొక గుక్క తాగు
ఉదయించబోయే ఉషస్సుకోసం
ఉర్రూతలూగు–

*****

నీ మట్టితో చేసిన బొమ్మని
నీ గాలితో ఊపిరి పీల్చుకునే జీవిని
నీ కమ్మని పలుకులు
చిలకలై నా కొమ్మల్లో
పాటలుపాడే తోటని–

ఇది
నీ పొలాల పాదుగులు పితికి
పెంచిన తనువు
నీ కోసం
ప్రాణాలు బాణాలుగా వదిలే ధనువు–

కానీ తల్లీ నీ పొలాల్లో
ధాన్యం కూలీల కోసం ఏడుస్తోంది
గుండె కన్నీటికోసం ఏడుస్తోంది

తల్లీ
నీ వెప్పుడు నాకొక పట్టెడు మెతుకులు పెడతావో
ఒక్క నిజమైన కథ చెవుతావో
యెదలో చోటిచ్చి నిదుర పొమ్మంటావో
అప్పుడు నీ పాటలు
పక్షులై విహరిస్తా యాకాశంలో
నీ నవ్వులు పువ్వులై వికసిస్తాయి
భూమండలంలో నీ యెండలు
జెండాలై ఎగురుతాయి దిగంతాల్లో
నే నొక కన్నీటి బిందువునై కలిసిపోతాను
మానవతా సముద్రంలో-

*****

రాళ్ళెన్ని ఉన్నా దూరాన్ని కొలిచే రాయి ఒక్కటే
పక్షులెన్ని ఉన్నా ఒంటరితనాన్ని తనమీద వేసుకుని
దిక్కులతో చూపులు కలిపే పక్షి ఒక్కటే
దిక్కు లెన్ని ఉన్నా
చూపులతో మాట్లాడే దిక్కు ఒక్కటే

మాట లెన్ని ఉన్నా
పొందేందీ లేదు పోగొట్టుకున్నదీ లేదు

ఈ వెలుగు చీకట్ల సంగమంలో
అని చెప్పేమాట ఒక్కటే

జీవితం అంతా అరిగిపోగా
చివ్వరి రేణువులా మిగిలి ఉన్న
నా ఉనికి అంతా ఒక్క జ్ఞాపకం
ఒక్కటే

* * * * *

ఆకాశాన్ని ముడిచివేసి దిగంతరేఖ
నాలోకి దిగింది నిలువుగా
నాలో అరణ్యాలు నదులు
పర్వతాలు గ్రామాలు పట్టణాలు
ఋజురేఖలై వక్రరేఖలై కోణాలై వర్తులాలై
పరుగెడుతున్నాయి స్పందించే ఒక బిందువువైపు :

నదులు వెనక్కి తిరిగి కొండల్లోకి పోతున్నాయి
కొండలు తమ గుహల్లోకి పోతున్నాయి
మనుషులు చెట్లల్లో కలిసిపోతున్నారు
పువ్వులు పళ్ళల్లో పళ్ళు గింజల్లో
గింజలు భూమిలో – కలిసిపోతున్నాయి.

భూమి ఆకాశంలో కలిసిపోయింది
ఆకాశం దిగంతరేఖలో కలిసిపోయింది

దిగంతరేఖ ఆకాశంవిప్పి నాలోనుంచి
ఎగిరిపోయింది

మళ్ళీ సముద్రంమీద పడుకుని
నక్షత్రలోకాల్ని చూస్తూ ఉంది
నాలోకి
రా రా రా అని
పిలుస్తూ ఉంది –

## మూడో సర్గ

బయట ఆకాశం పిలుస్తోంది పద
చర్చ్‌ల శిఖరాలకు మల్లే పెరిగిన
ఆ యూకలిప్టస్ అడవుల్లో పరుగిడుదాం పద

ఎక్కడ కెంపులొలికే కెమిలియాలు నిశ్శబ్ద
మాధురిలో
నీలి నీలి కలలు కంటున్నాయో
ఎక్కడ చెట్లు యౌవనపు ఆకుల్ని
రాలుస్తున్నాయో
భూమి నాగరికతల్ని రాల్చినట్లు,
ఆ యూకలిప్టస్ అడవుల్లో పరుగిడుదాం పద-

మత్తెక్కి కొండలు గుండెలమీద గంతులేస్తున్న
ఆ మబ్బుల తాగుబోతుల్లో కలుద్దాం పద
పొలాల్లో రాలిన చెమట బిందువుల్ని
ధాన్యపు ముత్యాలుగా మార్చి
భూమి గాయాల్ని మాన్పుదాం పద
ప్రేమ వానల్ని కురుద్దాం పద

మన అధరాలకు అడ్డువచ్చే నీ ముత్యాల దండలా
ఎందు కీ స్నేహితులు మన మధ్య
ఈ రోజుల్లో వాళ్ళొక మిధ్య
కాలం అన్ని వస్తువుల్లోనించి సత్యపు సువర్ణాన్ని
దొంగిలించుకుని పారిపోయిన ఈ రోజుల్లో-

ఇదిగో ఈ చెట్ల క్రింద ఈ నక్షత్రాల క్రింద
కలిశాం మన మొకప్పుడు-

పగలు ఎండ త్రాగి
రాత్రి నీడల్లో సూర్యుడి స్వాదు జ్ఞాపకాలను
నెమరు వేసుకుంటున్న ఈ చెట్లక్రింద
భూగోళం మీద
ఆకలిగొన్న మిలియన్ల చేసే అనంత
ప్రయాణంలో పాల్గొంటున్న ఈ నక్షత్రాల క్రింద
మనం కలిశాం-

ఇక్కడే ఈ మిమోసా శాఖల క్రిందనే
ఈ ఇంద్రనీల పర్వతాల్లో విరిసిన
డేలియాలు, కెమిలియాలు, లిల్లీలు, డైసీలు
ఇంకా ఏవేవో కొండపూ లేరి తెచ్చి
నిన్ను పూజించాను

ఇక్కడే
ఈ పచ్చ లుమిసే నికుంజపుంజాల మాటున్నే
నా కుంచె శబల భావాల రంగుల్లో ముంచి
నీ పాదాల మీద చిలిపిగా పికాసోబొమ్మలు
గీచాను

అప్పుడు పరిసరాలు
రంగుల భాషల్లో గుసగుసలాడుకున్నాయి
కొండ వాగులు నీలినీళ్ళ కౌగిలాలమీద

మెరిసే చేపల అక్షరాలతో
జిలిబిలి కవితలు రాశాయి

పోదాం పద ఆ అడవుల్లోకి
ఎక్కడ రాలే హేమంత పత్రాలమీద
సూర్యుడు మనిషికోసం
సందేశాలు రాస్తున్నాడో
ఆ అడవుల్లోకి-

*****

కాగితాల పడవల్లో
కలలు ప్రయాణాలు చేస్తున్నాయ్
సముద్రాల రస్తాల్లో తమ జెండా లెగరేస్తూ
కాలపు రేవులు దాటి గమ్యాన్ని చేరుతున్నాయ్
మట్టిని ధాన్యంగా మార్చే
వట్టి పొగని నాగరకతగా వడికే
ఆ ఎదురులేని ప్రజాశక్తి
ఇతిహాసం పాడుతూ
సూర్యుడ్ని కడుపుతో ఉన్న
సుందర దిశవైపు పోతున్నాయ్

వంగి పోతున్న దేశానికి నింగి ఎత్తు వెన్నెముక
నిర్మించే పండుగలో పాల్గొంటున్నాయ్
జాతి బాహువులకు కండరాలై
ఛాతీ కిరువైపులా నిలవడానికి
పరుగులెత్తు తున్నయ్

కలల రక్తనాళాల్లో రక్తం కాదు
భావితరాల కోసం బలైన ప్రాణాలు
ప్రవహిస్తున్నాయ్

ఎవరి గుండెల ఉయ్యాలల్లో ఊగిసలాడిన శిశువులో
వారి సమాధుల మీద పూలై రాలడానికి
గాలితో కలిసి పోతున్నాయ్
కాగితాల పడవల్లో
కలలు ప్రయాణాలు చేస్తున్నాయ్

*****

చెత్తకుప్పల్లో పుట్టిన ఈగలై నా గుండె మీద వాలకండి;
ఎలుకలై దాన్ని రొట్టెముక్కలా కొరక్కండి;
కష్టాల అగ్నుల్లోనించి ఖడ్గాలై పుట్టండి
పిలుస్తున్న పొలాల్లో ఫలిస్తున్న ధాన్యపు గుండెల్లో
మండే మాటలు వినండి-
నాగలి భుజాన వేసుకొని ఆకలి సంపాదించుకున్న వాడే
ఆకలి తీర్చుకునే హక్కును కూడా సంపాదించుకున్నవాడు
ఈ ఏడాది మొలిచిన పైర్లకు దుఃఖం తీరకపోతే
వచ్చే ఏడాది వట్టి కొడవళ్ళు పట్టుకున్న పిడికిళ్ళే
మొలుస్తాయి
నేనే మీ రస్తానై కలలు కంటున్నాను
వడివడిగా నడిచే మీ ముందడుగుకోసం
మన మందరమూ తుఫానుల్లో నడిచిన వాళ్ళమే
ఒక చిన్న తారతో దిన మవుతుందా
కావాలి ఒక మండే స

పదండి మీ జెండాలై ఎగురుతాను
చెత్తకుప్పల్లో పుట్టిన ఈగలై నా గుండెమీద
మాత్రం వాలకండి-

*****

నీవొక క్రముక్కవే కావొచ్చు
కానీ అనాది సృష్టిలో తలయెత్తిన
మానవ మహాకృషికి ఏకైక చిహ్నానివి
నాగలి అని నీ పేరేగానీ
నక్షత్రాల భాష విడిచి
ఆకాశం నించి భూగోళం మీదికి రాలిన
ఒక మండే అక్షరానివి
నీ స్పర్శ మట్టిలో నిద్రిస్తున్న
కలల పరిమళాల్ని మేల్కొల్పి
దిశల్లో విదిలించింది
నీ బలానికి అడవులు కొండలు
నదులు పాదలు తలలు వంచాయి
నీ వీర్యానికి లొంగిపోయి భూమి
ఆనందోద్రేకంతో వళ్ళూ ఇళ్ళూ పద్యాలూ
దోసిళ్ళతో దావాలు చేసింది
నీవు ఈదినం చరిత్ర చరమ పేజీలో గీచావు
మానవజాతి మధ్య ఒక మండే గీత-
కార్యచోరులు కార్యశూరులు అని . . . .
శ్రమజీవుల లోకానికి ఒక
నూతన సూర్యుడ్ని వాగ్దానం చేశావు

*****

అవిగో తూర్పున జ్వాలలు
పీడిత మానవులెత్తిన
మోదుగు పువ్వుల మాలలు

వ్రేలాడే మన కోర్కెల
బందూకులు లాక్కుందాం
కొండల్లో కోనల్లో
ఎండల్లా ప్రవహిద్దాం

అవిగో తూర్పున జ్వాలలు
పృధివీతల రుధిరంలో
ఉప్పొంగే తరంగ హేలలు

రోడ్లన్నీ రమ్మంటున్నయ్
ఎర్రమరక లిమ్మంటున్నయ్
రక్తం కారే కాళ్ళని
ముందుకు పొమ్మంటున్నయ్
మండే గుండెల జెండా
లెగరేస్తూ పోదాం
చీకట్లను చీల్చివేసి
సూర్యుడ్ని పిలుద్దాం

అవిగో తూర్పున జ్వాలలు
వచ్చే తరాల కోసం
చచ్చే వీరుల జ్వాలలు

* * * * *

చీకటి రాబందులు నా కనుగ్రుడ్లు తింటున్నాయి
చెవుల్లో గంభీర నిశ్శబ్దపు ఘంటలు మోగుతున్నాయి.
మొదట ఉదయించే ఏ తారకైనా
మొక్కుదామని మోకరించాను

చివరకు
నరాలు బిగించి నా రక్తబిందువులతో
దీపాల తోరణాలు కడుతున్నాను
గాలికాదు వాటిని తుఫాను కూడా ఆర్పలేదు

ఏ అంగూరు రక్తం తాగి
అనుభవిస్తున్నావో ఆ నాజూకు నిషా
అది ఆ చితికిపోయిన ప్రాణి
నీ చేతిలో కోల్పోయిన జీవన తృష్ణ
ఇదంతా ఎంతసేపు!
రాత్రి పాలలో ఎప్పటికయినా పడక పోదు
ఒక సూర్య బిందువు

* * * * *

చెట్లలో సూర్యుడు మేఘాల్లో సూర్యుడు
జలాల్లో సూర్యుడు ఆకాశంలో సూర్యుడు
లోపల సూర్యుడు వెలుపల సూర్యుడు
సూర్యుడు నా గోళ్ళలో ఉదయిస్తాడు-
చెట్లు లక్షలాది ఆకులతో
ఎండ తాగుతాయి
సూర్యుడి శిశువులుగా బ్రతుకుతాయి
నరనరాల్లో సూర్యుడి అంశ వృద్ధి పొందుతుంది
చెట్టు సూర్యుడ్ని గర్భంలో ధరిస్తుంది

గర్భంలో లేత జ్వాలలు ముడుచుకుని శిశువు
సమాధిలో వుంటాడు
చెట్టు గర్భం అంతర్లోక ఆకాశం
అగ్ని అంతః సూర్యుడు-
అగ్నిలో కిరణాలు దాచుకుని
లోకంలో రంగులన్నీ పోగు చేసుకుని
వెళ్ళిపోతాడు సూర్యుడు
చెట్లు జలాలు పువ్వులు ఆకాశాలు
అన్నీ రూపాలు కోల్పోయి అంధకారానికి
స్వాధీనమై పోతాయి
మానవుడు తండ్రిని కోల్పోయి అగ్నిని ఆశ్రయిస్తాడు-
భూమి పెడమొగం పెట్టినప్పుడు సూర్యుడు తన కిరణాల్ని
మేఘాల్లో నిక్షిప్తం చేస్తాడు
ఆకాశంలో మేఘాలు చెట్ల సోదరుల్లా పెరుగుతాయి
సూర్యుడు జలంగా మారి భూమిని వరిస్తాడు
వానచినుకు ఉయ్యాలలో మానవుడు
లేతచేతులూ కాళ్ళూ ఆడిస్తూ నవ్వుతాడు
రోజూ సూర్యుడు ప్రాచీరేఖ మీద బాలుడై
ఆడుకుంటాడు నాతో
నిత్యబాలుడైన నా తండ్రికి
నమస్కారము-

* * * * *

ఏమోయి తుఫాన్ ఎక్కడికి పోతున్నావ్
నీ ముఖం ఎంత ప్రశాంతమైన అచ్ఛాదన నీకు
ఉన్నది ఒక గుండె

వందగాయాలకు చోటెక్కడిది నీలో

ఓడినప్పుడు-
ఒక్కనిందలేదు ఒక్క నిట్టూర్పులేదు
నీ రస్తాలో వీస్తున్న చలిగాలి తప్ప
వీధి లాంతర్లు ముద్దలుముద్దలుగా
కక్కుతున్న గుడ్డికాంతి తప్ప

గెలిచినప్పుడు-
తప్పట్లులేవు తమాషాల్లేవు
వాల్ పోస్టర్ల కరతాళధ్వనులు
ఒంటరితనపు వికటాట్టహాసాలు తప్ప

నీ విప్పిన పేజిలో
అక్షరాలు పక్షుల్లా ఎగిరిపోయాయి
అర్థాలు మాత్రం మిగిలి ఉన్నాయి
ఎడారిలో మైలురాళ్లలా

* * * * *

బాధల్లో మునుగుతాను సంతోషాల్లో ఉదయిస్తాను
నేను మానవ సూర్యుడ్ని
గాలిచేత గాయాలు తిన్న ఆకుల్లా ఎగిరిపోకు

నాకు తెలుసు
నీ తలపులు తోటల్లో ఒక దాన్నొకటి తరుముకుంటూ
పరుగులెత్తే పక్షుల్లా ఉండేవి

ఈ నాడు నీ మనస్సు విరిగిన ఇంద్రధనుస్సు
ఈ చెత్తకుండీల్లో పువ్వులు వికసిస్తాయనుకోవడం
నీదే తప్పు

సముద్రాలే ఎండి పోతున్నాయి
నీ కన్నీరు రాక లెక్కా

ప్రవహించే కాలంలో పరుగెత్తే రంగుల చేప
జీవితం–
కన్నీళ్ళ వలలో పడదు. కలల గాలానికి తగలదు
బాధల్లో మునుగుతాను సంతోషాల్లో ఉదయిస్తాను
నేను
మానవసూర్యుడ్ని–

నా దేశం ఒంటి మీద గాయాల్లా చెరువులు
కారిపోతున్న రక్తంలా నదులు

కండరాల కంఠానికి లొంగి ఇక్కడ
ఆకాశం సూర్యుడ్ని అమ్ముకుంది
గుప్పెడు నక్షత్రాల కోసం

ఇన్నేళ్ళు రాసిన కాగితాలన్నీ హిమాలయపర్వతాలైనాయి
వాటి మీద వాడిన సిరా వక మధ్యధరాసముద్ర మయింది

దేశం కన్న కలలేమో
కొన్ని కాగితాల గుహల్లో సన్యాసం పుచ్చుకున్నాయి
కొన్ని సిరాలో దూకి ప్రాణ్యత్యాగం చేశాయి

జైళ్ళ కటకటాలకే ఖర్చవుతోంది
దేశంలో ఇనుమంతా
రైళ్ళ పట్టాలకు మిగలడం లేదు రవంత

రైతు నాగలి మోస్తున్నాడు
క్రీస్తు శిలువ మోసినట్లు

ఈ దేశపు గర్భగుడిలో దేవుడు జీర్ణమై పోయాడు
ఆకలి వేస్తోంది మరో దేవుడి కోసం-

* * * * *

మనిషి పడవలు చేస్తాడు కలలతో కాగితాలతో
నిశలతో నిశ్శబ్దాలతో
గుండెలతో గుసగుసలాడే గగనాల నీలిమతో-

బ్రతుకే తెరచాపగా వాటిమీద వేసి
రకరకాల పడవలు రంగురంగుల పడవలు
చీకటి కెరటాల్లో విడిచిపెట్టి వెళ్ళిపోతాడు-

అతడి నిట్టూర్పులు మోసుకుంటూ
అలల కల్లోలాలు దాటుకుంటూ
అవిపోతాయి - ఎప్పుడో ఎక్కడో
భావికాలపు దిగంత రేఖలు
చీల్చుకుని ఉదయించే
ఉషస్ తీరాలు చేరుకుంటాయి-

మనిషి ఈ తీరాల్లో శరీరాన్ని మట్టిలో కలుపుకున్నా
ఆ తీరాల్లో వాటిని కలుసుకుంటాడు

అప్పుడు తెరచాప
గాలులతో కలిసి ఊలలు వేస్తుంది

* * * * *

రేపు నీదే పద
ఉదయించె నదే నవలోకం
ఆరిపోనీకు సఖా
గుండెలో ఆశాదీపం –
ఓడిపోయానని చింతించకు
పద్మవ్యూహం
జీవితం కాదిది అడుగడుగున
ఒక పోరాటం–

రాలనీ బోకుము నీ కన్నులలో
ముత్యాలు
మోయలేదీభువి ఆ రగిలే
సముద్రాలు–

నీవు నీ పిల్లలు తోటల్లో
విహరిస్తారు
కోలుపోయిన నవ్వు
తిరిగి సాధిస్తారు-

ఇది వింశంతి తమ శతాబ్ద
చతుస్సప్తతి తమ సంవత్సరాన (1974)
విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్యప్రణీత మండే సూర్యుడు
నామాంతర సమేత
సూర్యపర్వము సర్వము
సమాప్తము

# పశు పర్వము

## ఒకటో సర్గ

రాత్రి నిద్ర కోల్పోయి ఇళ్ళ కప్పులమీద మొరుగుతోంది. కాలం శిశువులా నిద్రిస్తోంది ఊగుతున్న పెండులం ఉయ్యాలలో– ఇళ్ళన్నీ కళ్ళు మూసుకున్నాయి . . . వాటి గొంతులన్నీ ఆగిపోయాయి నాగొంతు లేచి బంగారం విసిరేస్తోంది యువమానవ పద్యజ్వాలల్లోకి– దీపం వీస్తున్న కాంతి నుంచి కాగితం తనని రక్షించుకోలేక పోయింది పారేసిన భావం కాగితాలమీద నరికిపారేసిన శిరస్సులా దొర్లుతోంది– ఒక గీతక స్వాధీనం చేసుకుంది రాత్రి బోధించే ఏకాంత పాఠాన్ని, మానవ నాగరికతా ఆదిమ సీమల్ని–

గీతికి రెక్కలు రాగానే ఎగిరిపోయింది గగనంలోకి; నా దేహం అందమైన పక్షి ఎగిరిపోయిన గోరీలా నిలిచిపోయింది–తెల్ల వారుజాము నా కిటికీ గ్లాసుల్ని గాయపరచి ఎర్ర మరకలు పూసింది అడవుల్లో ఉరి తీసిన వీరుడిలా ఉదయపు చెట్లలో వ్రేలాడుతున్నాడు సూర్యుడు.

అవ్యక్త భవిష్యద్విపినాంతరాల్లో అదిగో లేస్తోంది భయంకర ఆకారరేఖ– గొర్రిల్లా . . .

ప్రభాతం పసిదిగా ఉన్నప్పుడు సనాతన గంగంలో స్నానం చేశాడు మానవుడు; ఇప్పుడు మధ్యందిన మార్తాండ మండలాన్ని ఉపాసిస్తున్నాడు–

మానవత నూతన యుగద్వార తీరాలు చేరింది, రక్తంలో భయాల్ని పొదుగుతున్న పాత నమ్మకాల్ని పటాపంచలు చేసింది, క్రోధంతో భూగోళాన్ని కొలుస్తోంది భ్రూమధ్య రేఖతో . . .

అంతరాత్మ కోడైకూస్తోంది, కుక్కయ్ అరుస్తోంది, పక్షయ్ పాడుతోంది; అది కాని దేది లేదు దేశంకోసం–

దేవుడ్ని గూర్చి దీర్ఘ చర్చలు చేసేంతటి మూర్ఖులమూ కాదు, ధనికులమూ కాదు; మనవి పనిచేసి బ్రతకవలసిన చేతులు - జీవితం దుఃఖాన్ని రాసులు రాసులుగా పోసుకుని అమ్ముతోంది మన దేశపు బజారుల్లో; కానీ భూమిని ఫలాలుగా పంటలుగా మార్చే ప్రవీణత ఉన్నవాడు ధైర్యం కోల్పోనక్కరలేదు; మట్టిలో ఉన్న కస్తూరి తీసే మనిషికి జీవన పరిమళాల కొరతలేదు-

దేవత లొస్తుంటారు దేవతలు పోతుంటారు ఆకాశంలో; మన కందే దేవత మాత్రం మన చేతుల్లో ఉన్న నాగలి, మన కండరాల్లో నిదురించే గొరిల్లా.

నీకు తెలుసా! వ్యవసాయ కూలీల ఆకాశం వర్షాలే కురుస్తుంది వసంతాలు కురవదు- రైతులారా ! రాజకీయ వర్షం పడుతోంది. మోసపోయి మీ విత్తనాలు చల్లకండి -

గాలి కుక్కలా తిరుగుతోంది వీధుల్లో పిల్లిలా మ్యాంవ్ మంటోంది కిటికీల్లో; గాలి కోడెనాగులా బుసకొడుతోంది ఇళ్ళ కప్పుల్లో-గాలి దెబ్బతిన్న సైనికుడిలా మూలుగుతోంది రాల్చడానికి ఆకుల్లేని కొమ్మల్లో.

నక్షత్రాల్ని బీడీలుగా కాలుస్తోంది క్షుత్ పీడిత రాత్రి; చీకటి మీసాల మీద రాలిన వెన్నెల మెతుకులు తుడుచుకోకుండా తోలుకు పోతోంది శిథిల స్వప్నాల చక్రాల మీద - ప్రయాణీకులు దొరుకుతారనే ఆశతో.

వెన్నెల మంటలు ఒంటిమీద రేగుతుండగా ఒక చంద్రుడు ఫ్యాక్టరీ మీదికి ఎగబ్రాకుతున్నాడు కాలవగట్టు మీద గుడిసె దరిద్రదేవత కెత్తిన దేవాలయ ఛాయామూర్తి.

**నేల కొరిగిన ఉజ్జ్వల శరీరాలు** గాలిలో కంఠాలై లేస్తున్నాయి గ్రద్దలు దూరపు **కొండల మీద మండలా**కారంగా గిరికీలు కొడుతున్నాయి.

నాచేతిలో పుస్తకం శిశువై నా వక్షస్థలం మీద ఆడుకుంటోంది వెయ్యి నక్షత్రాలు ఒక్కసారి లక్ష వెల్తురు ఈ టెలు విసిరాయి నా మీదికి-

మదోన్మత్త మారుతాలతో తన మెదడుకు మేత వేసే గొరిల్లాగాండ్రిస్తున్న ఆకాశంలో నవయుగీన కంఠం విన్నాడు నిద్రలో మరో ప్రక్కకు పొర్లి పడుకున్నాడు-

తెల్ల వారగానే వీధుల నిండా నా జెండా విప్లవ ఎండ కాచింది.

అంతరాత్మ భూగోళంమీద చేసే నిమ్నోన్నత యాత్రే దేశాల అసలు చరిత్ర; ఏది ఒక మహా సముద్రమో ఆ సత్యాన్ని తన ఊపిరిగా పీలుస్తుంది అంతరాత్మ!

సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు

తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు

పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు

నేనింతా ఒక పిడికెడుమట్టే కావచ్చు - కానీ కలమెత్తితేనాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది; కష్టాల్ని కన్నీటిలోముంచుకుని బిస్కెట్లలా తింటాను, బ్రతుక్కంటే బలవంతుడైనవాడే శబ్దం నుంచి శతాబ్దం వరకూ మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను.

నరికిపారెయ్ నాచేతులు తిరిగి వచ్చి నాకే అతుక్కుంటాయ్- నా తుఫానుల్లో ఆకాశం ఆకాశమే ఎగిరిపోయింది ఒక కాగితప్పేలికలా. ఇక నక్షత్రాల గుంపులకు విలువేమిటి నా రస్తాలో! మానవ జీవితం ఒక పాశవిక ప్రదర్శనశాల అని మాత్రం నాకు తెలుసు-

ఇవాళ నా జ్ఞాపకాలు నన్ను దర్శనం చేసుకుంటున్నాయి, నా ప్రయాణాన్ని ఊపిరి సల్పని గాడ్పులతో నింపుతున్నాయి . . . . . .నేను తుఫానులకోసం గాయాలకోసం తాగుబోతులకోసం వెతుక్కుంటూ పోయేవాణ్ని; ప్రజాశిఖరాలు చూస్తే కరిగి ఒక పద్యాన్నయ్ కాగితం మీదికి కారిపోతా.

నా భాషలో భూకంపం పుట్టింది; శబ్దాల గుండెలు పగిలి ప్రవహిస్తున్న ఆగ్నేయ రక్తంలో మనుషుల నాల్కలు తేలుతున్నాయి ఈ శబ్దాల చెత్తంతా చీపుర్లతో చిమ్మివేయండి అప్పుడు ప్రత్యక్షమవుతుంది పేజీల మీద శుభ్రంగా నా తెల్లటి గొంతు!

మనం చరిత్రలో ఏ అధ్యాయంలో ప్రవేశించా మంటే చావు నెదుర్కోడంకంటే బ్రతుకు నెదుర్కోడం పెద్ద సమస్య అయింది– అంతకంటే భయంకర సమస్య అంతా బాగుందని అందరమూ కలిసిపాడాలి!

నా దేశంలో శవం చెవుతుంది బ్రతికున్న వాడికంటే ఇంకా బాగా, బ్రతుకంటే ఏమిటో . . . సముద్రంలో సవిలాసంగా పోతున్న ఓడ ఏం చెవుతుంది సముద్రపు లోతుల్ని గురించీ దాని కెరటాల గుణగుణాల్ని గురించీ; తీరానికి కొట్టు కొచ్చిన శిథిలనౌక చెవుతుంది అసలు కథ!

ఓ కవీ! నీ పద్యాల్ని యుద్ధానంతరం శస్త్రాల్లా అప్పుడే గోడకు తగిలించకు నీ తుపాకుల్లో పెద్ద పెద్దవి శార్దూలాలూ మత్తేభాలూ ఏరి సిద్ధంగా ఉంచుకో;

నీ మాటల దేశాల్నించి మత్తకోకిలల్ని బహిష్కరించు; రాబోయే ఇతిహాసంకోసం నీ శబ్దాలు నూరి పదును పెట్టుకో వాడిగుండె ఎన్ని తుపాకుల దూరముందో కనుక్కో–

నీ గొంతు ఉరిమితే వాడి గుండెల్లో గ్లాసులూ తలుపులూ గలగల కొట్టుకోవాలి; ఇవి వాడి కలలకు ఆహారంవేసే రోజులు కావు. వాడికోసం ఆకలితో కలలుకంటున్న గొరిల్లాకు ధూపంవేసే రోజులు!

కాళ్ళనిండా గొలుసులు నిండినా గగనం నిండా జెండాలు నిండాయి–

ఎన్నాళ్ళు ఈపాట పాడకుండా ఉండేది నా ఆత్మ దాని బరువు మోయలేకుండా ఉంది.

నా గుండెమీద ఈ దేశం ఒక రైల్వేప్లాట్ ఫారం అయింది ఈ వచ్చేపోయే భయంకర రైళ్ళ చరిత్ర చెప్పాలి ఒకనాడు.

ఇవి ప్రజల్ని మొయ్యడంలేదు ప్రభుత్వాల్ని మోస్తున్నాయి.
బిడ్డా నీవింకా గుడ్డులోనే ఉంటే ఎలా గుడ్డేలా ఎగురు తుందయ్యా.
ఆ ముఖం అలా కోల్పోయిన సామ్రాజ్యానికి ఒక సాక్ష్యంలా పెట్టకు.
జ్ఞాపకం పెట్టుకో - శ్రమించే కండరాలు
కోర్కెల సమాధులు కావు-
నీకు రెక్క లివ్వడానికే నిద్రపోకుండా మేలుకో ఉంది నా కిటికీ.

ఉషస్సు కళ్ళు తెరిచేసరికి కనిపిస్తాం ఒక గుడ్డిలాంతరు ముందు కూర్చుని పనిచేస్తున్న నేనూ నా కవిత్వపు పనిముట్లూ
నా పిడికిళ్ళ బిగి కెప్పుడూ వాడే లక్ష్యం
వాడి బలిశిన శరీరాన్ని ఆ కుర్చీ చేతులు పట్టుకో ఉన్నాయి గానీ
లేకపోతే వాడెప్పుడో భూమ్యాకర్షణశక్తికి బలి కావలసిన వాడు.
నా పిల్లల చేత వాడు నాతిండి తినిపించక పోతే భూమిచేత నేను వాడి రక్తం తాగిస్తా.
నా కవిత్వం ఏ జెండానూ ఎగరేయదు కాని నా చేతులు నా దేశపు ఖడ్గాలు.

రా సోదరా, ఇది గొర్రిల్లాయుగం! విస్తట్లో తుఫానులు వడ్డించాను తిందామురా-మనకోసం నిరీక్షిస్తున్న తరుణపు బ్రహ్మరాక్షస పరిమాణాలు అందుకుందాం ., రా
అవి వెన్నెల కిరణాలు కాదు-వెన్నెల దూలాలు, నెత్తిమీద పడతాయి రక్షించుకో ఆ ఒంటరిగా కూచోఉన్న కోకిలల్ని ఓదారుస్తూ నిలిచి పోకు;
ఎగిరే తోటల్లో పుప్పొడి పూసుకుని పరుగులెత్తేగాలి పక్షుల బరువే మోస్తుందో పాటల బరువే మోస్తుందో తెలీదుగానీ చైత్రానికి మాత్రం ఏడవడానికూ్కడా తీరికలేదు.
అదుగో వస్తున్నాడు గట్లమీద తిరుగుతూ పిల్లలకాలువలకు పాటలు

నేర్పేవాడు; ఆ పాటలుతిని కిశోరజలాలు గర్జిస్తూ దూకుతున్నాయి అరణ్యాల్లోకి.

హేమంతవనాల్లో చివరి ఆకు కొమ్మకు వేలాడుతూ గాలిలో తన బ్రతుకు తూచుకుంటోంది, వచ్చే వసంతం తన కేమవుతుందో తలపోసుకుంటూ-

వరిచేలల్లో వెన్ను ఉదయించిందో లేదో చలి గజగజ వణుకుతూ పారిపోయింది.

నలుదిక్కుల్నించీ ముసురుకొస్తున్న నూతన వాయువులు నా శరీర రంధ్రాలన్నిటిలోకీ దూరి నా ఎముకలన్నీ పిల్లన గ్రోవులై నా నరాలన్నీ సితారులై పాటలగోల రేపుతున్నాయ్

నా కన్నుల్లో కనిపిస్తున్నాయి భావితరాలు ప్రభాతం రాల్చిన కిరణాల గింజలు ముక్కుతో పొడుచుకు తింటున్న కోడిపుంజుల కుటుంబాల్లా-

# రెండో సర్గ

బాబూ, నీ ఆకాశాన్ని అమావాస్య కబళించింది! చౌరస్తాల్లో కాలం శిలావిగ్రహాలమీద తెల్లటి రెట్టలు వేస్తోంది; చలికి గజగజ వణుకుతున్న ఆ నోరులేని మూర్తులమీద కనీసం నీ చిరిగిన ఉత్తరీయమన్నా కప్పు-

గంగానది మొదట ఒక దేవత, తర్వాత పడవలరస్తా, ఆతర్వాత మన పొలాల్లోకి పారే ఒక పంట కాలువ! చూచావా-కాలం చేతుల్లో దేవతల రూపాలు కూడా మారిపోతాయి. బాబూ నదిలో ఇవాళ మనమంతా మునిగిపోతే పోవచ్చు కానీ నదే సముద్రంలో మునిగిపోయే రోజుకూడా రాకపోదు.

నాకు తెలుసు నీ మెదడులో మరో ప్రపంచం ఊపిరి పీలుస్తోంది నీ హృదయం మంచిదయితే నీ పెదవులమీద పుస్తకాలు పూస్తాయి కాలెత్తితే నీవు ఏ దేశాల్లో అడుగు పెట్టలేవు-పనిచేస్తుంటే నీ చేతులు ఎంత అందంగా ఉంటాయి నీ కన్నుల్లో ఎన్ని ఆశయాల సౌందర్యబలం సాక్షాత్కరిస్తుంది!

నీవు పెరిగి పెద్దవాడివయితే ఈ మిద్దెలు మేడలు అసెంబ్లీలు అకాడమీలు అన్నీ నీ నడుం ఎత్తుకూడా రాలేవు నీవు తలుచుకుంటే ఈ దేశపు కాలువల బంధాలన్నీ తొలగించి ఆకలిగొన్న ఈ అసంఖ్యాక పొలాల్లోకి విడిచిపెట్టేస్తావు కాళిదాసనే రాక్షసుడు తన పేజీల్లో బంధించిన అప్సరసలందర్నీ దేశంమీదికి విడుదల చేస్తావు

ఆ దినాన్ని నా కంటితో చూస్తా తర్వాత ఒక ఉదయం లోకంలో ఉన్న రంగులన్నీ మింగి హాయిగా చనిపోయి ఒక చిన్నస్మృతినై ఎగిరిపోతా-

జెండా ఎవరెగరేస్తున్నారు? గాలంటావు నీవు చెయ్యంటాను నేను రెండూ అంటుంది చరిత్ర-

నా దేశపు చరిత్ర తలచుకుంటే నా పసిచేతిని పట్టుకుని నడిపించుకు

పోతున్న ఒక మహామాత్రుమూర్తి ఎదుట సాక్షాత్కరిస్తుంది- నా దేశపు గతి చూస్తే నా బలిష్ఠహస్తం అందిమ్మని అడుగుతున్న దిక్కులేని పక్షుల మిలియన్లు ప్రత్యక్షమౌతాయి. ఇక్కడ భూగోళాన్ని లేత మెడలతో మోస్తున్న పిల్లలు తిరుగుతుంటారు.

తమ్ముడా నీ గాయాల దైన్యాన్ని చూడలేకున్నాను కానీ నీ ఆత్మ తిరగబడదనే నా బాధ- లోకం గొర్రిల్లా దశలోకి దొర్లిపోతోంది మన మహాపూర్వుడి ఇనుప కండరాల శకంలోకి- ఇంకా పాత పేజీల్లోనే పచార్లు చేస్తూ ఉండిపోకు

నీకు దాహం వేస్తోందా చెప్పు ఒక సముద్రమే నీ ముందు పెడతా కానీ నీకు దాహంలేదే నీకు తృష్ణలేదే దేనికోసమూ! అదే నా నిరాశ అదే నా సర్వస్వప్నాల సమాధి. నీవు దొంగ దేవతలకు పూజారివిగా నీ యాత్రముగిద్దామనుకున్నావు అందుకే నా క్రోధాగ్ని--

నీకు వరాలిచ్చే దేవతలెవరున్నారు మూర్ఖుడా! నీ స్వహస్తం తప్ప- యుగయుగాలనించీ గొర్రిల్లా నిర్మించిన ఆ విజయస్తంభం తప్ప- ఆ మానవ నాగరకతా గంగోత్రి తప్ప.

అద్దంలో చూస్తే నీవే కనిపిస్తావు కిటికీలో చూస్తే ప్రజలు కనిపిస్తారు నీవు తింటున్న గడ్డిలోనే నీలోకాలన్నీ ఉన్నాయనుకోకు. తల వంచినవాడికి నక్షత్రాలు కనపడవు వాడి వక్షస్సు వృద్ధి పొందదు వాడి మెదడులో ఎప్పటికీ సూర్యుడు ఉదయించడు.

ఈ బ్రతుకు నీకివ్వబడింది ఎలా చావాలో తెలుసుకోడానికి కాదు ఎలా బ్రతకాలో తేల్చుకోడానికి-దుఃఖాల బారినుంచి తప్పించుకోవడం సులువేగానీ సుఖాల బారినుంచి తప్పించుకోవడం అంత సులువుకాదు- ఇంత భయంకర గ్రీష్మాన్ని ఒక చిన్న విసనకర్రతో విసిరి పారేద్దామనుకున్నా వేమో.

తుఫానుల గర్భవాసాన పుట్టిన వీరుడు ఒక చిన్న పొద మాటున దాగి ఉండడు ఆదిమ శక్తులన్నిటికీ ఆలయమైన ఒక విరాట్ పురుషుడికి యావత్తు మానవజాతీ తన కార్యరంగం- బయటికిరా నీశోణిత నాళాల్లో స్పందిస్తున్న గొర్రిల్లాకు నీవు బృహద్వారసుడివి.

గుండె ఒక బ్రహ్మాండమైన మానవీయలోయ దేనిలోకి ధైర్యం ఒక నిర్మల ప్రభాతదేవతలా నడుస్తుందో...

ఎన్నిమైళ్ళు అని కాదు ఎన్ని శవాలు ముందుకు పోయిందో మన ఉద్యమం కొలుచుకో.

మిత్రమా, ఇదుగో నా హృదయం విసిరేస్తున్నా పట్టుకో!

నీ చూపుల రస్తాలకు తుదల్లేవు; కానీ నీ కళ్లు దేశాంతరాలకు వలసపోయిన పక్షులు కావు- నీవు కన్నెత్తితే వీధివీధంతా నభోమండలానికి లేస్తుంది కన్ను వాలిస్తే భూమి మీదికి జారి పడుతుంది-సోదరా నీ చూపు ఒక నక్షత్రానికి బిగించి ముందుకు నడువు...

పొగరుబోతు గుఱ్ఱాల్లా నురుగులు కక్కుతూ పరుగులెత్తే కండరాలకు కళ్ళెం వెయ్యకు, నీ బాహువుల్లో నిదురించే శక్తే నిన్ను రక్షించాలి. వాళ్ళ దేవుడు గుడివిడిచి పారిపోయాడు భక్తుల బాధ తట్టుకోలేక; నీ దేవుడు నీ తుపాకి కండరాల్లోనే నిదురిస్తున్నాడు. అది పేలిన శబ్దం నీ చుట్టూ సుడి తిరిగితే ఒక గుడిగా పెరిగితే అప్పుడు నీ యుగం దిగివస్తుంది భూతలం మీదికి.

ఈ దేశపు వీథుల్లో భీరువులు నడవలేరు- గుండె ఛాతీలోనుంచి దూకి ఎక్కడ పారిపోతుందో అని భయపడుతూ ఎలా నడుస్తాడు.

అస్తమించనీకుండా అరచేత్తో ఎత్తి పట్టుకో మిత్రమా నీ గుండెలో మెరసే నక్షత్రమండలాల్ని - నీకాళ్ళ సంకెళ్లు తెగిపోవాలనీ నీ చేతుల్లో ఖడ్గాలు మెరవాలనీ దీవిస్తున్నాను పద నిర్భయంగా నీ దీపాలన్నీ వెలిగించబడే ఉన్నాయి.

వస్తున్నాను నీ గుమ్మం తొక్కి నీ ప్రాణం చందా అడగడానికి మన దేశపు వీథుల్లో రాబోయే రక్త ప్రవాహాల మహోత్సవాలకోసం- ఈ దేశం బిరుసుగా ఒరుసుకుంటున్న నీ బాహువుల్నించి తప్పించుకోలేదు.

సోదరా నీవు గొర్రిల్లా!

గొర్రిల్లాలో రాక్షసుడు కరుణామయ రాక్షసుడు; అకలుషిత రాక్షసుడు; తనకు మానవతా నిర్మాణశిల్పమే ధ్యేయం తన మార్గానికి ద్రోహులు అడ్డువచ్చినప్పుడే చూపిస్తాడు తన రెండో ముఖం అమలిన హింస! పవిత్రహింస! తమ్ముడా ఇవాళ రాక్షసుడు నన్ను ఆవహించాడు, నీవు పడిపోయిన నపుంసకత్వపు లోతుల్లోనించి నిన్ను ఉద్ధరించడానికి-

ప్రతివాడూ కాంతికి బానిసే చీకట్లోకి పోలేడు గనక; ఇటురా నా వైపుకు నీగుండెలోరక్తం నా గుండెలో రక్తం కలబోసుకుందాం ఇద్దరమూ ఒకే తుఫాను పంచుకుందాం జీవన మైదానాల్లో ఏకాకి అశ్రువునై నీ అడుగులకోసం అన్వేషిస్తున్నాను-

నేను భిక్షగాడాడించే ఎలుగుబంటునుగాను అవమాన మెరుగని మహోగ్రకెరటం సముద్రపు గుండెలోనుంచే వస్తుంది ఏది పెనుతుఫానుల జన్మస్థానమో అదే దాని జన్మస్థానం.

ప్రేమించిన చోటినుంచి భూకంపాలొచ్చినా కదల్ను. జ్యోతికి అంధకారాన్ని చూస్తే భయమా? చావులో కూడా ఝుంఝూమారుతంగా ఉంటాను ఆశయాలకు ఆహూతి కావడంలోనే జీవనరుచి ఆస్వాదిస్తాను.

ఒక దుర్మార్గవర్గపు శిరస్సుమీద ఒక ఔదార్య దయాత్యాగాలతో అల్లిన కాంతి మండలాన్ని కిరీటంగా నా చేతులతో అలంకరించలేను వాళ్ళ దానధర్మాలు భుజించే నికృష్టజీవిగా రూపెత్తలేను- నా హక్కుకున్న కండబలంతో నా స్థానం గడించుకుంటాను చరిత్రలో లేదా నా రక్తధారల్ని ఈ భూమండలంమీద అంతరాత్మల్ని బాధిస్తూ ప్రవహించమని చెప్పి వెళ్ళిపోతా-

మానవ జ్వాలల్లో నుంచి గొర్రిల్లాను ఆవాహన చేస్తాను ప్రజలమీద ఇంద్రజాలం ప్రయోగించి వాళ్ళని అగ్నిపర్వతాలుగా మారుస్తాను నేను విశ్రాంతిని దున్నను శూన్యంలో కలలు చల్లను అంత ఎత్తుల్లో బ్రతకటం కష్టమే; పౌరాణిక దేవతలు మాత్రమే బ్రతుకుతారట అక్కడ-

నా కవిత్వం కేవలం మనిషికి డిఫెన్స్!

వసంతం అనుకుని ఈ దేశపు గుమ్మం ఎక్కి భిక్షం అడిగితే పిడికెడు పూలకు బదులు ఒక అశ్రువు వేస్తుంది ఇక్కడ మనదినం రెండుగా కోసి పళ్ళెంలో ఇచ్చిన మామిడిపండు కాదు.

మోపేకాడికి మెడ అంకితమిచ్చే ప్రజలూ రాజకీయ పేజీల్లో పురుగుల్లా నలిగిచచ్చిన మునీశ్వరులూ, కవీశ్వరులూ పుంజీలు పుంజీలుగా పడి ఉన్నారు- లోకయాత్ర యథాతథంగానే సాగుతూ ఉంది.

వ్యభిచారులైన దేవుళ్ళను పూజిస్తారు. నీతిపరులైన మనుషుల్ని చంపుతారు గాలిని దేశాలుగా నీళ్ళని జిల్లాలుగా తాలూకాలుగా విభజించి పంచుకుంటూరు మహారాజులే మకుటాల్ని కుదవ బెడుతుంటే బతకడానికి, నేలను బట్టలా కొలిచి పెట్టెలో పెట్టుకుంటున్నారు మూర్ఖులు అంతిమక్షణం వచ్చిందని తెలీక; దిక్కుల్లో పిక్కటిల్లుతున్న గొర్రిల్లా కేక మీద బధిరత్వం విధించారు.

తమ్ముడా ఆ రాతితో చెక్కిన విగ్రహాలు పీకెయ్ నీతితో చెక్కిన విగ్రహాలు నెలకొల్పు నీ మందిరాల్లో- నీకు రెండు వసంతాల ఛాన్సు ఇస్తున్నాను పోగుచేసుకో నీ తేనె బిందువులు శక్తి ఉంటే- లేకపోతే కాలం నిన్ను క్రూరంగా వెంటాడి వధిస్తుంది.

అదుగో ఉదయించే దిక్కు దానికే హృదయ పూర్వకంగా మొక్కు!

నేను జేబుల్లో కోకిలల్ని వేసుకురాలేదు పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని వచ్చాను- ఏవో నక్షత్రాలు కొన్ని కలలై నా వేళ్ళమీద వాలుతున్నాయి కొన్ని అప్సరసలై కన్నులమీద రాలుతున్నాయి నేను మోకరించి ప్రార్థిస్తున్నాను ఓ జిందగీ, నన్ను సుఖంమీద శిలువ వెయ్యకు.

నా తలుపు కొడుతోంది నా దేశపు భవిష్యత్తు, గొర్రెల్లా మధ్యాహ్నాలు మేస్తున్నారు కూలీలు సమానత్వం ఒక పౌరాణిక స్వప్నంగా మార్చివేశారు కవులకూ శబ్దాలకూ చెదపట్టింది ఈ దేశంలో ఋషులే పుస్తకాలై పడి ఉన్నారు లైబ్రరీల్లో, ప్రపంచ పటంమీద నా దేశాన్ని వేలిముద్రలా వేశారు.

సూర్యుడికే కలరా ఖండాలకు కోమా సముద్రాలకు టీబీ- నా ఊపిరి తిత్తుల్లో గాలికాదు గాలివానలు గాండ్రిస్తున్నాయి నేను బుట్టలో కళ్ళు వేసుకొచ్చాను కాళ్ళు వేసుకొచ్చాను కొనండి దేశపు గుడ్డివాళ్ళు కుంటివాళ్ళు అందరూ ప్రజల యెదుర్రొమ్ములమీద ప్రతిష్ఠ చేసిన ఈ శిలా విగ్రహాల్ని పీకెయ్యండి నిలువునా లేచి ఒళ్లు విరుస్తున్న జ్వాలలనోళ్ళల్లో పారెయ్యండి ఈ పాత దేవుళ్ళని.

పంట పొలాలమీద పరుగుఎత్తే గాలిగా ఉన్న నేను అడవుల్లో దూరే భయంకర తుఫానుగా మారేను మీకోసం; ఇప్పుడు ఎవ్వరూ నన్నొక జంతువులా పట్టుకుని గొలుసులు వెయ్యలేరు లోకం నన్నుభగ్నం చెయ్యలేదు సంవత్సరాలు నన్ను చల్లార్చలేవు.

నా మాటలు ఈ దేశపు మట్టిలో చల్లుతున్నా అన్ని చోట్లా కత్తులు మొలవాలని; నేను జ్వాలల్ని కొరడాలుగా ఝుళిపిస్తున్న అగ్నిని

నా జేబుల్లో కోకిలల్లేవు-

ఒక మహాకవి అట ఒక మహాఋషి అట– లేకపోతే ఒక మహావిప్లవ శిల్పిఅట– ఎవడో...... మా రూపాయల కళ్ళకు మాత్రం వాళ్ళంతా ఒక్కటిగానే కనిపిస్తారు– గాలికి కొట్టుకుపోతున్న చారిత్రక చెత్త.

ఒక రోజు అతను మరణించాడు కానీ నా పాటలో నక్షత్రం రాలలేదు భూగోళం ఒక్క చిరునవ్వుకూడా కోల్పోలేదు పువ్వు ఒక్కటి కూడా మొహం ముడుచుకోలేదు కాలం తన పేజీ తిప్పి వేసిందని వాటికి తెలుసు.

గుమ్మంలో తప్పదని కుక్క మొరుగుతోంది దీపం ముందు కూర్చున్న పిల్లవాడు పాఠం గట్టిగా చదువుతున్నాడు తండ్రి వినాలని, బాటసారి బిగ్గరగా పాడుతూ పోతున్నాడు వీథిలో రాత్రి భయంతో, ఎవడో ఫిడేలుతొడ గిచ్చుతున్నాడేమో అది చీకటిమీద వాలిపోయి మూలుగుతోంది.

నేను పాడుతున్నపాట ఏ శిశువు చెవిలో మునిగిపోయిందో తెలీదుకానీ ఆకలితో నిదురిస్తున్న ఆ పసివాడి గొంతులో నగరాల గర్వోన్నత భవనాలు వికటాట్టహాసం చేస్తున్నాయి వాడి ఏడ్పులో ఒక నాగరకత సిగ్గుతో తలవంచింది

పిడికిళ్ళతో స్వర్గాలు పట్టుకొచ్చిన ఆ నిష్కపట శిశువు అశ్రువై నిద్రపోతున్నాడు. ఓ గులాబీ పాదా! నీకు సిగ్గంటే పాడబోకు;
నీ గొంతులో ఉన్న ఆ బుల్బుళ్ళను వాంతిచేసుకో–

బిందెలతో చెప్పు, ప్రొద్దెక్కినా నిద్రపోతున్న కాలువల రేవుల్ని నిద్రలేపి ఉషస్సు కలిపిన నిశ్చల జలాల కలల్ని ముంచి తీసుకు రమ్మను..... ఇవిగో తూర్పు తాళాలు తీసుకొస్తున్నాను ఎర్రటి కోడి పుంజును.

# మూడో సర్గ

ఒకనాడు కాలమేఘంలా గర్జించిన ఈ దేశం ఈనాడు మ్యావ్ మంటోంది ఇదేమిటి? దుర్మార్గుల గొంతుల్ని పిడికిళ్ళలో ఇరికించుకున్న ఈదేశం తన కాళ్ళనే గొలుసుల్లో ఇరికించుకుంటోంది- అరే! నిన్ననే రాలిన రక్త బిందువుల్ని భూమి ఒక్క క్షణంలోనే తాగేసింది! మళ్ళీ స్వేచ్ఛ ఈ దేశంలో తిండిలేనిదై గడ్డితిని బ్రతుకుతోంది.

మనం కొత్తదేశం నిర్మిద్దామంటే ఏడీ ఆ మనిషి ఆ పునాది రాయి- వాడి బలిష్ఠ శరీరమూ వాడి కండరాలూ అన్నీ అధైర్యమూ అవినీతి అనే సంకెళ్ళలో ఖైదీలయ్ పడివున్నాయి- నాగళ్ళూ తుపాకులూ పట్టుకునే ఇనుప హస్తాలు నాయకుడి కాళ్లు పట్టుకుంటున్నాయి కబంధుడి కాళ్లు; పాలు పితికి పసినోళ్ళలోపోసే చేతులు రాత్రులన్నీ పిండి వెన్నెలల్తో వాడి పాదాలు కడుగుతున్నాయి. ఆ కుర్చీలో కూర్చున్న దంతవక్త్రుడి తల ఒక్క వేటుతో నేలకు రాల్చేదినం ఎలా వస్తుంది!

అసెంబ్లీలు మనమే కడతాము అకాడమీలు నిలబెడతాము జాతి కీర్తికి మనమే గాలిగోపురాలు లేపుతాము వాడ్ని కుర్చీలో కూర్చో బెడతాము వాడి ఇటుకలకింద నలిగిచస్తాము; వాడిచుట్టూ వెల్తురు మండలాలల్లుతాము వాడికి పూజారుల మవుతాము- ఒరే ఏం చేస్తున్నారో తెలుసుకోండి; రైతులారా రాజకీయవర్షం పడుతోంది మోసపోయి మీ విత్తనాలు చల్లకండి-

చూడండి, వీథుల్లో శిలావిగ్రహాలు కూడా ఈ దుర్గంధం భరించలేక క్రిందికి దూకి పారిపోదామనుకుంటున్నాయి; కానీ పాపిష్ఠి శిలలుగా కాలం మార్చి వేసింది వాళ్ళని-

ప్రపంచ భూములు తొక్కుతూ తిరుగాడే దేశద్రిమ్మరి విప్లవం మన వీథిక్కూడా వస్తుంది పసి పిల్లలు నిద్రలోకూడా బాంబులకోసం కలలు కంటున్నారు వేదాంతంవైపు పిలుస్తుంటే విప్లవంవైపు పరుగెత్తుతున్నారు చంద్రుడ్ని చూపించినా చూడడంలేదు తల్లులు తండ్రులు మూటలువిప్పి దుఃఖాలు చూచుకుంటున్నారు వాళ్ళకళ్ళకు నక్షత్రాలు పోసిన ఆకాశం స్ఫోటకంలా కనిపిస్తోంది మామిడికొమ్మల మీద కూర్చునే కోకిలలు మర తుపాకులమీద కూర్చుని పాడుతున్నాయి-

మనం మవునంగా పిడికిళ్లు బిగించి నిరీక్షించే ప్రభాతదేవత అందరి గుండెల్లోనూ అగ్నిప్రపంచాలు మేల్కొల్పుతోంది. ఖండ ఖండాతరాల్లో పల్లెల్లో పట్నాల్లో దాని వెలుగు నిరీక్ష పరుచుకొంటోంది దానిమీద భాషలు విసిరేసి ఆర్పలేరు దేశాలుకప్పి చల్లార్పలేరు కులాలు జాతులు ప్రయోగించి కూల్చలేరు.

నమ్మండి మనిషిబాధని తొడలమీద వేసుకుని పొట్టచీల్చే రోజు వస్తుంది గొర్రిల్లాఐ-

మీ చేతులే మీస్వర్గం నిర్మించేశక్తి పొందాలనీ మీ గుండెలు ధైర్యపు కండలు తొడుక్కోవాలనీ మీ దేహాల్లో గొర్రిల్లా మీ మస్తిష్క శిఖరాలకు పెరగాలనీ ఆశీర్వదిస్తున్నాను- పదండి.

రాత్రి అంటే ఈ దేశంలో ఒక జ్వాలలతో అల్లినగూడు అందులో ఎవ్వడూ నిద్రపోలేడు- అక్కడ ఎలుకలేగానీ కుక్కలు మొరగవు సింహాలు గర్జించడమే ఎరగవు రాళ్ళన్నా పలుకుతాయి మనిషి పలకడం మరిచేపోయాడు వాడి నోట్లోనించి నాలిక ఎప్పుడో పారిపోయింది ఇక్కడ అంతా పాత్రధారులేగానీ పాత్రల్లేవు. కలల్లో ఉన్న మనిషిని ఈ దేశం బయటికి పీకేస్తుంది, దంతాన్ని దంత వైద్యుడులా- శవాలే బజారుల్లో గుంపులు గుంపులుగా జీవిస్తుంటాయి.

ఎలుకలదేశంలో చరిత్ర ఏనుగల ప్రమాణంలో ఉంటుందా వంకాయల జాతిలో నాగరకత పనసపళ్ళ స్థాయిలో ఉంటుందా సోదరా చూడు దేశపు ఎండ కొంగు పట్టుకొని ఎలా నడుస్తున్నారో ఆ దిక్కుమాలిన పిల్లల పరంపరలు!

రూపాయి నలిపి వాసన చూపిస్తే ఆపాతంగా అలా మూర్ఛపోతే ఎలా కొత్తయుగపు తొడనుంచి చీల్చిన కండతో నిర్మించిన గరుడిడివి కావాలి ఝుంఝూమారుతాలకు ఎదురొడ్డే ఇనప రెక్కలు తొడుక్కోవాలి నలుగురిముందు నీ మూపు వంగితే నీ కాళ్ళు రెండూ బందూకుల్లా ఖచ్చితంగా నిలవలేకపోతే నీవు నా యుద్ధాల్లో పనికిరావు నీవు దాహం వేస్తోందని అడిగితే ఏమిస్తానో తెలుసా- ఒక గ్లాసెడురక్తం!

**లోహాలన్నిటినీ** పరిశీలిస్తున్నాను ఏ లోహం నీ అవయవాలు **అవడానికి అర్హత** ఉన్నదా అని నక్షత్రాల్లో నడువు స్నేహితుడా **ఆడునుదారులు** విడువు; నీవు నడుస్తున్న ధరాతలం ఒక చల్లారిన నక్షత్రం

నీ పాదాల క్రింద ఎన్ని నక్షత్రాలు చల్లారుతాయో నీ వెరుగవు...

నీ శోకాన్ని నాకు దత్తతగా ఇవ్వు తీస్కుకుంటా కానీ తెలుసుకో ఒక గొప్ప ప్రయాణం కోసం భూగోళంమీద అడుగుపెట్టిన మానవాత్మ మృత్యువు భుజాలమీద చెయ్యి వేసుకుని నడుస్తుంది.

ఆయుధశక్తి దాన్ని ధరించే బాహువులో ఉంటుంది; హక్కు-అర్థం దాన్ని అనుభవించే సంకల్పంలో ఉంటుంది- ఈ గీత నీ దిగంతాలమీద మెరిసినప్పుడే దానిమ్మ పండులా పగులుతుంది నీ ప్రభాత గగనం, ధరిత్రి వెచ్చగా రక్తంలో స్నానం చేస్తుంది.

ప్రభుత్వ సూర్యుడు ప్రకటిస్తాడు పదిన్నరయింది పదండి ఆఫీసులకని; బయలుదేరుతారు బంగారు బానిసలు ప్యాంటూ బుష్‌కోటూ తగిలించుకుని- చూడు వీథుల్లో బంగారు బానిసల ఊరేగింపు! వాళ్ళ చేతుల్లో జెండా వాళ్ళ గుండెల్లో ఆశయాలకు నాలికకాదు వాళ్ళ జేబుల్లో వేసిన పైసలు పెద్ద అక్షరాలై వాళ్ళ పెదవుల్ని ఆక్రమిస్తున్నాయి అంతరాత్మను ఎవరి కాళ్లకో కానుకగా సమర్పించుకున్న స్వాములు, ఊరేగితున్నారు.

ఒరే ఎలా నడుస్తారురా మీరు! తమ భుజాల మీద తల వ్రేలాడుతున్న ఆకారాలతో- అధికారి అదృశ్య మీసాలుచూస్తే చాలు వాటిమీద జబర్దస్తుగా నుల్చొ ఉన్న అగ్నిగోళాల్లాంటి వాడి కళ్ళు చూస్తేచాలు, నీ యిల్లు తనకు తెలీకుండానే కాళ్ళమీద ఉచ్చపోసుకుంటుంది.

ఓహోహో ఒకప్పుడు శరీరమే కారాగృహమన్న ఈ దేశం మీ చేతుల్లో ఈనాడు ఈ దేశమే ఒక ఓట్లతో నిర్మించిన స్వర్గం అంటోంది.

బాబూ దేవతలకన్నాడా మనుషుల నాట్యం నేర్పుతారు మీరు ఛీ మీ బ్రతుకేకాదు మీ చావుకూడా నాకు పరమ అసహ్యం ఎందుకంటే రెండు దశల్లోనూ మీ ఒంటిమీద క్రిములు లుకలుకలాడుతుంటాయి.

ఈ దేశపు నగరాల్నడిగాను గ్రామాల్నడిగాను ఎవరికోసం పుట్టారు మీరని నీకోసమే అన్నాయి నదుల్నడిగాను ఎవరికోసం ప్రవహిస్తున్నారని నీ కోసమే అన్నాయి గాలి నడిగాను నీళ్ళ నడిగాను ప్రభాతాల్ని అడవుల్ని ఆకాశాల్ని అన్నిటినీ అడిగాను దేశం దేశమంతా ఒక్క గొంతుతో ప్రతిధ్వనించింది నీకోసం నీకోసం నీకోసం అని.

మరి! నాకర్థం కాదు వాడెలా నీకు యజమానయ్యాడో నీ జీవిత శాసనకర్త అయ్యాడో... పురాణాల్లో వెతికాను ఇతిహాసాలు తిరిగేశాను దేవాలయాలన్నీ దివిటీలు పెట్టి గాలించాను వాడు నీ భుజాలెక్కే రహస్యం ఏ మంత్రంలోనూ దొరకలేదు.

నీ తొడలోనుంచి పుట్టినవాడు నీ రోమాల్లో నుంచి ఉద్భవించిన వాడు నీ చెమటకు సంతానం వాడి కెలావచ్చింది ఈ మహిమ?

వాడ్ని సృష్టించి వాడి చేతికి కలమిచ్చి నీవు కూర్చొబెడితే, నీ గొంతుకే వాడు తుపాకి గురిపెడుతున్నాడు వాడు నీమీద స్వారిచేయడానికి నిన్ను జంతువుగా చేస్తున్నాడు- పసిబిడ్డల్ని ఆకలితో చావమని రాసేవాడి చేతికి కళ్ళున్నాయా యేమిటి కన్నీరు కార్చడానికి? ఒక్క సంతకంతో జ్వలించే ఆత్మల్ని శవాలుగాచేసి చెట్లకు వ్రేలగట్టగలననుకుంటుంది ఆ చెయ్యి!

తమ్ముడా సిగ్గు నాగరకతకు చిహ్నం నీ స్వేచ్ఛకోసం ఎంతరక్తం పారిందో తెలుసుకో అది శరీర క్షేత్రంలో ధైర్యం చల్ల లేకపోతే అది నీ గుండెల్లో ఆత్మగౌరవం పండించలేకపోతే నీవు బానిసగానే ఉండిపోవడానికి నిర్ణయించుకుంటే ఎంత ద్రోహి విగా మారావు ఆ పవిత్ర రక్తానికి.

అరే నీవు వాడి చేతులో ఉన్న ముద్దేకాదు వాడి ఛాతీలో ఉన్ననెత్తురు ముద్దకూడా నీ కరాళ వక్త్రంతో కబళించు- నీ ఒంటిమీద అంటుకో ఉన్న ఆ మలినపు దినాల్ని కడిగేసుకో.

వాళ్ళు నల్లగా ఉంటే ఏం వాళ్ళు బంగారు కిరణాల్లో నివసించే వాళ్ళు వాళ్ళు ఈ దేశపు లవణాలు వాళ్ళ నడినెత్తిన ఉన్న సూర్యుడే వాళ్ళ ఉజ్జ్వల కిరీటం.

వాళ్ళకు కండరాలున్నాయి తెలుసా అవి నిద్రలేచి ప్రవాహాలై పరుగు లెత్తుతున్నప్పుడు చూడు తెలుస్తుంది వాటి జోరు వాళ్ళని మట్టిముద్దలనుకున్నావేమో వాళ్ళలో నేనున్నానని ఎరగవు మానవమట్టితో దేవతల ముఖాలుచేస్తా మనిషిబొమ్మ బాధల ఉలితో మలుస్తా.

గురికోసం వెతుకుతున్నా ఎక్కుపెట్టి నా ధనుస్సు దెబ్బకొట్టే వరకూ నీకు తెలీదు నా మనస్సు- కబడ్దార్ కవిత్వం పదాలు పేనే విద్య కాదు నీ చేతులో పద్యం ఒక భజన వాద్యం నా చేతిలో పద్యం ఒకగర్జ! నాది తపస్సు నీది వృత్తి నా క్రోధాగ్నికి ముందురా తెలుస్తుంది నీకు.

కొలిమిదగ్గర సమ్మెట పోట్లువేసే మాంసల శరీర దేవత దెబ్బదెబ్బకు లోహదేవతల్ని పుట్టిస్తున్నాడు తుపాకులు ఫిరంగులు ఖడ్గాలు ఈటెలు దూకుతున్నాయ్ అవి అగ్ని లోకాల్లోనుంచి దూకుతున్న సైన్యాలు- కవుల వేషాలూ నాయకుల వేషాలూ ధరించి తిరుగుతున్న పగటి వేషగాళ్ళని భస్మీపటలం చేస్తున్నాయి.

విప్లవజెండా ఎండ పిండివేసేవాడెవడు? ప్రజలమీదికి గురిచేసిన తుపాకులమీదికి ప్రజలే కాదు తుపాకుల వెన్నెముక అయిన ఇనుము కూడా తిరుగుబాటు చేస్తుంది వాటిని నొక్కే వేళ్ళుకూడా తిరగబడతాయి.

నా కండలు విప్లవపల్లవి ఆలాపన చేస్తున్నాయ్ నా చేతులు శత్రుకంఠాన్ని తడిసిన తుండు గుడ్డల్లా పిండెయ్యడానికి లేస్తున్నాయి.

ఒకనాడు నేనూ ఈగలూ కలిసి భోజనం చేస్తున్నాం అప్పుడు తెలిసింది- ఈగ నాకంటే గొప్ప జంతువు అది అక్బరుమీద వాలింది అశోకుడి మీద వాలింది వాళ్ళేమిటి వాళ్ళతాత గవర్నమెంటు ఆఫీసరుమీద వాలింది, నాకు వాళ్ళ గుమ్మంలో అడుగుపెట్టే అర్హత కూడాలేదు- కనక ఆ భోజనం నా జీవితంలో నాకో గొప్ప గౌరవం.

జీవితందున్నే నాగటిచాళ్ళుగా ముఖంలో ముడతలు శోభించే మనిషిని నేను- బ్రహ్మాండమైన పెంటపోగులాంటి నగరంలో నివసించే వీరుడ్ని ఎక్కడ దుర్గంధ క్రిములే సింహాసనాలెక్కి రాజ్యం చేస్తుంటాయో- అక్కడ ఊపిరి పీలుస్తూ పద్యాలుచెక్కే కార్మికుడ్ని ఎప్పుడూ బిజీగా గజిబిజీగా ఉంటాను.

ఒక్క ఆక్రందన వినగానే చెక్కుతున్న పద్యం విరిచి పారేసివెతుక్కుంటూ పోతాను చిరిగిన ఆశల్లోనుంచి మనిషి విషాదనగ్నత కనుపిస్తుంది వీథుల్లో సంకెళ్ళ చప్పుడు వినిపిస్తుంది.

నా ఆత్మను గురించి నాకేభయమూ లేదు నేను చస్తే దానికే నష్టమూ లేదు గనక- పాపం జీవిత పర్యంతం నా సుఖదుఃఖాలు పంచుకున్న నా శరీరాని కేమవుతుందో అనే నా భయం దాన్ని రాజకీయ క్రిములు తినేస్తాయి.

దోమలకు రక్తం పంచి పెడతా ఈగేః కలిసి భోజనంచేస్తా ఈ రాజకీయ శకంలో నేను ఒక బలిచక్రవర్తిని!

అన్నిరకాల జీవుల్నీ మోస్తున్న ఆత్మజ్ఞానం లేనిరోడ్లు, స్వీయ శరీరాల మీద ఏమి తేలుతున్నాయో స్పృహలేని నదులు, చచ్చిన చేపల్లా సైకిళ్ళ వెనక మోసుకు పోబడే వార్తా పత్రికలు, పాడుబడ్డ భవనాల్లో

గొంతెండిపోయిన ఫౌంటెన్లు లాంటి ప్రజలు- నాదేశమా నీ బాధలు నేనెరుగుదును నా జీవితమంతా ఒక కన్నీటి బిందువు చేసి నీ అరచేతిలో పెడదామనే నా ఆశ!

నీ మీదవేసే ఒక రోడ్డూ నీ రోడ్డుమీద వెలిగించే ఒక దీపమూ నురుగులుకక్కే నీ ప్రజాసముద్రపు ఆకలికి ఒక్క మెతుకయినా అవుతుందా? నీ పొలాలన్నీ కలిసి హృదయపూర్వకంగా పండినా చాలనంత ఆకలి పీక్కుతింటోంది.

ఏళ్ళు కుందేళ్ళలా రాళ్ళలో ప్రవహించేచోట ఎడ్లు తెడ్లులేని కెరటాల్లా ఉరకలు వేసేచోట కరువేమిటి వీళ్ళు కల్పించే బరువేగానీ!

నా దేశమా! ఈ సముద్రం ఒక నిద్రించే సింహం అది మేల్కొంటే అరఘడియలో అంతా సఫా- మరి హైదరాబాదుకు మరో ఉదయం ఉండదు.

బంగాళాఖాతం నీచంకలో పసిబిడ్డ నాగుండె ఒక కవిత్వపు గడ్డ! ఏనుగుల కళ్ళుతీసి ఎలుకల కతికిస్తా ఎలుకల తోకలు పీకి ఏనుగులకు తగిలిస్తా ప్రజల కళ్ళలో పులికళ్ళు చెక్కుతా వాళ్ళ మెదడుకు సింహాల కోరలు అంటిస్తా.

చూడిక చార్మినార్ దగ్గర పావురాళ్ళుకాదు రాళ్ళు వాలుతాయ్

# నాలుగో సర్గ

ఒక్క మబ్బుకూ్కడా వర్షం కురిసే ధైర్యం లేదు ఈ భయంకర బంజరు భూమిమీద తుఫానులు ఉమిసే ఆకాశాన్ని తువ్వాళ్ళలా తుడుస్తున్నాయి మేఘాలు–పాపం పొలాలకోరిక ఏమిటి? పంటలు పండి మీ ఆకలి తీరాలనేకదా రాజమార్గనడుం విరిగింది ఈ వెధవ రాజుల్ని మోసిమోసి ఎల్లకాలం కోకిల పాడుతూనే ఉంటే ఎలా అదీ ఇల్లు కట్టుకోవాలి పిల్లల్ని కనాలి ఈపాడే వ్యాధి ఏమిటో తెలుసుకోవాలి.

తెలుసా నీవ్యాధి ఏమిటో? బ్రతుకు

దానికి మందేమిటి మెతుకు

దాని లక్షణ మేమిటి

ఒక్కటే

నీకు ఆకలి వేసినప్పుడే నీవు మనిషినన్న జ్ఞాపకం నీకొస్తుంది.

ఆకలికి అడ్డొచ్చిన వాళ్ళని ఆహుతిచెయ్ వంకాయల్లా నీకాళ్ళు కదలాలేగానీ సంకెళ్ళు తెగడానికి సిద్ధంగా ఉన్నాయ్ నీవు నిలబడాలే గానీ నీ జైలుగోడలు కూలిపోవడానికి రెడీగా ఉన్నాయ్ స్వాతంత్ర్యం నీకోసం స్వాగతం చెబుతోంది విస్తారిత బాహువుల్తో.

నిన్నెంత పెద్దవాడ్ని చేస్తానంటే నీ నీడచూచే నీ శత్రువు నిగిడి చావాలి నీవు గర్జిస్తే సముద్రం బెదిరి నిదరపోవాలి ఒక శిశువులా

బాబూ ఇవాళ ఉదయం నాఆత్మ సారాంశం– ఈ నేలకోసం ఏం చేస్తానోచూడు– నిన్ను రెక్కల మీద ఎగరేసుకుపోతా గర్జించే మేఘాలజూలు పట్టుకుని వర్షాలుకక్కిస్తా.

బాబూమనం తుపాకుల్ని ఎదుర్కోగలంగానీ నియంతలు ప్రశ్నల్ని ఎదుర్కోలేరు-

మనిషి చేత్తో సృష్టించిన నాగరికతకు గుళ్లో దేవుడు కర్తా? నాగరికత అనే ఈ మానవ ద్రోహానికి బాధ్యత ఎవరిది? అధర్మానికి కాళిదాసు పౌరోహిత్యం చేయడు అధర్మాన్ని వాల్మీకి ఆదరించడు అధర్మ పీడితుడికి అష్టాధ్యాయి సాధన చేసే ఓపిక లేదు.

ఆకలిమంటలు అమాయక శిశువుల్ని దహిస్తుంటే చూస్తూ కూర్చోడం నాగరికతా? మనుషుల్ని మృగాల్లా వాడుతూ ఉంటే మౌనంగా ఊరుకోడం సభ్యతా అన్యాయం సహస్రముఖాలతో అన్ని దిక్కులా తాండవనృత్యం చేస్తూంటే కళ్లు మూసుకుని వ్యాన్‌గోని ఆనందించడం సంస్కృతా? అది నాగరకతకాదు అది సభ్యతకాదు అది సంస్కృతికాదు అది పచ్చిమోసం పచ్చిక్రౌర్యం కుళ్ళిపోయిన గుండెలోనుంచి ప్రవహిస్తున్న చీము!

స్వచ్ఛమైన నాగరకత రక్తనాళాల్లో స్వచ్ఛమైన హింస ప్రవహిస్తూంటుంది. నాగరకత రక్తంలోకి అన్యాయం ప్రవేశించలేదు పిరికితనం నపుంసకత్వం నాగరకతా దేహంలో అవయవాలు అవలేవు దాన్ని లోకవంచనగా మార్చకుండా- ఇంకా దాన్ని నాగరకత అనే వాడెవడయినా ఉంటే ఉమ్మేస్తారు బుద్ధిమంతులు వాడి మొహాన.

సోదరా! ఎలాంటి గుడ్డితనాన్ని కూడా కాంతి క్రౌర్యంనుంచి కాపాడబోకు.

కన్నబిడ్డని మండేమంటల కప్పగించి తిరిగి వస్తున్నవాడికే తెలుసు పంట చెరుకులో ఎంత చెరుకుందో దేహం వాళ్ళ వేదాంతపు పంచభూతాల్లో

ఎలా కలుస్తుందో; చేతికర్ర కావలసిన దినం వచ్చినప్పుడే తెలుస్తుంది రాబోయేతరం రాకపోతే ఏమవుతుందో! సోదరా! దేవుడు మనిషిని కోల్పోయాడు.

ఇదుగో చెపుతున్నా దేశం పేరుతో జాతి పేరుతో దేశదేశాన మన పిల్లల్ని భయంకరమైన యుద్ధాగ్నులకూ అంతకంటే భయంకరమైన జీవన దావాగ్నులకూ బలిచేస్తున్న మానవ ద్రోహులకు మరణశిక్ష ఆసన్నమయింది.

వట్టి చేతికర్రే అనుకోకు అదే తన ఆత్మనంతా గొంతులోకి తెచ్చుకుని యావన్మానవజాతికీ చెపుతోంది భయపడవద్దని– మీ కొడుకులే మీ కలల రక్షకులు చేతికర్రలోనుంచే పుడతాడు సింహంలాంటి మహాపురుషుడు గొర్రిల్లా! సముద్రాన్ని మచ్చిక చేసుకున్న వీరుడు జీవితాన్ని కుక్కలా తిప్పుకునే యజమాని సింహాలరౌతు తుఫానుల దోస్తు వాడే ప్రవక్త వాడే ద్రష్ట కొరడా పుచ్చుకొని వస్తాడు గాలుల్ని తోలుకుంటూ పిడుగుల్ని ఝుళిపిస్తూ మేఘాలు విసిరేస్తూ భూమ్యాకాశాలను సునిశ్చిత వజ్రపాదాలతో తొక్కుతూ ఉగ్రకిరణాలతో కుళ్ళిన ఆకుల్ని కాల్చివేస్తూ–

వాడ్ని ఎవడూ చంపలేడు శత్రువు సంతోషించే వాడిచావు శత్రువు గెల్పుకాదు వాడు అసంఖ్యాక వీరులరూపు లెత్తుతాడు భూమిలోకి ఇంకిన వాడి ఒక్కో రక్తబిందువు ఒక్కో వీర వంశవృక్షాన్ని బయటికి విసిరేస్తుంది– వృక్షాలు వృక్షాలే లక్షోపలక్షల శాఖలతో బాంబులు డైనమైట్లు తుపాకులు ఫిరంగులు ఖడ్గాలు ఈటెలు గదలు ధరించి కొల్లలు కొల్లలుగా భయంకర గొర్రిల్లాలై దూకుతాయి. ద్రోహుల అమానవీయ సంస్థల్ని బ్రద్దలు చేస్తాయి అరే వీరుడా అని కేకవేస్తే ఇదుగో ఇక్కడున్నా ఇక్కడున్నా ఇక్కడున్నా అని అన్ని దిక్కులూ ప్రతిధ్వనిస్తాయి.

ఓ గొర్రిల్లా లే గొర్రిల్లా మనిషిలో నిద్రిస్తున్న ఓ క్రియాశక్తీ ఓ

క్రియాశక్తీ ఓ మహాత్మా ఓ గొరిల్లా నిద్రలే! సూర్యచంద్రుల్ని మొదట చూచిన ఓ పితామహా లే అసహాయ ఐ మానవత ఆక్రందిస్తోంది లే నీవు కట్టిన సౌధాలు కూలిపోయాయి లే నీవు నిర్మించిన మనిషి శిథిలమై పోయాడు లే లే గొరిల్లా ఇది నీవు నిదురించడానికి వేళకాదు నీ మహాద్వారం దగ్గర నిల్చుని ఈ పాటలల్లుతున్నా ఈ పాటలన్నీ పాడుతున్నా ఈ పాటలన్నీ అరుస్తున్నా ఈ పాటల జన్మనిన్ను మేల్కొల్పడానికే ఈ పాటలన్నీ నీ పాదాలమీద పోయడానికే ఈ యుగంలో నీ జాగృతికోసం రాయనిపాట ఒక ఘోరాఘోరం నీ సుషుప్తికోసం రాసే జోలపాట ఒక మహానేరం ఓ క్రియాశక్తీ నీవంటేనే నాకుభక్తి.

వినబడటంలేదా నా పాట? గుండె తంత్రులు మీటుతున్నా తుఫానులు వేళ్లు చేసుకొని చాటుతున్నా లే గొరిల్లా నా బాహువుల్లో నివసించే గొరిల్లా నా బాహువు ధరించిన గండ్ర గొడ్డలిలో నివసించే గొరిల్లా దౌర్జన్యపు శిరస్సు తెగవేసే గొరిల్లా ప్రళయ ఝుంఝువులు ఊగే గొరిల్లా! నీవు నిద్రిస్తే చూడు ఎలా పొలాలు నిద్రిస్తూ పడి ఉన్నాయో ఎలా పొగ గొట్టాలు ఖాళీగా నిలబడి ఉన్నాయో నిద్రలే గొరిల్లా ఓ కర్మయోగీ నీ యోగ సమాధిలోనించి బయటికి రా నీవు చేసిన మనిషి వట్టి జ్ఞానయోగిఐ కృశించి నిర్వీర్యుడై పోయాడు రా మానవతా సముద్ధరణకు సహస్ర బాహువులతో సహస్రాయుధాలతో.

పాతరాతి యుగపుగుడ్డు బ్రద్దలు చేసుకొని ప్రళయ ప్రభంజనంలా బయటికొచ్చిన ఓ మహోగ్రమూర్తీ మానవజాతి ఆక్రందనల ఆర్కెస్ట్రా వినబడడంలేదా నీ సుషుప్తి విరగడంలేదా- నీవు మా జాతికి తొలి ఉషస్సువు-

ఆకలిగొని ఉదయారుణ బింబాన్ని పట్టుకోబోయిననాటి నీ హస్తం మా మస్తిష్కానికి జన్మస్థానం తొలుత వెలుతురు నీ కళ్ళతో దర్శించి

పిదప వెలుతురు కుటుంబాలన్నీ నివసించే వ్యోమమండలాన్ని మా కళ్ళకు చూపావు నీవు నిల్చుని మాకు నిల్చునే విద్య నేర్పావు మా బాహుదండాల్లో కాపురముండి పొలాలు పంటలు భవనాలు వనాలు సమస్త సౌభాగ్యాలు ఇచ్చావు మహీ తలంమీద క్రియాశక్తికి కీర్తి పతాకలు లేపావు; నీ సహస్ర బాహువులతో నిర్మించావు గ్రామాలు నగరాలు సామ్రాజ్యాలు సాహిత్యాలు మా మస్తిష్క మండలంలో మనీషకు జెండా లెత్తావు. మానవతకు ప్రతీకవు న్యాయానికి పతాకవు అధర్మానికి ఉత్తమ సమాధానం నీ కఠోరకుఠారం నీ గండ్రగొడ్డలి ఏది? ఏ మూల నిద్రిస్తూ ఉంది–

పితామహా! దౌర్జన్యానికీ కృత్రిమానికీ గురి అయిన దేవతల్లాంటి నీ పిల్లలగోడు వినబడడంలేదా బాలసూర్యుడితో పసినెలవంకతో నక్షత్ర శిశువులతో బాల్యక్రీడ లాడుకున్నావే ఓ తేజస్వీ నిదురలే.

నీవు భూమి యౌవనానికి పుట్టావు గర్జించే వాయువు ఆయువుగా పొందావు ప్రళయసాగారాల ముడి కండరాల్ని నీ మజ్జామాంసాదులుగా చేసుకొన్నావు అగ్నిహోత్రాలు నీ నేత్రాలుగా మారాయి ఆకాశమే నీ కంఠమై నిలిచింది. నీకు లొంగనిదేది పితామహా!

నీవప్పుడు డినోసెరస్ నామక పురాతన క్రూర జంతువులతో పోరాడావు మాకు దౌర్జన్య మృగత్వాన్ని వధించే కళ ఉపదేశించావు.

మమ్మల్ని ఆవహించు ఓ గొర్రిల్లా, నిజాలకు మా భుజాలు జోడించు మమ్మల్ని పవిత్ర హింసాసీమలకు వెూనుకుపో నీ రోమరోమాల్లోంచి పుట్టాలి కోటానుకోట్ల కర్మవీరులు త్యాగవీరులు పతనమౌతున్న ధరిత్రిని పైకెత్తి ప్రాణప్రతిష్ఠ చెయ్యాలి.

లే గొర్రిల్లా నీ కోపానికి మా గుండెలతో ధూపంవేస్తున్నా నీ గుండెల్లో మా గొంతులు హోమం చేస్తున్నా ఉద్భవించు గొర్రిల్లా హోమాగ్ని జ్వాలల్లోంచి యుగం యుగం నీ నిరీక్షణతో సగమై క్షీణించింది

అవతరించు గొరిల్లా అగ్ని చల్లారిపోతోంది.

నీ పిల్లల్ని నీ లోకాలకు తీసుకుపో ఎక్కడ శివమెక్కిన గణాచారుల్లా పూలు వసంతాలతో పోట్లాడుతుంటాయో ఎక్కడ అడవులన్నీ వీరమాతల్లా జుట్టు విరబోసుకొని విద్యుల్లతలు మెడల్లో దాల్చుకొని ఉగ్రతాండవం చేస్తుంటాయో ఎక్కడ ఆకాశం మోసంమీద ఉమ్మేస్తుందేగానీ వర్షాలు కురవదో ఎక్కడ గండ్రగొడ్డళ్ళమ్రోత శ్రవణ సుభగంగా దిక్కుల్లో మారుమ్రోగుతూ ఉంటుందో ఎక్కడ దొంగ నాయకుల్నీ దొంగ కవుల్నీ కుర్చీల మీదనుంచి తీసి సలసల మరిగే తైలతటాకాల్లో విసిరేస్తుంటారో ఎక్కడ  తుఫానులేగానీ మందమారుతాల్లేవో ఎక్కడ సముద్రాలేగానీ సరస్సుల్లేవో ఆ మహాలోకానికి తీసుకుపో.

మహాపురుషా! నీ దివ్య మంగళ విగ్రహం ఒక్కసారి చూపించు బాలకుడై నిస్సహాయుడై ఏడుస్తున్నాడు మానవుడు దర్శనమివ్వు- గోపురాలు భుజాన వేసుకొని నూపురాలుగా ఆధునిక రాక్షస కపాలాలు ధరించుకొని సహస్రబాహుల్లో పరశువులు బాంబులు శూలాలు శతఘ్నులు అసంఖ్యాక భయంకర మారణాయుధాలు అలంకరించుకొని వామపాదం కించిత్ ప్రత్యాలీఢభంగిమలో నిలిపి దక్షిణపాదం నాయకాసురుడి గుండెలమీద మోపి కుడి పిడికిట్లో కఠోర గండ్రగొడ్డలి పూని ఎడమ పిడికిట్లో అధికారి ఛిన్నమస్తకాన్ని జుట్టుతో గ్రహించి నానా అధర్మజాతుల ధైర్యాస్తమయ ఘోరకారణమైన గ్రీష్మతపజ్వాలా మాలికలాంటి నాలిక నీ ముఖమండల నిర్గళితమై వ్రేలాడుతుండగా నీ దివ్య మంగళమూర్తి సాక్షాత్కారం ప్రసాదించు పితామహా! నీ గుడ్లనే అగ్నిగోళాల్ని ఒక్కసారి ఈ కుళ్లిన దేశంమీద విసిరెయ్ గొరిల్లా! గొరిల్లా! గొరిల్లా!

నవతరాల పిల్లలార! యువతా పతాకలార! కడదాము రండి కాలపు తీరాలమీద బొమ్మరిళ్ళు అల్లరి చేద్దాము రండి ఆడుకుందాము రండి అలసి ఆ తీరాల్లో కలసి పోయేదాక; చిలుకల బళ్ళోచేరి పలుకులు నేరుచుకుందాం నెమలి కన్నెలకు మనమే నృత్యాలు నేర్పుదాం మబ్బులమై

వానకురిసి మడిచేలు పెంచుదాం గగనాలకు ఇంద్రధనుసు కానుకగా ఇద్దాం.

మంచుబొట్టులో రంగులు ముంచి పోసుకుందాం కొండవాగు గొంతులోని పాట దొంగిలిద్దాం పక్షుల్ని మువ్వలుగా పదాలకు ధరిద్దాం పూల బాలికల చెంతకుపోయి గంతులేద్దాం పుష్పాళ్ళను తోటల్లో పోగుచేసుకుందాం పసిడిగాలి ముత్తైదుకు పారాణిగ పూద్దాం సరసులోని చందమామ చాది పూసుకుందాం వసుధమీద అందరికీ వసంతాలు పంచుదాం.

ఇది వింశతితమ శతాబ్ద
షట్ సప్తతితమ సంవత్సర డిసెంబరు మాసాన (1976)
విప్లవ భాషా విధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజన విధేయ శేషేంద్ర నామధేయ
కవివర్య ప్రణీత గొర్రిల్లా నామాంతర సమేత
పశుపర్వము సర్వము
సమాప్తము

# ప్రవాహ పర్వము

## ఒకటో సర్గ

ఆకాశం సూర్యుడి దేవాలయం
లోకం చరాచరవస్తు గ్రంథాలయం
చెట్లు పూలుపుచ్చుకుని సుల్చో ఉన్న భక్తుల సమూహం
నేను ఆలోచనలో మునిగి ఉన్న జలాశయం

పాలబాట ఉషః ప్రవాహాల్లో మునిగిపోయిందో లేదో గుల్మొహర్ తన ప్రథమ దర్శనం ఇచ్చి నూతన ఋతువును ప్రకటించింది. ఏవేవో స్మృతులన్నీ దూరదూరాలనుంచి నా రక్త ప్రవాహాల్లోపడి కొట్టుకొచ్చాయి.

ఈ భాష ఈ కాలం ఈ దేశం నావి అని ఎలా చెప్పగలను? ఇవి నేను కోరుకున్నవీ కావు వీటి కోసం నేను పుట్టేముందు నా అంగీకారం ఒకరు తీసుకోనూ లేదు- నేను వాటి ఖైదీని.

నేను ఎన్ని జిహ్వలు ఎన్ని యుగాలు ఎన్ని దేశాలు తొక్కుతూ వచ్చానో ఇవాళ నన్ను మా వూరి వాడంటున్న ఈ కుగ్రామానికి, నాకూ తెలీదు నీకూ తెలీదు.

ఈ దినం మాత్రం చెపుతోంది, ఒకప్పుడు నా దేశం ఒక పువ్వనీ అందులో నేనొక మకరందశిశువునై ఊపిరి పీల్చాననీ.

ఒక్కొక్కప్పుడు బయటపడతాయి, నా రక్త నదీతీరాల్లో నా పాతరాతి పనిముట్లు- ప్రవాహాల్లో కొట్టుకొస్తాయి. ప్రాచీన సుమేరియాలు మొహంజోదారోలు.

నేను ఏ అడవుల్లో తిరిగానో సింహశార్దూలాల గర్భాల్లో నిద్రిస్తూ నన్ను ఏ అందమైన లేడి మేసిందో శాద్వలాల్లో తన రక్త మాంసాల్ని బుజ్జగిస్తూ నేను ఏ అడవి అనుభూతికోసం చెట్టునై కొమ్మలు జాపానో నా ఆకుల అంగుళులతో శూన్యం స్పృశిస్తూ.

ఏ ప్రాచీనసముద్ర చేతనలో తేలానో నిరింద్రియ నిరవయవ కాంతికణాన్నయ్ స్పందిస్తూ ఏ ఘడియలో ఊగానో కాలంలో వ్రేలాడే బొమ్మల్లా ఉన్న సూర్యచంద్రులకూ నాకూ అభేదం అనుభవిస్తూ

నాస్మృతులన్నీ రక్తప్రవాహాల్లో వడికొట్టుకొంటున్నాయి- గుల్‌మొహర్ ఒక నూతన రుతువును ప్రకటించిన ఈనాడు! ఏరుతువు సృష్టి అనంతత్వాన్ని గానం చేస్తూ ఉందో ఆ రుతువును.

మావూళ్ళో నన్నెరిగిన వాళ్ళు నలుగురే శిథిలమైన వంతెన గ్రామకాలువ పాతగుడి ముసలి చెరువుగట్టు-

ఈ జీవితంలో నీవు ఎన్నిరంగులతో ఆడుకుంటున్నా ఒకనాడు నీవు అదృష్టవంతుడివై నీ ప్రాచీన చీకటిని కలుసుకోక తప్పదు ఏ చీకటిలో నీ జీవకాంతుల బంధువులు స్పందిస్తున్నాయో

ఒకనాడు నన్నుచూచి పాడే పక్షులు పారిపోతే నేనెంత పాపాత్ముడ్నో అని భయపడిపోయాను

నేను మారుతూ సంతరించుకున్న నా కశ్మలాన్ని నాణ్యాలుగా మలిచి లోకపు బజారుల్లో ఇవ్వలేను నా అడుక్కి పోతా- నా చెవులోదూరి నా గుండెలోకి దిగుతా నా కన్నుల్లో దూరి నా ఆత్మలోకి దూకుతా...

ఎక్కడ శిశువై మానవుడు ఏ రసాయన ద్రవాల తోలు సంచిలో ఉన్నాడో ఏ ఆదిమద్రవాలు మూల పదార్థమైన ఆనందానికి ఉపనదులో

ఆ తీరాల్లో ఆడుకుంటా అక్కడే నిలిచిపోతా శిథిల నౌకలా అనంతత్వంతో ఆడుకుంటూ.

అక్కడ నాకు, ఒక తెల్లటి హంస మెడ పుచ్చుకుని మృదువుగా పిండుతున్నట్లు ఉంటుంది వెండిపిల్లవాడైన చంద్రుడ్ని దిమ్మమీద పెట్టి కోమలంగా సుత్తితో కొడుతూ సాగ దీస్తున్నట్లుంటుంది.

ఏవో అవ్యక్తానుభూతులు నా కనుగోళాల సూక్ష్మనాళాల్లోకి వ్యాపిస్తాయి లోకమే కొత్తదృశ్యంగా మారిపోతుంది.

చెట్టు బుగ్గలు పూరించి రెండు శాఖలతో ఒక పువ్వు పుచ్చుకుని షహనాయీ ఊదుతుంది.

ఒక్కరాగం విసిరి బుల్‌బుల్ తోటతోటనంతా తన చిన్ని రెక్కలమీద ఎగరేసుకుపోతుంది.

నా స్మృతి మీద ఒక స్తంభం విరిగి పడింది నా గొంతుమీద గడ్డి మొలిచింది గోవులు తిని భూవలయంమీద పిల్లలందరికీ పాలిచ్చాయి పిల్లల్లో నా గొంతు పద్యాలై పల్లవించింది వాటి మీదపడి బంగారు మూర్ఛపోయింది దేవుడు కాళిదాసై కన్నీళ్ళతో చేతులు కడుక్కున్నాడు.

మేజా మీద రోజాల సముద్రాల్లా కన్నీటి బిందువులు కుప్పపోశాను అవి చూచి పశ్చిమాన బంగారు చచ్చిపోయింది.

కిరణాలు నాకలల్ని మొలకెత్తనీడం లేదు వాటినిలోకాంతర చీకట్ల మట్టిలో పెంచుతాను సమాధిలోకి పోతాను.

నా సమాధిని బంగారు గాలివానలతో తుడిచి శతాబ్దుల రెక్కలతో అలంకరిస్తాను- నింపుతాను సంధ్యల రక్తిమతో, కీర్తిభరిత ఆత్మహత్యలు వెదజల్లుతాను.

కాంతుల కుంతలాలతో నిండిన నా తల కోసి రత్నాల పళ్ళెంలో పెట్టి సమర్పిస్తాను దానిలోంచి ఎర్రగులాబులు రాలుతాయి సంధ్యల్లా పసికందుల్లా ఆలివ్ జాతుల పురంధ్రుల్లా

మౌనంగా ఉన్న పూల సమక్షంలో నోరు విప్పని తైలచిత్రాల మ్రోల గదిచేతులో ఎన్నో అవమానాలు అనుభవించి దీపంకాస్తా ఆరిపోతుంది కానీ గదే నష్టపడుతుంది చీకటిచేత మింగబడి

అప్పుడు ఒక ఆకుకూడా ఒక శతాబ్దంలా రాలుతుంది- ఆ నల్లరాతి కింద గొంతునలిగిన ఒక నీరుందో లేక నా విరిగిపోయిన గొంతుందో... ఏ దేశద్రిమ్మరి గాలి వచ్చి దాన్ని దొర్లించినాకు నా రహస్యాన్ని స్వాధీనం చేస్తుందో తెలీదు.

ప్రతి వానజల్లుకూ నా జీవిత లోయ రంగులు మారుస్తుంది అదే నదిలో నేను రెండోసారి ఈదడం లేదు పుట్టినప్పుడు పెట్టిన పేరుతోనే మారుతున్న నన్ను లోకం ఇంకా పిలుస్తోంది- ప్రవాహంలో అదే నీరు ఎప్పుడూ ఉండదని తెలీదు.

సాయంకాలం సిగరెట్టు కాలుస్తోంది మెలికెలు తిరుగుతూ నక్షత్రాల్లోకి పోతున్న పొగచక్రాల్ని వెనక్కి పిలిచి మళ్ళీ వాటిని సిగరెట్టుగా చెయ్యాలని చూస్తోంది.

నా స్మృతుల ఉషస్సుల్లో నిదురిస్తున్న దుఃఖజలాల్ని అక్కడ పక్షులు తాగుతున్నాయి హరిత శాద్వల తీరాలమీద కూర్చున్న నగ్న శిశువులు తామర తూళ్ళతో షహనాయీలు ఊదుతున్నారు వసంత

స్వప్నాల మత్తులో తేలుతూ కాలువలు కాలువల్ని పిలుస్తున్నాయి భూమ్యాకాశాల నాడీ మండలం సంతోషకేకల ప్రకంపనలతో నర్తిస్తోంది.

మబ్బులెక్కి ఏడుస్తున్న చంద్రబాలుడు భారీభూద్యశ్యాల మీద వెన్నెల కుమ్మరించాడు వేణువుకు మానవుడు పోసిన జీవం వెయ్యిస్వరాలతో వేదన అనుభవిస్తోంది.

పూలతుఫానులు సంధ్యల తుఫానులు వచ్చి అక్కడ విడిది చేశాయి- చూచుకంలా మిసమిసలాడే కృష్ణద్రాక్షలో వ్రేలాడుతున్న రక్తనాళాల జీవమండలం నక్షత్రగుచ్ఛాల్ని పిలిచింది దిగిరమ్మని

హిమాలయాలు భూమధ్యరేఖకు దూరంగా పడుకోబెట్టిపోయిన నగ్నశిశువు గంగానది ఇసుక తీరాలమధ్య మూసిన పుస్తకంలా నిదురిస్తోంది తొలికిరణం తగలగానే నీరయ్ పారిపోయింది.

అమావాస్య చంద్రుడి చివరిముక్కను కూడా నోట్లోవేసుకుంది.

నీలిగా విరగబూచిన జాకరాండాశాఖల్ని ఆశ్రయించికూర్చున్నా ఒక ఉదయం- మడగాస్కర్ రాజధాని దూరదూర మధ్యాహ్నాల నీలిపూల నీడల్లో వాలింది నామనస్సు, ఒక రెక్కల జంతువు! దాని పరిపుష్టదేహపు పాతగాయాలు కార్చే నీలినీలి రంగులు స్వాప్నిక వీధుల్లో రాలుతూ అలాఅలా పోతున్నాయి మలయా మర్మభూముల్లోకి ఆఫ్రికానేల మూల ధాతువుల్లోకి.

ఆ తామస ఖండాల అంతరాళాల్లో మార్మికదేవతా సమూహాలు చేసే నృత్యాలూ అగరుధూపకోపోద్రేకాలు రేపే మేఘాలూ ఢమరుఢక్కాది చర్మవాద్యాల కంఠనాళాల్లోనుంచి మూకలు మూకలుగా దూకేభూతప్రేత పిశాచాలూ శబ్దంలో అధివసించే సూక్ష్మ శక్తికి లొంగి సంగీతాల్లా మసలే

చరాచరవస్తుజాల ప్రకంపనాలూ అంతా ఒక విచిత్రధూమ్రమండలం! పౌరాణికము, అతీతము, అద్భుతము, మార్మికము, రాక్షస పదార్థము అన్నీ మిళితమై ఒక అలౌకిక మత్తు కలిగించే సీమ అది-

ఆ ధూమం నా ఆధునిక మస్తిష్క కుహరాల్లోకి ఐంద్రజాలికంగా చొచ్చుకొని మాయానగరాలు నిర్మిస్తోంది- ఎక్కడో ఒక్కటే ఒక్కమబ్బు ఒంటరిగా కనిపిస్తోంది ఆకాశంలో, అది అనిపిస్తోంది చిలకల గుంపులు ఎగిరిపోయి వాలే వెండిద్వీపంలా అందులో నా ఊహ ఒక కుటీరంలా నేనక్కడ సరస్సులో తేలే చందమామను పట్టుకోడానికి వల విసిరేసి కూర్చొ ఉన్న జాలరిగా ఆ సరస్సులో నీళ్ళు నేను కలల్లో చూచిన ఉషఃకాంతుల్లా.

శాఖలనుంచి ఆకులు పుట్టుకొచ్చినట్లు నా శ్వాస తగిలితే శబ్దాలకు కాళ్ళొస్తాయి నా స్పర్శసోకితే వీణల్లో వేణువుల్లో మృదంగాల్లో నిదురించే అప్సరసల దేశాలు మేలుకుంటాయి అంతర్లోకాల్లోకి గుంపులు గుంపులుగా అవతరించి పూలపండుగలు చేసుకుంటాయి ఏవో అనిర్వచనీయమైన బాధల అందాలు అడవులై అల్లుకుంటాయి ఆ అడవుల్లో పడి ఉన్న శిలకూడా ఒక కలగంటున్న ప్రాణే.

నా శరీరం నా యుగీన తర్కానికి ఖైదీ అయ్ నేను నా స్మృతియాన సుఖాలన్నీ కోల్పోయాను కానీ నాలో ఉన్న జంతువు సృష్టి పరంపరల తర్కాన్ని సమస్తమూ వాసనలు చేసి మోసుకొని వస్తుంది, గర్భంనుంచి గర్భానికి నేను చేసే అనంతప్రయాణంలో.

నేను ఘనీభవిస్తే ఒక నామరూపాత్మక దేహం నేను ద్రవీభవిస్తే ఒక జ్ఞాపకాల ప్రవాహం! నేనున్న చోట ఇప్పుడు లేను ఎప్పుడూలేను.

చిల్లర దేవతలు సిద్ధాంతాలు చెపుతారు నేను మధువందిస్తాను రండి నాతోకలిసి -- నేనిచ్చే మధువు సేవించండి, దేవతల్లా ఆకాశంలో తిరగండి.

పొలికేకలు పోగుచేసుకుంటూ వచ్చే హోరు గాలి చేతుల్నించి తప్పించుకుందామని పుస్తకాల అడవుల్లోకి పారిపోయాను అక్కడ కుప్పలు కుప్పలుగా రాలిపడి ఉన్న ఆకుల్లో తల పొగొట్టుకున్నాను ఇప్పుడు పరుగెత్తే ప్రవాహం కూడా నా నీడని దోచుకుపోవాలని చూస్తోంది.

ఓ ప్రశాంత పొలాల్లారా ఓ దిశాంత శాద్వలాల్లారా మీ చూపుల సంగీతంలో పడుకుంటాను శాంతికోసం- నా అంతర్లోక చిత్రాల రంగులు నెమరువేసుకుంటాను.

సృజనాత్మక కళలుచిందే రంగులు నింపిన గిన్నెలు పువ్వులు; జీవన కాంతులు చిమ్ముతూనడిచే శమ్మెలు మనుషులు- సృష్టిఅంతా ఒక పువ్వు ఐ నా అంతరాళపు వెండి జలాల్లో రెక్కలు విచ్చుతోంది, పురాతన సువాసనలు పుక్కిలిస్తోంది.

మదిలోకి ఆకుల జనాభాల్ని తీసుకొస్తున్నాయి కొమ్మలు కొమ్మల్లో పాటలు పండి వేలాడుతున్నాయి గుత్తులుగుత్తులుగా.

నేను ఆనందం మీద వెల్లికిలా పడుకో ఉన్నాను సృష్టిలో ఏవీ నిశ్చలంగా లేవు శిశువులు చెట్లు కొండలు పచ్చికబయళ్ళు గోపురాలు గొర్రెల మందలు అన్నీ కదులుతున్నాయి తేలుతున్నాయి దైవీయరూపాల్లా పిల్లనగ్రోవి రంధ్రాల్లోకి పోతున్నాయి పాటలుగా మారి వస్తున్నాయి కాలపు అనంతత్వాన్ని గానంచేస్తూ.

అన్ని వైపులు ఒక్కసారి పట్టుకుందామని, అన్ని అపరిచిత పరిచిత వస్తువుల రూపు రేఖల్ని విడదీసి పోగులు పెడుతోంది కన్ను; మళ్ళీ ఆ రేఖల్ని మరో విన్యాసంలో కలిపి నూతన రూపాలు సృష్టించి మరో విచిత్ర జగత్తునే మేల్కొల్పుతూ ఉంది ప్రతి దృశ్యమాన వస్తువునూ అంతఃప్రపంచ రహస్య భాషగా తర్జుమా చేస్తోంది జీవజాలపు స్పందన లన్నిటినీ స్వరాలుగా అక్షరాలుగా అణువులుగామార్చి గాలిలోకి విడుదల

చేస్తోంది నా చేతనాంతరాల్లో శ్వాసపీల్చే ప్రపంచాల జనాభాలో ఒక ప్రగాఢ సంభాషణ పరుచుకుంటోంది.

వంకర టింకర్లుగా ఎగురుతున్న సీతాకోకచిలుక శూన్యంలో గీతలు గీచి నా జాగృతి లోకాలకు రంగురంగుల సరిహద్దులు నిర్మించింది.

నాలో నిద్రిస్తున్న రహస్యకళల్ని అప్పుడప్పుడూ నిద్రలేపుతుంటా ఒక పువ్వు ఊదా నీడలో నుల్చుని ఒక స్వరాన్ని మేల్కొల్పుతాను ఒక సముద్రపు వీరతరంగం ముందు కూర్చుని ఒక మారుతశకలాన్ని గాలివానగా మలుస్తాను రోజుకోరేఖ కలుపుకుని బలిసే చందమామను అనుకుని ఒక వెన్నెల దేవతావాహన చేస్తాను నా ఆత్మ వెండితనం చెట్ల ఆకుల్ని కలల జలాల్లో ముంచి తేలుస్తుంది- నే నెక్కడ నుల్చో ఉన్నానో నాకే తెలీదు ఎందుకంటే నా స్మృతుల పాదాలు అవ్యక్త భూతకాల ధూమ్రమస్థలాల్లో తేలుతున్నాయి.

గాలిలో ఉన్న పక్షులన్నీ కలిసినా నా పాటతో పోటీ పడలేవు నా పాట ఆర్కిటిక్ సముద్ర కన్య నా కంఠసీమల్లో చెక్కిన శిల్పం- నాది దేశద్రిమ్మరి పాట- ఎన్నో జిహ్వలమీద దేశాలమీద ప్రజలమీద దొర్లివస్తూ పోగు చేసుకున్న పాట అది- ఏ నదిలో నీరయినా తాగుతూ ఏ సీమ గాలయినా పీలుస్తూ వ్యాకరణాల్ని తొక్కుతూ మధుర స్వరాలు ఏరుకుంటూ వచ్చిన పాట.

నా పాటకు మాటల్లేవు మధురిమే ఉంది నా లేని మాటల లేత నీడల్లో నక్షత్రాలు సేద తీర్చుకుంటాయి దేశాల జాతుల కోలాహలం అడుగుపెట్టదు మృదువైన ఎర్రటి తో[illegible]ళ్ళూ అక్కడి వెండి ముద్దల్లాంటి శిశువులూ సంధ్యల్లో రెక్కలక[illegible] రంగులద్దుకునే పక్షుల కుటుంబాలూ

సంచరిస్తుంటాయి పువ్వుల్లాంటి ఋతువులు కొండల నడుములకు ఎండలు పూస్తాయి.

నా మాటలు తిన్న వాళ్ళు దేశాన్ని చెరుకులా నములుతున్నారు ప్రతిభాదీప్వకల్పాలుగా అందమైన గడ్డాలు పెంచుకుంటున్నారు నేనేమో దేశ కాలాలు విడుదల చేసిన పాటనై మాట నుంచి విడుదలైన గొంతునై గొంతునుంచి జారిపోయిన స్మృతినై దిగంతాల్లోకి కలిసి పోదామని కలలు కంటున్నాను- నక్షత్రాలకు పేర్లుపెట్టి ఆకాశంనుంచి పీకి పురాణాల్లోకి ఎక్కించిన వాళ్ళకు తెలీదు ఒక కలలోకి యాత్ర చేసే ఆత్మకు శబ్దం ఒక గోల పుస్తకం ఒక కాగితం అని.

నా కల పూర్తిగాక ముందే సూర్యుడు ఉదయిస్తుంటే ఒక రంగుల హిమ బిందువు రక్షించింది నా అస్తమిస్తున్న ప్రాణాన్ని.

# రెండో సర్గ

ప్రొద్దున్నే స్నానమాడి ఒక తామరపువ్వు సరస్సునంతా స్మృతులతో పరిమళభరితం చేసింది దానికి మూర్ఛపోయి చంద్రుడు అందులో పడి కరిగిపోయాడు.

ఆ మత్తులో సరస్సు రాత్రంతా నక్షత్రాల కలలుకంటూ ఉండిపోయింది. చంద్రుడ్ని బాల్చీలో పట్టుకుందామని రాత్రి నేను సరస్సుకు పోతే దాని గాఢసమాధి చూచి భగ్నం చెయ్యడానికి మనసొప్ప లేదు.

నక్షత్రాలతో తామర మొగ్గలతో కలల్ని అలంకరించుకున్న ద్రష్టగా సాక్షాత్కరించింది ఆ సరస్సు.

వేళ్ళలో నుంచి ఎవడో వేణువులు తీస్తున్నాడు. స్వరాలు చంద్రికల్లో పొర్లాడుతున్నాయి నా రక్త రేణువుల మీద – వెన్నెల ఇంద్ర జాలంలో వస్తువులు ఎలా మారిపోతాయో సౌందర్య పరివేషాలు ధరించుకుని అని చూస్తూ నిల్చున్నా కనురెప్పలు వెన్నెట్లో నాని ఉబ్బి బరువెక్కాయి.

నేనెప్పుడూ ఒక రాగానికి మేళవించిన తీగెనని తెలుసుకున్నా– నా స్మృతుల బాలతృణాలతో మధుర సమాసాలు అల్లేదీ అజ్ఞాత దిగంతాల్లో జన్మ వృత్తాంతం కోల్పోయినదీ అయిన ఒకానొక రాగానికి మేళవించిన తీగెనని తెలుసుకున్నా.

కొమ్మలో పక్షి కూస్తే నా దైనిక వ్యవహారాలన్నీ ఒక్కక్షణం ఆపి శ్రద్ధగా వింటాను నా కవితా ఋతువుల్లో నా జిహ్వ ఒక పూచిన శాఖలా

బరువెక్కి ఎన్ని శబ్దాలు పూస్తుందో దానికే తెలుసు ఆ శా [illegible] నా శరీర కణాల్లోకి ప్రవేశించి వ్యాపిస్తుందో దానికే తెలుసు.

ఇవాళ నా నోట్లో వాగ్దేవత ఒక పిప్పరమింటులా పలిచింది. ఒక పద్యం రాద్దామని ఉపమానాలు ఉత్ప్రేక్షలు అతిశయోక్తులు ఇంకా ఇతర కవిత్వపు పనిముట్లు ఎన్నో అన్నీ శుభ్రంగా సబ్బుతో కడిగి టేబిలు మీద పెట్టాను అవి నా సనాతన రక్త సరోవరాల్లో నుంచి అప్పుడే వెలువడిన జలకన్యల్లా తళతళలాడుతున్నాయి- నా గొంతులో పూలకొమ్మలు నిమ్మ గుత్తులు ఊగిసలాడుతున్నాయి ఊహోపవనాల్లో

నెచ్చెలి దేహంలో మోహంతో ఉరికే రక్తం గదిలో కొంటె సంధ్యలు కాస్తోంది.

ఇంతలో రోడ్డులో గాలివాన కిటికీలోంచి వచ్చి అన్నిటినీ ఎగరగొట్టేసింది గదినిండా గాయాలు చల్లి వెళ్ళిపోయింది.

శోకంలో స్నానమాడి వచ్చిన గీతిక నగ్నశరీరం ఇంకా అశ్రువులతో తడిసే ఉంది పొందవలసిన కాంతి లోకాల్ని పొగొట్టుకున్న కాగితం బావురుమంది నన్ను చూచి

ఎన్నో రుతువులు గాలికి కొట్టుకుపోయినప్పటికీ ఒక చైత్రమాసపు జ్ఞాపకం ఇంకా నా శిథిల శాఖల్లో చిక్కుకునే ఉంది

రాత్రంతా నాలో అగ్ని పర్వతాల కపాలాలు బ్రద్దలై ఏవో కాంతిగుంపులు పరుగులెత్తినట్లు చంద్రమండలాలు వెండికంచాల్లా దొర్లుతూనే ఉన్నాయి కాగితాల మైదానాల్లోకి పుస్తకాల లోయల్లోకి

పాలబాట ఆకాశమండలపు ఇరుసులా కిర్రున తిరిగి భళ్ళున తెల్లవారింది రోడ్డులో ఏదో ఒక భావపుతునక నములుకుంటూ పోతున్నాడు ఎవడో ఆవారా

నిన్నంతా ఆకాశాన్ని వేధించిన తుఫానుకు ఆ కరిగిపోతున్న చంద్రుడు ఒక ఫులుస్టాపు!

గదిలో వత్తి అంటించడం గదిలో వస్తువులకు నీడ లివ్వడమే- పుట్టిన పద్యం గుండెకు ఒక వైపే ఎండకాస్తుంది.

నా శయ్యలో రాత్రి జసచేశింది తన తామస పరిమళాలూ తన నక్షత్ర కాంతుల మర్మరధ్వనులూ తన సమస్త మార్మిక జగత్తులూ అలంకరించుకుని వచ్చి నా బాహువుల్లో ఒదుక్కుంది, "మబ్బుల అడ్రసు ఆకాశం, నా అడ్రసు నీహృదయం," అని చెవిలో ఊదింది ఆమె శిరోజాలు రోజాలు పూచాయి నా అన్ని ఇంద్రియాల్లోనూ

నా దంతాలతో రాత్రి కండల సౌకుమార్యాన్ని హాయిగా నములుకుంటున్నాను రాత్రిని మధువుతో తడిపి అంగుళులతో పిసుకతున్నా నా నిద్రకూ నా స్వప్నలోక ప్రయాణానికీ సరిపడే ఆకారం ఇద్దామని. జలకన్యలు వనకన్యలు గంధర్వకన్యలు క్రీడించే రెక్కల జగత్తుల్లోకి పోదామని-

పూలగుంపులు చేసిన తిరుగుబాటులో హత్య చేయబడిన ఆత్మలు నా అర్ధనిమీలిత చేతన పాడే గీతికలో కలిసి నా పెదవుల మీదినుంచి పార్లిపోయి ప్రవహిస్తున్నాయి నా కలల్లో మామిడి పళ్ళు అష్టమి చందమామల్లా వ్రేలాడుతున్నాయి దైనిక తుపానుల్లో నలిగిన నా ఆకుల గాయాల్ని కడిగి కట్లు కడుతున్నాయి నా నిశీథ స్వప్నాలు-

పూలల్లో నైతిక దండ్రయాత్రలు చేసే సోమరిగాలి వెదురుపొదల్లో చిక్కుకున్నప్పుడే రాగాలు తీసే విద్య నేర్చుకుంటుంది. జీవితపు తీగెలు స్పృశిస్తేనే గదా అది తత్వాలాలుకుతుంది

ఎన్ని వెన్నెల రాత్రులలో కలిసి చేసిన గాయాల్ని ఒక్క చందమామ మాన్పుతుందని నా నమ్మకం; అందుకే ఈ చెలరేగే గాలి వానల గాలికి గగనంలో నుంచి ఆ చందమామ ఎక్కడ ఎగిరిపోతుందో అని నా భయం

దినం తర్కిస్తుంది రాత్రి కలలు కంటుంది; ఒక్క రాత్రిలో వసంతం పోయి గ్రీష్మం వచ్చి కేశాలన్నీ ఎండలో మునిగిపోయాయి

వెన్నెట్లో తిరుగుతున్న మేఘనౌక చంద్రదీవికి తగిలి పగిలి పోయింది నా దుఃఖాల్నీ నా ప్రేమల్నీ అన్నిటినీ కవర్లో పెట్టి పోస్టులో వేసి వచ్చాను.

నేను ఒక పాట మీద సవారీ చేస్తూ మీ రాత్రుల తీగెల మీద నా స్వరాలు మీటుతుంటాను నేను మరణిస్తే నా కలల్ని మీ కన్నుల్లోకి అతికించు కుంటారు గదా అని-అది తైలంకాదు నా రక్తమే మీ దీపం ఇచ్చే కాంతి-దేని సహాయంతో మీ పుస్తకాల్లో అర్థాలు వికసిస్తాయో

నా పేజీ మీద ఒక సముద్రం పెడతా దాని మీద ఒక పడవ పెడతా దాని మీద ఒక తుఫాను ఊదుతా అది పద్యమై ఏ తీరాలకు కొట్టుకుపోతుందో చూస్తా... యుగీనశిలల్లో శిలువ వేయబడిన ప్రాణాల అస్థిపంజరాలున్న ఏ కాలపు తీరరేఖ తాకుతుందో అని చూస్తా

పేజీలను పుష్టికరమైన నా కలల ఆహారం వేసి పోషిస్తా, ఈ కఠోర కార్యాలకోసం వాటి కండలు పెంచుతా

నా తలపుల గుంపులు పిలపిల వాలుతున్నాయి కాగితాల కిటికీల్లో, పాతరాతి యుగపు శైశవ ప్రపంచానికి చెందిన బ్రహ్మాండమైన రూపాలను తమ చిన్న రెక్కల మీద మోసుకుంటూ వచ్చి-సాయం కాల ఆకాశం ఈ శిథిల ప్రపంచపు శరీరం మీద చింకి పేలికలా రాలింది సంధ్య పరుగెత్తే కాలువల ఒడిలో తల దాచుకుంది

ఒక సౌందర్యమూర్తి అద్దంలో మునిగి స్నానం చేస్తోంది ఏవో వాక్యాల రెక్కలు తన పెదవుల మీద తేనెటీగల్లా ఎగురుతూ ఉండగా....

వెనక నేను నా కవిత్వం మీటుతున్నా ఆ హృదయంలో దిగి స్నానం చేద్దామని- ప్రతి ఆత్మా ఒక రాగమే మనం వినాలే గానీ!

పక్షుల రెక్కల్నీ పద్యాల పాదాల్నీ వాద్యాల కళేబరాల్నీ గోర్వికా అవయవాల్నీ గోడలకి తగిలించి ఒక ఊహాయాన దుకాణం తెరుద్దామని ఉంది.

నేను నా నక్షత్రలోకాల్లో ఉన్న గృహానికి వెళ్ళిపోతా నా నివాసాన్ని ఆకాశానికి మారుద్దామనే ఇవాళ నా ప్రయత్నం

సాయంకాలం పూట కొంచెం పాట కొంచెం చీకటి కొంచెం మధువు కొంచెం నిరీక్ష కావాలి లేకపోతే అది ఒక ఆకు రాలిన క్షణం అవుతుంది.

ఒక పువ్వు వికసించిందని పిలుపువస్తే వెళ్ళి దర్శనం చేసుకున్నాను సూర్యోదయంలా ఉంది చేతులు జోడించాను నాకు తెలీకుండానే ఎవడో తన గొంతు కోకిలలకు జన్మస్థానమైన వాడు గొంతెత్తి పాడుతున్నాడు.

వాజాలో ఒక రెమ్మ నానుకుని విలాసంగా వెనక్కి వంగి నిలుచున్న గులాబీ పంచమ స్వరానికి గొంతెత్తడానికి ఆకాశం వైపు ముఖరేఖ యెత్తిన గీతికలా ఉంది ఆ తరుణంలో దాని ఒక్కో రెక్కకు వందేసి వ్యాఖ్యానాలు చెప్పవచ్చును-మనస్సు ఈ మెలిక సంతరించుకున్న వేళలో సంధ్యామహాత్తు సాక్షాత్కరిస్తుంది అప్పుడు తెలుస్తుంది జలపాతం నీటి అధఃపతనం కాదనీ కన్నీరు దుఃఖానికి సంకేతం కాదనీ-పశ్చిమాన పూచిన తార ఆకాశ నీలిమకు చెల్లెలనిపిస్తుంది.

ఆకాశపు నీలి చూపులకు నిలువలేని గాజా జీవిని : ఏ బహుముఖీన రంగుల దారుల్లోనో ఆత్మ పోగొట్టుకున్నాను సౌందర్యానుభూతి కండలోకి

గుచ్చిన కత్తిలా ఉంటుంది ఒక్కోసారి పెద్దకండే చీల్చివేసినట్లుంటుంది సుఖదుఃఖాల హద్దులు రద్దయిపోయిన ఆ అనుభూతిలో నాకు సౌందర్య భరిత బాధలతో చావు దగ్గరకు వస్తుంది.

నిజంగా ఆ సాయంకాలం మరో పువ్వు అస్తమించింది–

ఓ దీపమా నీవు రాత్రి రాకకూ దానితో పాటు వచ్చే నెచ్చెలి అనే తేనె వాకకూ నా జీవత్కాల పరిమళ శ్వాసకూ చిహ్నానివి అందుకే నా హృదయం నిన్ను ఆరాధిస్తుంది నీవు రాత్రి వైతాళికుడివి ప్రణయ రహస్యోపనిషత్ గాయకుడివి; నిన్ను సమాగమం కోసమే చేశాడు సృష్టికర్త

నీ మసక మసక నీడల్లో ఒక్క చిరునవ్వే ఒళ్ళంతా మత్తెక్కిస్తుంది కొన్ని కన్నుల్లో గారడీ మెరుస్తుంది నక్షత్రాల్లో నుంచి పాటలు రాలుతాయి. చేపల్లా చెరలాడే రెండు కన్నులు చన్నుల పై భాగాన అలంకరించుకున్న చిన్నది ప్రపంచ చక్రమంతా తిరిగే ఇరుసులా కనిపిస్తుంది లలీక్ గ్లాసులో లాస్యం చేస్తున్న ద్రాక్షారసమేనక తన తనూరేఖమీద చూపే ఒంపులూ సొంపులూ నా దేహంలో బందీగా ఉన్న రక్తం ఆతురతగా చూస్తుంది నక్షత్రాలన్నీ దిగివచ్చి నా చేతనలో నిశ్చల సరోవర జలాల మీద వాలి నిద్రిస్తాయి.

నేనూ ఆకాశంలో మెరిసే సప్తర్షుల దగ్గర సెలవు తీసుకుని ఆఖరి బొట్టుకూడా అదృశ్యమైపోయిన సీసాలోకి ద్రవమై ప్రవహించిపోతాను

ఒక్కో రాగం ఒక్కో ఋతువుకూ ఒక్కో సంధ్యకూ అతికినట్లుగా మరోరాగం అతకదు – హిందోళ షహనాయీకి అతికినట్లు శంకరా సితారుకు అతికినట్లు మరోవాటికి అతకవు

ఎవడి పెదవుల నుంచో ఒక సాయంకాలం షహనాయిాలు పిండుతోంది నా గుండె తీగెల్ని తన రాగం కోసం మేళవించుకుంటోంది

కొన్ని సాయంకాలాలు నీ బ్రతుకు బరువునంతా తెచ్చి ఒక్క-సారి నీ గుండె మీద మోపుతాయి అవి స్వరాల నిషాదమూ నరాల విషాదమూ కలిసిన ఒక అవ్యక్త మిశ్రమం అప్పుడు ఒక్కో లిప్త ఒక సంపూర్ణ జీవన రసలిప్త!

రాగము రంగు దిగులుబుగులు కున్న ఆ తరుణంలో అవన్నీ పరస్పర రూపాంతరీకరణీయ వస్తువులే అన్న బోధ ఒకటి కలుగుతుంది.

ఒక బరువైన క్షణం దాని రాగాన్నీ దాని రంగును దాని రేఖను దాని వేదనను అదే ఎన్నుకుంటుంది మనిషి అనహాయుడై ఆ క్షణపు నిరంకుశత్వానికి లొంగిపోతాడు అప్పుడు రెండు కళ్ళలో నుంచీ గంగా యమునలు కారుతాయి.

పదపోదాం జీవన తంత్రుల్ని సడలించి దాన్ని అవతల పెడదాం ఇవాళ ఒక ఆత్మ వెయ్యి బాలబాలికలుగా మారి విశాల శాద్వలాల అమలిన హాయిలో పరుగులెత్తేలా చేద్దాం అన్ని కవితలూ చదువుదాం. అన్ని కథలూ తిరిగేద్దాం మంచివీ చెడ్డవీ అన్నీ - సోమరితనపు తూలికా శయ్యలో కోమలంగా దొర్లిద్దాం అజంతా చిత్రరేఖల్లాంటి అవయవాల్ని - కాస్సేపు జీవితపు కోరల్లో నుంచి బయటికి వచ్చి మరచిపోయిన ఊపిర్ని మళ్ళీ పిలుద్దాం కాస్సేపు జీవితంలో నుంచి నిజాల్ని ఖాళీ చేద్దాం శరణార్థుల్లా వర్తమానం నుంచి పారిపోదాం.

# మూడో సర్గ

నేను అంతరాత్మ ముందు పద్మాసనం వేసుకుని కూర్చుని అడుస్తున్న నిశ్శబ్దాల గంధపు చెక్కలు ఆ హోమజ్వాలల్లో విసిరేస్తున్నా

నేను దేని మీద నా సచేతన శిల్పం చెక్కుతున్నానో ఆ శబ్దం నన్ను మృత్యువు నుంచి రక్షించుకోడానికి నేను లేపుతున్న అభ్రంకషదుర్గం నన్ను అది నా దేశకాల నిరవధికత్వంలోకి విసిరేస్తుంది ఫారోనా నిర్మించిన పిరమిడ్ వాడు వ్యర్థంగా మృత్యువుతో చేసుకున్న రాజీ

ఒకటి దురహంకారానికి స్మారక చిహ్నం రెండోది మానవతా జ్యోతికి తైలస్నానం ఒకటి పీడిత బానిసలు కట్టిన శిల మరొకటి మనిషి ఆత్మ నిర్మించిన కళ

నేను పుస్తకాలతో మనిషి పశుత్వానికి ఆనకట్టలు కడతాను వాడు పశుత్వంతో మనిషికే ఆనకట్టలు కడతాడు

సముద్రాలు సముద్రాలే ఇంకిపోయే జీవన గ్రీష్మంతో భూమి మీద ఫారోలు ఇంకిపోతారు కానీ గడ్డిపోచ నీడలో నివసించే ఒక కనిష్ఠజీవి హిమ బిందువు బ్రతికే ఉంటుంది తన అజరామర చైతన్య కాంతులు విరజిమ్ముతూ

వాడికి తెలీదు అది కొండల మీద హృదయాన్ని జెండాలా పాతిన తపస్వి—

నా చిక్కటి పొగడచెట్టు కొమ్మల్లో చేరి ఆ సాయంత్రం ఒక పక్షి గొంతులో నుంచి పాటలు పితుకుతోంది.

కిటికీలో సంధ్యా రెండు పక్షులూ కలిసి ఒక తైలవర్ణ చిత్రం కనిపించింది అవి రెండు బిందువులై చివరకు కాషాయగగనం మిగిలింది కిటికీలో వ్రేలాడుతూ

చీకటి చిక్కబడే కొద్దీ ఒక వేళ వస్తుంది అన్నీ ఏకమై, మన ఉనికిలో ఉన్న అడ్డుగీతలన్నీ లేచి నిల్చుని నిలువుగీతలవుతాయి నీలోకంలో మరోలోకం మరోలోకంలో ఇంకోలోకం ఇలా కుక్షిలో కోట్లాది బ్రహ్మాండాలు పెరుగుతూ పోతాయి అంతరిక్షసీమల్లో టాలెమీ గోళాల్లా

గదిలో, టేబిళ్ళమీది బొమ్మల్లో, జింకలెక్కి పరుగులెత్తుతున్న చైనా మునులు జింకలు దిగివస్తారు క్రిస్పానీ చిత్రాల్లో వెన్నీస్ భవనాల నితంబాలు చుంబిస్తూ పోయే కాలువ-కాలువ మీద తేలుతూ పోయే పడవ-పడవలో కదులుతున్న మనుషులు-వాళ్ళని పిలుద్దామని తటాల్న నా గొంతు లేవబోయింది రీఖ్, కరేల్ వెల్ట్, రావల్ చౌదాల చేతుల్లో వికసించిన చిత్రరేఖలు చిత్రాల్లోంచి దూకివస్తాయి గొంతులో లిల్లీల కాడలు దింపుకుని లాలిమలు వెల్లివిరిసే మొరానోవాజా నిశ్చల అవయవాల్లో కోమల కదలికలు అంకురిస్తాయి

ఒక చైత్రమాసపు చివరిపువ్వు రాలిపోతూ నన్ను కోరిన చివర్రికోరిక "నాకోసం ఒక్కసారైనా ఏడుస్తావుగదూ" అన్నది గుండెలో కసుక్కున గుచ్చుకుంటుంది గాలి పరిమళాలు పూసుకుని పాడుతూ వస్తుందిగానీ ప్రేమ అనే పువ్వులో విషాదమే మకరందం అని తోస్తుంది

ఈ పుస్తకాలూ ఈ చొక్కాలూ ఈ పానీ తాగే గ్లాసూ ఈ పార్కరు పెన్నూ అన్నీ ఆటవస్తువులు విడిచిపెట్టి అవతలి లోకాల ఇసుక తీరాలకు వెళ్ళిపోదామనిపిస్తుంది - నా కప్పు నిండ పార్లిపోయే ఘడియ వచ్చింది.

నా గొంతు కేకవేసింది దాన్ని ఆకాశం మింగివేసిందో లేక అది ఒక పక్షయ్ ఎగిరిపోయిందో-నా ఊహామాత్రం నావలా తిరుగుతోంది పూలదీవుల్లో ఆకాశఖండాల్లో నక్షత్ర గుచ్ఛాల్లో దాన్ని అన్వేషిస్తూ....

నాకు ఆ అన్వేషణే చాలు-

ఆకాశం ఒక శూన్యపు బీడు కాదు అది పక్షులనే రెక్కల గాయకుల గూడు, గాలి నిరంతరం మబ్బుల శిల్పాలు చెక్కే మాయానగరం-

ఈ కఠిన జీవన ఖైదీకి ఆ ఇనప ఊచలకావల ఎగురుతున్న ఆ చిన్న ఆకాశపు చింకిపేలికే చాలు - ఆ చెట్ల గుంపుల్లోనుంచి నావైపే తొంగిచూస్తున్న ఆ చారెడు సాయంకాలమే చాలు -

ఆ జీడిమామిడి తోపులో ముత్యాలకుప్పల్లాంటి ఇసుకదిబ్బల వెనుక నిక్కినిక్కి నీలికళ్ళతో చూస్తున్న ఆ సముద్రపు ముక్కే చాలు -

గుండెలో ఎక్కడో ఒక మూల గుసగుసలాడుతున్న ఆ నలుసంత కోరికే చాలు-

అన్ని అందాలకూలాంగే దేశద్రిమ్మరిని నన్ను అన్ని అందాలూ వలవేసి పట్టుకోజూస్తాయి ఎప్పుడూ ఏ తోటలోకీ ఒంటరిగా పరుగెత్తను ఏ వసంతం పట్టుకుంటుందో అన్న భయంతో - నేను పుస్తకాల్లో గుడ్లుపెడతాను పుస్తకాల్లో గుడ్లు పొదుగుతాను నేను అరుణోదయం ముందు కూసే కోడిని

ఏకాంతం కోసం ఎక్కడికీ పరుగెత్తకుపోను వస్తువుల్లోనే ఉంటూ వాటి సారాంశం అన్వేషిస్తూ నా ఏకాంతం నేను సాధించుకుంటూ, చంద్రుడు నా చేతిలో ఉన్నంతకాలం మాసాలెక్కడికి పోతాయి

మనిషి జీవన శిఖరాలు అందుకోవాలని పరుగిడుతుంటే మృత్యువు మనిషిజుట్టు పట్టుకోవాలని పరుగిడుతోంది ఈ సమస్య ఏదయితే ఉందో అదే కన్నీటికి జన్మస్థానం

బంగారపు గడియారంలో ఉన్నా కాలం నిన్ను రైలువైపే తరుముతుంది మృత్యువు ఆకులై రాలుతూ ఉంటుంది హేమంత వృక్షాల్లో – ఈ హేమంతంలో రాలిన మొదటి ఆకు వచ్చే ఆకుల వర్షాలకు నాంది అని తెలుసుకో

నా కాళ్ళకు ప్రయాణదాహం పట్టుకుంది ఎన్ని ఊళ్ళు తిరిగినా తీరడంలేదు గాలినీ ధూళినీ మేఘాల్నీ ఆకుల్నీ అన్నిటినీ రైలుచేసుకుని అనంతంలోకి ప్రయాణంచేస్తుంటే మృత్యువు రైలాపి నన్ను పట్టుకుందామని ప్రయత్నిస్తోంది కానీ అవేవీ ఆగేవికావు నిరంతరం దృశ్యా దృశ్య అవస్థల దాగుడుమూతలగుండా ప్రవహిస్తూ ఉండేవే అవి

నా రైలు ప్రయాణానికి ఆదీలేదు అంతమూ లేదు అంతకంటే గమ్యమూ లేదు ఈ వేటలో మృత్యువే మృత్యువుకు దొరుకుతుంది

నా పుస్తకం నీ చేతిలో ఉందంటే నేను నీ చేతిలో ఉన్నట్లే గదా–

దూరాన గేటు దగ్గర ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తున్నా నిర్లిప్తంగా– మనస్సు నాకు తెలీకుండానే లోలోపలే ఒక మహావృక్షంలా పెరిగిపోయింది ఏ ఏ దిగంతాల్లోకి వ్యాపించిందో ఎలా చెప్పను

నేను ఒకనాడు నా కొమ్మలోంచి రాలిపోతాను ఆ పిల్లలు నా కొమ్మల్ని ఆక్రమిస్తారు వాళ్ళ పూలు వాళ్ళు పూయించుకుంటారు వాళ్ళ పళ్ళు వాళ్ళు కాయించుకుంటారు వాళ్ళ తేనె వాళ్ళు అనుభవించి వాళ్ళూ రాలిపోతారు చెట్టు మాత్రం జెండాలా ఎగురుతూనే ఉంటుంది

ఒక ప్రవాహ ప్రతీకలా

పిల్లలూ పెద్దలూ వాళ్ళ కుటుంబాలూ వీథుల్లోకి వస్తుంటారు ఇళ్ళల్లోకి పోతుంటారు అంతా ఇంతే ఎండల్లోకి నీడల్లోకి వస్తూపోతూ ఉండడమే–నేలమీద పడ్డ మబ్బుల నీడల్లా రోడ్లుకనే కలల్లా, అలా సంచరిస్తూనే ఉంటారు.

అందరమూ ఏ చెట్టుకో పుట్టిన ఆకులం ఏ శాఖకో పూచిన పువ్వులం అందరమూ అన్నీ విడిచిపోతాము మరికొన్నిటికి తావిస్తాము కానీ జీవిస్తాము

విశ్వశూన్యంలో పరుగెత్తే ఈ బ్రహ్మాండమైన చక్రాన్ని ఎవడాపగలడు మనుష్యయుగాలకి కిర్రెక్కిస్తుంది చరిత్రని రస్తాలమీద ధూళిలా ఎగరగొడుతుంది ఏ బాహువు అడ్డుకోగలదు దాని దుర్వార పరాక్రమాన్ని!

ఒరే సిద్ధాంతీ నీ పంచాంగం కట్టిపెట్టు ఒరే రాజకీయప్రభూ నీ లౌడ్ స్పీకర్ పీకేసుకో–పాతచెట్టుకూడా కొత్తపూలు పూస్తుంది

మధ్యాహ్నపు ఒడ్డున కూర్చుని నేనూ సీతాకోకచిలుకా ఒకే పువ్వు పరిమళం తాగుతున్నాము సూర్యుడు సిల్వర్ ఓక్ శాఖల దాకా పోయాడు మనుషుల అడుగుల్లేని దారులకోసం వెతికే మనస్సుకి మంచిచోటే దొరికింది, ఒక్కసారి నాలోకి నేను పరుగెత్తుకుపోయాను

ఎంత కొద్దిమందిమే మిగిలిపోయాము ఈ అస్తమించే శతాబ్దపు చివరి కిరణాల్లా అరే ఎంత సాధించాం ఎంత ఏకాకిగా నిలిచిపోయాం మన కష్టసుఖాలే చెప్పదలచుకుంటే ఎంతకాగితం ఎంత సిరా వ్యర్థమవుతుంది! వచ్చే శతాబ్దం ఊరుకోదు మనల్ని చరిత్రముందు [illegible] తనహక్కు తాను [illegible]

ఓహో-జీవితం ఈ బ్రహ్మాండ చక్రానికి కట్టి ఈడ్చుకుని పోబడుతుంటే మనమెంత నిస్సహాయ జీవులమో బోధపడుతుంది

జీవన తరంగాలు వస్తూపోతూ నా ఒంటరితనాన్ని ఎంత లోతు చేస్తున్నాయి! వసంత ఋతువులు వచ్చివచ్చి కోకిలలు పాడిపాడి నాజుట్టు తెల్లబరుస్తున్నాయి అమూర్తస్థితినుంచి వచ్చిన నన్ను మళ్ళీ అమూర్తస్థితికి చేరుస్తున్నాయి

నదిలోకి జారిపోతున్న ఆ సూర్యుడు గుండ్రంగా ఉన్నాడు సూర్యబింబం ముక్కలై నదిలో కొట్టుకుపోతోంది చెట్లనీడలు కొండల నీడలు కూడా నీటిలో కంపిస్తున్నాయి నదీ ప్రవాహానికి లోకం కంపించే ముక్కలే, లోకం తానొక స్థిర మహత్తు ననుకో వచ్చుగాక

కానీ రోజూ ఆకాశం సూర్యుడనే ఎర్రటిగుడ్డు పెడుతూనే ఉంటుంది కోడిపుంజు సూర్యుడి దైనిక కార్యక్రమం రోజూ ప్రకటిస్తూనే ఉంటుంది-

పడమట ఒక సాయంకాలం ఒక తార ఒక వెలిసిన బంగారు కాంతుల వాన ఒక విరిసిన రోజాలాంటి మేజా దానిమీద ఒక విలాస రేఖ లాంటి స్కాచ్ సీసా అందులో ఒక బంధిపంపబడిన తరళ ద్రవ రాక్షసుడు వాడిముందు నేను

చిలక పచ్చ రోజెంథాల్ గ్లాసులోకి గలగల దొర్లిన సిల్కు ద్రవంలో సంధ్యను హిందోళను మిళితం చేసుకుని చప్పరించే దేశ ద్రిమ్మరి మరెవ్వడు! ఒక దేశపు కొయ్యకు కట్టుబడనివాడు ఒక్క తీగె పండుకు జిహ్వను అంకితం చెయ్యనివాడు ఒక నది నీటికి బానిసై పోనివాడు సముద్రాన్ని ద్రవీభవించిన భూమిగా భూమిని ఘనీభవించిన సముద్రంగా భావించేవాడూ పసిఫిక్ జలరాశిని ప్రపంచ శిశువుల

కన్నీటిబొట్టుగా చూచేవాడు భూదృశ్యాలు జలదృశ్యాలు మానవదృశ్యాలు భారీ ఎత్తున పోగు చేసుకునే రాక్షస దిదృక్ష గలవాడూ మరెవ్వడు! వేలు తగిలి రోజెంథాల్ చేసే సంగీత ప్రకంపనాల మర్మాలెరిగినవాడెవ్వడు! గోపురాల మీద శిఖరాలమీద నగరాల మీద రెక్కల మీద సంచరిస్తూ ఉండే ఆ గంధర్వుడెవడు! కృత్తికానక్షత్ర గుచ్ఛాన్ని మ్రోల కులుకుతున్న ద్రవంలో ముంచుకుని మునిపంటితో కొరికి ఒక్కొక్క నక్షత్రం చప్పరిస్తూ ఆస్వాదించే ఊహాలోక ప్రభువు-

తుఫానులు నగరాలమీద రాసే కవిత్వం చదివితే తెలుస్తుంది తుఫానుకు కవికున్న శక్తి ఉందనీ కవికి తుఫానుకున్న శక్తి ఉన్నదనీ-ఒక సెలయేటిలో ఎవడో కవి పడి కరిగిపోయినట్లున్నాడు ఆ నీళ్ళు ఎప్పుడూ కవితలు పాడుతూనే ఉంటాయి;

నా ఇల్లు గవర్నమెంటు తన స్వభావం చొప్పున లాగేసుకుంది కానీ సూర్యచంద్రుల్ని ఇప్పుడు ఇంకా బాగా దర్శనం చేసుకుంటున్నాను జీవితం నన్ను రాతిని చేసింది కానీ నేను రాళ్ళ సామ్రాజ్యానికి చక్రవర్తినయ్యాను అజరామర పుష్పాల్లో అవతరించాను, చేతిలో కమలాలు క్రిందపడేసి ఆ చేత్తో గుండె పుచ్చుకున్నాను నేను నా శరీరంలోనే పడుకుని నిద్రపోతాను

కాలం ఒక నిట్టూర్పులో కట్టింది నా దేవాలయం-కాని కలలో ఒక సర్రియలిస్టు ఋషి దర్శనమిచ్చి దీవించాడు, తెల్లవారేసరికి నా పిచ్చివాగుడికి కవిత్వమనే పేరు వచ్చింది-

విశిరేసెను తూరుపు ఒక శుక్రతారను
పోదాంపద అడవుల్లో పువ్వులేరను

ఏకాంతంలోన మనం కౌగలింతము
చెట్ల పంతలో నాకు సిగ్గు వేయును

ఒంగి ఒంగి నీ ముద్దులు దొంగిలింతును
శాఖల్లో పూలు చూచి వెక్కిరించును

నా పాటలు నీ కాళ్ళకు తగిలే సెలయేళ్ళు
చిరు ఉపమలు అందులో చేపలు తాబేళ్ళు

ఉదయించే కిరణాలకు ఎదురుపోదము
మన తోటల గులాబీల మాల వేతము

ప్రేమ అనే రంగుల్లో మునిగిపోదము
మనుషులనే పండుగలో కలిశిపోదము

ఇది వింశతితమ శతాబ్ద
షట్సప్తతి తమ సంవత్సరాన జనవరి
మాసాన (1976)
విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్యప్రణీత నీరై పారిపోయింది
నామాంతర సమేత
ప్రవాహపర్వము సర్వము
సమాప్తము

# ఆద్మి పర్వము

## ఒకటో సర్గ

సూర్యుడ్నుంచి సూర్యుడికి
ఇరవైనాలుగుగంటల దూరం
మనిషి నుంచి మనిషికి
రెండు గుండెలే దూరం
ఆకాశం ప్రభాత వాయువుల చేతులో
ఊదా రంగు ముడతలు విప్పి
తనని జెండాలా ఎగరేస్తోంది—
అడుగు!
గ్రామం నుంచి సంగ్రామానికి
ఎన్ని తుపాకుల దూరం :

శబ్దాల గాలివాన పిస్తోంది
ఈ దేశపు శరీరం మీద
లారీలు లౌడ్‌స్పీకర్లు ప్రెస్సులు బస్సులు
జెండాలెగరేస్తున్న జనాలు!
అరుస్తున్న ఆద్మి
ఈ శతాబ్ది గోపురం—
గ్రీష్మరుతువులు కక్కుతున్న ఆకాశం

కొమ్మల్లో గోలచేస్తున్న కాకి
వీధుల్లో అరుస్తున్న కుక్క!
రేషన్ కోసం యుద్ధం చేస్తున్న స్త్రీ
ఈ దేశపు చిత్రపటం—

ఎర్రగా పొడుస్తున్న సూర్యుడు
ఏడుస్తున్న చంటివాడు
గోడలమీద రాస్తున్న కుర్రవాడు!
ఉరికంబాన ఊగుతున్న వీరుడు
ఈ కాలపు పెండ్యులం—

మానవుణ్ని కుమ్మరిస్తున్న లారీ
మైదానాల్లో మొఱుగుతున్న మైక్రోఫోన్
చెవులమీద దాడి చేస్తున్న తుఫాన్!
రాజకీయ కేక
ఈ తరానికి ప్రతీక—

నా నౌకరిపోయిందని నా ఆకలి
మానేస్తుందా
నాకు రాబోయే స్వర్గం నీకిస్తాను
నాకు నీ ఇల్లు ఇస్తావా
అది ఒక చిన్న చీమ కావచ్చు
కానీ అది
ఎవరెస్టు కంటె ఎత్తయిన శిఖరం
సృష్టి అంతా ఇలాగే
కనిపించని తిరుగుబాట్లు :

ఆకాశం విశిరే పిడుగులకు
అడ్డం లేదు
నా వాక్యాలకు కాపలా లేదు
అరే అవి జూ నుంచి తప్పించుకున్న
సింహాలు
మనుషుల మీదికి దూకే
భయంకర ఓనమాలు

ధనికుల పొలాల్లోకే ప్రవహిస్తున్నాయి
దేశంలో నదులన్నీ కలిశి
స్వప్నాల బాధలేని నిద్రపోతున్నారు
ప్రజలంతా కలిశి
కవులు పాడుతున్నారు ఉపమానాల్ని
ఉత్ప్రేక్షల్ని పీడించి
వీథులు ఏడుస్తున్నాయి గగనంవైపు
చేతులు జోడించి

అరే దేశం మీకేమిచ్చింది
వంకరటింకరగా వంగే దేహం
బానిసత్వం మీద వ్యామోహం
మీరెగరేశే జెండా ఏమి తెచ్చింది
ఐదేళ్ళ కొకసారి ఓట్లు
ఆ మధ్యలో కునికి పాట్లు

బాబూ ఇక్కడ జీవితం బలి యిచ్చింది
ఆడపిల్లల్ని కని మగవాళ్ళ క్రౌర్యానికి
మగపిల్లల్ని కని ప్రభుత్వాల క్రౌర్యానికి

అరే ఆ కోడికూత విను
ఉషస్సు తూర్పున బ్రద్దలు కొడుతున్న
శబ్దం అది

వాడు ఒక్కొక్క జీవితపు పేలిక కోసం
వాడికి ఉన్న రెండు చేతుల్తో యుద్ధం చేశాడు
శాంతి రేవులు చేరే కోర్కెతో సముద్రాలు ఈదాడు
ఆశల ఒడ్డ కోసం
తెడ్లు లేని నావల్లో ప్రయాణించాడు
అరే ఎప్పుడు తెలుసుకుంటావు
ఇది భూగోళం!
మానవుడి ఆస్తి

ఇల్లులేని వాడు ఆకాశ క్రౌర్యానికి గురి
భూమి లేనివాడు ఆకలి కోరలకు బలి
మరణించే లోపుగా తన మాట చెప్పలేని
విన్నపోయ మానవుడి గొంతు పేరే కవి

చంపి కొండల్లో పారేశిన వాడి శరీరం
రాగం కోసం బిగించిన ఫిడేలులా
పడి ఉంది
వాడినోరు పాడిన పాటలు
ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి
చావులేని వాడ్ని చంపిన మూర్ఖులకు
తెలీదు
ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా
ఇచ్చిందో అది
వాడి నిర్మాణంలో ఉందని

మరణించిన నదులు మాట్లాడుతాయి
మూసీలా
మీసాల్తోస్తే గాలి తుఫానుగా
మారుతుంది
అతనితోపాటు అతని స్వప్నాలుకూడా
కాలుతున్న పరిమళం
అతడు ఒక శతాబ్దం మీద
నుల్చున్న వీరుడు—

అదృష్టాన్ని వాగ్దానం చేసే
దిండ్లలాంటి స్వప్నాలమీద
తలమోపి నిద్రిస్తున్న ఓ మానవుడా!
మేలుకో! ఎగరెయ్
నీ కోరిక ఒక ఉగ్ర జెండాగా
లోకమంతా లావా ద్రవాల ఉప్పెనలో
మునిగిపొయ్యేలా

అడవిలో నాకోసం మరణించిన
ఆ వీరుడికి
ఎవడు కట్టగలడు ఎత్తయిన సమాధి
నా గుండె వాడి మీద లేచిన గోపురం
నా అశ్రువులే వాడి మీద రాలుతున్న పూలు—

నీవు
బయట శాఖల్లో ఉన్న పక్షుల్ని చంపి
మా ఉదయాల్ని
గాన రహితం చెయ్యగలవేమోగాని
మా ఊహల్లో గూళ్ళు కట్టుకున్న
పక్షుల్నీ వాటి పాటల్నీ
ఎలా ధ్వంసం చెయ్య గలవు

తెలిశో తెలీకో మా ప్రజలు

చేసే యుద్ధాలు ధాన్యం కోసమే
వాళ్ళంతా ఇతిహాసం వైపు ప్రయాణం చేస్తున్నారు
వాళ్ళ మార్గంలో సముద్రాలు కూడా అడ్డురాలేవు
వాళ్ళ అడుగుల్లో వసంతాలు మొలుస్తాయి
వాళ్ళ పిడికిళ్ళలో సూర్యోదయాలు పుడతాయి
ఓ దేశమా నీవు నాకు తెలీకున్నా
నీ రక్తం
నా దేహంలో ప్రవహిస్తోంది

జీవితాల్లో ఖైదీలైన మీరు
కటకటాల్లో కార్చకండి కన్నీరు
ఆకాశపు నిట్టూర్పుల్ని పరిచయం చేస్తాను
ఆక్రోశిస్తున్న సముద్రాల్ని చూపిస్తాను
మీ కిటికీల సందుల్లో మీ శ్వాసల రాకపోకల్లో
గాలినై పూల ఊపిరినై కిరణాన్నయ్ వస్తాను
ఆచ్ఛాదన లేని అసంఖ్యాక జనులమీదికి వస్తాను
అడవుల మీదుగా ఆకాశాల మీదుగా వస్తాను
నేను శబ్దాన్ని
కటకటాల్లో కన్నీరు కార్చకండి

రైతులాంటి నదికి పొలాలతోనే పని
నాలాంటి కాగితానికి కలాలతోనే పని
చంద్రబింబం తుఫానుగా మారిన రాత్రి
నా కన్నులకు రంగురంగుల కలల్తోనే పని

నదులు కవులు భూగోళపు రక్తనాళాలు
నదులు ప్రవహిస్తున్నాయి కవితల్లా
పక్షుల కోసం పశువుల కోసం
మనుష్యుల కోసం
నదులు కంటున్న కలలు పొలాల్లో
ఫలిస్తాయి
కవులు కంటున్న కలలు మనుష్యుల్లో
ఫలిస్తాయి

ఒక అందమైన పోయెం అంటే
దానికి ఒక గుండె ఉండాలి
అది కన్నీళ్ళు కార్చాలి
క్రోధాగ్నులు పుక్కిలించాలి
పీడితుల పక్షం అవలంబించాలి
మనిషి రుణం తీర్చుకోవాలి
కాలపు బరువుల్ని మోయాలి
బ్రతకడానికి పద్యం ఒక
కోట బురుజు కావాలి
పద్యం మనిషి విజయానికి
ఒక జెండా అయ్ ఎగరాలి

నీ పాటలో ప్రజలు వాళ్ళ గొంతులు
ఏరుకుంటారు
నీ పాట బజారుల్లో పొలాల్లో

పడవ రేవుల్లో సాహస బీజాలు
చల్లుతుంది
నీ పాట కార్మికులు కర్షకులు పాడుతారు
సైనికులు నావికులు పాడుతారు
చెట్లు పూచేలా పాడుతారు
పక్షులు నేర్చుకునేలా పాడుతారు
పర్వతాలు గర్విష్ఠి శిఖరాలు ఊపేలా
పాడుతారు—

నీకు జ్ఞానం కంటే ప్రేమతో
పని ఉంది—నీవు కవివి
సుత్తులతో కొడవళ్ళతో
జీవితం శిల్పించే వాళ్ళని
నిద్రలేపుతావు
విప్లవానికి నీవు శుక్రతారవు

ఈ నిశ్శబ్దం శాంతి అనుకోకు
నా గీతి నిశ్శబ్దాల కుట్ర
అశ్రువుల తిరుగుబాటు
అవమానితుల భాషాసమితి
ఒకనాడు నా ఛాతీలో ఉన్న
కోళ్ళన్నీ అరుస్తాయి
విప్లవాలన్నీ ఉదయిస్తాయి

అది ప్రపంచమంతా వ్యాపించి
పోయింది
నేను రాశింది ఇప్పుడు ఎలా
తుడిచేస్తావు
నా పోయెం ఒక శిల్లీనీడ
ఒక నదీ స్మృతి
ఒక ఆందోళనలో ,పోయిన దినం
అవమానము ఆ ప్రేవులు క్రోధము
గాయాలు తుఫాను అనే పంచభూతాలతో
చేశిన దివ్య శిశువు!
నా పద్యంలో నుంచి మధువులో తడిశిన
సంధ్యలు రాలవు
బాల్కనీల్లోకి చూచే చంద్రబింబాలు
ఉదయించవు
అది తిరుగులేని ఒక ఆయుధం –

మనిషి కన్నీరు తుడవడం నీ వంతు
శరీరం పోయినా నిలిచేది నీ గొంతు
నీ ఛాతీ బందూకుల కార్ఖానా
నీ కవిత్వం గాయాలకు దవాఖానా
నీ మెడలో వ్రేలాడేది గాయాల దండ
నీవు మా యుద్ధాలకు నైతిక ఝుండా

కోకిల పుస్తకాల నుంచి పారిపోయి
కొమ్మ ఎక్కిన గాన సమ్రాట్టు
చంద్రుడు ప్రణయాగ్నుల్లో కాల్చిన
పెసరట్టు

దినం మనిషికోసం విశిరిన గాలం
జీవితం గుండెతో ముంచి పోసుకున్న కాలం

ఏమని రాశేన్
నిన్ను గురించి ఓ శేషేన్ –
నీకు నిద్ర అంటే
రాత్రి శయ్యలో చేసే సాహసయాత్ర
నీకు కవిత అంటే
క్రూర జీవన రాస్తాల్లో ప్రవేశించే పాత్ర
నీ రాత్రులు
అక్షరాల్లో పోశే ఘోష
ప్రజానీకాల అభివ్యక్తి హీనభాష
ఈ దేశపు మృత్తికలో చల్లావు
నీ హృదయాన్ని
నీ రక్త నాళాలు
తడుపుతున్నాయి కాగితాల తీరాల్ని
ఈ దేశం నీ కిచ్చిన గాయం
నీకు మాత్రం
తృణ ప్రాయం

ఇది దేశమా లేక కంఠపాశమా
అరే
ఈ మట్టికోసం బలిఅయిపోయిన
ఆత్మల సమాధుల మీద
గడ్డికూడా మొలవదు ఇక్కడ–
రాజకీయ నాయకుడు ఇరుసుగా

తిరుగుతోంది పత్రికల భూగోళం
భూగోళం మీద కడుపుతో
ప్రాకుతోంది చీమల్లాంటి కవీంద్రజాలం
కనకనే నీవు కవుల్ని చూస్తున్నావు శేషేన్ :
గడ్డిపరకల్ని చూచినట్లు తుఫాన్

నీ కాళ్ళుచేతులు భూమిలోకి వెళ్ళే ముందే
నీ పాటను గాలుల్లోకి విడుదల చెయ్
నీవు పండితులకు గడ్డాలిచ్చావ్
దేవతలకు రెక్కలు ఇచ్చావ్
నీ కాగిటాల్లో తుఫానులు పుడతాయ్
ప్రభుత్వాలన్నీ రేపు
నీ కవిత్వపు వరదల్లో కొట్టుకు పోతాయ్

ఆకాశం కనిపించడం మానేశింది
ద్రవ్యరాక్షసి కడుతున్న బహు అంతస్తుల
భవనాలు చూచి
ఉదయాన్ని ప్రకటించడమే మరచిపోయింది
కోడి గొంతెత్తి కూశి
అర్ధరాత్రి కుక్క అరవడం విరమించుకుంది
తన పాత్ర వ్యర్థమై పోయిందని
దొంగలక్కూడా అర్థమైపోయింది
రాత్రికంటే పగలే మంచిదని

దేశంలో నాల్గు చెట్లు పది పక్షులు కూడా లేవు
వసంతం వస్తే స్వాగతం చెప్పడానికి
మళ్ళీ వచ్చిన కోకిలకు మామిడి కొమ్మ కనిపించలేదు
విద్వాంసుడులా కూర్చుని గొంతువిప్పడానికి
కొత్తతరం కొడుకులకు కోకిలేమిటో తెలీదు
జీవితంలో ఉగాది గుర్తించడానికి
గ్రామాలు గ్రామాలే ఏడుస్తున్నాయి
మనకు వినిపించడం లేదు
క్షామం ఏమిటో తెలుసుకోడానికి

ఎవడో ఇరవయ్యో శతాబ్దపు
భక్తుడు గుడిగంట మ్రోగించాడు
దూరాన నాకు వినిపించింది
ఆ ముసలి దేవాలయం దగ్గుతోంది
రాళ్ళు ఊడిపోయాయి అక్కడక్కడా
దంతాల్లా
మనిషి కష్టాలు తీర్చే శక్తి ఎవరో
మనిషి ఇంకా వెతుకుతూనే ఉన్నాడు
అక్కడే !

బట్టలుతికే మానవుడు
మానవుల స్వప్నాల్ని కూడా
  ఉతుకుతున్నాడు
స్వప్నాలు జలాల్లో కలుస్తాయి
రేవులు గ్రామాల్ని పిలుస్తాయి

ఎవడు ఏడవగలడు
మరొకడికోసం!
అంతశక్తి ఎవడి కుంది
నీ కోసం ఏడ్చేవాడికి
నీవు ఋణగ్రస్తుడివి
మార్క్సుకు ఈ శతాబ్దపు
అన్నార్తులందరూ
ఋణగ్రస్తులు

ఈ పురాతన ధూళిలో
బ్రతుకుతున్న వాడికి
ఒక ఇల్లు కావాలని చెప్పడానికి
మార్క్సు కావాలా
నీకిది ఇన్నాళ్ళు తోచకపోతే
నీ కంటే నేరస్థుడు లేడు

కూలీ విలువ తెలీని దేశంలో
కమ్యూనిజం ఒక కొయ్యతుపాకి
అక్షరమూ అన్నమూ త్రాసులో
తూచే రోజుల్లో
కవిత్వం వసంతంలో నోరువిప్పిన
ఒక కాకి

నా బాహువు పడుకుంటే
పొలాలు కార్ఖానాలు నిద్రిస్తాయి
నా బాహువు లేస్తే
సుత్తులు కొడవళ్ళు పట్టుకున్న చేతులు
ప్రభుత్వాల మీదికి ప్రవహిస్తాయి
ఫిరంగులు బందూకులు చేశే శ్రామికుల్లో
వర్గచేతన కేతనమై ఎగురుతుంది
అసలు నేను పొడుగ్గా నిలుచుంటే
ప్రజలు సూర్యుడ్ని చూడలేరు

నది ప్రజల్ని విడిచి పోలేదు
భాష దేశాన్ని దాటి పోలేదు
నేను ఈ నేలను విడిచి పారిపోలేను
ఈ మట్టి కలలు కంటుంది
దూరదూరాల మనుషుల్ని గురించి
పక్షుల్ని గురించి
అడవుల్ని గురించి
కలలు కంటుంది కన్నీళ్ళు
కారుస్తుంది
ఇవాళ నా ఊహల మహళ్ళలో
దేశ దేశాల జనులు
సుత్తులూ కొడవళ్ళు ధరించి
ఊరేగింపులు చేసుకుంటున్నారు
పదండి మనమంతా కలుద్దాం
ఆ కొడవళ్ళ ఊరేగింపులో

ఒకడు
వీరమరణం పొందాలంటే
ఈ దేశంలో ఎన్నో కారణాలున్నాయ్
వెతక నక్కరలేదు
జీవన సంగ్రామం నుంచి పారిపోవాలంటే
ఇవేవీ అక్కరలేదు

ఎర్రటి సూర్యాస్తమానాలు
పాతకాలాన్ని క్రమంగా దహిస్తున్నాయి
నా ఖడ్గం
నా శత్రువుల గుండెల్లోకి అస్తమించింది
కొడవలి ప్రథమచంద్రరేఖలా
ఈ శతాబ్దం మీద ఉదయించింది

ఒక దేశపు సంపద ఖనిజాలు కాదు
నదులు కాదు అరణ్యాలు కాదు
కలల ఖనిజాలతో చేసిన
ఆ యువకుడు
మన దేశ భవిష్యత్తుకు
నావికుడు

తమ్ముడు అడవిలోకి వెళ్ళి
మళ్ళీ రాకపోతె

తడి కన్నులతో నిరీక్షించకు
ఈ దేశమంతా వాడి విశ్వరూపమే
మరచిపోకు—మరణించిన వీరుడు
ఈ ధరిత్రికి ఒక కొత్త నక్షత్రం

భూగోళం మీద నుల్చొని ఉన్న
ఆ యువకుడు
ఒక అద్భుత ఋజురేఖ
ఒక మానవ మహాస్తంభం
అతడొ[illegible]దుస్తున్న దేవదారు
అతడి [illegible]ముక కుతుబ్ మీనారు
ఋజురేఖను వక్రరేఖ చేస్తున్న
మన రాజకీయనేత
ఈ దేశానికి ఒక భయంకర
యమదూత

బస్సుల మీద రాళ్ళు వేస్తూ
గోడల మీద రాస్తూ
అరుస్తున్న కుర్రవాడు
మన కష్టాల అడవుల్ని కోయడానికి
పుట్టిన రంపం
ఉషస్సు దినోదయానికి ముందు
ఆకాశంలో కలిగే ఒక
భూకంపం

వాడు ఎందుకు చస్తున్నాడనుకున్నావ్
ఆ అడవుల్లో అన్ని గాయాలతో–
వాడు ఎందుకు మరణిస్తున్నాడు!
ఎందుకంటే
వాడికివ్వబడిన ఆయుస్సు చాలదు
నూరేళ్ళకు బదులు వెయ్యేళ్ళు కావాలి
మందులతో రాదు అమరత్వం
మరణంతో వస్తుంది

పిల్లల కలల్లో బాంబులు కనిపిస్తే
రాజులు చస్తారని జనశ్రుతి
విప్లవ వీరాభినయం చేస్తే
కవులు గాడిదలై పుడతారని
మనుస్మృతి

అక్టోబరులో నేను పుట్టాను
అక్టోబరులోనే విప్లవం పుట్టింది
అందుకే నేనంటే భయపడుతుంది
తిమిరం–
రష్యాకాదు చైనాకాదు
విప్లవం మాత్రం అజరామరం

నీ దేహమే గంగోత్రి
నీ స్వరమే భాగీరథి
పువ్వులో లేని స్వర్గం

పురాణాల్లో ఉంటుందా
చేతులో లేని సుఖం
జెండాల్లో ఉంటుందా
నీలో సాహసం ఉంటే
దేశంలో అంధకారం ఉంటుందా-

అగ్నిజ్వాలని ఆర్పగలవేమోగానీ
ఎర్రగులాబీ బ్రద్దలై ప్రవహిస్తున్న
రక్తవర్ణలావాని మాత్రం ఆర్పలేవు
ఎవడు అడవిలో వధింపబడ్డాడో
వాడే ఆకాశాన్ని వెలిగిస్తాడు
మనకన్నుల్లో సాహసరేఖలు గీస్తాడు

నది పొలాలవైపు పరుగెత్తింది
అన్నార్తుల్ని రక్షిద్దామని
చెయ్యి రైఫిల్ వైపు పయనించింది
ప్రజా ద్రోహుల్ని శిక్షిద్దామని

ఒక దేహానికి ఒక రక్తనాళం చాలదు
ఒక దేశానికి ఒక నది చాలదు
రాత్రి నాచెయ్యి నదిగా మారుతుంది
కాగితాల డెల్టాల్లోకి పారుతుంది
అక్షరాలు మొలకలెత్తి నాగలిధారి మనిషితో

దేశం దేశమంతా మారుతుంది

ఒక భయంకర తిమిరం
అలముకుంది వేగంగా
ఇండియాలో కుక్కలన్నీ
అరుస్తున్నాయి
ఏకగ్రీవంగా
మన దేశం మండిపోతున్న ఒక చోటు
మనిషి కేవలం ఒక ఓటు
గంగానది ఫ్యాక్టరీల శౌచాలయం
గోదావరి రాజకీయ దావానలం
వ్యాస కాళిదాసులు హిమాలయాల్లో ఉన్నారట
సర్కారువాళ్ళు వాళ్ళెవరో పొమ్మన్నారట
అరే ఇవాళ
నగరం ఒక చంబల్ వ్యాలీ
గ్రామం దేశానికి కూలీ

మంచిది ఒకప్పుడు కోకిల కూసింది
కవిత్వం వచ్చింది
ఇప్పుడు అది కావ్యమనే గ్రామఫోనులో
కన్నాంబ అనే రికార్డు
చంద్రుడు ప్రబంధాకాశంలో
చండశాసనుడు ఒకప్పుడు
ఇప్పుడు ఆంస్ట్రాంగ్ అరికాలు క్రింద

చితికిన ఒక నక్షత్రం
ఎన్నో పొలాలు ఫ్యాక్టరీలు
ఏకగ్రీవంగా అరచినా
ఆకలి తీరని ఈ దేశం
ఉపమానాలు నంజుకుని
ఊపిరి నిలుపుకుంటుందా
ఉద్రేకం చంపుకుని ఇంకా
ఊపకుంటుందా

చిన్న చిన్న కాగితప్పొట్లికలు
రాత్రి గర్భాన
పుట్టిన అగ్ని జ్వాలికలు
కలలంటుకుని
కాగితాలు మండుతాయి
నగరాలు మండుతాయి–
కావొచ్చు ఒక మహానగరం
కానీ భూకంపానికి
ఏమి భయం?

రేచుకుక్కల్ని రెచ్చగొట్టు
త్రాచుపాముల తోకలు తొక్కు
ఆరే నిదురించే కాంతిని మాత్రం
నిత్యమూ జోకొట్టు
చూడగలవు చంద్రుడ్ని
ప్రబంధాల పద్యాల్లో
పడిపోయిన అంధుడ్ని

చూడలేవు ఈ శతాబ్ది
విశిరేశిన సవాల్
నగ్న సత్యాల మర్మావయవాల్

ఓ ప్రియమైన నా దేశమా :
నీ నదులు కొండల్లో ప్రవహిస్తున్నాయి
నీ తారీఖులు చరిత్ర పేజీల్లో ప్రవహిస్తున్నాయి
నీవు మురికివాడల్లో ప్రవహిస్తున్నావు
నేనడుగుతున్నాను
నీ పొలాల్లో కొడవళ్ళ స్వప్నాలు ఫలించేదెప్పుడు
నీ యుగయుగాల ఆకలి తీరేదెప్పుడు
జెండాలన్నీ ఎండలో
నీ శ్రామికుల కోసమే ఎగురుతున్నాయి
కలాలన్నీ సిరా నీ కలలకోసమే తాగుతున్నాయి
అక్టోబరు విప్లవం పేరుతోనే
అన్ని గొంతులూ ప్రమాణం చేస్తున్నాయి
కానీ నీ ఫ్యాక్టరీల చిమ్నీలు భూగోళం మీద
మా విజయ స్తంభాలయ్యే దెప్పుడు
పనిచేశే చేతుల్లో పద్మాలు పూచేదెప్పుడు
ఎన్ని సిద్ధాంతాలు కురిశాయో ఈ
ఆకాశం క్రింద
జలప్రవాహాలై కడిగాయో ఈ ధరిత్రినంతా
ఎన్ని మతాల ఖడ్గాలు ఒరుసుకున్నాయో
ఈ మునలి నేల మీద
కానీ మనిషి కండరాలకు అలంకారాలైన

ఇనప సమ్మెట్లు
ఈ బూర్జువా దేశాల ఆకాశాల్ని
బద్దలు కొట్టేదెప్పుడు
నక్షత్రాల వర్షాలు కురిపించేదెప్పుడు
మేమంతా ప్రజలం
ఈ దేశపు స్వప్నాలం
మా గొంతే ఈ దేశపు సమగ్ర సంకల్పం
ఎన్నాళ్ళో కన్నీళ్ళతో కడిగి
మా రక్తంతో రాశి ఇచ్చిన అధికారమే
మా గొంతుకు ఉరిత్రాడై కూర్చున్న
ఈ రోజు అస్తమించేదెప్పుడు
నేనడుగుతున్నాను సర్కారు
ఆఫీసుల లోహపు గిట్టల క్రింద
నలిగిపోతున్న మా ఆత్మ గౌరవం
కసి తీర్చుకునే దినం వచ్చే దెప్పుడు
సముద్ర గర్భంలో నుంచి
సూర్యగోళంలా మేము మళ్ళీ
లేచేదెప్పుడు—

ఆరే ఏమిటీ ఋతువు!
నేను పువ్వులుగా మారిపోతున్నాను
తోటలుగా మారిపోతున్నాను
కోకిలలుగా మారిపోతున్నాను!

ఒక నదిలా నా మాట
విశేషబలవతి అవుతోంది
మనిషి
కన్నీళ్ళకు వారసుడయినా
ఈ మధుర స్వరాలూ గుండెలో
హెూలీ పండుగలు చేసుకుంటున్న
ఈ రంగురంగుల పూలూ
మనిషిని వారసుడ్ని చేస్తున్నాయి
అదృష్టానికి!
మానవుడి దారుల్ని
ఆశలు పూచిన శాఖలతో
కోర్కెల చెరుకు తోటలతో
అలంకరించి
మనిషిని నడిపిస్తున్నాయి
దీర్ఘ దీర్ఘ దిగంతాలకు—
ఎగరేస్తున్నాయి నెమిలి గుంపుల్ని
మస్తిష్క లోకాల్లోకి
రగిలిస్తున్నాయి పిపాసాజ్వాలల్ని
దూరదూర తీరాలకోసం—

ఈ ఋతువు ఎవరిచ్చిన
వరదానమో సఖా!
దాని చేతన నీ సర్వావయవాల్లో
ఆవహించుకో......
నిరంతర యాత్ర చేసే

జీవజ్వాలకు ఈ మాసపు పువ్వు
ఒక ప్రతీక ః!
నీ ట్రాక్టర్లు నీ పొగగొట్టాలు
నీ భవిష్యత్కాల నగరాలు
గ్రామాలు నీ సమస్త
స్వప్నలోక గోపురాలు
ఈ రుతువు ప్రదానం చేస్తున్న
ఆశారేఖమీదనే లేస్తాయి—

కలలు కను కలలు కను
వర్తమానాన్ని ద్వేషించే వరకు
కలలు కను
నీ కలల్ని తొక్కుతూ నడుస్తున్న
కాళ్ళని ఖండించేవరకూ—
కలలు కను!

సోదరా ఇక్కడ్నుంచే
ఈ నేలమీద నుంచే
ఈ రాగ ద్వేషాల లోయల్లో నుంచే
లేస్తుంది నీ కోర్కెల మేళా
ఇక్కడ్నుంచే నీ ఆకాశమంత
అడుగులేస్తుంది

స్వప్నించు స్వప్నించు
ఎక్కడికో పైకెపైకి ఎగిరిపో
రంగుల్లో రాగాల్లో
మనిషిగా ఎగిరిపో
లే
నీ పాదాన్ని నక్షత్రమండలాల్లో
పెట్టు—

వృద్ధ సంవత్సరం వెళ్ళి పోయింది
పసివత్సరం నేడు పల్లవించింది
పండుటాకుల తరం పవనధాటికి పోయి
క్రొత్త చివురులు వేసి కోకిలమ్మలు కూసి
నూతనంగా యిలకు చేతనం వచ్చింది
జీవకాంతుల్లేని శిశిర శిథిలాంగాల
హిమ సమాధులమీద సుమసమూహం చల్లి
నవ వసంతోదయం నాట్యమాడింది

గత కాల బూజు దశ గడచి సీతాకోక
చిలుక పలురంగుల చీరగట్టింది
కుసుమ వీధులు చేరి కులుకులాడింది

ఏడాది రాకలో ఏడాది పోకలో
ప్రకృతిలో బహువిధ ప్రాణి వర్గాలలో
పరిణామ సత్యమే ప్రతిఫలించింది.

'నాదేశం నా ప్రజలు' పారాయణం చెయ్యండి
అది ఒక మహాప్రజా తంత్రం
వర్షాలు కురుస్తాయి వ్యాధులు నశిస్తాయి
జనతలో జ్వలిస్తుంది స్వతంత్రం

ఓ శేషన్
నీవు పీడిత ప్రజలకే చెందుతావు
అక్షరమై అందరికీ అందుతావు
మర్రిచెట్టు నీడంతా నీవు
ఒక్క గులాబీ నీడలోనే పొందుతావు

# రెండో సర్గ

నా శరీరంలో
ఎన్ని విషాలు పారుతున్నాయో
ప్రవేశించనే లేదు
నా అక్షరాల మైదానాల్లోకి—
ఇది భూమిలో
కలుస్తుందో కలవదో
బెదిరిపారిపోయే
పురుగులక్కూడా తెలీదు
నా తప్పేమిటో తెలిసినప్పుడు
నా అంతరాత్మతో వాదించడానికి
నాకు ఒక గొప్పతర్కంతో
పనిలేదు—

నా బాల్యాన్ని
చెరువులమీద జామ చెట్లమీద
గుర్రపు పిల్లలమీద వెదజల్లాను
స్త్రీల మీద పుస్తకాల మీద
కుమ్మరించాను యౌవనాన్ని
రక్తాన్ని పిండి త్రాచుల్లాంటి
వాక్యాలకు పోశి పెంచాను
ఇప్పుడు రాత్రి వచ్చింది

చంద్రుడనే పాత లాంతరు
పట్టుకుని—

భూమండలాన్ని స్వాధీనం చేసుకోవాలని
నగరాలు నిర్మించాలనీ
శాసనాలు చెయ్యాలనీ ఉంటుంది కానీ
రాత్రుల్ని బెలూనుల్లా ఎవరు ఎగరేశారు

శబ్దాలతో పర్వతాల్ని ఎవరు బంధించారు
కోర్కెల చంద్రమండలం మీద
ఎవరు అడుగు పెట్టారు
ఆకలి సముద్రాలకు ఎవరు ఆనకట్టలు
కట్టారు
తెలుసా! నేను నిద్ర
కోల్పోయిన రాత్రులే నాగరకతలు
నా కన్నుల మీద వాలిన సీతాకోక చిలుకలే
కవితలు—

పక్షిపాటే పుస్తకాల ఖజానా
వృక్షమే జగత్తును చూచే అంటెనా
శాద్వలం మీద ఆడుకుంటున్న
బాలుడు
సముద్రంలో క్రీడిస్తున్న తుఫాను

జీవించడంలో జీవితమంతా
ఖర్చుచేశి అలశిపోయాడు
అతడు వర్తమానంలో నుంచి

చరిత్రలోకి వలస పోయాడు

మీ రహస్యాల్ని మీ గర్భిత వర్ణ ఖనిజాల్ని
కొల్లగొట్టే సాహస యాత్రికుడ్ని
అని ఘోషిస్తాడు కవి
వస్తువుల్ని అనుమానాలతో త్రవ్వుతాడు
ప్రశ్నలతో పేలుస్తాడు వాటి కళేబరాల్ని
అప్పుడు ఆయన అక్షరాల అడవుల్లో
వాక్యాలు నదులై ప్రవహిస్తాయి

జీవన సముద్రమంతా ఈదాను
అక్షరాన్ని ఒక బెలూనులా ఊదాను
ఒక్కబొట్టు కన్నీటిలో నుంచి
ఎంతో దుఃఖం చేదాను

ఆకాశ ధేనువుకు మేఘమే పొదుగు
వర్షధారలు త్రాగి సస్యాలు ఎదుగు
భూమిదున్నే వాడి శ్రమ గీతమాయె
నదిరాల్చు బాష్పమే నాగరకతాయె

నిట్టూర్పు అనే గుడిలో
జీవితం ఒక దేవత
తడికన్నులకే దర్శనం
పగిలిన గుండెల చేతనే
ఆరాధిత
అశ్రువే ఒక భూషణం
గుడిలో మనుషులు
జీవితం చెక్కిన శిల్పాలు
మేఘాలు వాయుదేవుడి
సంకల్పాలు

మా ఊరి వంతెన కాలాన్ని
ఎదిరించి నా కాళ్ళ పక్షాన
నిలిచింది
అది పడిపోయింది
ప్రవహించే కాలువ మాఊరి నుంచి
నన్ను విడదీసింది

దినం అనే నావ
నెమ్మదిగా చేరుస్తోంది
నీ ఆయుష్తీరానికి
చాకలి ఆరవేశిన చొక్కా
తాడు మీద నుంచే
వ్యాఖ్యానం చెపుతోంది

శబ్దాన్ని ఎవడు అలా ఎత్తాడు
ఒక మధుపాత్రలా
అతడు కవి అయి ఉంటాడు
ఒక గీతికతో ఈ వసంతరుతువుకు
ప్రారంభోత్సవం చేశింది ఎవరు
అది కోకిల అయి ఉంటుంది
సూర్యుడు దున్నుకుంటూ వస్తాడు
మన ప్రాతఃకాల స్వప్నంలోకి
నక్షత్రంలా నగ్నమైన ఆమె తనువు
చేపలా వస్తుంది
నా అరిచేతిలోకి—

ఒకడి వస్తువుల్లోకి వాడి మరణానంతరం
ఎక్కువ అర్థం వచ్చి ప్రవేశిస్తుంది
ఆ వస్తువుల్లో సముద్రాలు చూస్తాయి
నేత్రాలు
వాటి శిరస్సుల మీద మకుటాలు పెడతాయి
దేశాలు

కవిత్వం
కవి మరణించిన తర్వాత
ఆకాశంలోకి లేచే నిర్మాణం
మొలిచే నాగరకత

అడుగు పెట్టే వసంతం
కవి ఒక గ్రీష్మ బింబం
అతడు జ్వలిస్తున్నంత కాలం
అతడి అక్షరాలు మొలవ్వు
అతడి ఆకాశాలు కురవ్వు

నన్ను సేవిస్తే ఏమొస్తుంది
సూర్యాస్తమానాన్ని సేవిస్తే
దుఃఖమన్నా వస్తుంది
అర్ధరాత్రి భూమి మీదికి
ఆకాశం దిగి వస్తుంది
టేబిల్ మీద లైటు
శిరోజాలు విరబోసుకుని
కూర్చొడన్న దేవకన్య అయ్
విలపిస్తుంది
బాలబాలికలు నిద్రించే ఊహల్లో
పుష్పవనం క్రీడిస్తుంది

దినం చచ్చిపోయింది
షహనాయీ ఏడుస్తోంది
సంధ్యని పూజించి నిశ్శబ్దం
బాష్పాల్ని నైవేద్యం పెడుతోంది

వార్ధక్యానికి సహాయపడుతున్న చేతికర్ర,
వాడు పోయిన తర్వాత చింతాగ్రస్తమం

దాన్ని ఎగతాళి చేసిన యువకుడి
ఆత్మ విశ్వాసాన్ని చూచి నవ్వింది!

వెళ్ళి పోయాయి కిరణాల ఊరేగింపులు
చెట్ల గుంపుల్ని అప్పగించి చీకట్లకు
కాంతిధూళిలో తేలుతున్న చంద్రరేఖ
పొండి ఇండ్లకని చెప్పింది పొలాల్లో కూలీలకు
నీడలుగా మారిన లోకంలో
దీర్ఘరేఖలుగా సాగి
దిగులుపడుతున్నాయి
వస్తువులు
జైలుగదుల్లో ఖైదీలు
పాటలు పాడుతున్నారు
ఒంటరితనం భరించ లేక

నిద్ర కోల్పోయి గ్రామం
ఎడ్ల కదలించే మెడగంటలు
వింటోంది
గడ్డివాముల మౌనం మీద
నక్షత్రాలు రాలుతాయనిపిస్తోంది
కంటికీ కలకూ
ఒక రాత్రి అడ్డంగా ఉందని తెలిసింది—

గాలి వీచికలు వీచికలుగా వచ్చింది
ఆకుల తుఫానుల్ని మోసుకొచ్చింది
సంక్రాంతి పాలాల్లో మంచు బిందువులు
ఏరుకుంటున్న బాలబాలికలు
తరాలు తరాలుగా వెళ్ళిపోతున్నారని
మనస్సుకు వచ్చింది—

సముద్రం తన తీరాన్ని దాటి ఎరగదు
మనిషి జీవన మరణాలు దాటి ఎరగడు
ఇంతా ఒక బిందువు ఈ భూమి అంతా
అందులోనే
వసంతాలు తుఫానులు జీవితాలు
అనే గొడవంతా—
జీవితం ఒక
మహాసముద్రం కావచ్చు
కానీ ఆశ అనే నావతో
దాన్ని దాటి వెయ్యొచ్చు

శిథిలాలకు చరిత్ర పిత
శిథిల కుడ్యాలకు నిర్జల దుర్గాలకు
వాయువు అధిష్ఠాన దేవత
రోదన స్వరాలకు సైన్యాధిపతి
సంగీత ప్రపంచానికి మార్మిక ప్రభువు

ఎన్నో పక్షులకు విడిది ఇచ్చే
ఈ చెట్టు
పాటల పోషణకర్త

కవిత్వం ఒక మెస్మరిజం
కవి కన్ను ఒక ప్రిజం
నేను సృష్టించిన అలంకారం
నీ అంధకారానికి దీపం

ఉద్రేకపు బరువుమోయలేని శబ్దాలు
గాలుల్ని ఎదుర్కోలేని పూలు
తుఫానుల్లాంటి మనుషుల చరిత్రల్ని
ఎడారుల్లో పిరమిడ్లలా నిర్మిస్తున్నాయి
అశ్రువులు సముద్రాల్ని మోస్తున్నాయి

గ్రామీణుల ఇంద్ర ధనుస్సే
నగరాలకు కవితా వస్తువు
పక్షివాలే వృక్షశాఖే
కవి కంటికి విమానాశ్రయం

అక్షరాల్ని ఆయుధాలుగా మార్చేవాడు
జీవితాన్ని కార్ఖానా చేస్తున్నాడు
ఇల్లనుకుని ఆధారపడ్డవాళ్ళని
దేనికో బలి చేస్తున్నాడు

పక్షి ఆకాశంలో మాట్లాడేది
వ్యాకరణం లేని భాష
మేఘం స్వప్నాల సామాను
మోసుకుపోయే నౌక
సెలయేరులాంటి పాటకు
జన్మ ఇచ్చే నీవు
జుల్ములో బంధింపబడిన
ఖైదీ

నేను ఆపిల్‌ను ప్రేమిస్తాను
దాని బుగ్గల్లోనుంచి సత్యాల్ని
చుంబిస్తాను
ప్రతి వస్తువు ఒక సత్యాన్ని మోస్తూ
ఉంటుంది
సత్యం కల్పన కంటె విచిత్రంగా
ఉంటుంది
నీలిమలో ఒక తార కోసం
వేటాడుతున్నప్పుడు
పాలబాట నాకు ఒక గొర్రెలమందలా
కనిపిస్తుంది

సంతోషం! వాళ్ళు మరణించారు
కారణం సుఖదుఃఖరహితమైన
వాళ్ళ తొలిరూపు పొందారు
అంటే మట్టి అయ్యారు
ఎవడో ఈ చెట్లను ఈ నదుల్ని

ఈ పర్వతాల్ని మనుష్యుల్ని చేశినవాడు
మళ్ళీ వాడి వేళ్ళ స్పర్శను పొందారు

ఒక సప్తర్షి మండలం
గగనంలోకి వస్తుంది ఒక పూర్ణ
పౌరాణిక ప్రపంచాన్ని తెస్తుంది
ఒక అస్తమించిన అవ్యక్త
అనుభూతుల నగరాలమీనార్ల మీద
కిరణాలు కిరణాలు విశిరేస్తుంది
ఆశ్చర్యం—
వస్తువు వస్తువు కాదు
అసంఖ్యాక స్మృతులకు
ఒక సంకేతం!

నిశ్శబ్దాల నిర్మాణ వాస్తువు తెలిసినవాడు
ఋషి
శబ్దాలకు రెక్కలిచ్చి నిశ్శబ్దాల్లోకి
ఎగరేశేవాడు కవి
జీవితంలో సుఖదుఃఖాలు
వసంతరుతువుల్లో
పువ్వుల వాదోపవాదాలు

ఎలుకలు పొలాల్లో పడతాయి
ఆకాశంనుంచి జారిపడిన
ఉల్కల్లా

క్షామాగ్నులు మనుష్యుల్లో పుడతాయి
చెట్లల్లో పళ్ళు
కొరుకుతున్న రామచిలుకల్లా

నా గుండెల్లో
ఎప్పుడు కాంతిదాహం జన్మిస్తుందో
అప్పుడే చీకటి సుడిగుండాలతో
నిండిన నా కిటికీ
ఈ రాత్రి చేతిలోనే మారిపోతుంది
గెలక్సీలు నర్తిస్తున్న
విశ్వంగా—

ఆకాశంలోకి వెళ్ళే కొండలు
గుండెల్ని చీలుస్తున్నాయి
పువ్వులో అల్లుకో ఉన్న నరాల నదులు
భూగోళాన్ని బ్రద్దలు చేస్తున్నాయి
శిశువుల్ని చూచి పశువులు పరవశిస్తున్నాయి

కొండలు కొండలే ఛేదిస్తున్నారు
ఆరే నీళ్ళ నెంత బాధిస్తున్నారు
డాములు కట్టి కాలువలు త్రవ్వి
ఆకలి తరపున సృష్టితోనే వాదిస్తున్నారు

సముద్రమైన మనిషిలో నుంచి
సత్యం ఎండిపోవడం చూస్తే
ధరిత్రిమీద
సముద్రాలు ఎండిపోతాయని
భయమేస్తోంది
పర్వతాలు పారిపోతాయని
భయమేస్తోంది
వృక్షాలు పుష్పవతులై
నడిచే రోజు
రాదని భయమేస్తోంది

శాఖనుంచి ఒక ఆకు రాలితే
ఇతిహాసంలో ఒక సామ్రాజ్య పతనం
పాదమీద ఒక ఎర్రటి లిల్లీ విరిస్తే
ఢిల్లీ మీనార్ల దర్శనం
ఇంద్ర ధనుస్సు విరిగి
రాలితే ఒక రసాయనం
వస్తువులో వస్తువు చూచే
నయనం

పండు నేలలోనుంచి చెట్టులో నుంచి
కొమ్మలోనుంచి బయటికి వచ్చి
వ్రేలాడుతుంది
అది దంతాలకోసమే పుట్టినట్లు
మాట మూలాధారం నుంచి ఛాతీలో నుంచి
కంఠంలోనుంచి వచ్చి

నాలుకమీద నిలుస్తుంది
కేవలం పెదవుల కోసమే
పుట్టినట్లు

ఆకాశంలో ఎన్ని విశ్వాలు పడి ఉన్నాయో
లైబ్రరీలో ఎన్ని పుస్తకాలు పడిఉన్నాయో
అన్నీ కాలం కడుపులో పచనం కావలసిందే
శిలల కంటే శబ్దాలే జీర్ణం కాని పదార్థాలు

అతడు సాధించదలచిన కార్యాలు
మనకెప్పుడు చెప్పడు
నది ఎక్కడికి వెడుతోందో
మనకెప్పుడు చెప్పదు
కాలం ఎక్కడికి వెడుతోందో
మనకెప్పుడు చెప్పదు
కాలం మన రక్తంలోకి ప్రవేశిస్తుంది
మన అక్షరాల్లోకి ప్రవేశిస్తుంది
తరతరాలు వెంటాడుతుంది
అతడు నది కాలము అంతంలేని
వలయం

మృత్యువు బోధిస్తుంది కళ్ళకు
మూసుకునే విద్య

భాష బోధిస్తుంది పెదవులకు
విచ్చుకునే విద్య
జీవన శాఖల్లో ఇవాళ
హృదయం పక్షయ్ పాడుతోంది
ఊహ సప్తర్షి మండలమెక్కి
ఆడుతోంది

నేను మరణిస్తాను పుడతాను
పుడతాను మరణిస్తాను
నేను జీవన మరణ జీవన
మరణ జీవన ప్రవాహాన్ని
పక్షుల దాహం తీరుస్తాను
పెళ్ళి కాని ఒక మేనక
ఇదే నా కిచ్చిన కానుక

ఏ శత్రువూ నీ బయటలేదు
నీ శత్రువు నీలో ఉన్న బానిసత్వమే
ఇక్కడ ఏ చెరసాలా బయట లేదు
ఇండియా కంటే పెద్ద చెరసాల లేదు
స్వాతంత్ర్య సమర యోధుడు
రాజకీయ సాధనంగా మారాడు
కాలమే రాజకీయాల బానిసగా
మారినప్పుడు
గాంధీ చీమలుతిన్న గారెలా మారాడు

సముద్రాన్ని తెచ్చి మా తోటలో
పెట్టమంటాడు
నక్షత్రాన్ని తన గుండీగా కుట్టమంటాడు
కవిత్వ పుస్తకాలతో కాఫీ కాచుకుంటాడు
మన నాయకుడు దేవుణ్ని కూడా ఇలా వచ్చి
పొమ్మంటాడు

ఒరే నీ గిటారు వాద్యం చాలించు
ఆ పచ్చటి సీసాల్లో పడుకుని నిద్రిస్తున్న
ద్రవరూప సూర్యుణ్ని ఒంచు
ఈ క్షణిక పాత్రలోకి జలపాతంలా
దూకనీ
నిద్రిస్తున్న ప్రతీకల్ని బింబాల్ని
అలంకారాల్ని మేలుకుంటూ
వీథుల్లోకి పరుగెత్తనీ—

ఆ చౌరస్తాలో అది ఒక
విగ్రహం కాదు
దేశాన్ని చేయెత్తి పిలుస్తున్న
ఒక మహా స్వప్నం!
దేశాలు స్వప్నాలు కంటే
ఆకాశాలు ప్రతీకల్ని వర్షిస్తాయి
శిల్పాలు మేలుస్తాయి భాషల్లో
పుష్పాలై పోతారు
మనుష్యులు రస్తాల్లో

ఓ యుద్ధంలో ఉన్న మానవుడా
రేపటి యుద్ధం కోసం
నేటి నిద్ర మానుకోకు
నీ యుద్ధం నిర్విరామం
నిద్రే ఆనందరామం

రక్త నదులు పారించాడు యుద్ధాలతో
వాటి మీద వంతెనలు కట్టాడు ఇతిహాసాలతో
గగనంలో ఎగిరేకాలం ఒక రాబందు
మనిషి చివరకు దానికే విందు

నడుస్తోంది సేనా వ్యూహం
శత్రు శతఘ్నులు పేలుతున్నా
నడుస్తాడు అందులో సైనికుడు
ప్రక్కవాడు కూలుతున్నా
ఎందుకు చావాలని సైనికు
డాకడూ అడగని యుద్ధం
అర్థంహీన శబ్దాలతో అల్లిన
ఒక పద్యం

యుగయుగాలనుంచీ సైన్యాలున్నాయి
అవన్నీ ఒక్కటే రుజువు చేస్తున్నాయి

మనిషి కొనబడే వస్తువు
యుద్ధం హేతువాదం లేని మృత్యువు

హెూరున గాలివాన వీస్తోంది
సోదరా ఎలా నిద్రపోతున్నావు :
వినాదాల దండయాత్రల్లో
లౌడ్‌స్పీకర్ల అగ్నిపర్వతాల్లో
అరే ఇది శబ్దం కాదు
కఠోర శిక్ష!
ఆలోచనల్ని ఆర్పివేస్తోంది లౌడ్ స్పీకర్
మారుస్తోంది మనిషిని మళ్ళీ పశువుగా
పశువుల మందల్ని సృష్టిస్తోంది దేశంలో

శబ్దాలు పురాతన బర్బర సైన్యాలు
మైకులోనుంచి దూకుతున్న భయంకర
అరణ్యాలు
దాడిచేస్తున్నాయి ఇళ్ళమీద
గుళ్ళమీద గుండెలమీద
ఏకాంతం కోల్పోయిన ఖైదీలం
పాశవిక శక్తులకు బలి పశువులం
సోదరరా నీవు
వినాదాలు నెమరువేస్తున్న శబ్దోపాసివి!
నీలో నిశ్శబ్దం నిద్రపోయింది...

విశ్వబ్దాలు సజీవ దేశాలైతే
మనుష్యుల గొంతులు వసంత రుతువులు
ఒక్కమాటలో స్వర్గం తళుక్కుమంటుంది
దీపం మేలుకోమంటుంది

సజీవ భావోద్వేగ రుతువుల్లోనే
సత్యాల్ని రాలుస్తాయి జీవితాలు
అంతవరకూ ఆకులు రాలుతాయి
నగ్న శాఖల్లో నక్షత్రాలు పుడతాయి

ఒకడి శరీరపాత్ర నిండి కాలం పొర్లిపోయింది
అర్థమయింది అతడ్ని భూమి ఆహ్వానించింది
ఎందుకో ఉద్రూతలూగుతోంది వసంతరుతువులతో భూమి
ఉపమలు ఉత్ప్రేక్షలు సృజించే శరీరాన్ని భుజించడం చేతనాఏమి
పోతూ విడిచి పెట్టి పోయిన ఆ పుస్తకాలు
అతడు ఆడుకుని అలసిపోయిన ఆటవస్తువులు
అతడి అస్తిత్వంలో అతడి హస్తస్పర్శ పూసుకుని
స్నానం చేశిన పేజీలు

రెండు కన్నులతో కార్చే కన్నీరు చాలదన్నట్లు
ఇవ్వబడింది ఒకడికి మూడవకన్ను మరొకటి
ఏ దేవతలు చూస్తారు గుండెలో జరుగుతోన్న యజ్ఞాలను
చూస్తారే తప్ప మెడలో వ్రేలాడుతున్న సమకాలిక మాలను

అంధకారానికెక్కడిది తేజస్సును కీర్తించే ఆసక్తి
ఆర్జించుకోలేదింకా మనభాష వీరుడ్ని గురించి రాశే శక్తి

నడవాలని ఎప్పుడు సిద్ధపడ్డామో ఆ రాస్తామీద
అన్నిదృక్కులూ పడ్డాయి గండు శిలల్లా మా మీద
వీడు మాచేతుల్లో పరాజితుడని నవ్వుకున్నారొకప్పుడు
వహవ్వా అంటున్నారు మారాక చూచి తుఫానులే పారి
పోతున్నప్పుడు

ఎంత ఎత్తుకు ఎదుగుతాడో మనిషి ఈ కఠిన ధరిత్రి మీద
అంత దీర్ఘంగా పడుతుంది చరిత్రలో వాడి నీడ

ప్రయాణం ఇది భయంకర సముద్రాల మీద
భరోసా ఎక్కడిది తెరచాపల మీద

తపిస్తున్నాము కిరణాలకోసం యుగయుగాలనుంచి
రక్షించకు తమస్సును కాంతి క్రూరత్వం నుంచి
గుండెల్లో నుంచి విడుదలై కన్నుల్ని చేరే ఆ ముత్యాలు
పడనీయము నేలమీద పరుస్తాము మా ప్రాణాల రుమాలు

ఆకలిహింసకు గురైన ప్రతి గుమ్మం మీద మోపాము
మా శిరస్సు
యుద్ధం చేస్తూనే ఉన్నాము రోజూ రావాలని ఉషస్సు

ప్రతి ఏడూ భూమిలోనుంచి బయటికొచ్చి నుల్చునే ధాన్యాలు
ఆకలిమీద దండయాత్రకోసం బయలుదేరుతున్న సైన్యాలు

పక్షి పర్వతము నది నక్షత్రము ఏవీ మాట్లాడవు
మనుష్యభాషల్లో
అరుస్తోంది భూమి అందుకే వినదించే విశ్వబ్దాల్లో

ఒక సుదీర్ఘ నదినై దేశం నడుమ

పెనవేసుకున్న
ఓ దుఃఖిత మానవుడా!
నీవొక్కడివే యోగ్యుడివి
దీపం ఇచ్చే కాంతికి

ఉత్తరాలు రాలేవి దినాల తునకలు
గిటార్లు వాయిస్తున్న వాన చినుకులు
నేను ప్రవేశించిన నిశ్శబ్దాల లోయల్లో
సిగ్గుపడుతున్నాయి పూలు
మాంత్రికుల్లా ఎగురుతున్నాయి సీతాకోక చిలుకలు

నీ భాష మీద నీవొక అలంకారం పెట్టు
ఆ అలంకారం మీద వాలుతుంది
వచ్చి ఒక పావురం!
కట్టుకుంటుంది తన గూడు స్వప్నాల పుల్లల్తో
విశాలంగా  ఉన్న అబిద్ రోడ్డు ఒళ్ళంతా
కదులుతుంది సజీవ రక్తంతో

కవిత్వం అర్ధరాత్రాలోకి ప్రవహించలేదు
విస్కీ దేవత భుజం తర్కాన్ని మోయలేదు
విశ్వాసాల ఆనకట్టలు రక్తాన్ని ఆపలేవు
ఇంద్రనీలం ఉమిశే నీలికాంతుల్ని
ఏ తుఫానులూ ఆర్పలేవు

కొందరు పుట్టక ముందే వాళ్ళని
గొప్పతనం నిరీక్షిస్తుంది
కొందరు చచ్చిన తర్వాత కూడా వాళ్ళని
గొప్పతనం పరీక్షిస్తుంది
ఒకడు పుష్పహారాల బరువుతో పొంగిపోతాడు
ఒకడు గాయాలు లెక్కపెట్టుకుంటూ ఉప్పొంగిపోతాడు

వాడు కవితల సైన్యాలతో బయలుదేరితే
వాడి శత్రువులే కాదు
వాడి మిత్రులు కూడా పారిపోతారు
వాడు కవిత్వం ఉత్పత్తి చేసే ఫ్యాక్టరీ
రాజకీయాలు కవిత్వాన్ని
జాతీయం చేసిన లగ్నంలో
వాడు జన్మ ఎత్తాడు

మెదడు లేని క్యాబేజీ వాడితల
నగరాల్లో ఉన్న కాలేజీ వాడి వల
వాడు బంగాళాఖాతంలా నోరు
తెరచి ఆవులిస్తాడు
మాటల చెత్తకుప్పలు సృష్టిస్తాడు
త్రవ్వగా త్రవ్వగా
మొహంజోదారోలో కుండపెంకులా
వాడి పుస్తకాల దిబ్బల్లో
ఎక్కడో ఒక పొయెం—

ప్రభుత్వాల భుజాలకు ఎగబ్రాకు
జెండా పుచ్చుకుని దూకు
యూనివర్సిటీల బురుజుల్లో తలదాచుకో
తెలిసిన నోములన్నీ నోచుకో
కొట్టుకు పోతాయి నీ కాగితాలు
సంవత్సరాలు వీచే గాలుల్లో
మనిషి పుర్రెకు అతుక్కొని ఉన్న
వికటాట్టహాసం
భూమిలో నిరీక్షిస్తోంది నీ కోసం

జేబులో పైసలు ఆవులించాయి
కాళ్ళు త్రీ ఏసెస్‌కు దారితీశాయి
పశ్చిమం ఒక నక్షత్రాన్ని విశిరేశింది
విస్కీలో బేరర్ ముఖం వికసించింది
చవితి ఒక చందమామ ముక్క ఎగరేశింది
ఛాతీలో సూర్యబింబం అస్తమించింది
చీకట్లు నక్షత్రసమూహాల్ని తరుముకొచ్చాయి
పాలాలు ఫ్యాక్టరీలు కళ్ళల్లోకి తోసుకొచ్చాయి

జ్ఞాపకం అనే కుక్క
ఒకడికాలు పట్టుకోబోయి
మరొకడి కాలు పట్టుకుంది
గుండెల్లో హోరుమంటున్న
సముద్రం దాకా వ్యాపించిన గడ్డం

పురీ జగన్నాథం గోపురంతో
తగాదా పెట్టుకుంది

ఆయన సత్యాల బరువు మోస్తున్న
మనిషి
జీవితాన్ని చింపిపారేస్తున్న సన్యాసి కాదు
జీవన స్పర్శ చేతనే అతడు
చిత్రవర్ణ విన్యాసంగా మారుతున్నాడు

వాడు ఒక కవిత్వపు కొళాయి
వాడ్ని తిప్పకున్నంత సేపే
హాయి
తిప్పితే వాడు మన పాలిటి కసాయి
కవిత్వం అంటే భయపడే
కలియుగంలో వాడు
కవిత్వంతో భూకంపాలు
సృష్టిస్తానంటాడు–

శబ్దం మీదనే
బొటన వ్రేలిమీద నుల్చుని
ఒక నక్షత్ర మండలంలా
తిరుగుతూ
ఆయుస్సునంతా తపస్సుగా

మారుస్తున్న ఓ కవీ!
నీ వేళ్ళ మధ్య
వేలాడుతాయి కవితల గుచ్ఛాలు
నీవు నిజంగా ఒక
వేసవి కాలపు ద్రాక్ష తీగెవు—

చేయెత్తి పిలుస్తున్నాయి హిమాలయ శ్రేణులు
చరిత్రని ఘోషిస్తున్న పురాతన ప్రాణులు
అరుస్తూ అభిషేకిస్తున్నాయి భిన్న భిన్న ఆకాశాలు
నీలిమతో తడిశిపోతున్నాయి నా యాత్రాస్థలాలు

పైసలిచ్చి కొనుకున్న స్త్రీ
చదివేశిన దిన పత్రికలాంటిది

కోడిపందాల్లో కోడిపుంజు ఆత్మ
దేశాల యుద్ధాల్లో సైనికుడి లాంటిది

జీవన కోరల్నించి పీకేశిన మనస్సు
పాటల్లోకి ఎగరేశిన పదంలాంటిది

ఆకాశాన్ని విడిచిపెట్టే ప్రతికిరణం
మనవైపు పరుగెత్తే      సూర్యుడు లాంటిది

రాత్రిజలాలు కడిగేస్తాయి దినం
పూనుకున్న మరకల్ని
శరీరం నిండా ఊదాపూలు దాల్చిన చెట్టు
ఒక సంపూర్ణ స్వప్న మండలం లాంటిది

నీవు కళ్ళుమూసి కళ్ళు తెరిచేసరికి
నీవు మొదట చూచిన నక్షత్రం
ఎక్కడుందో నీకు తెలీదు
నీవు నడిచే జీవన ప్రయాణంలో
ఎన్ని నక్షత్రాల దూరాలు
ఉన్నాయో
నీకే తెలీదు—
ఒక్క ఘడియలో ఎన్ని జీవన ప్రయాణాలు
మేలుకున్నాయో నిద్రపోయాయో
నీకు తెలీదు—

ఎంత అద్భుతమైనది ఈ రోడ్డు భాష!
అందుకే దాని దగ్గర నేర్చుకున్నావు నీ భాష—
ఓ కవీ ఇప్పుడు
నీ నిశ్శబ్దాలు మస్తిష్క భూకంపాల్లో
బ్రద్దలౌతున్న అద్దాల మహళ్ళు
నీ శబ్దాలు
కథల జలపాతాలు అశ్రువుల ఖండాంతర —
తడి శిశువులు పుష్పిత లోయలు
గగనంలో త్రుళ్ళిపడుతున్న మెరుపు తీగెలు
అది అబీద్ రోడ్డు కాదు
అది ప్రతీకలు బింబాలు అలంకారాలు
క్రిక్కిరిసి ప్రవహిస్తున్న ప్రవాహం
గంగ పురాతన కావ్యం
అబీద్ రోడ్డు రేపటి క్యాలెండర్లోకి

ప్రవహిస్తున్న నది—

చెట్లు అంగుళుల్ని ముసలితనంలో
ముంచుకుని పసుపు రాచుకుంటున్నాయి
ఏటవాలు కిరణాలు కొండలు జారి
లోయల్లో ఆడుకుంటున్నాయి
తలలో సువర్ణం దాచుకున్న ఓ కవీ!
నీ మాటల్లో ధాన్యం పండించు
మేము గోవులమై
నీ పొలాల్లో మేస్తాము
భూమిలోకి అస్తమించిన నగరాలు
మా మస్తిష్కంలో ఉదయిస్తాయి

రాస్తున్న కాగితాలు ఎగిరిపోయి
దూరానపడ్డాయి
ఆ రోజు నాకు గాలి మీద కోపం రాలేదు
ఎప్పటి మాదిరి నేను అగ్నిపర్వతంలా
బ్రద్దలై పోలేదు
కానీ నీకోసం వెతికాను
జీవితమనే వెతకడంలో
రస్తాలకు
బాటసారినై పోయాను

బ్రహ్మాండమైన నక్షత్రాల మార్గాలు కూడా
వంగుతాయి

గాయాల్లోనుంచి కారే
పూజనీయత ముందు
కన్నులు వంచుదామురా
ఈ చిన్ని దీపం చాలు
ఉన్నకాంతిని పంచుకుందామురా

పక్షులు గాలుల్లో ఎగురుతున్న పూలు
పూలు కొమ్మల్లో ఇరుక్కున్న పాటలు
చైత్రంలో చెట్లు శిశువుల్ని దేవతల్ని పూస్తాయి
గొంతుకోశి వాజులో గుచ్చిన పూలు
నాగరకతల్ని శపిస్తున్నాయి

బెజవాడ అనే నగరం ఎగిరి
హుసేన్‌సాగర్ తీరాన దిగుతుంది
హైదరాబాద్ కడుపులో
చందమామ పుడుతుంది
అర్థంమీద వాలే రాబందు
కవిత్వం ఒక నల్లమందు

పుస్తకాలు ప్రజల గుంపుల్లా
పడున్నాయి టేబిల్‌మీద
అక్షరాల కళ్ళతో
అహోరాత్రులు చూస్తున్నాయి నన్ను

లైబ్రరీల్లో ప్రవేశిస్తే మనస్సు
అంటుంది నాతో
శబ్దాలు పుస్తకాల్లో నివసించే పరివారం
దుకాణాలు కళ్ళుమూసుకున్న ఆదివారం

గాలి పరిమళాల దొంగ
తుఫాను అడవులమీదికి దూకే సేన
వీధి మనిషి మీద వీచే
అక్షరాల సుడిగాలి
మనిషికీ అంతరాత్మకూ మధ్య జరుగుతున్న
తర్కమే ఈ శతాబ్దం

సుడిగాలి రాబందులా లేచింది
గ్రీష్మరుతువుకి బాదుషా అని తోచింది
అర్ధరాత్రి ఆకాశం రాల్చిన నక్షత్రాల్ని
కౌగితంలో చుట్టి చేతికిచ్చింది

వెండి మాటలు
చెట్ల కొమ్మల్నించి ఎందుకు రాలుతాయో
తెలీని హేమంత రహస్య వేళలు
కాకులెగిరే ఎత్తుల్లో ఎగురుతారు
కొందరు
కొందరు కపోతాల ఎత్తుల్లో

గృధ్రాల సీమల్లో
కొందరు అవయవాలు జాపుతారు
కానీ ఎవరికీ తెలీదు
ఎక్కడ్నించి పడుతుందో
ఆ గీతికల వర్షం......

మల్లెపూలది జావళీల వాసన
రోజాది మొగలాయీల వాసన
కోలోన్‌ది ఫ్రెంచి హోటేల్ వాసన
ఆ ఇంద్రనీలంది నీ అనామిక మీద వాలిన
ఆకాశం వాసన—

వాడు వేణువుకు ప్రాణం పోస్తున్నాడు
నదీ ప్రవాహాలను గానంతో ఆపుతున్నాడు
హృదయాల్లో సూర్యోదయాలు వెలిగించి
స్వప్నాల్ని బోధగా మారుస్తున్నాడు

జీవన భాషలో చెట్టు ఒక
ఛాయామయ విరామం
ఎక్కడ చేరి పక్షులు మనుష్యులు
విశ్వబ్దాలై కలలు కంటారో—
దాన్ని విరిచి గొడ్డలి చేయకు
దాన్ని ఉరికంబం చేయకు
దేశపు వీరత్వాన్ని
దానికి వేలాడ దీయకు

జీవించిన వాడు పళ్ళుగా ధాన్యంగా
మారిన భూమిని తింటాడు
మరణించిన వాడు
పట్టి భూమినే తింటాడు
సుఖంకొనడానికి ఇచ్చేవెల
సుఖమంత సుఖంగా ఉండదు
సత్యం మడమల క్రింద చితికిపోయిన
మానవుడికి సాక్షాత్కరిస్తుంది
మనిషి తన భ్రాంతినే హత్య
చేస్తున్నాడు శత్రువనుకుని—

రాత్రి ఒక నక్షత్రాల కోడి
రోజూ ఒక బంగారు గుడ్డు పెడుతుంది
తూర్పు దిశమీద—
సూర్యుడు ఒక కిరణాల పంది
రోజూ ఒక కెంపుగా మారి
రాత్రి పెదవుల మీద నిద్రపోతాడు

ఎన్ని రాత్రులు నా గదిలోకి ప్రవేశించలేదు
ఈ రాత్రి నక్షత్రాల్ని మోసుకొచ్చింది
ఈ నిశీధి మహిమాన్వితమైన మహిళ
విశ్వం ఒక సంకేతాల గుంపు
నేనొక జ్ఞాపకాల ఊరేగింపు

జన ప్రవాహం తరతరాలుగా
ముందుకు తోసుకుపోతుంటే
నీ స్వప్నాలు వెనకబడి పోతున్నాయి
నీవు రోజా ఉత్తరాల కోసం
దినదినం పెరిగే ఉత్కంఠతో
ఎదురు చూస్తావు
ఏమిటి ఈ అనిర్వచనీయ నిరీక్ష
నీవు తీరం తగిలి వెనక్కి తిరుగుతున్న
జలప్రవాహానివా కావా

ఈ ఉదయం
అదృశ్యాల ఆనంద సముద్రం
బోగన్విలియా నికుంజాలు వెదజల్లిన
రక్తంతో
తోటంతా తడిశిపోయింది
ఆ పచ్చటి జీవితపు తివాచీ
లాన్
ఆవులించిన బంగళాకు
జబాన్

ప్రభాత పుష్పాలు రంగుల్లో స్నానం
చేస్తున్న నిశ్శబ్ద దేవతలు
సూర్యోదయాల నృత్యంలో
పర్వతాలకు ఆకాశాలకు
అడవులకు నదులకు
పొలాలకు పుష్పాలకు

జరుగుతున్న మౌన సంభాషణ
ఒక బ్రహ్మాండమైన శిల్పాల మహానగరం
స్వర విరామాల రహస్య
సంగీత కేళి–

శరదృతువనుకుని
ఒక వెండికాంతుల జల ప్రళయాన్ని
ముట్టుకుంటున్నావు
అది నీమీద విద్యుద్ఘాతం విసిరే వేళ
ఒకప్పుడు వస్తుంది
అప్పుడు అది మామిడి తోటలో
బంజారా స్త్రీల గానం
అది నక్షత్రాలకు పునర్జన్మ
మేఘాలకు జ్యోత్స్నా స్నానం
నదులకు విలాసక్రీడ
ప్రాణికోట్ల కష్టాలకు
మాధురీ స్పర్శ!
అది ఆశ్చర్యం!

ఆయన శబ్దంలో మామూలు కళ్ళు వెతికే
శబ్దంలేదు
అతని లోతైన లోతుల్లో అమాయకత
ఉంది
సింహాల్లాంటి సత్యాలు లేవు

ఆశ్చర్యాలకోసం వెతికే కళ్ళకి అక్కడ
సాక్షాత్కరిస్తాయి పూల శిశువులు
నీలి నదుల వక్రక్రీడలు
పక్షుల సంభాషణలు
గాలుల మౌనముద్రలు
ఆయన శబ్దం నిజంగా నిశ్శబ్దం
శబ్దం మనిషిని బలాత్కరించదు
కానీ నిశ్శబ్దం?

రోజూ శతాబ్దాలను గురించి
ఘోషిస్తావెందుకు
ఊదారంగులు పూసుకుంటున్న
ఉదయాలతో సాయంకాలాలతో
గుసగుసలాడు
ఈ ఒక్క భూగోళం
పది స్వర్గాల విలువ చేస్తుంది
నీకు తెలీదు
ప్రేమ జ్వాలల్లో మండిపోతున్న
పుష్పమే ఈ సృష్టి
కొన్ని హృదయ స్పందనల పేరే
ఈ జీవితం
భూమి శాశ్వతంగా తిరిగినా
నీ కాలం శాశ్వతంగా తిరగదు

పుష్పాలకు దొరుకుతాయి ఎన్నో
సీతాకోక చిలుకలు

సీతాకోక చిలుకలు కోల్పోతాయి
ఎన్నో రంగులు
బలహీనతలమీద దండయాత్ర అంటారు
తపస్సు
కానీ జీవితపు పాదలమాటున చేరి
విన్ను చూస్తూ ఉండటాక సత్యం
ఎవడు జీవన మరణాల ఎల్లలు
కొల్ల గొడతాడో
ఎవడు తన శరీరంతో క్రీడిస్తాడో
వాడు విజయి—

అతడి పంక్తులు ఊహల శిల్పాలు కావు
అవి మనుష్య చేతనలో మునిగి ఉన్న
నాగరకతలకు అభివ్యక్తులు
ఆయన నేత్రాలు వట్టి చర్మగోళాలు కావు
అవి వస్తువులనే సముద్రాల్లో
రహస్య ద్రవ్యాలకోసం వేటాడే
సాహస నావికులు

మనుషులంతా ఒకటే కావచ్చు
కానీ నేత్రాలన్నీ ఒకటే కావు
అన్ని నేత్రాలకూ కనిపిస్తుంది
వస్తుజాలం
కానీ కొన్నిటికే కనిపిస్తుంది

వాటిలో కవిత్వం అనే
ఇంద్రజాలం

అకవిత స్వప్నాలు తెలీని భాష
పట్టి శబ్దం నిద్రపోతుందేగానీ
కలలు కనలేదు
అబీద్ రోడ్డు తొక్కగానే
పామరుడి నోట్లో నిద్రిస్తున్న
మాటలో కూడా
స్వప్న ధనుస్సులు విరుస్తాయి
అలంకారాలు కురుస్తాయి

నీకోసం లోకాన్ని మోసుకొచ్చే
వార్తాపత్రిక
రోజానీ గుమ్మంలో పూచే లిల్లీ
టేబిల్ మీద పడుకో ఉన్న టెలిఫోను
అప్పుడప్పుడు మ్యావుమనే పిల్లి

నీళ్ళు నిశ్వాసాలు విడుస్తున్నాయి
నేను నక్షత్రాలు గుణిస్తూ నిద్రపోయాను
అలవాటు చొప్పున బ్రతుకుతున్నామే గానీ
లేకపోతే ఎప్పుడో మరణించేవాళ్ళము
ఆత్మహత్య చేసుకోగూడదనుకున్నవాడు కూడా
భ్రమపగిలి మరణించాడు

ఆధునిక దునియాలో సిరానదులు
కాగితాల పొలాల్లోకి ప్రవహిస్తున్నాయి
కలాలతో దున్నబడుతున్నాయి
కాగితాల మీదనే భూకంపాలు
విప్లవాలు వసంతాలు వర్షపాతాలు
ఆకాశాలు కూడా కాగితాల మీదనే
విరిగి పడతాయి
నక్షత్రాలు చెల్లాచెదరవుతాయి
కవిత్వాలు లేస్తాయి కవిత్వాలు
పడతాయి
ప్రాచీన సామ్రాజ్యాల్లా పుటల్లోకి—
లోకం
మాటమీద నుంచి కాగితం మీదికి
దిగింది.........

అబీద్ రోడ్డులో కాలం మార్వాడీ కాదు
గాలిలో కులికే ఒక సీతాకోక చిలుక
వాళ్ళు సేట్లుకారు షేర్వాణీలు ధరించి
మెలికెలు తిరిగి పడున్న కొండచిలువలు
అవి వస్త్రాల షాపులు కావు
సంధ్యల్లో రంగులు మార్చుకుంటున్న
మేఘాలనే ఆకాశవలువలు
వస్తువులు కావు అవి గ్లాసుల్లో ఇరుక్కుని
వ్రేలాడుతున్న నక్షత్ర మండలాలు
స్వాగత్ హొటలు క్రింద ఎంగిలాకుల మీద

ముసురుకున్న వాళ్ళు పిల్లలు కారు
మనుషులుగా మారిన ఈగలు

ఈ రాత్రిఒడిలోనే
నీవు ఒక బాలుడివి
తెల్లవారితే ఒక
సైనికుడివి
నిశ్చింత ఒక చెరకు
నీవు నములుతున్నంత వరకు
మనస్సు జరిపే జుల్మ నెదిరించు
ఒక గులాబీ కలని
కన్నులతో కౌగలించు

మాట చేశే ఇంద్రజాలాన్ని
మీమాంసకు గురిచేయకు
సాయంకాలం పాడుగుతున్న స్వప్నాల్ని
దినస్మృతికి బలిచేయకు
స్త్రీలో ఉన్న ప్రేమమీద
పోలీసు ఎంక్వయిరీ జరపకు
వసంత ఋతువులో అడుగుపెడుతున్న
వృక్షాన్ని
వంటచెరుకుగా చూడకు

పుస్తకాల శిఖరాల్లో నుంచి
స్త్రీల సముద్రాల్లోకి దూకాను

ప్రొద్దు పొడుపు పువ్వు
పొదవెనక సింహంలా వికసిస్తే
విస్కీ సరస్సులోకి దూకి
తామరమొగ్గ వెనక దాక్కున్నాను

కోకిల వృక్షానికి ప్రదక్షిణం చేశి
కొమ్మ ఎక్కి కూర్చుంది
వాయువు పుష్పాన్ని పూజించి
పుప్పొడి చప్పరించింది
సూర్యకిరణం భూప్రదక్షిణం చేశి
గడియారంగా మారిపోయింది

ఊగే నీ ఉయ్యాల శాశ్వతాన్ని
తాకుతోంది
నీ విప్పుడే వికశించిన పుష్పానివి కావచ్చు
నీ ఉయ్యాల క్రింద
దినాలు వత్సరాలు శతాబ్దాలు
కాలప్రవాహంలో పడి శిథిలమవుతున్నాయి
కానీ నీవు మాత్రం
శాశ్వతంగా ఊగుతున్న శిశువ్వి!

నీవు ఒంటరితనం పొందాలంటే
నన్ను ఆశ్రయించు

నేను ఒక పువ్వునై నిన్ను
అన్ని బంధాల నుంచీ విడిపిస్తాను
పానశాల నషాలు
బాటసారి కేమితెలుసు
తెరుస్తుంటే తలుపు
విడుస్తుంది ఒక నిట్టూర్పు

నేను లేచి నీ దగ్గరకు రాలేను
నేను వృక్షాన్ని లేక పర్వతాన్ని
అప్పుడప్పుడూ నేను
ప్రవహించే నదిని
పశువులు పక్షులు మనుష్యులు
నా రేవులు చేరి వాళ్ళ కలల జలాలు
వాళ్ళు త్రాగారి
నది ఎన్నో నాగరకతల్లో పడి
ప్రవహిస్తుంది
కవి ఎన్నో మనుష్యుల కథల్లో పడి
ప్రయాణిస్తాడు

నా శరీర మహానగరం మీద
ఎన్ని జీవన విమాన దాడులు జరిగాయో
ఇవాళ అది శిథిలాల మొహంజొదారో!
ఎంత శాంతి నాలోకి ప్రవహించిందో
ఇంత ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నాను
ఇవాళ మృత్యువును—

లోకం నీ మీద ఎన్ని
నిందారోపణలు చేశిందో
నీవు ఒక ఏకాకి బాటసారివి
నీ ఆత్మ అహంకారాన్ని
నీ శరీరం మీద ఆరోపించింది
తెలిశింది
సూర్యచంద్రులకు కూడా
గ్రహణం పడుతుంది

అరే! అరచేతిలో రేఖలు
చూస్తావెందుకు
కనుబొమల మధ్య
రెండు లోయల్లా నుల్చొ ఉన్న
ఆ గీతల్ని చూడు
కనుపిస్తుంది మనిషిలో
విరుచుకు పడుతున్న
దుఃఖసాగరం—

# మూడో సర్గ

ఏ నక్షత్రం కోసం
నిరీక్షిస్తూ
నా పాటలన్నీ పాడేనో
అది ఈ దేశం మీద
ఉదయించనే లేదు
ఎగిరిపోయింది
మా వయస్సు మాత్రం
వాలి పోయిన ఆకాశంలో
ఒక పక్షిలా—

అరే ఈ కోకిలలు పాడుతున్నాయే
వాటికి మా కన్నీళ్ళు కనిపించవా ఏమిటి!
ఒంటి మీద వసంతం పూసుకున్న వాడికి
గుండెలో జీవన పోరాటాలు ఉండవా ఏమిటి!

నేను రిక్త హస్తాలతో రాస్తున్నాను
నీవు అశ్రునేత్రాలతో చూస్తున్నావు
బొట్లు బొట్లుగా నా దుఃఖం కాగితపు
బుగ్గల మీద రాలుతోంది

జ్ఞాపకాలు ఇంతగా బాధిస్తాయని
నేనెప్పుడూ ఎరగను!
నీ దోశిట్లో ఒకప్పుడు నీళ్ళు కూడా
పియానోలు వాయించేవి
నీ నవ్వుల్లో కాంతుల్ని గెలక్సీలు కూడా
దొంగిలించుకుని పారిపోయేవి
మా గుమ్మంలో నీ పరికిణీ కదిలితే చాలు
మా కిటికీల్లోకి ప్రభాతాలు పరుగులెత్తేవి

ఓ తల్లీ ఒకప్పుడు
గగనంలో నక్షత్రాలు చూచే నీ కళ్ళు
ఇవాళ ధరిత్రిమీద రాలిన మెతుకుల్ని
చూస్తున్నాయి
క్రమంగా నీ ముఖంలో నవ్వు నిష్క్రమించడం
చూచాయి ఈ కళ్ళు
నీ పెదవులు పాటల్ని త్యాగం చెయ్యడం
చూచాయి ఈ కళ్ళు
నీవిప్పుడు జీవితం చెక్కిన ఒక
మౌన మూర్తివి
బాలికనుంచి భార్యవరకు ఒక యాత్రవి!

మా కోట విడిచి పెట్టి ఎక్కడో ఎగురుతున్న
చిరిగిపోయిన ఒక జెండావి
నేను భరించలేను – తుఫానుల్ని

ఆహ్వానించలేని పుస్తకం నాజీవితం
ఇవాళ నీవు నిశ్శబ్దాలతో ఏకాంతంగా
గది తుడుస్తున్నావు
నేను ఏకాంతాలతో నిశ్శబ్దంగా ఉరిపోసు
కుంటున్నాను
అమ్మా!
నీవు ఏ భూమి వీపు మీద చీపురుతో
తుడుస్తున్నావో
ఆ వీపుమీద ఒక దేశం ఉందని నీకు తెలీదు
ఆ దేశంలో నీ తమ్ముళ్ళు జంతువుల్లా
బరువులు మోస్తున్నారని నీకు తెలీదు
నా కన్నీళ్ళు ఎప్పుడూ దండలు దండలుగా
మీకే అంకితమని నీకు తెలీదు –

రోజూ నా కష్టాల్ని టేబిల్ మీద పరచి
లెక్కపెట్టుకుంటాను
ఏం చెయ్యాలో తోచక మళ్ళీ
అలమారులో పెట్టుకుంటాను
నా కళ్ళకు నక్షత్రాలు కనిపించవు
చంద్రుడు కనిపించడు
నా కష్టాలకు అంతు కనిపించదు

దినం వ్రేలాడుతోంది ఆకాశంలో
దినంలో వ్రేలాడుతున్నాడు మనిషి

మనిషి నాపద్యంలోకి వచ్చి
ఇరుక్కున్న ఒక తుఫాను
నేను
జీవిత అఖాతంలో ఇరుక్కున్న
ఒక సముద్రం

లోధీ హోటల్లో కూర్చున్నప్పుడు
నా కలం కంపించింది
ఢిల్లీ అశ్రువులు నేత్రాల్ని విడిచి
నా వాక్యాల్లోకి ప్రవహించాయి
ఉపవనాల్ని ఖాళీ చేశి ఢిల్లీ పక్షులు
గూళ్ళు కట్టుకున్నాయి నా అక్షరాల్లో
మనిషి గుండెలో భూకంపం
నా అరచేతిలో ప్రత్యక్షమయింది

ఏ వేదనా ఎరగని ఈ ఆకాశం క్రింద
అవే రాత్రులు అవే దినాలు
కటకటాల్లేని ఈ దేశంలో
ఒక్కో గ్రామం ఒక్కో జైలు
అంధకారంలో ఒక దీపం వెలిగించడం
తప్పు కాదు
గుండెలో ఒక జ్వాల అంటించడం
తప్పుకాదు
నా ఛాతీలో దాక్కో ఉన్న ఆత్మని మాత్రం

సంబోధించి అరుస్తున్నాను
నీవు వేదాంత శిక్ష అనుభవిస్తున్న
యావజ్జీవ ఖైదీవని

ఓ హైదరాబాద్ నీవు ప్రేమతో
చేసిన నగర మంటారు
నీ గుండెల్లో తోటల్లే వేమి
నీ కన్నుల్లో దూది పింజల్లాంటి
బాతులీదే నీలి సరస్సు ల్లే వేమి
చరిత్ర మారింది చెహరా మారింది
కోకిలలు టెలిఫోన్ తీగెల మీద
కూర్చోవు
కమలాలు ఆఫీసుల్లో వికసించవు
చేపలు కాగితాల్లో ఈదవు
చిలుకలు ఆఫీసర్ల మీసాల మీద
వాలవు
ఇదేమి నగరం ఇది
అలంకారం కోల్పోయిన ఆధునిక కవిత
చంద్రుడు లేని చతుర్దశి

గగనంలోకి ఎగిరిపోతున్న ధాన్యపు గింజలు
చెట్లలో ఇరుక్కున్న సంక్రాంతి పతంగులు
అక్షరా లమ్ముకుంటున్న కవులు—

ఆర్తనాదం చేస్తున్న అనహోయుడు
ఈ ఘడియకు సంకేతం—

అప్పుడప్పుడూ ప్రభుత్వ యుద్ధాలు చేశే ప్రజలు సైనికులు
రోజూ యుద్ధాలు చేశే సైనికులు ప్రజలు

ఎందరు యోధులు మరణించారో ఆకలి దండయాత్రల్లో
ఒక్కరికీ దేశంలో సమాధుల్లేవు చరిత్రలో పేజీల్లేవు
ఆయుధాలు లేకుండా ఆకలి రాక్షసితో ఎదుర్కొంటున్నశూరులు
వారు మరణిస్తే ఆకాశవాణి ఘోషించదు
రాజభవనాల ధ్వజాలు తలవంచవు

వాళ్ళకు అసెంబ్లీల్లేవు తుపాకుల్లేవు
ఇక జెండాలెక్కడివి నినాదాలెక్కడివి

వాళ్ళలో రక్తమే లేదు వాళ్ళయుద్ధాల్లో రక్తపాత మెక్కడిది
వాళ్ళకు క్రాసులేగానీ రెడ్ క్రాసు లెక్కడివి

వాళ్ళ ఆకలి నీ అక్షరాలతో చల్లారదు
బ్రహ్మాండమైన బాంబుల కార్ఖానాలు కావాలి

అడవులు నదులు కొండలు
స్వప్నాలతో క్రీడిస్తున్నాయి
ప్రజానీకాలు పొలాల్లో దున్నుతున్నారు
సైన్యాలు ఒక్క గీతానికి ప్రాణాలర్పిస్తున్నారు
దేశమంతా ఒక్క జెండా నీడలోనే
బ్రతుకుదామనుకుంటోంది

అరే ఎంత అమాయకత్వం! ఎంత
అజ్ఞానం :
ఎన్ని వ్యర్థంగా వీరమరణాలు :

మీకు కావాలి
పుస్తకాల్లో ఉండే చంద్రుడూ ఆకాశమూ
కారణం
మీ భవనాలు మిమ్మల్ని ఆకాశం నుంచి
విడదీశాయి
చలికాలంలో కూడా చందమామ ఆకాశమూ
మాతో కలిసే ఉంటాయి
చలికి చనిపోయిన మా పిల్లలు
చంద్రలోకం వెళ్ళి ఆడుకుంటారు

వాళ్ళు భూమి మీద నడవడం లేదు
వాళ్ళు మన స్వప్నాలమీద నడుస్తున్నారు
వాళ్ళ కాళ్ళు కాలిపోతాయి
వాళ్ళు మన పిల్లల క్షుధాగ్నుల మీద నడుస్తున్నారు
వాళ్ళు పురుగులై పునర్జన్మ ఎత్తుతారు
వాళ్ళు మన సమానత్వం గుర్తించలేదు

ఇల్లు కట్టాడు ఇంకెవడో చేరాడు
ధాన్యం పండించాడు మరెవడో తిన్నాడు
వీడు మాత్రం కాలంలో కాలుజారి
ఆయుస్సు హద్దుల అవతల పడిపోయాడు
దేశం భుజాలెక్కి కూర్చున్నాడు
మరొకడు మహిషం లాంటివాడు

మేము పూల గుత్తులు వ్రేలాడే
వసంత రుతువులం కాము
వట్టి మనుష్యులం!
దేశం మాకు గాయాలిచ్చినా నీకు
మేము పువ్వులిస్తున్నాం
ఓ ఆశాచంద్రికల కుంభవృష్టి
కురిశే మిత్రమా
యోచించు ఏమి తెస్తావో
మా అందరి కోసం
ఓటు అనే బోటు మీద
ఒక సముద్రం దాటావు

ప్రభుత్వాలకు మా విలువ తెలీదు
కానీ మాకు తెలుసు ప్రభుత్వాల విలువ
ఏ ఉరికంబానికి కావిపోబడుతున్నావో
ఓ శేషన్
నీకేం తెలుసు నీ దేశానికే తెలీదు
వెయ్యి జ్యోతుల్ని బుజం తడుతూ
రేపు కదులుతుందొక గాలి కెరటం

ఎండల పాండిత్యం అనుభవిస్తున్న
కర్షకుడికి
అదే ఒక పువ్వులాంటి కబురు

ఎవడి చేతనలో విమానదాడులు జరుగుతాయో
నగరాల భారీ గోడలు బాంబుల వర్షాల్లో కూలుతాయో
సైన్యాల బూట్లు ఎవడి జీవన పేజీలమీద నడుస్తాయో
దేశాల ఇనపతీగెలు చెల్లాచెదరై పోతాయో
ఎవడి గుండెల్లో
మానవ రక్తం గొంతులెత్తి విలపిస్తుందో
ఎవడి మెదడులో నక్షత్రం బ్రద్దలౌతుందో
వాడే పద్యాల పితామహుడు –

శకలాలై ఎగిరిపోతున్న ఒక శతాబ్దంలో
ఊరేగింపులై పోతున్నాయి ప్రతీకల నిశ్శబ్దాలు
అడవులు మెరుపులు అశనిపాతాలు
కొడవళ్ళు నాగళ్ళు క్రూరబింబాలు
కన్నీటిలో ఇరుక్కున్న మానవ సమాజాలు
తుఫానుల్ని పిండి తెచ్చిన రెండు పద్యాలు
పత్రికల్లో అరుస్తున్న శీర్షికలు ప్రజాసీకాలు

భవనాల్లో ఫటాకాలు పేలుస్తున్నారు
దీపావళి పశువులు

వసంతరుతువుల స్తనాలు ఇచ్చే
పాలుతాగుతున్న శిశువులు
భయపడి పారిపోతున్నాయి
పక్షుల గుంపులు
బుల్లెట్లయ్ వస్తాయి
కొమ్మలే వాటి క్యాంపులు

హైదరాబాదు వసంతంలో నుంచి
గ్రీష్మంలోకి ప్రవేశించింది—
సూర్యకిరణాలన్నీ సంఘటితమై
ఒక జ్వాలగా మారే రుతువు ఇది
శ్రామికులందరూ కలిసి
ఒక శక్తిగా మారే శతాబ్ది ఇది

అవి దుకాణాలు కావు ఉవ్వెత్తున లేచి
పడుతున్న పసిఫిక్ సముద్ర ఖండాలు
జనుల్లో అవి గుండెలు కావు
రెపరెపలాడుతున్న కాంక్షల జెండాలు
కొన్నాట్ ప్లేస్‌గానీ అబీద్ షాపుగానీ
కొన్ని నేత్రాల్లో దైన్యం పోస్తాయి
కొన్ని నేత్రాల్లో కాంతులు నింపుతాయి
దుకాణాల్లో మెరిశే వస్తువులన్నీ
కుట్రచేశి మనుష్యజాతిని
రెండుగా చీలుస్తాయి

ఒక హవా వీస్తుంది
వెయ్యి స్వప్నాల్ని ఎగరగొడుతుంది
నక్షత్రాల ధూళిలా —
కొండలు దిగివస్తాయి సెలయేళ్ళు
కొడవళ్ళు పట్టుకుంటారు పాలేర్లు
అకస్మాత్తుగా కురుస్తాయి ఆకాశాలు
గట్టున ఆరుతున్న గుడ్డల్ని
కాలువలు మోసుకు పోతాయి
కొడవలి నౌక ఎక్కి నేను
ఒక బాలుడ్నయ్
కోట్లాది నక్షత్రాలుచేరుతాను—

మహానగర నిర్మాణంలో
ఉన్నది భయంకర తామసిక సామగ్రి....
దున్నపోతుల ముఖాలు
పెద్దపులుల కండ్లు భల్లూకాల శరీరాలు
జలూకాల నాలుకలు
అవయవాలు మహానగర రాక్షసికి—

మహానగర కళేబరం బలుస్తోంది
మానవ పదార్థం మేశి—
ఆ రాస్తాల్లో ప్రవహిస్తున్న కుళ్ళు
ఆ కుళ్ళులో కుములుతున్న అగ్ని
ఆ అగ్నిలో పుడుతున్న

స్వచ్ఛ పశువుల సమూహాలు –
ఆ పశువుల నాసారంధ్రాల్లోనుంచే
పుడతాయి భూకంపాల గ్రామాలు
పరుగులెత్తుతాయి ఝంఝామారుతాల
మందలు
నిప్పు ఎక్కడ్నించి పుడుతుందో
నేల మీది నుంచి పుడుతుందో
జలాల్లో నుంచి పుడుతుందో
ఎవరికీ తెలీదు

మహానగరాల మీద తిరిగే
నా గర్విష్ఠి నేత్రాలకు
భవనాల సౌందర్య శిల్పాలు
కనిపించవు
వినిపిస్తుంది బరువులు మోస్తూ
చక్రాలు లాగుతూ కిర్రు కిర్రు
మంటున్న కండరాల ధ్వని
అశాంతి సముద్రాలు
విరుచుకు పడతాయి
నా పిడికిళ్ళలో

కాలేజీ శిఖరాల మీద నుంచి
కష్టాల సముద్రాల్లోకి దూకుతున్న
యువకుడు

దేశపత్రికలకు మామూలు వృత్తాంతం
కొండ శిఖరాల్లా పుట్టిన యువకులు
గుమాస్తాలుగా మారిపోవడం
తల్లిదండ్రుల జీవితాలకు
విషాదాంతం

ఒక తరాన్ని ప్రసవింపజెయడమంటే ఒక తమాషా కాదు;
ఒక నిండు కలల జగత్తును మేల్కొల్పడం
ఎన్నో అవ్యక్త ఆత్మలు
చిత్ర విచిత్రానుభూతుల ఒడిలో
స్పందన పొందిన తరుణాల స్వరాలు ఈ తరాలు
పేరులేని ఏ చరమ గమ్యానికో పోయే కలల బిడారులు—
చంద్రకిరణం అడవి ఏకాంతతలో
తనువు ధనువు చేసి ఆవులించి
వృక్షాల వీపులకు రాచుకుంటూ సుఖాన్ని చుంబించేవేళ,
ఏ గుడిసెలోనో నిశ ఉషతో సెలవు పుచ్చుకునే వేళ
మానవ అవయవాలు నరికిన కొమ్మల్లా తెంచిన ఆకుల్లా
వెదజల్లిన మైదానాల్లో బాంబుల పొగ మోసి మోసి
ఇక మోయలేక
గాలి జాలిగా కూలిపోయే వేళ...
ఈ వేళల ఊళల రూపాంతరాలు తరాలు—
నవతరానికి ఏ సంపద విడిచిపెట్టాము
యుద్ధము రక్తము కన్నీరు తప్ప,
గాయాలు బాధలు వేదనలు తప్ప,
కలలు కలలు కలలు తప్ప
పిరికితనం మోహం తప్ప—

దేశం మనిషిని పట్టించుకోనంతకాలం
నేను అజ్ఞానంలో జలక్రీడలాడాను
జ్ఞానం ఆలస్యంగా పొందాను
దేశం విన్ను ఈనాడు
దవడల్లో చేర్చుకుని నములుతుంటే
నీకు చిన్నతనంలోనే ముసలితనం వచ్చింది

ఇది వట్టి నేలకాదు
ఇది ఒక దేశం
ఇది దేశం కాదు ఇదొక సముద్రం
తిమి తిమింగలాలు విహారం చేసే
సముద్రం
రెక్కలురాని పక్షులు బిడ్డలు
రెక్కలొచ్చిన కొడుకుల పాలి
మొసళ్ళు నేతలు!
అమాయకంగా కొమ్మల్లో వ్రేలాడే
పళ్ళు పిల్లలు

మన దేశపు జీవన రాక్షసి కబళాలు
తండ్రుల హాహాకారాలు నిండిన
ఆకాశం ఈ దేశం...
బాబూ నీకు ఈ జన్మమిచ్చి
ఎంత గాయం చేశానో ఇప్పుడే తెలిసింది
నీ రక్తం నన్ను అహో రాత్రులు శపిస్తోంది

ఏ హస్తం నీకు రెక్కలివ్వలేకపోయిందో
ఆ హస్తం తెగి పడిపోకుండా
ఇంకా శరీరాన్ని అంటుకునే వేలాడుతోంది
బుల్ బుల్ పక్షుల్లాంటి మీ బాలస్వప్నాల్ని
తుడిచివేసే హక్కు నాకెవడిచ్చాడు—
ఈ దేశమనే విశాల జైలులో
బేడీలు పడి ఉన్న ఈ హస్తాన్ని
క్షమించు...

ఈ నేల ఒక జ్వాల అవుతుంది
అవుతుందొక బ్రహ్మాండ శతఘ్ని
నిశ్శబ్దంగా ఉన్న శతాబ్దం
నిగళాలు త్రెంచుకుని నిలుస్తుంది
జీవన కుహరంలో స్పందించే
ధ్వని బ్రద్దలై భూమి దద్దరిల్లుతుంది
పిడికెడు మట్టికోసం కాదు
ఒక పుట్టుక కోసం ఒక చేతన కోసం
గాలి కోసం కాంతి కోసం
గగనంలో కెగిరే రెక్కల కోసం...

ఓ ధరిత్రీ! ఓ జననీ!
నిశ దొంగిలించిన పాటను
మళ్ళీ పక్షుల గొంతుల్లో పెట్టు
ద్వేషం గూడుకట్టుకున్న గుండెల్లో
జీవన ప్రేమ రగిలించు—

తన భవితవ్యాన్ని మహిళల నుదుటి కుంకుమతో
యువకుల వేడి నెత్తుటితో
కొనడానికి ముందుకు దూకుతుంది ఆ నేల
ఆశలూ రక్త బిందువులూ కలిపి అల్లిన
దండ వేసుకుంది ఆ నేల
జనతను బంధించేదెవరు
సముద్రాలకూ ఝంఝూ మరుత్తులకూ
సంకెళ్ళు వేసే దెవరు?
అరే మూర్ఖుడా!
చరిత్రలో గాలులూ అడవులూ కొండలూ
విప్పే ఆ పురాతన బొంగురు గొంతుక
వినిపించడం లేదా?
నిన్న గగనంలో గాయంగా ఉన్న సూర్యుడు
రేపు మణులూ మాణిక్యాలూ వెదజల్లుతాడు
నిన్న నెత్తుటి బురదలో పిశాచాలు తాండవం చేసిన చోట
రేపు పచ్చటి గమిళ్ళలో నెమిళ్ళు నృత్యం చేస్తాయి
రక్తగంగా తరంగాల ఒడ్డున ఆడుకునే పిల్లలు
కాలంలో పడవల తెరచాప లెత్తుతారు—
క్రొత్త సూర్యుడు క్రొత్త ఉదయాన్ని
సువర్ణ కిరణాలతో స్నానం చేయిస్తాడు

ఈ ఉషస్సు ఎన్ని తీరాలు ఎన్ని తుఫానులు
ఎన్ని ఉదయాస్తమయాలు దాటి వచ్చిందో
నలుదిక్కులా ముసిరి విసిరే ఈ నూతన
వన పవనాలతో కలిసి—
ఒక కొత్త గొంతెత్తి కేక వేస్తోంది
అది ఒక కొత్త కల అది ఒక కొత్త అల;

నవయుగ ప్రాచీ రేఖ మీద విరిసిన కల
మనమీదికి దూకుతున్న అల...
ఈ ఉషస్సు కురిసే రక్తిమలో
స్నానం చేసి మానవుడు శుచి ఐ
ఆకాశాన్ని తన్నే సముద్రతరంగంలా
మన తీరాలమీద విరుచుకు పడుతున్నాడు;
మనుషుల్ని విభజించే ఇనపతెరల్ని త్రెంచి
దళిత జీవుల మొరల్ని
ఒరల్లో ఖడ్గాలుగా ధరిస్తున్నాడు
ఓహ్! మన మనోద్వార తోరణానికి
మానవతా సూర్యుడు జ్వలత్‌జ్వాలా గుచ్ఛమై
వ్రేలాడుతున్నాడు—
భాషలు ఆరవేసిన వలువల్లా ఎగిరిపోతున్నాయి
దేశాల సరిహద్దులు ఈ ఝుంఝామారుతాల ధాటికి
గజగజ వణకిపోతున్నాయి
మానవత నగ్నంగా ఉద్విగ్నంగా
నూతన వ్యక్తీకరణ కోసం చూస్తోంది
దిశాంచలాల్లోకి

నా మొలలో కత్తి అడుగుతోంది
దాన్ని వాడి కండల్లోకి పోనిమ్మని—
బ్రతికున్నవాడి నోరయితే మూస్తావు
మరణించిన వాడి నోరెలా మూస్తావు
బ్రతికున్నప్పుడే ఓ కవీ!
నీవు బలహీనుడివి—

దేవుళ్ళని శాసించేది విధి
బ్రతిమాలినా గొంతుకోయక
మానదు అది
దాన్ని జయించు
జీవన శిఖరం అధిరోహించు–

ఓ బిడ్డా నీవు ఎగరేసిన జేబురుమాలు
పక్షులతో కలిసి ఎగురుతోంది ఆకాశం మీద
ఇంద్ర ధనుస్సు తీరాల్లో నివసించే దేవతలు
ఆశీస్సులు కురిపిస్తున్నారు నీ స్వప్నాల మీద

డేగలు బలశాలి రెక్కలతో
గోపురాల్ని మీనార్లని కూలుస్తున్నాయి
హైదరాబాదు ఆకాశరేఖల్లో
పడుకోఉన్న శిలల్ని తన్నుకు పోతున్నాయి

గణపతి హుసేన్ సాగర్ని తాగేస్తున్నాడు
గాలి చెట్ల సభల్లో బోధిస్తోంది–

వర్షాలు గోరీల్లో శవాల్ని బయటికి తెస్తున్నాయి
భిన్న భిన్న ఛందస్సుల్లో వాటి మీద
మంత్రాలు చదువుతున్నాయి
ఈ మీనార్లు ఈ గోపురాలు

కాలపు తీరాల మీద
ఒరిగి పడిపోతాయి ఓడిపోయిన
సైనికుల్లా
నేను వస్తాను చేతిలో ఉషస్సు ధరించి
విప్లవానికి ఒక రక్తబిందువు చాలదు

రాహువు పట్టిన పట్టొక
సెకండు అఖండమైనా
లోకబాంధవుడు అసలే లేకుండా పోతాడా.....
మూర్ఖుడు గడియారంలో
ముల్లు కదలనీకుంటే
ధరాగమన మంతటితో
తలక్రిందై పోతుందా
కుటిలాత్ముల కూటమి కొక
త్రుటికాలం జయమొస్తే
విశ్వసృష్టి పరిణామం
విచ్ఛిన్నం అవుతుందా
దనుజలోక మేకంగా
దారి కడ్డు నిలుచుంటే
నరజాతి ప్రస్థానం
పరిసమాప్తమవుతుందా

ఈ ప్రపంచంలోన యెక్కడున్నా సరే
ధ్రువములకు మధ్యవలె దూరమైనా సరే
మన బాధలూ ఒక్కటే — ఎప్పుడూ
మన గాధలూ ఒకటే...

ఈ దేశమననీండి ఆ దేశమననీండి
కొండలల్లే మధ్య గోడ పెట్టగనీండి
మనుషులంతా ఒక్కటే—అందరీ
మనసు లంతా ఒకటే...

చేతులన్నీ కలిపి సిద్ధమైనామంటె
ఏడు సంద్రాలైన ఈది పారేస్తాము
బ్రతికినా మన కొక్కటే అందులో
చితికినా మనకొక్కటే....

ప్రొద్దిప్పుడే పొడిచి భూగోళమంతటా
ఎర్రరంగులు పూసి వెర్రి ఎత్తిస్తోంది
నిండు కంఠము విప్పరా — సోదరా
నిదుర లెమ్మని చెప్పరా...

ఇది వింశతితమ శతాబ్ద
త్ర్యశీతితమ సంవత్సరాన (1983)
విప్లవ విభాషా విధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్యప్రణీత అరుస్తున్న ఆదిమ్మ
నామాంతర సమేత
ఆదిమ్మపర్వము సర్వము
సమాప్తము

# ప్రేమ పర్వము

## ఒకటో సర్గ

బాబా సూర్యుడా !
నిదురించే ఈ రాత్రి నెందుకు లేపుతావు
మా కష్టాలమీద
మూత నెందుకు తీస్తావు
వాళ్ళకున్న ప్రభుత్వాలు సైన్యాలు
మాకు నాస్తి
రెండు శుభ్రమైన చేతులు
ఒక ఎర్రరక్తం ప్రవహించే శరీరం
ఈ రెండే
మాకున్న ఆస్తి

ఓ హైద్రాబాద్ ఓ హైద్రాబాద్ నీ వీథుల్లో నా కీర్తి అపజయాల భుజాల మీద చేతులు వేసుకుని నడుస్తోంది. నేను తలచుకుంటే ఎంత సంతోషమిస్తానో నీకు తెలీదు. నా పిడికిటినిండా ఎన్ని వసంత విపినాలు పట్టుకొచ్చానో నీకు తెలీదు. నా చేతుల్లో ఎన్ని వేణువులు ఎన్ని మెరుపుతీగెలు ఎన్ని నక్షత్రగుచ్ఛాలు ఉన్నాయో నీకు తెలీదు-పాపం, నీకు తెలీదు కోకిల కొమ్మమీద కూర్చుంటుందేగానీ నేలమీద కూర్చోదు.

ఓ హైద్రాబాద్ నా పచ్చటి భావం నీకో పర్ణశాల నా ఎర్రటి శబ్దం అక్కడ పూచే గుల్‌మొహర్.

ఎన్ని కోర్కెలతో ప్రవేశించానో ఒక చక్రవర్తిలా ఈ భూమండలం మీదికి, ఇవాళ జీవన ప్రస్థానంలో కోర్కెల బరువుల్ని మోయలేక ఒకటొకటే జారవిడిచాను. చివరకు ఏ ఒక్క కోర్కె కోసం నా కోర్కెలన్నీ బలి ఇచ్చానో అదే ప్రశ్నగా మారిన బ్రతుకు ఈ చరమక్షణం–

బ్రతుకును తాగాను రెండు చేతులతో పుచ్చుకుని : గ్లాసులతో ముంచి మధువుగా గుండెలతో ముంచి దుఃఖంగా తాగాను. ఆశలతో స్వర్గాన్ని కొన్నాను. ఒక్క స్వప్నం కోసం మొత్తం జీవితపు అగ్ని ముద్దనంతా పట్టుకున్నాను, రక్తంతో రస్తాలు వెలిగించాను కానీ ఇప్పుడు ఏ పడవమీద ఈ రాత్రిని దాటేది అవతలిగట్టుకు?

ఒకనాడు కొమ్మల్లో పువ్వులై పక్షులై నా గుండె లోయల్లోకి రంగులూ రాగాలూ దొర్లించిన సంవత్సరాలే ఈనాడు నిర్జీవతారీఖులై క్యాలెండర్లో వేలాడుతున్నాయి.

జీవితపు కోరలతో పోరాడి పోరాడి నా సంధులు సమాసాలు సడలిపొయ్యాయి. భాష సగం చచ్చి భావాన్ని మాత్రమే కళ్ళలో నిలుపుకో ఉంది – నా జీవయాత్ర నన్నెక్కడికి తీసుకుపోతుందో నాకే తెలీదు. ఎంత బాధ కలిగించినా ఎంత కన్నీరు పారించినా హృదయాన్ని ఎంత శిథిల సామ్రాజ్యంగా మార్చినా ఈ ప్రేమ మాత్రం ఉండనీ

ఈ చార్మినార్ శిఖరాల్ని ఇంకా పిలవనీ ఈ హుసేన్ సాగర్ గుసగుసల్ని ఇంకా చెవుల్లో మధురించనీ ఈ తామరమొగ్గలాంటి అరచేతి వీపుని నా పెదవుల దగ్గరే ఉండనీ, నన్ను ఈ భూమి బుగ్గల మీదనే చందమామలా పట్టెడు వెన్నెల పులమనీ–

అల్లాకు అర్పిద్దాం మల్లేపూలు
బాలాజీ కిద్దాము హెూలీగులాల్

ఈద్‌నాటి చంద్రరేఖ కిదే నూలుపోగందాం
దసేరా ముబారకు దర్గాగా చెప్పుదాం
గాలిబ్‌ను పాడుదాం గడ్డాలు పెంచుదాం
రామదాసు పాటల్లో రాముడ్ని చేరుదాం.

ఉగాది వేపచేదు అందరమూ తిందాము
కష్టాలు సుఖాలు కలిసి పంచుకుందాము
మొహర్రంకు మనమంతా ముస్తాబు అవుదాం
షీర్‌కుర్మా తాగి చార్మినార్ ఎక్కుదాం.

షేర్వానీ వేద్దాం షాయిరీలో మునుగుదాం
ధోతీతో నాజూకు గజలును ప్రేమిద్దాం
గీత్‌ను దోహాను తెచ్చి బాహువులో బంధిద్దాం
మతాల్లోని మతలబులను మట్టిలో కలుపుదాం.

ఈ నేలను ఈ గాలిని ఏమిమ్మని అడుగుదాం
ఈలాగే ప్రవహిస్తూ ఉండండని కోరుదాం
భాగ్యనగరు వీథుల్లో స్వప్నాలు చల్లుదాం
అనురాగపు కుంకుమతో ఆకాశం పులుముదాం.

ఈనగరం జాబిల్లి
దక్కను ప్రేమాగల్లీ—

గులాబీలు వీథుల్లో గుసగుసలాడేచోటు
మధుశాలలు మశీదులు మనసును చీల్చేచోటు
అంగూరు తీగెలాంటి అందచందాల సాకీ
మేను విరిచి ఒయారంగ మెహఫిల్లో తిరుగుచోటు
రంగేలీ ఖిడకిలో ఇంద్రధనుసు విరియుచోటు

కవులు పడకగదుల్లోకి గజళ్ళయి చేరుచోటు
గోలుకొండ నిషానయిన కోహినూరు కన్నచోటు
ప్రేమకు ఝుండా మాదిరి చార్మినారు ఉన్నచోటు

నీకేం తెలుసు నా అర్ధరాత్రుల్ని కాల్చే దీపానికే తెలుసు
నా నిట్టూర్పుల వేడి కథలు...
నీ సాయంకాలాన్ని అందంగా మలుద్దామని
ఒక ముద్దు ఇస్తే అది నీ గుండెలో తుఫానుగా
మారుతుందనుకోలేదు

నీ బుగ్గలు చిదిమి రోజా మొగ్గలు పూయిస్తే చైత్రపరీమళాలు నా నరాల్ని తెంచుతాయనుకోలేదు. నీ గోళ్ళలో పూచే గులాబీలు పెదవితో ముట్టుకుంటే నా అన్ని స్మృతుల్నీ అవి రద్దుచేస్తాయనుకోలేదు. నా బాహువుల రేవులో నీవు నావలా ప్రవేశించినప్పుడు నీ కన్నుల నీలి అఖాతాల్లో నా తెరచాప పోగొట్టుకుంటా ననుకోలేదు.

ప్రేమకు దానికోసం ఎంత బాధయినా పడదగిన విలువున్నది; అందుకే నేను ఇవాళ ఒంటరిగా ఈ వంతెనమీద కూర్చుని నా మీద చంద్రుడిచేత వెన్నెల కురిపించుకుంటున్నా పారిపోతున్న ప్రవాహాన్ని చూస్తూ-

నీ నవ్వుల్లో ఏ పువ్వులున్నాయో ఎరగని రోజుల్లోనే నిన్ను ప్రేమించాను. ఇటుకలతో కాదు,కలలతో పూలశాఖలతో ఇల్లుకట్టి నీతో కాపురం పెడదామనుకున్నాను.

చంద్రుడు ఆకాశంకోసం చేయబడినట్లు నీవు నాకోసం చేయబడ్డావనుకున్నాను. కోకిల మామిడికొమ్మకే అతికినట్లు నీవు నా బాహువులకే అతుకుతావనుకున్నాను.

నేను దునియా గెలిచినప్పుడల్లా నా నయనాల్లో నిలుస్తావు ఒక ఆనందాశ్రువై- నీవు స్త్రీవి కావు అందాల తూఫానువి చీరా తారా కలిపినేసిన రూపానివి... నీ చేతులు పువ్వులదండలు నీ నవ్వులు నక్షత్రాల కండలు కనకనే గాలి ఆకుల్లో శాశ్వతంగా ప్రేమికుడైపోయినట్లు నన్ను నీ కన్నుల నీలి రేవుల్లో తీరాలకోసం వెదకని నావికుడ్నిగా మార్చుకున్నాను.

నీవు లేకపోతే నాకు ఆకాశం మాత్రం ఏమవుతుంది? సూర్యచంద్రులు నక్షత్రాలు కలిపిన శూన్యం గాక...

నన్ను కవి అనకు నేను కలలవర్తకుడ్ని నా బజారుల్లో నీ కళ్లు రెండు విలువైన భూగోళాలు.

ఎందుకలా చూస్తావు గుండెకు నిప్పంటిస్తావు
రెండు తలుపులూ తెరచి నీ కథల ఖజానా ఇవ్వు
నా ఊహల్లో ఊగే పువ్వు ఎందుకలా చూస్తావు
గిన్నెలతో తాగిన మధువు ఎక్కుతుంది దిగిపోతుంది
నీ కన్నులతో తాగిన మధువు ఎక్కుతుంది కానీ దిగదు
ఎందుకలా చూస్తావు...

మనసు దాచగలవేగానీ ఆ చూపులేమి చేయగలవు
నా చూపులు రామచిలకలై నిన్ను గోల చేయగలవు
దేవతలే దాటలేరు నేననగా ఎంతవాడ్ని
కన్నులతో చూడకముందే నీకు దాసుడయ్యాను
ఎందుకలా చూస్తావు...

నీవులేని శూన్యాన్నేదీ నింపలేదు ఈలోకంలో
నీ పెదవే నా మధువై నిలిచె నా ప్రయాణంలో
ఎందుకలా చూస్తావు......

ఇది తారక లేలేవేళ ఇవ్వలేను దీన్నెవ్వరికీ
జాము వాలిపోతోంది ప్రేమ కాటువేస్తోంది
ఎందుకలా చూస్తావు......

ప్రేమ ప్రేమంటె మాటల్తో ప్రేమవుతుందా
రెండు పూటల్ నషాతో మా దాహం తీరుతుందా

నీతో బాజార్లు తిరిగి బద్నామై పోతి
నీవు రాశీనవే పాడి దాసీ నయితి
నీకు ప్యారీనయ్ దునియాకు దుష్మన్ ఐతి...
కలలలో నీవే నా ఖయాల్లోనీవే
నీవు లేకుంటే బ్రతికే మజాయే మాకులేదు—

ఇప్పుడో రేపో ప్రాణాలు ఇచ్చేస్తాను
జ్ఞాపకాలన్ని దోచేశి వచ్చేస్తాను
ఎంత శోకించినా అపుడు లాభం లేదు...
రక్తి నీ మీదనే భక్తి నీ మీదనే
నమ్ముతావో లేదో ఖుదావే మాకు నీవు—

## రెండో సర్గ

నా గొంతులో మొదట నిట్టూర్పు లేపిన
సౌందర్యం
సామాన్యమయింది కాదు
నా యెదలో నీవు రేపిన మంటల్ని
నీవూ పంచుకో
ఓహో!
నీ కన్నుల్లో ఒక దృక్కు ఉంది
ఆ దృక్కులో ఒక లీలఉంది
ఆ లీల
ఒక రాతిలో సైతం
వెలిగిస్తుందొక జీవజ్వాల
నీవు అబద్ధం ఆడినాసరే
ఏదో ఒక కొత్తసత్యం చెప్పినట్లే
ఉంటుంది
శిశువుగా చూచాను నా లోకం
ఉయ్యాలలో ఊగడం
ఇప్పుడు చూస్తున్నా నా లోకం
నీ బాహువుల్లో ఊగడం
నా హృదయంలోకి ఉషస్సులు మోసుకొస్తున్న
నిన్నెవ్వడాపగలడు
ఆకాశంలోకి అఖండ కాంతిపుంజాలతో
అడుగుపెట్టే ఉల్కాహక్కు
ధిక్కరించే వాడెవ్వడు

చిక్కటివెన్నెల ధారల్లో తడిసి
ఆకులు మూర్ఛపోతున్నాయి
పద పోదాం
రెండు మేఘాల శరీరాలు
తెల్లగా తేలుతున్నాయి
రాత్రి నీలిమలో

బ్రహ్మాండమైన నక్షత్రాల ఊరేగింపులో
వెన్నెలజెండా పుచ్చుకుని చంద్రుడు
ముందు నడుస్తున్నాడు
ఆరాత్రి...
తలుపులు నన్ను పిలిచాయి
కుర్చీ నన్ను కూర్చోమంది
గ్లాసులో వైను కన్నుగీటింది
ఆపిల్‌పండు నన్ను కొరుక్కోమంటూ
కండ చూపింది
శయ్యనధిరోహించమని
సైగ చేసింది
నక్షత్రాలరాత్రి వెచ్చటి
కౌగిలి ఆవరించింది— అంతే
తొడల్లో మిడిసిపడే చేపలు
ఒడిసి పట్టుకుంటూ
ఆ పెదవుల్లో పిల్లనగ్రోవులు
పితుక్కుంటూ
మసకచీకటి క్షణాల్లో మాధుర్యం కొల్లగొట్టాను

నా రక్తం చప్పుడు చెయ్యకుండా నాళాల్లో
పాకుతూ పరుగులెత్తుతూ పోతోంది—
ఏ దొంగభావాన్ని గుండెల్లోకి వెంటాడి పట్టుకోవాలని
రక్తక్రీడలాడుతున్న ఏ నారీరూపాన్ని
గిరఫ్తార్ చెయ్యడానికో!

ఆకాశం నక్షత్రాల శరణాలయం
నీ దేహం నా చూపుల కార్యాలయం
నీ గొంతు నీ కంఠాన్ని అలంకరించడానికి
నవ్వుల రవళితో చేసిన ఒక ఆభరణం
నీ మర్మర స్వరాలు వాయువుల్లో విరిగిపడుతున్న
దూరదూర సముద్రాలు
గ్రీకులకు వీనస్ ఏమిటో ఆనాడు
ఇండయాకు అదే నీవు ఈనాడు—
సవాల్ చేసి అడుగుతున్నాను
నీ సౌందర్యంలో భాగంకాని నక్షత్రంకానీ ఉషస్సుకానీ
పువ్వుకానీ ఎక్కడుంది?
నీ తనురేఖలో ఏకంకాని భూమ్యాకాశాలు
ఎక్కడున్నాయి? నీ
చూపుడువేలెక్కి మరింత గులాబీగా మారని
గులాబీ ఎక్కడుంది
నీ కనులోతుల్లోకి దూకి మరింత నక్షత్రంగా మెరవని
నక్షత్రం ఎక్కడుంది
ఏ అవ్యక్త భౌతిక ద్రవ్యాలతో
కాచిన పీయూషమో నీ ప్రేమ!

అందులో తమ స్వప్నాలు కరిగించుకుని తాగి
ఎందరో మానవమాత్రులు దేవతలై
రెక్కలమీద ఎగిరిపోయారు
ఒక్కబొట్టు చప్పరిస్తేచాలు
దేహంలో కండరాలు మోహంలో మునిగిపోతాయి...
ఒక్కటే చాలునాకు—
ఎక్కడ నా కలలన్నీ నిజమో ఆ మధుర
నిశ్శబ్దంలాంటి ప్రవాసం
నీ దరహాసం—

ఇదే చందమామాగదా
హృదాకాశమంతా సుధాకాంతి నింపే
గులాబీ గదా

చాందినీ రాత్రులన్నీ నీ చరణాలమీద
అర్పించి తనమీద గాఢాంధకారం
విధియించుకొనదెవ్వడు
మధురోహలూరించి మరిపింపజేసే
జిలేబీగదా

చైత్రమాసాలు పూచే జాజీ చమేలీ
సుమాలన్ని కోసి నీ ముందు పోసి
పూజారి అవదెవ్వడు
నీ పేరు ఈ ఊరి శిఖరాలు ఏలే
కహానీ గదా.

నీలికేశాలు విప్పావు అంటే అమాంతం
దినం రాత్రిగా మారు ఖుష్బూ నిషాతో
అదేరాత్రి నీ నవ్వుతో
మళ్ళీదినంగా మారిపోయే
రాణీ గదా.

ఒకప్పుడు శ రీర గృహముండేది నా ఆత్మకు
ఇప్పుడది దహనమైపోయింది
నీ ప్రేమాగ్ని అంటుకుని—
కానీ ఒక జెండా ఐ ఎగురుతున్నా ఇవాళ
నీ గుండె శిఖరాలెక్కి...
మునుపు రుతువులెన్నో ఉండేవి నాకు
ఇప్పుడు నీ బాహువుల్లో ఏవీ లేవు.
ఒక్క వసంతం తప్ప!
ఎందుకు పోగు చేసుకొచ్చావు నీ శరీరంతో
ఆ బంగారు క్రూర కాంతులు?
ఏమయిందో చూడు! నా చూపులన్నీ
నీ శరీరతీరాల్లో త్యాగంచేసి వచ్చేశాను
తిరిగే కుర్చీలాంటి ఒక క్షణంలో కూర్చుని
ఒక గులాబీతో నిశ్శబ్దం ముంచి
పోసుకుంటున్నాను
ఒక ద్రాక్షరస దేవతనైపోయాను—

ఏ దిగంతాల అవతలికి వెళ్ళావో నీ హంసలాంటి అడుగుల్ని ఏ దీవులకు అంకితం చేశావో—

నా చేతిలో నీవొక నక్షత్రాల గుత్తిలా ఉండకపోతే నేనేమయి పోయేవాడ్ని- నేనేమయిపోయేవాడ్ని నారాత్రి బరువును నీ శరీరం మోయకపోతే భూగోళాన్ని ఇరుసుమోస్తున్నట్లు!

నా శరీరాన్ని నీ బాహువుల్లో కోల్పోయాను చంద్రుడు తన బింబాన్ని ఆకాశంలో కోల్పోయినట్లు.

అందుకే మరెక్కడా చోటులేదు నీ మాంసరాష్ట్రంలో తప్ప-

కాలం నా కళ్ళలోకి ఎన్ని రాత్రుల్ని ఊదిందో ఏమి చెప్పను?

నా రాత్రుల్ని మోసిమోసి దీపాలుకూడా వాలిపోతున్నాయి
బలహీనంగా-

జీవితం అని అందరూ అనే అడవిలో నన్ను నేను కోల్పోయాను...

నిన్న పోయినదినం ఇవాళ మళ్ళీవచ్చి నా గాధారచన కొనసాగిస్తోంది- సాయంకాలంపూట దినం కాలధర్మం చెందినా రేపుమళ్ళీ పునర్జన్మ ఎత్తుతుంది. సూర్యుడు పోయిన తర్వాత సూర్యుడిదెయ్యంలా వస్తుంది రాత్రి.

ఏం చెయ్యను? నా నిద్ర శయ్యలో చేస్తున్న ఒక సాహసయాత్రగా మారింది-

ప్రేమ నౌకాపై పొమ్మ బిచారా
నాల్గు దినాల నౌక హమారా
మూసీనదీ జలాలమీద

మోహవీచికల పల్లకి మీద
మనసా ప్యార్‌కరో
అదిగదిగో ఎవరో

ప్రేయసి గీతికలో ఏముందో
ప్రేమకె తెలుసు ఖుదాకే తెలుసు
వలపాక రంగు వల
అది ఒక పూల కల.

కోట నాలుగు దిక్కుల పహరా
చీకటిరాత్రి భయానక చెహరా
జీవితమే ఖేల పరుగెత్తేజ్వాల

ఆకాశంలో తారల అడవులె
అంటుకొనే నీ ఆవేదనలో
ఓ కవితా షెహెన్షా
వయసోక మహానషా

# మూడో సర్గ

కోర్కెలు నీళ్ళలో కరిగిపోతున్నాయి
ఇక శ్రావణం మీద భరోసా యెందుకు?
దేశమే కుళ్ళిపోతూ ఉంది
ఇక యౌవనం మీద భరోసా యెందుకు?
కలలు విడిచిపెట్టిపోతున్నాయి
ఇక నిద్ర మీద భరోసా యెందుకు?
కన్నులు కూడా మూతపడుతున్నాయి
ఇక తెరచాపలమీద భరోసా యెందుకు?
సాయంకాలం మళ్ళీ తనదీపాల్ని ముట్టించుకుంటోంది
ధూమ్రమేఘాలు దొర్లిస్తూ
టిక్కుటిక్కుమంటూ పోతోంది గడియారం
తనపని చేసుకుంటూ.

నా స్మృతుల మధ్య ఇంకా తిరుగుతున్న దైనికస్వరూపాల్లో నిన్ను చూచాను నా మార్గాల్లో నీవు విడిచిపోయిన అడుగులు నా క్షణాలకు బంగారపు మంటలు అంటిస్తున్నాయి.

నీవు ఉన్నప్పుడు వాలేదానివి నా గుండెమీద
ఒక దండలా

నీవు శవ్వుడు లేఉ
కానీ వాలుతున్నావు ఒక కొండలా

ఒకప్పుడు ఒక మిణుగురు పురుగుకాంతిలో నీ కన్నీరు చూచి ఘనీభవించిన నా స్వప్నాన్ని ఆకాశపు అరచేతుల్లో పెట్టాను అదే ఈనాడు ఒక చంద్రఖండమై వంచిన వెండిరేకులా గాలిలో తేలుతోంది.

రాజులు నగరాల్ని పాలించినట్లు గాలి తోటల్ని పాలిస్తోంది. నీవు నా ఊహల్ని పాలిస్తున్నావు – సూర్యకాంతులైనా అస్తమిస్తాయి గానీ నీ కన్నుల్లో కాంతులు అస్తమించవు.

నీవే నాకు ఒక స్త్రీ దేవత శరీరంలో ఎన్ని నక్షత్రమండలాలున్నాయో ఎన్ని శ్వేత ఐరావతాల కుటుంబాలున్నాయో ఎన్ని కోకిలల దేశాలున్నాయో ఎన్ని గులాబీ తోటలున్నాయో చూపించావు.

అందరూ ద్వీపమనే ఆ మరకతశకలానికే అంకితమైపోకు ఈ తీరాలకు రా, క్రూరంగా నామీద రంగులు విసిరేస్తున్న పూల గూండాలనుంచి నన్ను రక్షించు– నీ చన్నుల్లో దూరి చలికాచుకోని నీ రక్తంలోదూకి కరిగిపోనీ.

ఈ తీరాలకు రా నీకు నా నరాల్లో రక్తజ్వాలలు చూపిస్తా–

ఇవాళ రహస్యాలు వెతికే ఒక గాలి నా పేజీల్లోకి దూరి గోల చేస్తోంది. పద్యం ఒక పడవై నన్ను నా లోతుల్లోకి సాహసయాత్రలు చేయిస్తోంది.

పూలగాలి నా గదిలోకి ప్రవేశించింది దానిలో తేలుతూ తేలుతూ నా ఊహ కిటికీలోనుంచి ఎగిరిపోయింది నా కలల్లో నీ మందహాసాల

మందల్ని తోలుకుపోతున్న బాలుడ్నిగా మారిపోయాను.

ఇక్కడికి వస్తే ఈ పరిసరాలు నిన్ను గురించే మాట్లాడుతాయి. నీ గొంతు ప్రతిధ్వనులకోసం వెర్రిగా వెతుకుతాను నీళ్ళ చప్పుడులాంటి నీ కంఠస్వరం నా చెవుల్లో ప్రవహిస్తూ ఉంటుంది. ఈ భూమిని కరుణించాయి గనకనే నీ గులాబీలు ఇక్కడ పూస్తున్నాయి తమ సౌరభాలన్నీ ఇక్కడే కుమ్మరిస్తున్నాయి.

నీవు ద్వీపాంతరాల్లో ఉన్న ఈ రోజు నీ గులాబీలన్నీ వచ్చి స్వయంగా నన్ను దర్శనం చేస్తే ఏం చేసేది? నీ మధుర స్వరాలన్నీ కలిసి నా మీదికి దండెత్తితే ఏం చేశేది?

ఈ ఏకాంతలక్షణాల నిర్దాక్షిణ్యంలో నా రెండు కన్నుల్నించీ స్వర్గాలు కారుతున్నాయి, నీకు తెలుసా–

ప్రిజంలో ఉన్న రంగుల్నీ నీలో ఉన్న లోతుల్నీ
ఊహించుకోవలసిందే–
కనకనే ఇవాళ మనం మాట్లాడుకుంటున్నాం ఒక
శబ్దాల్లేని భాషలో...
నీవు ఒక పెద్ద ఆఫ్రికా ఖండంలా
కూర్చుంటావు నిబ్బరంగా
ఆకాశం దాటిపోతున్న చంద్రుడ్ని కూడా
ఆజ్ఞాపిస్తావు అక్కడే ఆగమని
పర్వతాన్ని కూడా ఇలారా అని
ఉత్తర్వుచేస్తావు ఒక వేలితో
నీ కన్నుల్లో సముద్రాలే కదుల్తాయి పసిపిల్లల్లా
నీ ఒక్క మాటలోనే ఒదిగి పడుకుంటాయి మనిషి
నిర్మించిన ప్రేమగాథల లైబ్రరీలన్నీ

**నీ ఊహల్లో కిరీటాలు ధరించిన రాజులు కూడా**
**తలవంచి నడిచిపోతారు తమ పరిపాలన**
**సాగని వీథుల్లో నడుస్తున్నట్లు**
**ఏ తొడల జోడయినా ప్రేమ అవుతుందనుకోవు**
**అనంతకాలాన్ని అర్థరాత్రిలో**
**మూటగట్టుకోవచ్చనుకోవు**
**నీకు తెలుసు**
**ఒక్కరాత్రిలో ప్రేమ పుట్టదని**
**ఒక్కరాత్రిలో నక్షత్రం పుట్టదని**

ఒకప్పుడు నాకు ఏ విస్కీపేరూ తెలీదు నేను ఏ సముద్రమూ దాటలేదు వాయువుల్లో ఎగిరిపోయి ఏ మహానగరాలూ చేరలేదు ఏ స్టేజీ ఎక్కలేదు ఏ తెరా దురాక్రమణ చేయలేదు.

అదృష్టం లేదు అధికారంలేదు నన్ను అందమైన స్త్రీలు కన్నెత్తి చూడనేలేదు- నిన్ను కలియకముందు నా ముఖం ఒక కొలంబస్ చూడని అమెరికా ఒక హిల్లరీ ఎక్కని ఎవరెస్టు! అందుచేతనే అప్పుడు ఎవరికీ నామీద అసూయా లేదు నా మనస్సుకు అశాంతీలేదు.

ఇప్పుడు దేశంలో నేను ఒక తరానికంతా ఒక ప్రేమగాథ ఇచ్చిన హీరోను అసూయాగ్నిజ్వాలానగరాలను హాస్యం పాలు చేసిన ఫిడేలు లేని నీరోను.

ఓహో ఏమి చిత్రం! ఈ భూమి ఇన్ని యుగాలు తన చుట్టూ తిరిగి తిరిగి ప్రదక్షిణాలు చేసింది నన్ను నీ కివ్వడానికేనా! ఈ భూగోళపు ఇంత సుదీర్ఘ చరిత్రకు ఇదేనా పర్యవసానం!

ప్రేమలో ఉన్నవాడు తన ప్రేమను వర్ణించడానికి నా హృదయం భగ్నమయిందనీ నా కళ్ళకు నీవు తప్ప లోకమే కనిపించడం లేదనీ అనారోగ్యలక్షణాలన్నీ ఉపమానాలుగా ఉత్ప్రేక్షలుగా పేనుతుంటాడు- నేను ఆ భాష తెలీని వాణ్ని, ఏ స్త్రీ కూడా తన స్వప్నాల్లో నా మీద పడివిరిగి పోకూడదని ఆకాంక్షించే ఋషిని.

నాకు తెలుసు స్త్రీలు ధరించిన వలువలు దాటి చూడగలిగిన కన్నులన్నే అభిమానిస్తారు. కాని నీవు నీ శరీరాన్ని దాటి నీ స్వప్నలోకాల్ని దర్శించగల కన్నులన్నే అభిమానిస్తావు.

కనుకనే నా ఉచ్ఛ్వాస నిశ్వాసాల రూపాంతరాలైన నా కవితలన్నీ ఒక్క హృదయం ద్రవించడానికే పాడుతున్నాను. ఒక్క ముఖంలో చిరునవ్వు పల్లవించడానికే అల్లుతున్నాను. కోట్లాది నక్షత్రాలన్నీ ఒక్క ఆకాశాన్ని వెలిగించడానికి ప్రకాశిస్తున్నట్లు-

నీకు కవిత వినిపించడం ద్రాక్షతోటకు దండ్వం పెట్టడం వంటిది... చంద్రుడు ప్రేమికుల నిద్ర పాడుచేసే మంచుముక్క, ఆ ముక్క సాక్షిగా చెపుతున్నా;- నిన్ను ఒక్కదాన్నే ప్రేమిస్తా చిన్నప్పుడు కాశీమజిలీ కథల్లో నుంచీ అరేబియన్ నైట్సు కథల్లోనుంచీ నా చైతన్య సీమల్లోకి దిగిన రాజకుమార్తెలందరూ నీ వొక్కతెవే అయినట్లు ప్రేమిస్తా.

నన్ను అహర్నిశలూ వేధించే కీర్తి స్వప్నాలన్నీ రద్దుచేసుకుంటూ నీతో కలిసి హాయిగా నిద్రపోవాలనే ఒక్క స్వప్నంకోసం ఒక్క గమ్యంకోసం తక్కిన ప్రయాణాలన్నీ త్యాగం చేసుకుంటూ-

ఈ విశాల ప్రపంచం అంతా ఒక్క పురుషుడు ఒక్క స్త్రీ కోసమే సృష్టించబడిందని నమ్మతూ కైలాస పర్వతమంతా ఒక్క శివుడు ఒక్క పార్వతికోసమే నిర్మింపబడినట్లు

వృత్తానికి ఒక్క కేంద్రమే అయినట్లు బ్రతుక్కి ఒక్క లక్ష్యమే అని చెపుతా–

మనమిద్దరమూ కలిసి ఎలా ప్రేమించుకుందామంటే – ప్రతిరాత్రిలో నుంచీ మన మహత్తర కామోద్రేక లోకాలన్నీ పిండుకునేలా ప్రతి ఉదయం నుంచీ నిన్నటి ప్రేమ ఇవాళ అసత్యం కాదనేసత్యం ఆవిర్భవించేలా.

నిన్ను మరణానంతరం కూడా ప్రేమిస్తాను ప్రేమకు చావు బ్రతుకుల తేడా లేదు గనక.

శపథం చేసి చెపుతాను– మరణించి మరో జన్మ ఎత్తినా సరే ఆ రక్తమాంసాల్నే ఆ మందమంద హృదయ స్పందనల్నే ఆ నులివెచ్చటి ఉరోజాల్నే ఆ మత్తెక్కించే శిరోజ సౌరభాల్నే మళ్ళీమళ్ళీ ప్రేమిస్తా.

ఆ రెండు తొడల్లో నుంచే నా ఆనందబ్రహ్మలన్నీ ఒడుక్కునేలా ప్రేమిస్తా.

ఆ రెండు మృదు మధుర నేత్రాల్లో నుంచే సమస్త జీవితమూ సాక్షత్కరించేలా ప్రేమిస్తా–

ప్రియే లేక మధువు సేవింపగలనా
ప్రియే లేక క్షణమైన జీవింపగలనా
ప్రియే లేని బ్రతుకు భావింపగలనా

లయే లేని గీతం ఊహించగలవా—
కలే లేనివాడు ఒక శిలవంటివాడు
కలలోయలో పారు సెలయేరు చాలు—
ఒయారంగ ఒంగే ఒక పూలశాఖ
కనిపించితే ప్రియను మరచిపోగలవా—
ఎలాగోయి శేషేన్ దివానావు నీవు
ఎలాగయిన నీకు వలాహ్ చెప్పగలవా—

ఇది వింశతితమశతాబ్ద
అశీతి తమ సంవత్సరాన (1980)
విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్యప్రణీత ప్రేమ లేఖలు
నామాంతర సమేత
ప్రేమపర్వము సర్వము
సమాప్తము

# సముద్ర పర్వము

## ఒకటో సర్గ

సూర్యుడు సముద్రాల మీద వంగి
పీల్చుతాగే గుజ్జుం
ఆకాశం నగరాల మీద వంగి గర్జించే
సింహం
భూమి ఒక శూన్యంలో తిరిగే
బొంగరం
జీవితం మనం అడక్కుండా వచ్చిన
ఒక సంగరం

సముద్రం కేవలం ఒక కెరటాల సంకలనం కాదు... అరే దిశాంతాల వరకూ వ్యాపించిన ఈ విశాల అసహాయతావలయంలో ఏది సముద్రమో ఎవడు గట్టున ఉన్నాడో ఎలా తెలుస్తుంది.

నీవు కులాసాగా పోతున్న ఒక పడవ, కెరటాలు మోసుకుపోతున్న పల్లకీ– భయంకర సన్నివేశాలతో పోరాటాలూ జీవనమరణాల్ని తరాజులో పెట్టితూచే ఘోరపరాజయాలూ ప్రియవస్తువుకోసం వ్యయంచేసిన యుగాల్లాంటి క్షణాలూ అన్నీ క్రిక్కిరిసిన బీభత్సాల ఉత్సవాల్లో ఎప్పుడు పాల్గొన్నావు? ఒకే ఒక్క ఘడియకోసం విరిసి రంగులగాలివానలు వీస్తున్న పువ్వు ఆత్మని ఎప్పుడు ప్రత్యక్షం చేసుకున్నావు?

నీకెలా తెలుస్తాయి సముద్రపు లోతులు? సముద్ర మొకమార్మిక ద్రవ్యము! సముద్రపునాడుల్లో ఎన్నిపర్వత శ్రేణులున్నాయో దాని పేగుల్లో ఎన్ని నాగరికతలు జీర్ణమై పోయాయో దాని రక్తప్రవాహాల్లో ఎన్నియుగాల ఎన్ని మన్వంతరాల అగ్నివేదనలు ఎన్ని విస్మృత ఆత్మల సాహసోపేత యాత్రలు దాని అంతరాళాల్లో ఘుర్ఘురధ్వనులు చేస్తున్నాయో నీకెలా తెలుస్తుంది.

నిన్న సముద్రం ఒక అశ్వధాటితో పరుగులిడుతోంది ఒక్కొక్క తరంగం ఒక్కొక్క ప్రతీకలా ఒక్కొక్క అలంకారంలా- ఈవేళ ఆ సముద్రం విరిగిపడుతున్న భారీ కెరటాలూ తెల్లటి నిరాశలాంటి నురుగుల సమూహాలూ తీరాలమీదపడి గొంతుకోల్పోయిన శంఖాలూ ఛిన్నాభిన్నమైన నత్తగుల్లలూ శాశ్వతంగా నీళ్ళు పోగొట్టుకున్న భగ్ననౌకలూ- అంతా నా గొంతుపేజీల్లోకి కుంగిపోయిన ఒక మానవ అవయాల శిథిలరాజధాని;

నా గొంతులో ఒక అరుపుంది; అరుపు కడుపులో ఒక ప్రతిధ్వని ఉంది- నా అరుపులో సముద్రాలూ, పర్వతాలూ అడవులూ గ్రామాలు అన్నీ అరుస్తున్నాయి అభివవ్యక్తికోసం పేరుకోసం; తమ అస్తిత్వానికి భిన్నమయిన ఒక అనుభూతికోసం- కానీ నా పేరులో పేరుమీద అనాసక్తి ఉంది;

నాలోనుంచి కాలం ప్రవహిస్తోంది అభివ్యక్తి పరాకాష్ఠదిక్కుగా, నిశ్శబ్దంవైపు అన్ని శబ్దాల్నీ పోగుచేసుకుని పోతోంది.

సముద్రం ఒక కెరటాల సంకలనంకాదు. సముద్రం ఒకభాష సముద్రం నాపేరు!

వర్షరుతువు మేఘాల బరువుమోయలేక గాలిచేసే తిరుగుబాట్లే తుఫానులు- తుఫానులు తిరుగుబాట్లవిద్య నేర్పుతాయి;

అరువ్ నిర్భయంగా, అరే బతుకుదామన్న పిపాస ఉన్నంతవరకే బతుకుతాం మనం.

ఓ జిజీవిషా! నీవు మాత్రం వర్ధిల్లు, తెరచాపా తెగిపో, కెరటాల్లారా! ఉగ్రస్వరూపాలు ధరించండి, కుక్కల్లానడవకండి.. గాలీ! గాలివానల్ని పిలువ్. ఓ తీరమా! దూరమై పో, పడవా! పగిలిపో.

సముద్రాలెక్కడ ఆకాశాల్ని పిడికళ్ళతో పొడుస్తుంటాయో అక్కడికే పోతాను; తుఫానులతోనే స్నేహం చేస్తాను సింహాల సౌందర్యాన్నే ఉపాసిస్తాను. నా ప్రాణాలక్కడే పారేస్తాను..

గాలి సముద్ర భూముల్నించి మేఘాల్ని పోగుచేసుకుని పోతుంది. కొండల శిఖరాలమీద విడుస్తుంది. అరుస్తున్న అడవులమీద ఉన్మత్త ఆకాశాల పరాకాష్ఠలమీద వదలుతుంది, శిశువుల్లా యథేచ్ఛగా విహరించండని- గాలి సముద్ర స్వప్నాల రాయబారి గాలి తన చక్రవాత శరీరంతో సాగారోపనిషత్తులు రాస్తుంది; గాలి సముద్రహృదయ వాఖ్యాత! ఎవడు అర్థం చేసుకుంటాడో వాడి ఆస్తే హృదయం...

## 3

నా భావాన్ని వెంటాడేవాడు నా అంతరంగ సారంగాల్లోకి పరుగెత్తాలి. అప్పుడు అంతా జలమయంగా గోచరిస్తుంది- నా మాటలో సముద్రం నాకండలో సముద్రం నాగుండెలో సముద్రం నేనంతా ఒక జలరాశి! అందులో నా శరీరం అవయవాలతో వికసిస్తున్న ఒక పువ్వు! సంవత్సరాలు కూడా నామీద కెరటాల్లా దొర్లిపోతాయి.

ఒక సముద్రాన్ని మరో సముద్రమే అర్థం చేసుకుంటుంది- దూరపు దిగంతరేఖ అంచుల్ని ఎప్పుడూ నములుతూ ఉన్న ఒక సముద్రాన్ని కావా నేను? అందుకేనేమో సముద్రలోకాల్నించి వచ్చిన వానచినుకులు

వాటి మినమినలాడే దేహాల్ని మామిడికొమ్మలకి రుద్దుతూ నన్నే చూస్తున్నాయి, కిటికీలోంచి, ఇవాళ ఒక అనిర్వచనీయ సంతృప్తితో.

## 4

నేను నా బాల్యం నుంచీ చూస్తున్నా ఈ సముద్రం- ఊదా ఆకాశాల చంచల వర్ణాల్ని చిక్కించుకోవాలనే రాక్షసబుభుక్షలు తరుముతుంటే పరుగులెత్తిన నా బాల్యపు దినాలనుంచీ దాని జీవితం అధ్యయనం చేస్తున్నా... అది ఒక గంభీర భాష! దాని వ్యాకరణం దాని ఛందస్సు దాని హార్దికమర్మాలు ఎలా గ్రహిస్తావు?

దాని దీర్ఘజీవితంలో ఎన్నో మహత్తర నిర్మాణాలు విచ్ఛిన్నమయినా సముద్రం సముద్రంగానే ఉంది ఎవరూ సముద్రాన్ని నీ భయంకర కెరటాలు తీసివేసి ప్రశాంత జలాలు ధరించుకొనిరా అనలేరు; నీ గర్జాధ్వని వదలి సవినయస్వరం తగిలించుకునిరా అని ఆజ్ఞాపించలేరు- అది సముద్రం!

గడియారపు చేతులు ఇచ్చే ఆజ్ఞలకు లొంగి జీవనపందెంలో పరుగులెత్తే మనుషులు రుషులుకారు, నిద్రిస్తున్న మూర్ఖులు; కాలం బంగారు గడియారంలో పెట్టినా మనిషిని కాటువేస్తుందని ఎరుగరు- నేర్పగలరా తమ తుచ్ఛమర్యాదల్ని ఒక నిరంతర అశాంతజలరాశికి? ఈ రోడ్లు మాత్రం తమమీద ఒక కుక్క కాలు మోపితే చాలు ఎంతో గర్వకారణంగా భావిస్తాయి.

భయంకర నగరాల రాజమార్గాల్లో గాండ్రిస్తూ సంచరించే క్రూరజీవన సత్యాలు సింహాల్లాంటి ఆత్మలజాలు చూడగానే పలాయనమై పోతాయి...

# రెండో సర్గ

## 1

ఆకాశం అంతా ఉంది
మొహంనిండా పులుముకున్న పట్టెడు నీలిమతో
గుప్పెడు చిలిపి మబ్బుతునకలతో
నెలవంకతో
నక్షత్రాల జనాభాతో
అది ఒక సౌందర్య మహాసముద్రం!
నా కన్నులు స్పృశించలేని అంచులు గల
చంచల ద్రవం.....

నా కిటికీకి చిక్కిన ఆకాశపుముక్క ఒక్కటే
నా ఇంద్రియాల గుమ్మంతొక్కిన అతిథి
నా అంతర్లోకాల్లో కోట్లాది కోర్కెలు
క్రిక్కిరిసిన ఆకాశాలు దొర్లుతున్నాయి;
కానీ నా ఆస్వాదజాలంలో ఇరుక్కున్నదే
నా ఆత్మబంధాల్లో లీనమయిపోయింది;
అర్థానికీ అనుభూతికీ ఉన్న అభిన్నత
నా ఆత్మకే తెలుసు మానవ శబ్దానికేం
తెలుసు?

నా కాళ్ళకు ప్రయాణదాహం పట్టుకుంది
ఎన్ని ఊళ్ళు తిరిగినా తీరడంలేదు— కసకసే
నా రెక్కలు సవరించుకున్నా ఎగరాలని
నా గొంతు సవరించుకున్నా పాడాలని
ప్రాణాలు ఒడ్డి నా మాట ఆర్జించుకున్నా
ఏదో చెప్పాలని

కానీ ఈ ప్రస్థానంలో చెప్పలేనిదే
ఎక్కువై పోతోంది
అలసి అలసి చెప్పే అవధులే దాటి
కొట్టుకుపోతున్నా
ఒక అనిర్వచనీయపు లోతుల్లోకి...

## 2

అందరూ నిద్రపోయారు
గడియారాన్ని ఒంటరిగా విడిచిపెట్టి...
భయంతో కొట్టుకుంటోంది దానిగుండె—
మొరుగుతూ ఉంది ఒక కుక్కలా దూరాన
దిగంతరేఖ
ప్రార్థిస్తోంది రాత్రి మైదానాల్లో మోకరించి

భూదృశ్యాలూ సముద్రదృశ్యాలూ
తపస్సులు చేస్తున్నాయి,
ఒక్క పాటకోసం బతుకు బతుకంతా సమర్పించిన
వాడెక్కడని

వాటికి గొంతులు ఇచ్చేవాడు వస్తాడనీ
మాటల దేశాల్లో వాటికి దేవాలయాలు కడతాడనీ
నిరీక్షిస్తున్నాయి.
తిరుగుబాట్లు లేస్తున్నాయి మనోమయలోకాల్లో
నిశ్శబ్దాల గనుల్లో నా ఆత్మ సారంగాలు తవ్వుతూ ఉంది
విలువైన రాళ్ళకోసం అన్వేషిస్తూ—
ఆకాశాన్ని చూస్తోంది రెక్కలువిప్పి
నా కిటికీ...

3

వలలు కావాలి సముద్రం దున్నడానికి
పడవ బుజాన వేసుకున్నవాడికి
కలలు కావాలి జీవితం దున్నడానికి
గొడవలు భుజాన వేసుకున్న వాడికి
విలవిల కొట్టుకుంటున్నాను నీళ్ళు కోల్పోయిన చేపలా
కలలు కోల్పోయిన నేను—

రాత్రి అయ్యేసరికి సజీవ వస్తువులు మౌనం వహిస్తాయి
నిర్జీవ వస్తువులు మాట్లాడుతాయి
నిద్రలో నిశ్శబ్దం వెలిగిస్తుంది నా స్వప్నాల దారుల్ని;

ఇల్లు అల్లుకుంది ఒక సాలెపురుగు, ఒక పువ్వునూ
ఒక శిల్పాన్నీ కలిపి
అదే వంతెనగా పువ్వునుంచి శిల్పానికీ శిల్పంనుంచి పువ్వుకూ
ప్రయాణాలు చేస్తున్న ఆ సాలెపురుగు ఎంత తపస్వి!

ఆ చిన్న కీటకం నిర్మించగలిగింది నా ఆత్మను
ఒక మహా నగరంగా
అక్కడ నివసించే ప్రజలే అసంఖ్యాక నిశ్శబ్ద సమూహాలు!
ఎప్పుడూ శాంతి నడచివస్తుంది
నిశ్శబ్దాల అడుగుల మీదనే...
శబ్దాల్లో నలిగిపోయి నిశ్శబ్దంకోసం
ఆక్రోశిస్తున్న ఈ నాగరికతకు నేను కావాలి
నేను సాలెపురుగు అడుగుల దగ్గర అధ్యయనం
చేసిన నిశ్శబ్దశాస్త్రవేత్తను— అందుకే
మనిషి బురదలేని అడివికి పోతుంటా...

# మూడో సర్గ

చీకటి నొక్కివేస్తోంది నా గొంతుని - నా ఆత్మకు వెల్తురు చెరువులు కావాలి స్నానం చెయ్యడానికి బ్రహ్మాండమైన వాయు తరంగాలు కావాలి దోసిళ్ళతో తాగడానికి - పచ్చటి అడవులూ పచ్చికబీళ్ళూ పశుపక్ష్యాదులూ కావాలి నా నేత్రేంద్రియానికి -వాటి వైపు నా ఆత్మ గట్లు తెంచుకుని పరుగులెత్తుతుంది; తడిపచ్చిక కొసలు తగిలితే చాలు తలలో సహస్రారకమలం విచ్చుకుంటుంది.

అడవుల్లో ఆర్కెస్ట్రాలా వినిపిస్తున్న పక్షుల గొంతులు వింటేచాలు నా కలలు పరుగులెత్తుతాయి; పక్షులు సృష్టిలో ఆదికవులు!

కరెంటు దీపాల్లా వేలాడే పళ్ళగుత్తులూ షాండిలేర్లలా ఊగే పుష్పశాఖలూ కలిసి పంచేంద్రియాలను పరిపాలించే తోటల్లో పచ్చటి తివాచీల్లాంటి శాద్వలాల్లో నా కలలు గంతులేస్తూ ఆడుకుంటాయి అక్కడ పరిమళాలు గాలికి కిర్రెక్కిస్తుంటాయి.

పువ్వూ పక్షీ రంగూ రాగమూ అన్నీ నా సుశిక్షిత నేత్రానికి ఒక్క వస్తువు రూపాంతరాలే, ఒకే ఆత్మ తన ప్రయాణంలో విడిసే విభిన్నపాంథశాలలే; ఒకటి లేనప్పుడు మరొక దానిలో నా హృదయం ఓలలాడడమే దానికి గుర్తు.

నా ఆత్మ నా శరీరాన్ని రంగు రంగుల రుతువులు విడిసే వనంగా చేసుకుంది: మహళ్ళలోనేకాదు గుండెల నగళ్ళలోకూడా తోటలుంటాయి, మనిషి తోటలు పెంచుకోవాలి. బయటికంటే లోపల... కవిత్వంలాంటి ఆ తోటల్లో ఒక నెమిలి సిమిలీలా నర్తించాలి.

ఒక్క పువ్వు రేరిగును చూస్తూ వంద శతాబ్దాలు బ్రతగ్గలను- జీవనిధులైన శబ్దాలు చావులేని ఆత్మలకే వినిపిస్తాయి; అంతర్లోకాల్లో అభ్యసించే ఒక మార్మికకిరణ్మయవిద్య కావాలి ఈ అతీతానుభూతుల సంపాదనకోసం...

అప్పుడే తెలుస్తుంది మనిషి గొంతుకంటే పక్షులగొంతు గొప్పదనీ పక్షుల గొంతుకంటే పువ్వుల గొంతు గొప్పదనీ- పూలభాష అడవులభాష సెలయేళ్ళభాష సముద్రాల భాష భూమ్యాకాశాల భాష. ఇలా ఎన్నో! అనుభవాలే అక్షరాలుగా మసలే అసలు బాషల మార్మిక పాఠశాల ఇదంతా! ఆ మర్మర ధ్వనుల్లో ఊపిరి పీలుస్తుంది నా ఆత్మ రంగుల సాయంకాలాలకూ రాగాలుతీసే పక్షులకూ పరిమళాలు మోసేగాలులకూ లోకం ఎంత రుణపడి ఉందో అశిక్షిత జీవులకెలా తెలుస్తుంది?

లోకం చూచి చూచి మనుషిల్ని చదివి చదివి లోకం వట్టి సంకేతాల సముదాయం అని తెలుసుకున్నా... ఈ మనుషులందరూ గుర్తులుమాత్రమే, ఏ అర్థాలకో శబ్దాలు-ఎక్కడికి వెళ్ళినా మనుషులు మారుతారేగానీ అర్థాలు మారవు.

ఆ తోటలోకి అడుగుపెట్టాలంటేనే భయం!
గాలితో కుట్రచేసి ఒక్కో పరిమళం
ఒక్కో జ్ఞాపకాలగుంపుని మోసుకొస్తుంది
కొమ్మల్లో ఇరుక్కుని వేలాడే ఒక్కోనీలి
ఆకాశపు పేలిక నా కంటిముందు ఎగరేస్తుంది

ఒక్కో గడిచిపోయిన దూరదూర జీవిత దృశ్యాన్ని—
నేను తట్టుకోలేను గుండెనరాల్ని తెంపే
ఆ క్రూరమైన పక్షులగాన స్వరాలకు...
పాట వినబడుతూ ఉంటుంది కలత
పెడుతూ ఉంటుంది హృదయాన్ని
మధురబాధలతో, కానీ
ఎంత వెతికినా కనిపించదు
పక్షి ఎక్కడుందో—

గుండెలమీద పర్వతాల నీడలు పడుతున్నాయి
నేను గాలించిన తోట ఇప్పుడిప్పుడే
చెపుతోంది పక్షి అంటే
ఎగిరిపోయే పాట అని—
ఆ తోటలోకి అడుగుపెట్టాలంటేనే భయం!

ఆ చెట్టు ఎలా నిశ్శబ్దంగా నిల్చుని చూస్తోంది నన్ను ఆశ్చర్యంగా! నా కప్పుడే అర్థమయింది, ఇక్కడి చెట్లన్నీ నన్ను గురించే ఆలోచిస్తున్నాయని– ఆ కొండలెప్పుడూ తరులతలతో హరితంగా భరితంగా ఉన్నాయేగానీ అవి ఒక నిర్భగ్న నిశ్చలత్వంలో ఉన్నాయి వాటి ఆలోచనాత్మకనేత్రాలు నాకు కనిపిస్తున్నాయి.

ఇక్కడిచెట్లూ పర్వతాలూ తమ హృదయాలకు భాష్యం చెప్పే వాడెవడొస్తాడా అని అలాగే నుల్చుని నిరీక్షిస్తున్నాయి శతాబ్దాలనుంచీ–

నా దీర్ఘ తపస్సుల్లో నేను ఇక్కడి రూపాల రేఖాగణితం ఇక్కడి నిశ్శబ్దాల వ్యాకరణం సమస్తం హస్తగతం చేసుకున్నా– ఈ చెట్ల మాటల్లో ఈ కొండల కంఠస్వరాల్లో ఈ వాయువు ఒళ్ళు విరుపుల్లో ఈ పూలపోరాటాల్లో ఎన్ని వంపులు ఎన్ని సొంపులు ఎన్ని అవ్యక్తమధురధ్వని సమాసాలు సంధులు కిటకిట్లాడుతున్నాయో అన్నిటి సారాంశమూ పిండుకున్నా వాటి అలౌకిక క్షీరాలతో అవి నా ఆత్మని పోషించాయి.

ఇక్కడి భూగోళపు శరీరమంతా స్పృశించా నా లాలనామయ కోమల చేతనతో– ఈ భూమి అణువణువూ జీవంతో స్పందిస్తోంది భావోద్వేగంతో కంపించిపోతోంది... అనుక్షణమూ రంగుల పరిభాషలో పరిమళాల పరిభాషలో మాట్లాడుతోంది; ఒక శిల కూడా ఇక్కడ భావాత్మక నిశ్శబ్దాల్లో సంభాషిస్తుంది మనతో!

ఇక్కడి చెట్లు కుంచెకూ కాన్వాసుకూ తలవంచుతాయి ఒక స్వాప్నిక జగత్తులో తేలే అప్సరసల్లా తేలుతూ– మనుషుల ఫోటోయోగ్య ముఖాల్లా ఈ చెట్లవి వర్ణయోగ్యముఖాలు; భారీ బంగారు ఫ్రేము లెక్కడానికే పుట్టాయి అవి....

ఏ సూర్యుడ్ని ఆర్పెయ్యడానికి కాలానికే ఒక దినమంతా పడుతుందో ఆ సూర్యుడ్ని ఇక్కడ ఒక చిన్నమేఘంకూడా తన హస్తంతో అడ్డగించి ఒక పెద్ద లోయకు బ్రహ్మాండమైన నీడ ఇస్తుంది.. .శుక్లపక్షంలో ఆ సైప్రస్

చెట్లకు పుడతాడు చంద్రుడు, మహత్తరమైన ఒక వెండిగోళంలా చెట్ల కడుపులోంచి వస్తుంటే ఆకాశం దాన్ని ఎలా భరించేదా అని భయంతో చూస్తుంది.

నేను రాస్తుంటే సూర్యుడు బాలుడై నా కలం మీదికి దిగివస్తాడు ఆయన బాల్యకిరణాలు నా అంగుళుల్ని స్పృశిస్తూ నా ఆత్మబలంలోకి తొంగి చూస్తాయి గుంపులు గుంపులుగా నిల్చుని.

ఒక పద్యం పొలంలో పనిచేసి చేసి ఊపిరి పీల్చడమే మరిచిపోతాను నాతోపాటు నా రక్త ఝురులు కూడా ప్రవహించడం మరచిపోతాయి; పనిముగించి నా పద్యం దగ్గర సెలవుతీసుకుని ఒక్కసారి బయటకు వస్తాను ఎండలో దిగిస్నానం చేస్తాను; నులివెచ్చటి మధురిమలో వెల్లకిల పడుకో ఉన్న శాద్వలం మీదికి ఇంద్రియాల్ని వదలిపెట్టేస్తాను, శిశువుల్లా ఆడుకోమని. .

పువ్వులు భూమిలోనుంచి వచ్చి నా నగ్నమూర్తిని ఆహ్వానిస్తాయి లోయలు విశాల బాహువులు జాపి గొంతెత్తి పిలుస్తాయి నేను వాటి గుండెల్లోకి నిష్క్రమిస్తాను ఒక నిశ్శబ్దాన్నయ్-

## 4

పచ్చటి ఆకుల్లో బసచేసిన ఆ పక్షిపాడుతూనే ఉంది. బాధల గాయాలు కెలుకుతూ- రంగురంగుల రెక్కలు ఖైదుచేసిన దాని ఆత్మ రాగాలగుండా కారిపోతూ ఉంది స్వరాలొలుకుతూ...

పాడిపాడి శరీరంనుంచి తప్పించుకునిపోయే మధురజీవి, దానికేం తెలుసు నా బంధాల సందర్భాలు!

ఎన్ని వసంతాలకో నా గుండె ముక్కలు ముక్కలుచేసి సమర్పించాను;

జీవితంచేతిలో అలసిపోయి ఒక సీతాకోకచిలుక తోడుగా ప్రయాణం చేస్తున్నాను.

ఏదో ఒక చైత్రం నన్నూ ఒక పువ్వును చేసి తన రథచక్రానికి కట్టి ఈడ్చుకునిపోతే ఎంత బాగుండును! లేదా నేనే ఈ పువ్వుల అగ్నుల్లో దూకి అంతమైపోతే ఎంత బాగుండును!

ఈ రంగుల దండయాత్రల్లో ఈ స్వరాల గాలివానల్లో ఈ శిథిలమైన రుతువుల అస్థిపంజరాల్లో నడవలేకపోతున్నాను; చివరకి నా సీతాకోకచిలుకని పూలతీగల్లో పూడ్చిపెట్టి వసంతానికి స్వస్తి చెపుతున్నాను.

ఓ పక్షీనీ మిగిలినపాట మరో ప్రపంచంలో వింటాను, క్షమించు!

5

ఎక్కడ్నించోవచ్చి నేను ఈ లోకంలో
నా మొదటి అడుగుపెట్టిననాడు ఈ లోకం
నన్నడక్కుండా నాకు పేరు పెట్టింది
అప్పట్నించీ నా కష్టసుఖాల బరువులు
మోసుకుంటూ ఈ భూమిమీద నేను
వేసిన అడుగులన్నీ
అన్వేషణ చేశిన తప్పటడుగులు
అభివ్యక్తి కోసం చేశిన ప్రయత్నం
నా పేరు నేనే పెట్టుకోడానికి
చేశిన యాత్ర—
మనుషులందరూ నడిచే సముద్రాలు!
చివరకు కాలపు కెరటాల్లాంటి పునః
పునరావృత్త ప్రాచీన పంక్తుల్లో అర్థశక్తి
ఆవిష్కారం జరిగింది; నాలో కల్లోలం
స్వస్వరూపదర్శనం ఇచ్చింది

ఇప్పుడు శబ్దాల్లో హృదయం ప్రవహిస్తోంది
శిలల్లో సెలయేరు ప్రవహించినట్లు–
అందుకే చైత్రస్వరాలు అడవుల ఆర్కెస్ట్రాలో,
ఆర్కెస్ట్రా గడియారంలో, గడియారంలో కాలం
కాలం సముద్రంలో, కలిశాయి–

ఇక నాకు నేను పేరు పెట్టుకోలసిన రోజు వచ్చినప్పుడు నా పేరు మరొకటి ఎలా అవుతుంది?

సముద్రం నా పేరు....

పువ్వును ఐ ఈ రోజొక పునర్జన్మ ఎత్తాను
విన్నవే ఆకునై నేలమీద రాలాను
గర్విత పాదాల క్రింద గతిలేక నలిగాను

ఆకాశపు ఎడారులకు అమృతకాంతులిచ్చాను
అమావాస్య తిమిరానికి ఆహుతినై పోయాను
చైత్రానికి మళ్ళీ ఒక చంద్రుడ్నయి పుట్టాను
శూన్యంలో ఒక శాశ్వత వలయాన్నయి ఉన్నాను
వలయంలో విలయం ఒక మజిలీ అని అన్నాను
పువ్వును ఐ ఈ రోజొక పునర్జన్మ ఎత్తాను

ఇది వింశతితమ శతాబ్ద
ఏకోనశీతితమ సంవత్సరాన (1979)
విప్లవభాషా విధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజన విధేయ శేషేంద్ర నామధేయ
కవివర్య ప్రణీత సముద్రం నాపేరు
నామాంతర సమేత
సముద్ర పర్వము సర్వము
సమాప్తము

# జ్యోత్స్నా పర్వము

## ఒకటో సర్గ

ఎండలాంటి నా ఊహ శబ్దంమీదపడింది
సుదీర్ఘంగా దాని నీడ శతాబ్దంమీద పడింది
సూర్యుడు ఉదయం పూచిన పూలతో
క్రీడిస్తున్నాడు
వీరుడ్ని చూచి కాలం భయపడింది

అక్షరాల ఇసుకతో కవిత కట్టలేరు–
తలపుల నెత్తావులు చిమ్మే మృదుహృదయ
సుమధూళి కావాలి; జీవన మధూళితో తడపాలి–
చెఱకువిల్లు విరిచినవాడే చిగురుకైత చెపుతాడు
యెదల పొదరిళ్ళమీద మల్లెలు విరియిస్తాడు
వలపుల వలలో రంగుల చేపగా చిక్కని వాడు
జనన మరణ కూలా లొరిసిపారే
జీవన కల్లోలినిలో జలకమాడనివాడు
కలల కల్హారమాల మెడలో దాల్చనివాడు
ప్రపంచ విపంచి తీగెల రాగాలకు కన్నీరొలకనివాడు

కవిత కడగంటి చూపుల కలిమికి నోచుకోలేదు–
జీవితంలో లేని కవిత కాగితంలో వస్తుందా
తునకమబ్బు లేకుండా చినుకునేల పడుతుందా
సుందర భావజగత్తు సృష్టించలేనివాడు
ముసలి పదాలతో మురిపేలాడుతాడు
ఊహకు రెక్కలున్నవాడు ఉదధులు దాటుతాడు
శిఖరాల కెగురుతాడు
వాడే చైతన్యం– వాడే చరిత్ర సృష్టిస్తాడు
వాడే కొమ్మల్లో రామచిలుక
తోటల్లో తేనెటీగ
గగనంలో ఎగిరే డేగ, కొండల్లోతిరిగే వాగు
గుహల్లో హర్యక్షం, వర్షకాలాంతరిక్షం
దిశల్లో ప్రభంజనం, నిశల్లో గాఢతమిస్రం
సముద్రాల కల్లోలం, ఖండాంతర కలకలం
పరిభ్రమించే నాగరకతలు, పరుగెత్తే గేలక్సీలు–
వాడే "అజరః కవిః"....

ఏమిరాత్రి!
దీపం వెలిగిస్తే కాంతి ఇవ్వడానికి
బదులు నిట్టూర్పు విడుస్తోంది
బహుశా ఇవాళ
ఆకాశపు ఆలోచనల్లో
చంద్రుడొక కన్నీటి చుక్క

ఒక స్వరాన్ని ప్రసవించడానికి

ఎన్నిమెలికలు తిరిగిపోతుందో
ఒక తీగ!
ఎంత వేదన అనుభవిస్తోందో
ఒక వేణువు!
మాకు తెలుసు
రవీంద్ర భారతి గోడలకేమి తెలుసు?
సంగీత శిథిలాల్లో
ఎంత మానవ బాధా ప్రకంపన ఉందో
ఎవరికి తెలుసు—

ఏదో గీతిక విధుర విషాద దూతిక
అతినాజూకుగా నన్ను చేరుతూ ఉంది
వేయి కోమల హస్తాలతో స్పృశిస్తూ లాలిస్తూ ఉంది
మనస్సు వెళ్ళిపోయిం దెక్కడికో
మమతల పందిళ్ళలో మల్లెపూ లేరుకునేందుకు
కాలదూరాల తీరాలు విడిచి స్పృహ
అనుభూతిలో జలకాలాడుతూ ఉంది—
వినబడే గీతికంటే విడిచిపోయిన గీతిలో ప్రీతి మెండు
బాధకంటే
బాధ మిగిల్చిపోయిన గాధకు పదు నెక్కువ
గాయంకంటే మచ్చకు గొంతు హెచ్చు
సూర్యుడికంటే సూర్యుడే పోగా అకుల కంటుకున్న
సంధ్యారేఖలకే వ్యాకులత అధికం

ఈ సత్యం ఒక చిన్న నలుసు
ఇది ఈ ఒక్క సాయంకాలానికే తెలుసు

బాటసారీ
తుఫానుతో గాలితో చీకటితో
చెరలాడుతా వెందుకు
మేఘాలతో ఎందుకు నీకా ఖేల?
అదిగో!
నా దోసిట కుంకుమ నింపే ప్రత్యూష ధవళిమ వస్తోంది
ఓ జీవన తృష్ణా తిరిగి రా
ప్రేమరసంతో నీ గొంతుక తడుపుతాను
ఈ క్షణాన్ని నిమిష నిమిషమూ
చప్పరిస్తూ పోదాం పద
ఈ జీవన హాలాహలంలో
రెండు అమృత బిందువులు కలుపుదాం పద
ఈ రాత్రి చీకటిచీరని చింపి
పసిడికిరణాల తరుణాలతో తడుపుదాం పద
మరొక రెణ్ణాళ్ళు బ్రతుకుదాం పద—

ఎవరు రానిస్తారు ఈ రాత్రిని!
ఆ సిందూర సుందరి నెందుకు పోనిస్తారు...
రాత్రి అడుగుల చప్పుడు వినిపిస్తే
చాలు

గుండె గుబగుబలాడుతుంది
ఉఫ్! దిశనించి దిశవరకూ ఈ రాత్రి నేత్రాల్లో
ఎంతటి గాఢ తమస్సు!
చీకటి దుప్పటిలో ముఖం దాచుకుని
భ్రాంతుల దుస్తులు తీసి
కడుపులోకి కసుక్కున
ప్రశ్నలో పొడుచుకుంటాను
రక్తధార లెగజిమ్ముతాయి
రేపటి లలిత చేలాంచలాన్ని మలినం చేస్తాయి
విడుదలైన కంకాళాలేవో
ప్రసన్న కాలాన్ని కబళిస్తున్నాయి
మదిని విశ్లథంచేసే గొంతులతో
గాలిని కశ్మలం చేస్తున్నాయి—
నా కులుచ నీడని చూస్తే
నాకే అసహ్యంగా ఉంది
ఓ భగవంతుడా!
ఈ నీడని నరకహోయ్ ఒక గొడ్డలివై...
జీవం ఏ జీవంతో స్పందిస్తుందో
ఓ జీవకిరణ స్వరూపిణీ!
శాంతీ!
నా కాంతుల్ని భ్రాంతులు చేస్తున్నావు—
ఎందుకు రావు?
ఈ తిరోగమించే ఆశలు
ఈ జ్వలించే కోరికలు మిళితమైన
ఈ దయనీయ నాటికపై
యవనిక ఎందుకు జార్చవు?

## నిదురలోయల్లో

నిదురిద్దామని
మది తలుపులు మూసి
చంద్రుడిన్ని ఆర్పివేసి
తారల తెర జారవేసి
ఒలికి పోయిన కథలా పడుకున్నా
దూరాన సముద్రపు రొద పంఖాగా—
జ్ఞాపకాలు నాలికలు జాపి
గాయాల్ని నాక్కుంటూ పడుకున్నాయి
చూచావుగదా
ఓ విషాదంతో నిండిన పాత్రా! నిన్ను
చీకటితో నిండిన శార్వరిలా ప్రేమిస్తాను
జీవన సమరంలో అలసి వచ్చి
తారల వెలుతురు కలిపిన నీ తిమిరంలో
స్నానం చేస్తాను,
ఆనాడు నా ఏకాంత దర్పణ మందిరంలో
ఎన్ని వన్నెలు వెదజల్లేవు
ఎన్ని రూపాలు ప్రసరింప జేశావు
నిశ్శబ్దాన్ని కలతో గీతికలతో
మధురింప జేశావు
హింసించే ఏకాకితనించి ఎన్ని
మధురక్షణాల దండ అల్లి నా గుండెల
కర్పించావు
నీ కుంచెతో విసిరికొట్టిన రంగులు

నీలి మబ్బుల్లో ఇంద్ర దనస్సులై ఊగిసలాడుతున్నా
ఇంతకూ
అనేక వేల జ్యోతులు కళ్ళలో నాట్యం చేసే
నీవు—
నీ వెవరు?
నా కెందు కిచ్చా వింత చీకటి!

సంధ్యారాగశ్రీలు సాగిపోతున్నాయి
ఎడదలో క్రీనీడలేపారుచున్నాయి
చీకటి దయ్యాలు శీర్ణకేశాలతో
దూరాన చెట్లలో తారాడుతున్నాయి
కాకరపొదులో కనరానివేవియో
మొకరి గొంతులు జగము ముంచివేస్తున్నాయి
గుడ్డి ముసలమ్మలాగున్న గదిలో దివ్వె
తన పూర్వ గాథలను తలపోసుకుంటోంది
ఈ శూన్యలోకపు ఇసుక ఎడారిలో
కళ్ళు మూస్తే చాలు కలలు వస్తున్నాయి

జాలిలేని అనుభవాల చేతుల్లో
చితికి చితికి నీ కందరాలు
శిశువులైపోతాయి
కోమల అంగుళుల స్పర్శ కోరుతాయి
లాలించేవరకూ పాపం! లలితంగా
ఏడుస్తాయి....

కురిశి కురిశి వెన్నెలలు
గగన మలశిపోయింది
వేచి వేచి అడుగులకోసం
దీప మారిపోయింది

పెరటిలోని జాజితీగె
పులకరించి పూచింది
ఆశలన్ని కోలుపోయి
బాట చిన్నపోయింది

చెరువుగట్టు చెట్టునీడ
జ్ఞాపకాలు రేపింది
నీవు లేవు అన్న తలపే
కనుల నీరు నింపింది

ముసురుకున్న తారల రాత్రి
బాధలోతు చేశింది
ఊరు పూల ఊపిరుల్లో
ఒదిగి నిదురపోయింది

ఓ పువ్వులు తురుముకొచ్చిన శాఖా!
నీ ఆకాశంలో వ్రేలాడుతున్న
సూర్యుడు
తెగి చీకట్లో పడిపోకూడదు
ఆ వెండి చంద్రరేఖ పశ్చిమ సముద్రంలోకి

జారిపోకూడదు
ఈ క్షణాలు నా స్మృతుల్లో
నక్షత్రాల్లా అస్తమించగూడదు–
వెయ్యి తంత్రులతో వేడుకుంటున్నాను
ఒక సితారులా
ఈ రుతుదేవత అయిన కోకిల్ని
పల్లకీ ఎక్కించి
నా గుండెల రాస్తాల్లో
మోస్తున్నాను.

ఈ నాటి చంద్రుడ్ని మరిచిపోలేను
ఏనాటి అర్థాలో త్రవ్విపోస్తున్నాడు
ఈ తారలు తోరణాలై నా అనుభూతి పండుగలో
పాల్గొంటున్నాయి–

ఈ గాలి ఏ పూల సందేశాలు మోసుకుని వచ్చిందో
ఎప్పుడో ఎక్కడో నేను పారేసుకున్న
మధుమాసాన్ని గుర్తుకు తెస్తూ ఉంది
ఈ తావు లే యెదల వ్యథలు పెనవేసుకుని వచ్చాయో
ఒకప్పుడు నా అగాధాల్లోకి జారిపోయిన
దేదో లోపల గుచ్చుకుంటూ ఉంది–

జడివెన్నెల వానజల్లుల్లో తడిసి వచ్చిన
కోర్కెల రెక్కల చప్పుళ్ళు

నా గుండెల మండువాలో వినబడుతున్నాయి
కనుగోనల్లో తొంగిచూచిందొక అశ్రువు
షోకుగా చెక్కిలిమీదికి అవతరిస్తూ—

అది పోతేపోయింది ఇన్ని గుర్తులు
విడిచిపోవాలా!
ఒక వేయి పరిమళాలు వేయి గుసగుసలు
వేయి రంగులు— ఎంత ఇంద్రజాలం
మిగిల్చిపోయింది!
అది పోయింది, కానీ కన్నుల్లో నిల్చిపోయింది.

నీలి నీడలు మెదిలే తన విశాల
నేత్రాలు విప్పి ఈ రాత్రి
నా గుండెతో గుసగుసలాడుతూ ఉంది
కలలకు నా కన్నులు
తిన్నెలు చేసి కూర్చున్న ఈ రాత్రి—

ఈ రాత్రి ఒక సుందర దృశ్యం మాత్రమే కాదు
సుఖము దుఃఖము అందము ఆనందము
వేడుక వేదన స్మృతి విస్మృతి
అన్నీ కలిసి తమ జీవరక్తం పిండి
పండించిన ఒక అవ్యక్తమధుర క్షణం—

తాళలేని రాత్రి భావమధురిమకు
లొంగిపోతున్నా నాత్మ సరిగమకు
ఇది వన్నీటిలో కడిగిన క్షణం
ఇది గీతికలో తడిసిన రాత్రి—

వెన్నెల త్రాగిలేగానీ
వేణువులు ఏడుస్తున్న సాయంకాలాల్ని
భరించలేను
మనిషి చెప్పలేని వేదన
వేణువు అనుభవిస్తుంది
మాట ఊదలేని లోతుల్లో
ముంచివేయబడిన ఓడ!
మనిషి.....

నిదురించే తోటలోకి పాట ఒకటి వచ్చింది
కన్నుల్లో నీరు తుడిచి కమ్మటి కల ఇచ్చింది
రమ్యంగా కుటీరాన రంగవల్లు అల్లింది
దీనురాలి గూటిలోన దీపంగా వెలిగింది
శూన్యమైన వేణువులో ఒక స్వరం కలిపి నిలిపింది
ఆకురాలు అడవికి ఒక ఆమని దయచేసింది
విఫలమైన నా కోర్కెలు వ్రేలాడే గుమ్మంలో

ఆశల అడుగులు వినబడి అంతలో పోయాయి
కొమ్మల్లో పక్షులారా
గగనంలో మబ్బులారా
నది దోచుకుపోతున్న నావను ఆపండి
రేవు బావురుమంటోందని నావకు చెప్పండి

ప్రేమనుగురించి ఉత్ప్రేక్షలు పేనుతుంటే
గుండెని కోకిల తన్నుకుపోయింది
గజల్ గురించి రాద్దామని కూర్చుంటే
రాత్రి కవిత్వంలో తడిసిపోయింది

## రెండో సర్గ

సంధ్యాకాల బాహువుల్లో ఇరుక్కున్న
ధరిత్రి
సౌందర్య లీలకు లొంగింది
కోటలాంటి గుండెమీద
ప్రేమ శతఘ్ని ప్రేలింది

నిన్నూహించి రెండుముక్కలు చెపితే
అవే రెండు రెక్కలయి — ఊహ
విహాయసంలో కెగిరి పోతుంది
అదే ఒక గీతం అవుతుంది
అదే ఒక ప్రేమకపోతం అవుతుంది—

ఆ మత్తెక్కిన అవ్యక్తక్షణాల తెరల్లోనించి
నావైపు గంతులేస్తున్న ఆ కళ్ళెవరివి
కొండవాగుల పలచటి కెరటాల్లో
చలించే చేపల్లాంటి కళ్ళెవరివి?

యుగయుగాలు నీకోసం వెతికాను
ఉదయాస్తమయాల రంగుల పొలిమేరల్లో
వెన్నెల పొర్లాడే వచ్చిక వేలల్లో
మబ్బుల మందలు ఆకాశపు బయళ్ళలో

పరుగులెత్తుతున్నప్పుడు
చినుకుల పిల్ల గుంపులు, పందిటి
ముందట చిందులాడుతున్నప్పుడు
శీతల వాయువు కిటికీలో
ఈలలు వేస్తున్నప్పుడు
మది దిగులుతో కుంగిపోతుంది
వాననీటి పాయల్లో రాత్రి వెలుగునీడల్లో
ఒంటరిగా పోయే కాగితపు పడవతో
కలసి వెళ్ళిపోతుంది—

విధి నా యెదపై విరిసిన ఎర్రగులాబీ!
నీ మృదుపద విన్యాసాలకు
తలపులు పూలచాపగా పరచాను
మెల్లగా రా! చల్లగా రా! ఓ ఎర్రగులాబీ!

కొమ్మల్లో విచ్చుకుంటున్న కుసుమ సమూహాల
పరిమళ నిశ్శ్వాసాల్లో పరవశిస్తోంది నిశ్శబ్దం,
కలలు కన్నీటిలో జలకాలాడుతున్నాయి
ఈ మిగిలిన క్షణాలు రాలిపోకముందే
రా! నీ తెలితామర పూతనువును
నా ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాల ఉయ్యేలలో
ఊపుతాను—

నా చూపులు నీ మోముమీద పడినప్పుడు
నిదుర నా కన్నులు విడిచింది
ఈశిథిలాలయంలోఆశల అగరుధూపం వేశాను
తరుముకుని వచ్చే చరమ నిమేషాంధకారంలో

రెండు చేతులతో నా ప్రాణజ్యోతి పుచ్చుకుని
నీ కోసమే ఎదురుచూస్తున్నాను

నీవు తాగే కాఫీలోకి
ఒక పంచదార చినుకునై
రాలుతాను
నీ గుండె అనే వాజులోకి
ఒక పువ్వునై చేరుతాను
నీవు కన్నెత్తి చూడకుంటే
పద్యమనే పది అంతస్తుల మేడ ఎక్కి
భూమి మీదికి దూకుతాను

ఆమె నడక ప్రోజుపోయెం
ఆమె కంటే మ్యారివానా నయం
ఆమె పొడుగు పొగడ వృక్షం
పూర్ణ సముద్రం వక్షం

బహుజన్మల సమూహాలకు పూర్వం
నాలో నీవూ నీలో నేనూ ఉన్నాము కాబోలు...
ఆ కథలు – ఇంద్ర నీలాల గనులు–

ఏవో తెలియని రహస్యాల కోనలు మసలే
ఆ కొమ్మల్లో దర్శించాను, ఎప్పుడో విస్మరించిన

నా పరిమళాల ప్రపంచాన్ని–
అదృశ్యమైపోయిన నా బ్రతుకుల కోనల్లో
దారికోసం ఇటూ అటూ
సంచరిస్తున్న ఒక అవ్యక్త షహనాయీ స్వరఝురి–
నిశ్శబ్దంగా ఉషస్సు చుంబించే
నిశ్చల వనభూముల్లోకి
చంద్రకిరణం నించి మెల్లగా జారివచ్చిన
ఒక అప్సరసలాంటి హిందోళరాగ లహరి–

చెంగావి లేయెండల్లాంటి వలువలు దాల్చిన
రాజమహిళలు
వారికురుల ఇరులతో చెరలాడే
కుసుమ తుందిల గంధిల నీలిమలు
కోటల్లో తోటల్లో మేడల నీడల్లో కూర్చుని
చెలికత్తెలు ఋతుగీతిక లాలపిస్తుంటే
కురంగి కన్నులు విప్పి చూస్తుంటే
రంగులు విహంగి పురివిప్పి నటిస్తుంటే
ఓ! ఏమి స్మృతులు! ఎన్నో మృతుల వెనుక
నిలిచి పిలిచే సుందరాకృతులు

ఆ విదూర వింధ్యోత్తరభూములు
ఆ గిరులు ఆ నగరులు ఆ తరువులు–

ఏ చిత్తరువులు మా నాన్న గ్రంథాల్లో చూచానో
ఏకాంతంగా కూర్చుని ఒంటరి బాలుడ్నిగా
నా అవ్యక్త మనఃకుహరాంతరాల్లో వెతికానో

ఎప్పుడో పోగొట్టుకున్న ఏదో సౌందర్యంకోసం—
ఆ సౌందర్యం!
దొరికిందిప్పుడు ఈ కళ్ళల్లో
దూరాన ఉదయించే ఆ ప్రాచీ రేఖల్లో
పుట్టుకకోసం నిరీక్షిస్తూ
చిరునవ్వుల మోములు చూపించే
నా పుట్టని ప్రియ శిశువుల జననీజనకులు
ఆ రెండు కళ్ళల్లో....

నీ గుండె మీద నా ప్రమాణం రాస్తా
నా గుండెతో దానిమీద ముద్రవేస్తా
నీలో దకాల్లాంటి నీ నేత్రాలు
ఇంకా నేను ప్రయాణం చేస్తున్న సముద్రాలు
వాజుతో నీవు తెచ్చిన పుష్పాలు
నా గదిలోకి వచ్చిన చైత్రాలు

నీతో ఏవి చెప్పలేక పోయానో అప్పుడు
అవి నా పాటల్లోకి వచ్చాయి ఇప్పుడు
వీక్షణాల్ని అందుకోలేకపోయానో అప్పుడు
అవి నా మధువుల్లోకి అస్తమించాయి ఇప్పుడు
ఇప్పుడు నా పాటలు మనుష్యుల్లోకి
ప్రవహించే నదులయ్యాయి

నా ఎత్తులు నగరాల్ని చూచే
కొండ శిఖరాలయ్యాయి

నేను నిద్రలేచినా
నా అవయవాలు ఇంకా నిద్ర
పోతూ ఉన్నాయి
రక్తప్రవాహాలు ప్రవహించడం
మరచిపోయాయి
నా భయంకర మనోజలధికి
ఎవరు ఆనకట్టలు కట్టారు
నా శరీర భూగోళం ఇరుసు
ఎవరు వంచారు
పువ్వులు పువ్వులు పువ్వులు
చెట్ల ఆధ్యాత్మిక జ్వాలలు—

అడగవద్దు నన్ను యౌవనం ఎలా గడిచిందని
ప్రభాత సాయంకాలాల్ని చూస్తూ నేను
పరుగులెత్తిన పాలాల్ని అడుగు—

అడగవద్దు నన్ను జీవితంలో
ఎలా దోచుకోబడ్డానని
నేను హృదయమొడ్డి ప్రేమించిన
ఎండమావుల్ని అడుగు—

అడగవద్దు నన్ను ఎలా
కాలం గడిచి పోయిందని
ఊరిమంచి ఊరికి వలసపోతుంటే
చూచిన చెట్లను పక్షుల్ని అడుగు—
విశ్రాంతి కథలు నానుంచి
ఏమి వింటారు
ప్రేమలు పోరాడిన భూములు
అశ్రుతుఫానులు ఆశాభంగాలు

మబ్బుల వలువలు విడిచి రాత్రి
నగ్నంగా స్నానం చేస్తోంది వెన్నెట్లో
పూలసౌరభాలతో గాలి గుసగుసలాడుతోంది
నీవు వస్తావన్న నిరీక్షామధువు చప్పరిస్తూ
ఎద మత్తులో ఒత్తిగిల్లింది

కలలెగిరి పోతాయని కన్నులు ముకుళించాయి
రేకుల్లో తేనె దాచుకున్న తామర పువ్వుల్లా—

మల్లె పొదకు తగులుకున్న దేశద్రిమ్మరి చంద్రిక
నీ వెన్నెని వలువ అని నాచేయి పట్టుకోబోయింది...

కలలతోటే వెన్నెలలంతా ఖర్చయిపోతే
నీ చరణధ్వనులు నాగుమ్మం తొక్కేనాటికి
మిగిలిందేమిటి?

భ్రమ తొలిగిన బ్రతుకు
నీరువదలిన తామర కొలకు—

ఇంద్ర ధనస్సు తలపాగా చుట్టుకున్నవాడు
కంటక పాషాణపథాల్లో
ఒంటరి బాటసారిగా మిగిలాడు
కలలెగిరిపోయిన కళ్ళు
పక్షులెగిరిపోయిన గూళ్ళు—
గగనంలో నర్తించే తారల సమూహాలమీద
ఉషస్సు అరుణకిరణాల వల విసిరేశింది...

చిరునవ్వులు చిందే తారకలతో
నింపుకున్నావు నీ శూన్యాన్ని
బరువైన కన్నీటి బిందువులతో
నింపేవు నా శూన్యాన్ని

అరవిరిసిన పూల నెత్తావులతో
బుగుల్కొల్పేవు నీ గాలిని
ప్రిదిలిన ఎద వదలిన వేడి నిట్టూర్పులతో
రగుల్కొల్పేవు నా జోలిని

కోమల మలయ సమీరంతో
రెక్కలు సంతరించుకున్నావు నీ వేళకు

నిత్య జీవవన శిలలతో నిగళాలు
వేశావు నా కాళ్ళకు
కొందరికే తెలుసు జీవిత శక్రచాపం
వెనకున్న నగ్నత
కాని తప్పదెవరికీ ఆ రంగుల
వలలో నిమగ్నత

ఏది ఎందుకు తారసిల్లుతుందో
ఎవరూ చెప్పలేనిది బ్రతుకు
కారణాలకు అదృశ్య
దూరతీరాల్లో వెతుకు
నిశ్శబ్ద నిశా మధుశాలనించి
వీచే సురభిళ వాయువీచిక
తూరుపు తెరల్లో మేల్కొలిపింది
ఉషశ్శారిక కోరిక

మరుభూముల ఇసుకల్లో
నడిచే ఓ బాటసారి
దొరక దనుకోకు కలువలు
విచ్చిన చల్లని కాసారవారి.

ఎన్నాళ్ళకు మా అతిథివిగా వచ్చావు
ఈ శిథిల కుటీరానికింత వెలుతురు తెచ్చావు
గగనానికి నీలిమ పూశావు

గాలికి వుప్పొడి రాశావు
జగతిమీద శాద్వలాలు పరచావు
బాటల్లో తోటల్లో పువ్వులు చల్లావు
గ్రుక్కెడు విశ్వబ్దం త్రాగి, చిరిగిన
చీకట్లు కప్పుకొని పడున్ననాకు
కమ్మని ఆశామధురిమ కానుకగా తెచ్చావు—

తలపుల సీతాకోక చిలుకలకు పూలపీటలమీద
ప్రభాత కిరణాలతో అభ్యంగనం చేయించావు—
కొమ్మల్లో గుసగుసలాడే కోర్కెలతో
కలసి జిలిబిలి గీతిక అల్లావు—
ఆశ నిరాశల నూలుపోగులతో అల్లిన జీవితాన్ని
మధురక్షణాలు జరీపూల బ.టాలతో
అలంకరించావు—

సంజకెంజాయల్లో విరిశిన సన్న చీకట్ల
జీరలు చూపి
వెతలలో ఉన్న చిరుచేదు రుచి చూపించావు—
అంగూరు చితకందే ఆసవం రాదనీ
చెరుకు నలగందే శీధువు వెలువడదనీ
చితికిన బ్రతుకు లోతు ఆవిష్కరించావు

వ్యథ కళ్ళకద్దుకున్న మనిషి
బ్రతుకు తవకు బానిసైన వాడవి తెలిపావు
ఆత్మ అనే మంచు ముక్కను అందులో కరిగించి
ప్రేమపూర్ణ పాత్రిక అందివ్వమన్నావు.

మాట్లాడు తరుణీ
ఒక్కసారి మాట్లాడు
అదృష్ట తీరాలనించి అవతరించి
నా నేత్రాంచల సీమల్లో ఇంద్రధనువులా
విరిసిన కలా!

గులాబీ మొగ్గల్లాంటి ఆ పెదవులు విప్పు—
నా అపరిపక్వ జన్మాంతర కెరటాల గమిలో
ఎన్నాళ్ళు విదురించావో— వీనస్‌డెమెలో
మెలో—ఆలో—క సౌందర్య రాశీ!
రోములో ఏకాంత శిథిల శిలా
ద్వార బంధంలో కనుపించావు
కొండలవెనుక చెట్ల కొమ్మల వెనుక
సంధ్యాకాల దీధితిగా కనుపించావు
కాలపు గులాబీలు దోచుకొని
పారిపోతున్నట్లు కనుపించావు—

ఆ రోమన్ అస్తమయం మైకేలేంజిలో
బ్రతుకు వెన్నెల వన్నెల్లో ముంచిన
తూలికలా ఉండేను—

నీ కన్నులు మిన్నులు విరిగిన నీలి శకలాలు
రెండు విహంగాలుగా, రెక్కలు వచ్చిన
రెండు ఇంద్రనీల మణులుగా అవంత
వీథుల్లోకి ఎగిరిపోయాయి—

నిన్ను చూచాను
నన్ను మరచాను
ఒక తియ్యటి కల రాయంచలా
నా మధుర నిదురలోకి వచ్చింది ఒయ్యారంగా
తేలియాడుతూ వచ్చింది తెలిమబ్బు తునకలా—

సంతోషపూరిత బెలూనులా
నే నాకాశపు నీలిబాహువుల్లోకి ఎగిరిపోయాను;
ఏదన్నా చెప్పుడెమెలో! ఏదన్నా చెప్పు
ఈ పూల నిట్టూర్పులు ముసురుకున్న
నిశావేళ గడచిపోకముందే చెప్పు—
ఎన్ని రాత్రుల వెన్నెల లహరుల్లో జలకాలాడేవో
ఎన్ని గులాబీ సంధ్యల పరిమళాలు అనుభవించావో
నీ అతిలోకమూర్తి పెదవుల మధువులపై
నా మానవ కళంక ముద్రలు వేయనా
చెప్పు డెమెలో!

ఎందరు పయనించే బాటసారుల ఆశాంచల
వీథుల్లో ఉషస్సులా మల్లికలా వికసించావో
ఎందరి కన్నుల్లో రంగు రంగుల కలల పులుగులకు
కోర్కెల పట్టుదారాలతో పేశల ఆశల
గూళ్ళు నిర్మించావో అదంతా చెప్పు!

నీవు శిలవు కాదు కలవు కాదు నా వలపుల
వలలో చిక్కిన శబలవర్ణసంచాలిత శఫరివి
ఒక అనిర్వచనీయ క్షణంలో

నా కోటి నాడుల దారుల్లో విరిసిన
సౌందర్య రసానుభూతివి

క్రూరమైన జీవితం ముక్కలు చేసిన నన్ను
కలిపి జీవం పోశావు
నిన్ను దర్శిస్తూ సరేంద్రియాలతో స్పర్శిస్తూ
పరవశించే వేళ
నా ఒడినిండా మధుర స్వప్నాలు నింపావు
నిన్నుగూర్చి భావాలు పూలపడవల్లా
నా సర్వాంగ శోణిత సరసీజలాల్లో
సంచరిస్తున్నాయి–
ప్రే మొక మకరందమైతే నేనొక పుష్పాన్ని
నీ కోమల పాదలతాగ్రాలు పూచిన పుష్పాన్ని
ఓహో ఏమి జరిగింది నీ కౌగిట్లో నాకు!
తొలి ఋషులు అగ్ని కీలల్లో మంత్రగ్రామాలు
దర్శించినట్లు
నీ కౌగిట్లో ప్రేమజ్యోతిని చూచాను
నేను నీ భౌతిక మూర్తికోసం రాలేదు
వచ్చానొక కిరణం కోసం
ఒక కవితా చరణం కోసం
కిరణాల్లో స్నానం చేశాను
మృదు మధుర స్మరణల్లో గానం చేశాను
నన్ను నేను చేరుకున్నాను.

# మూడో సర్గ

పూలని గాయపరస్తూ
వీస్తోంది గాలి
నఖా రాత్రులు పరిమళాల్లా
ఎగిరిపోవచ్చు
ఒక కీటకం
పువ్వును శయ్య చేసుకునే రాత్రి
మళ్ళీ రాకపోవచ్చు
పువ్వుల్లో మునిగిన పాదాలకు
నమస్కారం చెయ్యి
కలల్లో మునిగిన కళ్ళకు
నమస్కారం చెయ్యి
మబ్బుల గ్రామాల అవతల
చూడు
ఎక్కడో ఉంది ఒక
ఏకాకి తార :

నా బాల్యాన్ని నిశ్శబ్ద మాధురిలో
పోషించిన మా గ్రామం
మొన్న చూపించింది
తన ఉనికిని చెరుపుతున్న భయంకర
శబ్ద వ్యాయామం
వీధిలో లారీ గుళ్ళో లౌడ్ స్పీకరు

వర్తమాన జీవన విధానం :
తెలిసింది దేశం మారింది
ఇదే కాబోలు మన స్వప్నధామం

ఈ ఆకాశంలో నక్షత్రాలు
చినుకులై రాలితే
భూగోళానికి కాంతి ఇచ్చేది
సూర్య చంద్రులకు బదులు
ఒక ఇంద్ర ధనుస్సు అయితే
మోటార్ల మీద గాక మనుష్యులు
జింకల మీద స్వారి చేస్తే
నల్లటి రోడ్లు గాక నగరాల్లో
రిబ్బన్ల లాంటి పచ్చిక బయళ్ళయితే
మనిషి ఈ జ్ఞాపకాన్నంతా
మరిచిపోతే
పరుగులెత్తించే గడియారాన్ని
పగులగొట్టి పారేస్తే
ఓహ్ : మానవ సమాజం
శతాబ్దాల బట్టీ ఇచ్చిన కీ నుంచి
మనిషిని విడుదల చేస్తే

దుఃఖాన్ని మోయని గీతము
చరిత్రని మీటని లయ

కుతుబ్ మీనార్ లేచి నుల్చోని
వాక్యాలు
గంగ ప్రవహించని సమాసాలు
కోటి కోటి పల్లెలు పట్నాలు
గుసగుసలాడని అక్షరాలు
ఎన్ని కలిశినా ఏతీగా కదలదు
ఏ వేణువూ పలకదు
ఏ గొంతూ మేలుకోదు

చైత్ర వైశాఖాల శాఖల్లో
ఆ కోకిల దుఃఖాలన్నీ మరచిపోయి
ఎంత బాగా పాడుతోంది
తన దుఃఖపు కన్నీటిని
తన చెఱగుతోనే తుడుచుకోవలసిన
ఈ క్రూర జీవితాన్ని
బ్రతకడమెలా ?
ఒక వసంత చ్ఛాయలేకపోతే......
అందుకే నేను పాదాక్రాంతు
డ్నవుతాను
ఈ చిగురాకు నీడకు

వచ్చాయి పూల బంధువులు
తెచ్చాయి తేనె బిందువులు

పిలిచాయి విందు కిద్దరిని
పోదాము ప్రేమ విహ్వరిణి——

అటు చూడు కొండలంతా
ఇటు చూడు కోనలంతా
ఎటు చూడు, జగమ్మంతా
రంగేళీ పూల సంత——

(గుండె గాయాలు చిరునవ్వులతో కప్పుకో
పాత స్వప్నాల హారాన్ని దులిపి మెడలో ధరించుకో
కార్చే కన్నీళ్ళు కనురెప్పల్లోనే దాచుకో)
అవి బ్రతుకు కడలి ముత్యాలు
మన జీవన సత్యాలు—

పోదాము ప్రేమ విహ్వరిణి
పిలిచాయి విందు కిద్దరిని—

పరాగాల షిఫాను
పరిమళాల తుఫాను
నేను నేటి సుల్తాను
గతం మరచిపోతాను...
(ఇది రంగుల నెల పరిమళాల నెల పువ్వుల నెల నవ్వులనెల)
చూడు, జీవితం ఎక్కు పెట్టిన ధనుస్సులా ఉంది.
వడిగా కొండల ఒడిలో దూకే జలపాతాలు
మన ప్రేమకు సంకేతాలు)

చేరుదము పూల మేళా
ఊగుద మాశల డోల—

గులాబీల ఉదయాలు కుంకుమ అస్తమయాలు
బుల్బురి జిలిబిలి పాటలు
జగమే మన రంగుల గూడు—
(చుక్కల గుంపుల్లో ఉన్నా జాబిల్లి
గగనంలో ఒంటరి బాటసారి)

నీవు రాకుంటే—
కొమ్మల్లో తెమ్మెరలేదు
పక్షుల్లో పాటల్లేవు
తోటల్లో పువ్వుల్లేవు
బాటల్లో వెలుగుల్లేవు—
(నీ నవ మృదులాంగుళి అందిస్తే
నీ చూపుల పన్నీటి జల్లు చల్లితే

పూలు కలకల నవ్వుతాయి.
పక్షులు పాడుతాయి
జీవిత పథాల్లో చైత్రం వెల్లివిరుస్తుంది)

కాలువలో పూల పడవలం
కొమ్మల్లో జంట పక్షులం
తోటల్లో తేనెటీగలం
పందిట్లో పూల తీగెలం

బ్రతుకే ఒక దరహాసం
మనసే ఒక మధు మాసం
పోదాము ప్రేమ విర్ఝరిణి
పిలిచాయి విందుకిద్దరివి–
ఒక క్షణం మధుర క్షణము
ఒక క్షణం చేదు క్షణము
బ్రతుకొక అతుకుల బొంత
శేషంద్రకు నీవే అంతా–
పోదాము ... ...

ఆమె "మూడయిదులు" విడిచే
ఒక నీలి వలయం
నా కళ్ళ మీదికి దాడి చేశే
ఒక మెడిటరేనియన్ పాయెం
చెట్లకూడా రంగుల చెక్కర్లు
తెచ్చే ఒక అయోమయం
రైలెక్కి పోతుంటే ఊరూరా
జ్ఞాపకం వచ్చే ఒక అనుభవం

వాజెదు పూలతో వసంతాన్ని తెచ్చిన నా ప్రేయసి
నా గదిలోకి వచ్చిన నక్షత్రాల రోదసి
ద్రవరూపమెత్తి పానశాల చేరిన ద్రాక్షాలయ నివాసి
నేనెదుర్కొలేని ఒక మధురమైన రాక్షసి

పరాగ రేణువులై పరిమళించె నా మధువు
హజారు వేణువులై పాడసాగె నా తనువు
అదేమి నీ మహిమో అడుగుపెట్టినావా లేదో
గదంత ఒక్కసారి వసంతరుతువాయె

ఆవిడతో కలిసి నేను పోతుంటాను అబిద్ రోడ్డులో చీరెల దుకాణాల్లోకి

ఏ ఇంద్రజాలం చేతనో అప్పుడు బాలుడ్నయి ఎగురుతున్న ఇంద్రధనుస్సుల్లో కురుస్తున్న నక్షత్రాల చినుకుల్లో, ఎప్పుడూ ఫలించని స్వప్నాలు పీడిస్తున్న నేత్రాలతో తేలిపోతాను–

ఆ అందాల్లో జారబడి దోశిళ్ళతో తాగిన తర్వాత ఏ కోరిక ఊరుకుంటుంది.

బయట రోడ్డులోకి వచ్చేసరికి కళ్ళలో చార్మినార్ శిఖరాలు లేస్తాయి

బ్రహ్మాండమయిన శ్వేత మేఘాల పంక్తులు బారులు తీరి పోతుంటాయి.

వీధిలో క్రికెట్ ఆడే కుర్రవాడిలా గాలి ఒక్కసారి కాగితపు ముక్కల్నీ ఎండాకుల్నీ ఎగరగొట్టేస్తుంది.

ఆ ఊపులో ఈ లోకం పూలబంతయి ఎగిరి ఏ దూర దూర వనాల్లో పడిపోతుందో అని ఒక ఊహ గిర్రున కేబెరా నర్తకిలా తిరుగుతుంది–

ఒక కొత్త లోకం కోసం దేహం దేహమంతా ఉద్రూత లూగుతుంది..........

వసంత ఋతువు వచ్చిందో లేదో
కోకిల గొంతు పేలిపోతోంది
చైత్ర మాసపు ఎండ చూచిందో లేదో
బీరు సీసామూత ఎగిరిపోతోంది

నురుగులు గొంతులోకి జారిపోతున్నాయి
వృక్షాలు పుష్పదేవతలై తేలిపోతున్నాయి

వాక్యాలు ప్రేమలోయల్లోకి పడిపోతున్నాయి
వాస్తవాలు స్వప్నాల మాయల్లోకి దొర్లిపోతున్నాయి

క్షణకాలం మరచిపోదాం
ప్రజల కన్నీళ్ళు పుస్తకాలు చేసి అమ్ముకునే కవుల్నీ
ఓట్లుగా మార్చి వాడుకునే నాయకుల్నీ
చెట్టుమీద పూలు ప్రవహిస్తున్నాయి
అనుభవిద్దాం పద ఆ ఇంద్రజాలాన్ని

ఈ దునియా ఏమనుకుంటే నాకేమి?
ఆ నక్షత్ర గుచ్ఛాలు తెంచుకోడానికే
నా చేతులెత్తుతాను
దోసిళ్ళు పడతాను ఈ చైత్ర
మాసాల గుంపుల మేళాలోనే
మిలన మాధురి త్రాగడానికి—
లోకపు ధూర్తులతో నాకేం పని
అక్షరాల పూల పొట్లాలై
ఉత్తరాలు నా గుండెల ముంగిళ్ళకు

రావాలనే
స్వప్నాల్లో మునిగిపోతాను

వసంతం అంటే మజాఖ్ కాదు
పువ్వు పువ్వూ గొంతెత్తి పిలిచే రుతువు
ఆకు ఆకూ అనంత భవిష్యత్తుల
ప్రతీక ఐ నర్తించే రుతువు
చెట్ల నిండా కలలు పూచే రుతువు
రంగూ రాగమూ కలిశి నీ మీద
కుట్ర చేశే రుతువు

ప్రేమ కోమల హస్తంలా వస్తువుల్ని
స్పృశించే రుతువు

అంగుళులు సోకితే చాలు తీగె
కీచుమని వెయ్యిస్వరాలు రాల్చే రుతువు
వసంతం కామదేవత చేసుకునే సౌందర్య క్రతువు–

ఓ అక్షరాల వేటగాడా
ఇక దించు నీ ధనుస్సు
మనిషి భవిష్యత్తులో వ్రేలాడుతాడు
ఒక ద్రాక్షగుత్తిలా

మెదడులో నిద్రిస్తున్న నదులన్నీ
మేల్కొంటాయి
ఆకాశం అరుస్తుంది
నీ కీర్తిని గురించి;
నీ స్వరాల్లో నుంచి దేవతలు
దూకుతారు గుంపులు గుంపులుగా
కురిపిస్తారు నీ మీద
ఆశీర్వచనాల పుష్పవర్షాలు...

చెట్టుకొక దేవతలా చేరాయి పక్షులు
ఎంతో గొప్పఋతువు, ఈ వసంతాన్ని
కోల్పోకు

నా స్వరాలన్నీ సమావేశం చేసి
చెపుతున్నాను
నా శబ్దాల హిరణ్యంలో మునుగు
శతాబ్దాలు నీ గుమ్మంలో
చాకిరీ చేస్తాయి
నీ కిటికీలో బుల్బుళ్ళు పూస్తాయి
నీ ఉదయాలు పళ్ళ బుట్టలై
పరిమళిస్తాయి

ఇది అదే రోజు
ఎండమావుల్ని వరిస్తూ నీలి దీవుల్ని స్పృశిస్తూ
ఆశల విస్ఫులింగాలని కన్నుల్లో నింపుకుని వచ్చింది--
ఈ రోజు మళ్ళీ మళ్ళీ అనేక
శరత్తులదాకా ఇలాగే వస్తూ ఉండాలి;
నా యెదలో పచ్చటి శాద్వలాలు, ఊపిరి పీల్చే
మరకతాల పొలంగా నిలవాలంటే
జీవకాంతు లొలుకుతూ దేవకాంతల్ని నాట్యానికి పిలవాలంటే
అనేక శరత్తులదాకా ఈ రోజు ఇలాగే వస్తూ ఉండాలి
ఈ రోజే నా ప్రాచీ రేఖ మీద ఒక తార
ఉదయించడం చూచింది.
ఈ రోజే నా ఆశ నీ ముఖ బింబం మీద
తుఫాను వీచే జీవన సముద్రంలో
తేలే ఒక్క ప్రేమ నావను చూచింది
ఒక్కరోజే కావచ్చు
అది చరిత్ర పెదవుల్ని చుంబించింది
రెండు కిరణాల్ని ముడివేసి అక్షర జగత్తు
మెడలో వేసింది,
చందమామై నా యింద్రియాల
గిన్నెల నిండా వెన్నెల నింపింది
నాకు తెలుసు ఈ రోజు ఉభయ ప్రపంచాల
కవితా పేజీల్లో
సువర్ణాక్షరాల మాల వేయించుకుంటుందని,

ముల్లోకములు ఏలు ముద్దుల జాబిల్లి
విరజాజి తీవలకు విరహిణీ జీవులకు
తరిపి వెన్నెలపాలు తాగించుచున్నాడు—

ఏ గాలి కెగసెనో ఈ చికిలి తారకలు
అందాల తళుకులతో అప్సరసలకు మల్లె
ఆకాశరంగాని కవతరిస్తున్నాయి——

నిర్మలాకాశపు నీలాటి రేవులో
పండువెన్నెల నీట పిండి ఆరేసిన
తెలి మబ్బు వలువలు తేలిపోతున్నాయి——

చిగురు గుబురులు దూరి చిరుగాలి బాలికలు
రేరాణి పూలపై పారాణి రాచుకుని
చిక్కని నెత్తావి పుక్కిలిస్తున్నాయి——

తీయని భావాల లోయలన్నీ కలిశి
రాగమయ జీవన రమ్యవన భూమిలో
గొంతెత్తి గీతాల గోల చేస్తున్నాయి

ఓ సఖీ రావె వసంతోత్సవంలో
సరాగాలు రాగాలు ఆడుదాం పాడుదాం

సుగంధానిలంగా షోకుగా రావే
నదీ పాద మంజీర నాదంగ రావే

ఏదో తన్మయత్వాన ఈ ప్రేమ పాగల్
స్మరిస్తూనే ఉన్నాడు నిన్నే ఒ బుల్బుల్

ఋతువులా వచ్చే కుసుమదేవత నీవు
ఎలుగెత్తి పిలిచే ధరిత్రిని నేను

ఎలా ఆడుదామే వసంతాల ఖేల
నీలాల నింగిలో హెూలీల మేలా–

ఇదంతా తమాషా కవిలోక బాదుషా
ఖుదాతోడు నీ గాధ అమర్‌హై హమేషా

ఇది వింశతితమ శతాబ్ద
ద్విసప్తతి తమ సంవత్సరాన (1972)
విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్ర నామధేయ
కవివర్య ప్రణీత శేషజ్యోత్స్న
నామాంతర సమేత
జ్యోత్స్నా పర్వము సర్వము
సమాప్తము

# మౌక్తిక పర్వము

చమత్కారికలు

వీధిలోకి వ్రేలాడే బత్తాయి పండు
మా ఫలం కాదు
మా ఫలం గగనంలో వ్రేలాడే
సూర్యుడు!
చచ్చేముందు మాకు న్యాయం చేస్తే
మేము వాడి మిత్రులం
మమ్మల్ని ఆకలితో చావనిస్తే
మేము వాడి శత్రువులం

నీకెందుకింత అశాంతి
నీకెందు కింత ఆవేశం అంటే
ఏం చెప్పను?
సముద్రాన్ని అడుగు నీ కెందు కింత
అశాంతి అని
ఝుంఝూమారుతాన్ని అడుగు
నీ కెందు కింత ఆవేశం అని

కాలాన్ని నా కాగిలతం చేసుకుంటా
దాని మీద లోకానికి ఒక స్వప్నం

రాశి యిస్తా
దాని కింద నా ఊపిరితో సంతకం చేస్తా

సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు
నేనింతా ఒక పిడికెడు మట్టే కావచ్చు
కానీ కలమెత్తితే నాకు
ఒక దేశపు జెండా కున్నంత పొగరుంది

కష్టాల్ని కన్నీటిలో ముంచుకుని
బిస్కెట్లలా తింటాను
బ్రతుక్కంటే బలవంతుడైన వాడే
శబ్దం నుంచి శతాబ్దం వరకూ
మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను

నా పిడికిళ్ళ కెప్పుడూ వాడే లక్ష్యం
వాడి బలిసిన శరీరాన్ని ఆ కుర్చీ చేతులు
పట్టుకో ఉన్నాయి గానీ లేకపోతే
వాడెప్పుడో భూమ్యాకర్షణ శక్తికి
బలికావలసిన వాడు

అడుగడుగునా కనిపించే
ప్రభుత్వ మార్కు ముఖాలవి చూస్తూ
నాలో ఉన్న ఫిరంగులన్నీ పేలుతాయి—
చెట్ల వైపు చూస్తూ
ఈ చెట్లు పూలెందుకు పూస్తాయి
ఇవి బుల్లెట్లెందుకు పుయ్యవు
అని కేక వేస్తూ

హేయ్ పువ్వులూ పక్షులూ
మీ గొంతులు కట్టి పెట్టండి
నా తుపాకి నన్ను తీసుకోనీండి
అసహ్యతని సహిస్తూ నిద్రిస్తున్న
మనస్సులన్ని మేల్కొల్పనీండి
వాటిని భయంకర మారుతాలుగా మార్చనీండి
వాటికి ద్వేషించే పవిత్ర విద్య
నేర్పనీండి

నవ్వు మొహాన రాశిన వాళ్ళని చూస్తే
నా చెయ్యి బాంబు కోసం వెతుకుతుంది
వాళ్ళకు నవ్వేంతటి సుఖం ఎలా దొరికింది
ఈ దేశంలో :
ఈ దేశంలో వంగే వాడికి

వంగి సలాం చేశేవాడు పుడుతున్నాడు
జాగ్రత్త : ఈ లక్షణం తలయెత్తిందంటే
ఆకాశంలో తోకచుక్క పుట్టిందన్నమాటే

నా అవయవాలకు నీచంగా వంగే
భంగిమలు తెలీవు – నేను సత్యాగ్రహిని
నా కశ్మల శరీరాన్ని దగ్ధం చేసుకుని
తప్త హిరణ్య ద్రవంగా ప్రవహిస్తున్నాను
నా దేశపు రహదారుల్లో –
రండి నాతో కలిశి

నా ఉష్ణోగ్రత చూచి నాగరక భాష
నా పెదవులు వదలి పరారయి పోయింది
ఇప్పుడు తిట్టు కాదు నా శరీరం
అగ్నిచ్ఛటల వర్షపాతం వీస్తోంది

ఆ పెద్ద బిల్డింగుని ఒక్క గుద్దుతో
బ్రద్దలు చేద్దామని నా హస్తం లేస్తోంది
నన్నిలా చూస్తే ఏముంటుంది?
బ్రతికి ఉంటే పామరుడ్ని చస్తే అమరుడ్ని –

పోతున్నాను నా జ్ఞాపకాలు మోసుకుని
ఎక్కడ దొరుకుతాయా మందులు
ఈ గాయాలకని
ఇక్కడ జీవితం ఎవడ్నీ విడిచిపెట్టదు
ఓ పక్షీ నీ పాట ఇక్కడ పాడబోకు
ఎగిరిపో నీ వనాలెక్కడున్నాయో
వెతుక్కుంటూ

నాగళ్ళు తీసుకోండి నా సోదరులారా:
పుస్తకాలు పారెయ్యండి నా దేశపు
పిల్లలారా !
మన ఉషస్సుల్ని పాతిపెట్టి
మన దేశంలోనే మనల్ని
బానిసలు చేసిన వాళ్ళ ప్రాణవాయువులు
పీలుద్దాం పదండి

నా గంభీర వేగాన్ని చూడండి
రండి నా శబ్ద జ్వాలల మీద
మీ హృదయాల్ని రొట్టెల్లా కాలుస్తా
మీరెటు నడవాలో చూపిస్తా

నా చతుర్భుజ పద్యాలతో నా స్పృహ
నా దేశానికి దానం చేస్తున్నా
నేను అడవుల కడుపుల్లో నేర్చుకున్న
భాషలోనే ఇక శతాబ్దాలు మాట్లాడుకుంటాయి
నా మాట భావితరాలకు వారసత్వంగా
సంక్రమిస్తుంది
నా పద్యాలను పొందే అర్హత
భూగోళం మీద జాతులకూ
దేశాలకే ఉంటుంది.

గంగానది మొదట ఒక దేవత
తర్వాత పడవల రస్తా
ఆ తర్వాత మన పొలాల్లోకి పారే
పంటకాలువ !
చూచావా కాలం చేతుల్లో
దేవతల రూపాలు కూడా
మారిపోతాయి

ప్రతివాడూ కాంతికి బానిసే
చీకట్లోకి పోలేడు గనక
ఇటు రా నా వైపుకు
నాగుండెలో రక్తం నీ గుండెలో రక్తం
కలబోసుకుందాం
ఇద్దరమూ ఒకే తుఫాను పంచుకుందాం

నేను మానవ జీవిత పొలాలన్నీ దున్నుతా
ఈ చేత్తో నేను ఏ అందాన్ని సృష్టించలేదు
ఏది ఈ భూమి మీద ఈ చేతికి లొంగలేదు
కానీ ఈ చెయ్యి ఖాళీగానే ఉండిపోయింది
శాశ్వతంగా

నీవు కాలేజీకి పోతుంటే బాబూ
నిన్ను పొలాలు బిక్కమొహంతో చూస్తున్నాయి
నీవు కాలేజీ గోడల్లోకి పోతావు
అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు
ఆ తర్వాత ఎప్పుడూ ఎవ్వరూ తిరిగిరాని
గోడల్లోకి పోతావు:
ఇక నీవు బ్రతికిందెప్పుడు?

నా నడకలు అడవుల్లో తిరిగే సింహాలు
నేను పూలతో పోట్లాడుతాను
తుఫానులతో పోట్లాడుతాను
పోట్లాట నేను బ్రతకడానికి
పీల్చే ఊపిరి !

మీరు పలకా పుస్తకాలు పట్టుకుని
పోతుంటే బాబూ మీరు శిలువలు

మోసుకుపోతున్న బాల్యాక్రైస్తుల్లా
కనిపిస్తారు – లే బాబూ లే
నీ బాల్యంలో నుంచి లే
పుస్తకాలవతల పారెయ్
నాగలి భుజాన వేసుకో
గతకాలవు దారులకు
కఠినంగా వీడ్కోలు చెప్పు

బాబూ నీ చిన్ని కన్నీటి బిందువులో
ఏ సముద్రం గర్జిస్తూ ఉందో నాకు తెలును
అందుకే చెట్లతో మొరపెట్టు కుంటున్నాను
ఆకులు కాదు తుపాకులు కాయండని

పిలుస్తున్న పొలాల్లో ఫలిస్తున్న
ధాన్యపు గుండెల్లో మండే మాటలు
వినండి
నాగలి భుజాన వేసుకుని ఆకలి
సంపాదించుకున్న వాడే
ఆకలి తీర్చుకునే హక్కును కూడా
సంపాదించుకున్న వాడు
నేనే మీ రస్తానై కలల కంటున్నాను
వడివడిగా నడిచే మీ ముందడుగు కోసం
పదండి ముందుకు మీ జెండానై ఎగురుతాను

నీకు తెలుసా! వ్యవసాయకూలీల ఆకాశం
వర్షాలు కురుస్తుందే కానీ
వసంతాలు కురవదు

రైతులారా ? రాజకీయ వర్షం
పడుతోంది మోసపోయి
మీ విత్తనాలు చల్లకండి

ఇన్నేళ్ళు రాశిన కాగితాలన్నీ
హిమాలయ పర్వతాలైనాయి
వాటిమీద వాడిన సిరా వక మధ్యధరా
సముద్రమయింది
రైతు నాగలి మోస్తున్నాడు
క్రైస్తు శిలువ మోశినట్లు
దేశపు గర్భగుడిలో
దేవుడు జీర్ణమైపోయాడు

భూమిని ఫలాలుగా పంటలుగా మార్చే
ప్రవీణత ఉన్నవాడు ధైర్యం
కోల్పోనక్కరలేదు
మట్టిలో ఉన్న కస్తూరి తీసే మనిషికి
జీవన పరిమళాల కొరత లేదు

ఇది వసంతం
ఇది సంవత్సరం కన్న మొదటి కల
ఈ కలలో నేను నా దేశపు శరీరం మీద
నడుస్తున్నా
ఏడుస్తున్న పొలాల్ని ఆడిస్తూ పోతున్నా
సూర్యుడు కిరణాల బండ్లు తోలుకుని
వస్తున్నాడు
మొదట నన్ను చూచి కన్నీరు కార్చిన చెట్టు
ఇప్పుడు నా కల మీద పూలవాన
కురిసింది

ఆ చెట్టు అలసిన నా శరీరం మీద
ఒకనాడు ఒక నీడ పట్టింది
ఎప్పటికయినా చెట్ల అవయవాల మీద
పూలు పూస్తాయి
చెట్ల శరీరాలు కోశే కసాయివాడి చేతుల్ని
నరకాలి నా దేశం!

నా వాక్యం ఒక పిల్లన గ్రోవి
లోపల గాలి తప్ప అర్థం ఉండదు
గొంతు మాత్రం ఎందుకు తియ్యగా
ఉంటుందో తెలీని బాటసారిని

బాధల తుఫానుని ఒక్క నవ్వుతో
తుడిచి వేశాను
ఒక అశ్రువు నన్ను మోసం చేశినా
చంద్రుడు తన తెల్లజండా
లోకం మీద ఎగురవేశాడు

మనుషుల బజార్లు తరిమి వేస్తే
నిశ్శబ్దం కొండల్లోకి పారిపోయింది
నిశ్శబ్దాన్ని బొట్టు బొట్టుగా చప్పరిస్తున్నప్పుడు
చప్పుడు చేశే నా గుండెను కూడా క్షమించలేను

నిద్రనుంచి బయటికి వస్తాను
స్వప్నంలోకి వెళ్ళిపోతాను
నేను లోకాన్ని చూడలేని బాధను
రాత్రి నేను కనే కలలు
దినాల మీద కట్టే వంతెనలు
నేను పాట కాలేక పోయిన స్వరాన్ని

ఏ తార ఏ రహస్యం చెపుతుందో
విందామని పడుకున్నా
చంద్రుడు పరచిన వెండి తువాలుమీద–
వెన్నెట్లో చీకటి ప్రయాణాలు చేస్తూ

మిణుగురు పురుగు దారిలో
మరచి పోయిందొక వాక్యాలమూట

అడివిని పక్షిపాటలతో కొలుస్తాను
లేదా సెలయేటితో కొలుస్తాను
అడవిలో అగ్నిజ్వాలలు
సన్యాసుల్లా పరుగులెత్తుతున్నప్పుడు
చెట్ల శరీరాలు కౌగలించుకుని
భోరున ఏడుస్తా

చేతులెత్తి గ్రీష్మానికి చెమట బొట్టు
మ్రొక్కింది
గగనానికి ఇంద్ర ధనసు కలగాలని
కోరింది
మనసు ఇచ్చి గాయాలను మమత
కొనుక్కున్నది
బ్రతుకు సంతలో చివరకు
బాటసారి అయినది

కన్నీటిలో గుండె పిండి కవిత మీద
ఆరవేశాను
జనతా శాలువా కప్పుకొని

చరచరా వెళ్ళి పోయాను
ఈ దేశం నా ప్రతిభ కాక సమాధి
ఎంత దూరం నడిచినా
ఎప్పుడూ దూరం అంతే

వర్షం వెళ్ళిపోయింది మబ్బుల రథాలెక్కి
జలదానం చేశిన మేఘాలకి
జోహార్లు చెప్పాయి చరాచరాలు
భూమిలో ఉన్న చిన్నారి గింజ
మెడబయటపెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది
కృతజ్ఞతతో

వంకరటింకర్లుగా ఎగురుతున్న
సీతాకోకచిలుక
శూన్యంలో గీతలు గీచి
నా జాగృతి లోకాలకు
రంగురంగుల సరిహద్దులు
నిర్మించింది.

ఏ కలలో రాలుతున్న ఆకు కూడా
నేలమీద పడేముందు ఒక గీతిక
పడవలో తేలుతూ పడుతుందో
ఎక్కడ పేరులేని పక్షి కొమ్మమీద
కూర్చున్న మాత్రాన
పరిసరాలు పద్యాలుగా మారుతాయో
అక్కడ ముద్దుగా ఇంటిమీదికి
ఒరిగిన జాబిల్లి ముద్ద
చేతికి అందుతాడనిపిస్తుంది

ఎన్నాళ్ళో పెంచి పోగుచేశిన వాళ్ళు
ఎండల తలపాగాలతో వెళ్ళిపోతుంటే
మిలియన్ల గొంతులెత్తి
ఏడుస్తున్నవి ధాన్యపురాసులు

సభలు జరుగుతున్నాయి
జెండాలు ఎగురుతున్నాయి
బాధితుల క్యూలో నుల్చుని
బ్రతుకులు నడుస్తున్నాయి

నా తలుపు కొడుతోంది
నా దేశపు భవిష్యత్తు
గొరిల్లా మేస్తున్నారు కూలీలు
మధ్యాహ్నపు మైదానాల్లో
సమానత్వం పురాతన స్వప్నంగా
మార్చివేశారు
కవులకూ శబ్దాలకూ చెదపట్టింది
దేశంలో
ఋషులే పుస్తకాలై పడి ఉన్నారు
లైబ్రరీల్లో

ఒక్క మబ్బుకూడా వర్షం కురిశే
ధైర్యంలేదు ఈ భయంకర బంజరు భూమి మీద
... తుఫానులు ఉమిసే ఆకాశాన్ని
తువాళ్ళలా తుడుస్తున్నాయి మేఘాలు
పాపం పొలాల కోరిక ఏమిటి
పంటలు పండి మీ ఆకలి తీరాలనే కదా!

నా ఆత్మను గురించి నాకేమీ
భయం లేదు – నేను చస్తే
దానికే నష్టమూ లేదు గనక ...
పాపం! జీవిత పర్యంతం నా సుఖదుఃఖాలు
పంచుకున్న నా శరీరాని కేమవుతుందో
అనే నా భయం

నేను డాము లెందుకు కడుతున్నానో
భూము లెందుకు దున్నుతున్నానో
నాకు తెలీదు
నా బ్రతుకొాక సున్న కానీ నడుస్తున్నా
వేళ్ళు కాళ్ళయి నడిచే చెట్టు మనిషి
చెట్టుగా ఉంటే ఏడాదికొాక
వసంతమన్నా దక్కేది
మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను

ప్రేమించిన చోటినుంచి
భూకంపాలొచ్చినా కదల్ను
జ్యోతికి అంధకారాన్ని చూస్తే
భయమా!
మృత్యువులో కూడా ఝుంఝూమారుతంగా
ఉంటాను
నా కవిత్వం కేవలం మనిషికి డిఫెన్సు !

గురి కోసం వెతుకుతున్నా ఎక్కుపెట్టి ధనుస్సు
దెబ్బ కొట్టేవరకూ నీకు తెలీదు నా మనస్సు
కబడ్దార్ కవిత్వం పదాలు పేనే విద్య కాదు
నీది వృత్తి నాది తపస్సు

బాబూ మనం తుపాకుల్ని ఎదుర్కోగలం
కానీ నియంతలు ప్రశ్నల్ని ఎదుర్కోలేరు
సోదరా ఎలాంటి గ్రుడ్డితనాన్ని కూడా
కాంతి క్రౌర్యం నుంచి కాపాడబోకు
భయానికి నిన్ను బానిస కానీకు

అసెంబ్లీలు మనమే కడతాము
అకాడమీలు నిలబెడతాము
వాటి ఇటుకల క్రింద నలిగి చస్తాము
వాడి పూజారుల మౌతాము
ఒరే ఏం చేస్తున్నారో తెలుసుకోండి

నా ఊపిరి తిత్తుల్లో గాలి కాదు
గాలివానలు గాండ్రిస్తున్నాయి
ప్రజల ఎదురొమ్ము మీద ప్రతిష్ఠ చేసిన
ఈ శిలావిగ్రహాల్ని పీకెయ్యండి
నిలువునా లేచి ఒళ్ళు విరుస్తున్న
జ్వాలల నోళ్ళల్లో
పారెయ్యండి ఈ పాత దేవుళ్ళని

నా మాటలు ఈ దేశపు
మట్టిలో చల్లుతున్నాను
అన్ని చోట్లా కత్తులు మొలవాలని
నేను జ్వాలల్ని కొరడాలుగా
ఝుళిపిస్తున్న అగ్నిని !
నా జేబుల్లో కోకిలల్లేవు

ీకు రెండు వసంతాల ధాన్ని
ఇస్తున్నాను
పోగు చేసుకో నీ తేనె బిందువులు
శక్తి ఉంటే
లేకపోతే కాలం నిన్ను క్రూరంగా
వెంటాడి వధిస్తుంది

నేను జేబుల్లో కోకిలల్ని వేసుకు రాలేదు
పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని
వచ్చాను
ఏవో కొన్ని నక్షత్రాలు కల్లలై
నా కన్నులమీద రాలుతున్నాయి
కొన్ని అప్సరసలై నా వ్రేళ్ళమీద
రాలుతున్నాయి
నేను మోకరించి ప్రార్థిస్తున్నాను ఓ జిందగీ !
నన్ను సుఖం మీద శిలువెయ్యకు—

నలుగురి ముందు నీ మూపు వంగితే
నీ కాళ్ళు రెండూ రెండు తుపాకుల్లా నిలవకపోతే
నీవు నా యుద్ధాల్లో పనికిరావు
నీవు దాహం వేస్తోందని అడిగితే
ఏమిస్తానో తెలుసా?
ఒక గ్లాసెడు రక్తం!

వాళ్ళు మట్టి ముద్దలనుకున్నావేమో
వాళ్ళ కండరాలు నిద్రలేచి ప్రవాహాలై
పరుగులెత్తుతున్నప్పుడు చూడు...
మానవ మట్టితో దేవతల ముఖాలు చేస్తా
బాధ అనే ఉలితో మనిషి బొమ్మ మలుస్తా
నీ శోకాన్ని నాకు దత్తతగా ఇవ్వు
తీసుకుంటా

నా యుద్ధాల పొగల్లోనుంచి
పద్యాల ముఖాలు పుడతాయి
నా గొంతు జలపాతానికి బెదిరి
చెదిరిపోతారు
కాలపు మేకులకు వ్రేలాడే కవులు
నడిస్తే నా అడుగులు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగులు
ఎత్తితే నా చేయి మండే అగ్నిజ్వాల
దించితే వెయ్యి కిరణాలు వ్రేలాడే
సాయం సంధ్య

నరికి పారెయ్ నా చేతులు
తిరిగి వచ్చి నాకే అతుక్కుంటాయి
నా తుఫానుల్లో ఆకాశం ఆకాశమే
ఎగిరిపోయింది ఒక కాగితపు పేలికలా
ఇక ఈ నక్షత్రాల గుంపులకున్న
విలువేమిటి నా రాస్తాలో!
మానవ జీవితం ఒక పాశవిక ప్రదర్శనశాల
అని మాత్రం నాకు తెలుసు

నేను తుఫానుల కోసం గాయాల
కోసం తాగుబోతుల కోసం
వెతుక్కుంటూ పోయే వాడ్ని
ప్రజా శిఖరాలు చూస్తే
కరిగి ఒక పద్యాన్నయ్
కాగితం మీదికి కారిపోతా
కన్నీటి వాక్యాన్నయ్ పారిపోతా

బిడ్డా నీవింకా గుడ్డులోనే ఉంటే ఎలా
గుడ్డెలా ఎగురుతుందయ్యా
శ్రమించే కండరాలు
కోర్కెల సమాధులు కావు
నీకు రెక్కలు ఇవ్వడానికే నిద్రపోకుండా
మేలుకో ఉంది నా కిటికీ

ఓ కవీ నీ పద్యాల్ని యుద్ధానంతర
శస్త్రాల్లా అప్పుడే గోడకు తగిలించకు
నీ మాటల దేశాల్నించి మత్తకోకిలల్ని
బహిష్కరించు
రాబోయే ఇతిహాసం కోసం
నీ శబ్దాలు నూరి పదును పెట్టుకో
వాడి గుండె ఎన్ని తుపాకుల
దూర ముందో కనుక్కో

నా పిల్లల చేత వాడు నా తిండి గింజలు
తినిపించకపోతే
భూమి చేత నేను వాడి రక్తం తాగిస్తా
నా కవిత్వం ఏ జెండానూ ఎగరవేయదు
కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు

నీకు దాహం వేస్తోందా చెప్పు
ఒక సముద్రం తెచ్చి నీ ముందు పెడతా
కానీ నీకు దాహం లేదే దేనికోసమూ!
అదే సోదరా నా స్వప్నాల సమాధి
నీవు దొంగదేవతలకు పూజారివిగా
నీ యాత్ర ముగిద్దామనుకున్నావు
అందుకే నా క్రోధాగ్ని

అరే! ఎన్ని మైళ్ళు అని కాదు
ఎన్ని శవాలు ముందుకు పోయిందో

మన ఉద్యమం కొలుచుకో
మిత్రమా ఇదుగో నా హృదయం
విసిరేస్తున్నాను పట్టుకో

ఓ హైదరాబాద్ ఓ హైదరాబాద్
నీ వీధుల్లో నా కీర్తి
అపజయాల భుజాల మీద
చేతులు వేసుకుని నడుస్తోంది
నేను తలచుకుంటే నీకు ఎంత
సంతోషమిస్తానో నీకు తెలీదు
నా పిడికిటి నిండా ఎన్ని వసంత విపినాలు
పట్టుకొచ్చానో నీకు తెలీదు
నీకు తెలేదు కోకిల కొమ్మమీద
కూర్చుంటుందే గానీ
నేల మీద కూర్చోదు

బ్రతుకులో బాగా జలకమాడాను
అనేక లోతుల్లోకి దూకాను
అనేక ఎత్తులకు ఎగబ్రాకాను
ఒకచోట నిలవలేదు ఒక చోటు చేరలేదు
ఎన్నో కలల్ని పద్యాల నావల్లో తెచ్చి
మీ తీరాలకు చేర్చాను
సముద్రాలు యాత్రించిన సాహసికుడ్ని

ఇవాళ నా వాక్యాలు తీగెలుగా బిగించి
నవ్యొక వాద్యాన్ని చేసుకుని
మీకు సమర్పించుకుంటున్నాను
నేను స్వరాన్నయి పోతున్నాను
నా ప్రాణాలు నా మూర్ఛనలు తోడుకుని
తాగండి—నవ్యొక రేవు చేరనీండి
నా స్వర్గాలన్నీ ఇక్కడే కుమ్మరిస్తా

మీకు తెలీదు మనిషి ముందుంటాను
నేనెప్పుడూ ముందున్న వస్తువుల్ని
పట్టుకుంటాను నాఅదృశ్య కిరణాలతో –
నాకు గ్రహణం కాదు రాహువు
నా గ్రహణం అసూయా విషబాహువు !
నా శత్రువు నా రోజుల్లో ఊపిరి పీలుస్తున్నవాళ్ళుకారు !
నా కాలం నా దేశం నా భాష
వాటికి లొంగని నా అంతర్జ్వాల –

భయపడకు ఓ శేషేన్
ఇవాల్టి ఉదయం రేపటి ఉదయాన్ని
మరచిపోతుంది
గుండె ఆడుతుండనీ
ఏ కొమ్మలో చీల్చుకుని
పువ్వులు రాకమానవు

ఎంత బాధ కలిగించినా ఎంత కన్నీరు
పారించినా హృదయాన్ని ఎంత
శిథిల సామ్రాజ్యంగా మార్చినా
ఈ ప్రేమ మాత్రం ఉండనీ
ఈ చార్మినార్ శిఖరాల్ని ఇంకా పిలవనీ
ఈ హుస్సేన్‌సాగర్ గుసగుసల్ని
ఇంకా చెవుల్లో మధురించనీ
ఈ తామర మొగ్గలాంటి అరచేతి వీపుని
నా పెదవుల దగ్గరే ఉండనీ
ఈ భూమి బుగ్గలమీదనే చందమామలా
పట్టెడు వెన్నెల పులమనీ

ప్రేమ
దానికోసం ఎంతబాధయినా
పడదగినంత విలువ ఉన్నది
అందుకే నేను ఇవాళ
ఒంటరిగా ఈ వంతెన మీద కూర్చొని
నా మీద చంద్రుడి చేత
వెన్నెల కురిపించుకుంటున్నాను

చిన్న పసి ఆకునీడలో
ఒక కల అల్లుకుంటూ
సేద తీర్చుకుంటున్న పక్షి
నీలిమలో తేలిపోతున్న ఒక

తిరుగుబోతు మబ్బును
చూపులతో వెంటాడుతోంది
అదెక్కడికిపోయి కరిగిపోతుందో
అక్కడికే తానూ పోయి
ఆ లోతుల్లో కరిగిపోదామని

ఇదిగో నీకోసం చేలలో
కోసి తెచ్చిన పువ్వు
ఆ పువ్వు నీ కురుల్లో
గూడు కట్టుకుందామని
ఎగిరివచ్చిన రంగుల పక్షి

బ్రహ్మాండమైన నక్షత్రాల ఊరేగింపులో
వెన్నెల జెండా పుచ్చుకుని చంద్రుడు
ముందు నడుస్తున్నాడు
ఆ రాత్రి గ్లానులో వైను కన్నుగీటింది
ఆపిల్ పండు నన్ను కొరుక్కోమంటూ
కండ చూపింది
అంతే – ఆ పెదవుల్లో పిల్లనగోవులు
పిలుక్కుంటూ
మనకచీకటి క్షణాల్లో మాధుర్యం
కొల్లగొట్టాను

ఆకాశం నక్షత్రాల శరణాలయం
నీ దేహం నా చూపుల కార్యాలయం
గ్రీసుకు వీనస్ ఏమిటో ఆనాడు
ఇండియాకు అదే నీవు ఈనాడు
నీ సౌందర్యంలో భాగంకాని నక్షత్రం కానీ
ఉషస్సు కానీ పువ్వు కానీ ఎక్కడుంది !

నీ చూపుడు వేలెక్కి
మరింత గులాబీగా మారని
గులాబీ ఎక్కడుంది

నీ కనులోతుల్లోకి దూకి
మరింత నక్షత్రంగా మెరవని
నక్షత్రం ఎక్కడుంది

ఏ అవ్యక్త భౌతిక ద్రవ్యాలతో
కాచిన పీయూషమో నీ ప్రేమ
అందులో తమ స్వప్నాలు కరిగించుకుని
తాగి ఎందరో మానవ మాత్రులు
దేవతలై రెక్కలమీద ఎగిరిపోయారు

నా చేతిలో నీవాక నక్షత్రాల గుత్తిలా ఉండకపోతే
నేనేమయిపోతాను
నేనమయిపోతాను నా రాత్రి బరువును
నీ శరీరం మోయకపోతే
భూగోళాన్ని ఇరుసు మోస్తున్నట్లు

మన అధరాలకు అడ్డువచ్చే
నీ ముత్యాల దండలా
ఎందుకీ స్నేహితులు మనమధ్య
ఈరోజుల్లో వాళ్ళొక మిథ్య
కాలం అన్ని వస్తువుల్లోనుంచి
సత్యపు సువర్ణాన్ని దొంగిలించుకుని
పారిపోయిన ఈ రోజుల్లో

నీవు స్త్రీవి కావు అందాల తుఫానువి
చీరా తారా కలిపి నేసిన రూపానివి
కనకనే నన్ను నీ కన్నుల నీలిరేవుల్లో
తీరాలకోసం వెదకని నావికుడ్నిగా
మార్చుకున్నాను
నన్ను కవి అనకు నేను కలల వర్తకుడ్ని
నా బజారుల్లో నీ కళ్ళు రెండు విలువైన
భూగోళాలు

ఒకప్పుడు శరీరమనే గృహముండేది
నా ఆత్మకు
అదిప్పుడు దహనమైపోయింది
నీ ప్రేమాగ్ని అంటుకుని
మునుపు రుతువులెన్నో ఉండేవి నాకు
ఇప్పుడు నీ బాహువుల్లో ఏవీ లేవు
ఒక్క వసంతం తప్ప

నీ గులాబీలన్నీ వచ్చి నన్ను దర్శనం చేస్తే
ఏం చేశేది – నీ మధుర స్వరాలన్నీ కలిశి
నా మీదికి దండెత్తితే ఏం చేశేది
ఆ ఏకాంత క్షణాల్లో నిర్దాక్షిణ్యంగా
నా రెండు కన్నుల్నించీ
స్వర్గాలు కారుతాయి తెలుసా

ప్రిజంలో ఉన్న రంగుల్నీ
నీలో ఉన్న లోతుల్నీ
ఊహించుకోవలసిందే
కనకనే మనం ఇవాళ శబ్దాల్లేని
భాషలో మాట్లాడుకుంటున్నాము
నాకు తెలుసు నీవు
ఏ తొడల జోడయినా ప్రేమ
అవుతుందనుకోవు
అనంతకాలాన్ని అర్ధరాత్రిలో
మూటగట్టుకోవచ్చు ననుకోవు
నీకు తెలుసు
ఒక్క రాత్రిలో ప్రేమ పుట్టదనీ
ఒక్క రాత్రిలో నక్షత్రం పుట్టదనీ

ఎందుకు పోగుచేసుకుని వచ్చావు
నీ శరీరంతో ఆ క్రూర బంగారు కాంతుల్ని
ఏమయిందో చూడు

నా చూపులన్నీ నీ శరీర తీరాల్లో
త్యాగం చేశి వచ్చేశాను
ఒక గులాబీతో నిశ్శబ్దం ముంచి
పోసుకుంటున్నాను
ఒక ద్రాక్షారస దేవతనై పోయాను

నీవొక గడ్డంలేని మహర్షివి
దేవుడు లేని భక్తుడివి
ఎన్ని గుళ్ళ జేఘంటలు కాదని
ఏకగ్రీవంగా అననీ

పాపాలనుకుని చాల మజాలకు
మీరు దూరమవుతున్నారు
నరకంలో ఉన్నన్ని మజాలు
స్వర్గంలో కూడా లేవు
స్వర్గ నరక పేజీలను బాగా
తిరగేశిన ఋషివో శేషన్
గడ్డంతో నీ నగ్న ఋషిత్వం
కొలుచుట ఎంతటి మూఢత్వం

జీవిత మంటే ఏమిటిరా అని
గడ్డాన్నడగడ మెందుకురా
మధుమాసంలో మామిడికొమ్మను

గురించి బ్రాహ్మడ్నడక్కురా
నన్ను అడుగు ఆ కోకిల నడుగు
అన్యుల నడుగుట వ్యర్థమురా

ఓ శేషేన్
నీవొక పల్లెటూళ్ళో మొలకెత్తిన ప్రేమదేవతవు
ఇంగ్లండులో నీ పేరు ఎడ్వర్డ్
ఇటలీలో నీ పేరు రోమియో
అరేబియాలో నీ పేరు మజ్నూ
అరే ఇండియాలో దేవదాస్
నిజంగా నీకో ఊరూలేదూ
నిన్నెరగని వారూ లేరు

ఓ శేషేన్ నాకు తెలుసు
నీకు కవిత అంటే ఒక ద్రాక్ష ఒక ఉత్ప్రేక్ష
కలిసి తాపీగా లేని గుండెల్ని
కాపీ గొట్టడం అనీ
చక్కటి భోజనం తిని ఫ్రెంచి లిక్కరుతో
గొంతు కడుక్కుని
ఒక కోమల హస్తంమీద వాలి
రాత్రి ముదురు ఘడియల్లోకి ప్రవేశించడమే
నీకు ప్రేమేంద్రజాలం అనీ

ఓ శేషేన్ నీ పాటకు రోజా
ఒక పునర్జన్మ

నీ పాటకు జగమే ఒక
రూపాంతర చేతన
ప్రేమే నీమంత్రం
హృదయం నీ పీఠం—ఓ శేషేన్
నీవే ఒక ప్రేమలోక దేవతవు
నీ కోసం ఒక కోవెల
నిర్మించాలనుకుంటే
చెట్టునాటి కొమ్మమీద
కోకిల పెడితే చాలు

ప్రతిభ అనే నేరం చేస్తే
మీరు క్షమించరని నాకు తెలుసు
కానీ నేను పుట్టేముందు
నిర్దోషివిగా పుట్టమని
నాకెవరు చెప్పారు !

నీ బాణానికి గురి ఎవడో శత్రువు
నా బాణానికి గురి ఏదో హృదయం
గాలివాలు తెలిసి ఎగిరే పక్షివి నీవు
గాలి కూడా భయపడే గమ్యం కోసం
రగిలే పక్షిని నేను—
నా దురదృష్టాల్లో కనుపించని
నా సత్యాల కోసం నా లోతుల్లోకి దిగి
సాన్నం చేసే ప్రమాదం

ఎవడు స్వీకరిస్తాడు
స్వీకరిస్తే వాడు సమకాలికు డెలా అవుతాఁ

కాలం ఒక నిట్టూర్పులో కట్టింది దేవాలయం
ఎవడో కవి ఒక సెలయేటిలో పడి
కరిగిపోయాడు——అందుకే ఆ నీళ్ళు
ఎప్పుడూ కవితలు పాడుతూ ఉంటాయి.

తుఫానులు నగరాలమీద రాశే కవిత్వం
చదివితే తెలుస్తుంది
తుఫానుకు కవికున్న శక్తి ఉందనీ
కవికి తుఫానుకున్న శక్తి ఉందనీ

వర్షరుతువులో మేఘాల బరువు
మోయలేక గాలిచేసే తిరుగుబాట్లే
తుఫానులు-తుఫానులు మానవుడికి
తిరుగుబాట్ల విద్య నేర్పుతాయి

ఒకనాడు నేను నా కొమ్మల్లోనుంచి రాలిపోతాను
ఆ పిల్లలు నా కొమ్మల్ని ఆక్రమిస్తారు
వాళ్ళపూలు వాళ్ళు పూయించుకుంటారు

చెట్టుమాత్రం ఒక జెండాలా ఎగురుతూనే ఉంటుంది
ఒక ప్రవాహానికి ప్రతీకలా–
పాత చెట్టుకూడా కొత్త పూలు పూస్తుంది

జీవితం ఈ బ్రహ్మాండమైన రథచక్రానికి కట్టి
ఈడ్చుకుని పోబడుతుంటే
మనమెంత నిస్సహాయులమో బోధపడుతుంది
జీవన తరంగాలు వస్తూ పోతూ
నా ఒంటరితనాన్ని ఎంతలోతు చేస్తున్నాయి !
కానీ రోజూ ఆకాశం సూర్యుడనే ఎర్రటిగుడ్డు
పెడుతూనే ఉంటుంది
కోడిపుంజు సూర్యుడి దైనిక కార్యక్రమం
రోజూ ప్రకటిస్తూనే ఉంటుంది

సముద్రం ఒక కెరటాల సంకలనం కాదు
సముద్రమొక మార్మిక ద్రవ్యం
సముద్రమొక భాష
ఒక్కో తరంగం ఒక్కో ప్రతీక
ఒక్కో అలంకారం ఒక్కోనౌక

గాలి సముద్ర భూముల్నించి
మేఘాల్ని పోగుచేసుకుపోయి
పర్వతాగ్రాలమీద విడుస్తుంది
గాలి సముద్ర స్వప్నాల రాయబారి
గాలి లేని శరీరంలో

సాగరోపనిషత్తులు రాస్తుంది
గాలి సముద్ర హృదయవ్యాఖ్యాత

నా పేజీ మీద ఒక సముద్రం పెడతా
దాని మీద ఒక పడవ పెడతా
దాని మీద ఒక తుఫాను ఊదుతా
అది పద్యమై ఏ తీరాలకు
కొట్టుకు పోతుందో చూస్తా

గడియారపు చేతులు ఇచ్చే ఆజ్ఞలకు లొంగి
జీవన పందెంలో పరుగులెత్తే మనుషులు
ఋషులు కారు
కాలం బంగారు గడియారంలో పెట్టినా
మనిషిని కాటువేయక మానదు

చంద్రుడు నీ చేతిలో ఉంటే
మాసా లెక్కడికి పోతాయి
నా పుస్తకం నీ చేతిలో ఉంటే
నీ చేతిలో నేను ఉన్నట్లేగదా

నేను నా సర్వస్వాన్ని రాల్చుకున్నాను
చెట్టు తనపువ్వుని రాల్చుకున్నట్లు
ఎక్కడికో నిశ్శబ్ద కుహరంలోకి పోయి
ధ్యానం చేసుకుందామని ఉంది
ఎవ్వరూ లేని దేవాలయానికి—చివరకి
నా ఏకాంతానికి భంగం కలిగించే
దేవుడు కూడా లేని దేవాలయానికి

నేను ఘనీభవిస్తే
ఒక నామరూపాత్మక దేహం
నేను ద్రవీభవిస్తే
ఒక జ్ఞాపకాల ప్రవాహం

ప్రొద్దున్నే స్నానమాడి ఒక తామరపువ్వు
సరస్సునంతా స్మృతులతో
పరిమళభరితం చేసింది
దానికి మూర్ఛపోయి చంద్రుడు
అందులోపడి కరిగి పోయాడు

నక్షత్రాలతో తామరమొగ్గలతో కలల్ని
అలంకరించుకున్న ద్రష్టగా
సాక్షాత్కరించింది ఒక సరస్సు
నా కల పూర్తిగాక ముందే సూర్యుడు
ఉదయిస్తుంటే ఒక రంగుల హిమబిందువు
రక్షించింది నా అస్తమిస్తున్న ప్రాణాన్ని

ఎన్నో వెన్నెల రాత్రులు కలిసి చేసిన
గాయాల్ని ఒక చందమామ
మాన్పుతుందని నా నమ్మకం
అందుకే నాకు భయం
ఈ చెలరేగే గాలివానల గాలికి
గగనంలోనుంచి చందమామ
ఎక్కడ ఎగిరిపోతుందో అని–

వెన్నెట్లో తిరుగుతున్న మేఘనౌక
చంద్రదీవికి తగిలి పగిలిపోయింది
నా దుఃఖాల్నీ నా ప్రేమల్నీ అన్నిటినీ
కవర్లో పెట్టి పోస్టులో వేసి వచ్చేశాను

ఎన్నో రుతువులు కొట్టుకుపోయినప్పటికీ
ఒక చైత్రమాసపు జ్ఞాపకం ఇంకా
నా శిథిల శాఖల్లో చిక్కుకునే ఉంది
పశ్చిమాన పూచిన తార
ఆకాశ నీలిమకు చెల్లెలనిపిస్తోంది

ఏవో వాక్యాల తేనెటీగలు
పెదవుల మీద ఎగురుతుండగా
ఒక సౌందర్యమూర్తి అద్దంలో మునిగి
స్నానం చేస్తోంది

వెనక నా ఊహ హృదయంలోకి దిగి
కవిత్వం మీటుతోంది

చెట్టు బుగ్గలు పూరించి
రెండు శాఖలతో
ఒక పువ్వు పుచ్చుకుని
షహనాయిా ఊదుతోంది
ఒక్క రాగం విశిరేసి బుల్‌బుల్
తోట తోట నంతా తన చిన్ని రెక్కల మీద
ఎగరేసుకు పోయింది

పుష్పాల్లో నైతిక దండయాత్రలు చేశే
సోమరిగాలి వెదురుపొదల్లో చిక్కినప్పుడే
రాగాలు తీశే విద్య నేర్చుకుంటుంది
జీవితపు తీగెలు స్పృశిస్తేగదా అది
తత్త్వాలొలుకుతుంది

మధ్యాహ్నపు ఒడ్డున కూర్చుని
నేనూ సీతాకోక చిలుక
ఒకే పువ్వు పరిమళం తాగుతున్నాము
మనుష్యుల అడుగుల్లేని దారుల కోసం
వెతికే మనస్సుకి మంచిచోటే దొరికిందని
ఒక్కసారి నాలోకి నేను పరుగెత్తుకు పోయాను

అదే నదిలో నేను రెండోసారి ఈదడం లేదు
ప్రతి వానజల్లుకు నా జీవనలోయ
రంగులు మారుస్తుంది – కానీ
పుట్టినప్పుడు పెట్టిన పేరుతోనే
మారుతున్న నన్ను లోకం
ఇంకా పిలుస్తోంది

నా పాటకు మాటల్లేవు మధురిమే ఉంది
నా లేని మాటల లేత నీడల్లో
నక్షత్రాలు సేద తీర్చుకుంటాయి
మృదువైన ఎర్రటి తోడేళ్ళూ
వెండిముద్దల్లాంటి శిశువులూ
సంధ్యల్లో రెక్కలకు కావిరంగులద్దుకునే
పక్షుల కుటుంబాలూ సంచరిస్తుంటాయి
పువ్వుల్లాంటి రుతువులు
కొండల నడుములకు ఎండలు పూస్తాయి

ఓ దీపమా నీవు రాత్రిరాకకూ
ఒక పరిమళ శ్వాసకూ చిహ్నానివి
నీ మసక మసక నీడల్లో చేపల్లా చెరలాడే
కన్నులు చన్నుల పై భాగాన అలంకరించుకున్న
చిన్నది ప్రపంచ చక్రమంతా
తిరిగే ఇరుసులా కనిపిస్తుంది

నిన్నంతా ఆకాశాన్ని వేధించిన తుఫానుకు
ఆ కరిగిపోతున్న చంద్రుడు ఒక ఫులుస్టాపు
అరే! ఇది ఇవాళ ఆకాశమా నక్షత్రాల ఖజానా
రా పాడుకుందాం కాలం మనముందు
కుంటేలా చేద్దాం

నక్షత్రాలకు పేర్లుపెట్టి
ఆకాశంలోనుంచి పీకి పురాణాల్లోకి
ఎక్కించిన వాళకు తెలీదు
ఒక కలలలోకి యాత్రచేశే ఆత్మకు
శబ్దం ఒక గోల
పుస్తకం ఒక కాగితం అని

సౌందర్యానుభూతి కండలోకి గుచ్చిన
కత్తిలా ఉంటుంది
సుఖదుఃఖాల హద్దులు రద్దయిపోయిన
ఆ అనుభూతిలో
నాకు సౌందర్యభరిత బాధలతో
చావు దగ్గరకు వస్తుంది

నేను దేనిమీద నా నచేతన శిల్పం చెక్కుతున్నానో
ఆ శబ్దం నన్ను మృత్యువునుంచి రక్షించుకోడానికి
నేను లేపుతున్న దుర్గం
పుస్తకం
మనిషి పశుత్వానికి
నేను కడుతున్న ఆనకట్ట

వసంతం అంటే
కోకిలల పాఠశాల
పక్షుల సంగీత అకాడమీ
ఒక్కో పక్షి వెయ్యేసి పాటలుగా
రూపాంతరం పొందే రుతువు–
పచ్చగా పంచమంలో పాడే
మామిడిచెట్టు
నడవడం ఒక్కటితప్ప
చైత్రం కోసం
ఏమయినా చేస్తానంటుంది
అందుకే లోకం ఎప్పుడూ
ఒక కొత్త వసంతం కోసం
ఎదురు చూస్తుంది

చెట్లన్నీ కలుస్తున్నాయ్
వసంతాన్ని పిలుస్తున్నాయ్

కొమ్మల్లో గూళ్ళమీద
గొడ్డళ్ళు వదుతున్నాయ్

పూలుపూస్తున్నాయ్
పక్షులన్నీ పాడుతున్నాయ్
గుడిసెల గుండెల్లోపల
ఘోర తుఫానులు వీస్తున్నాయ్

చైత్రాలు వస్తున్నాయ్
చైత్రాలు పోతున్నాయ్
ఒక్క పువ్వేడు వసంతం కోసం
చెట్టు ఆకులన్నీ రాల్చుకుంటున్నాయ్

శోకంలో స్నానమాడి వచ్చిన గీతిక
నగ్న శరీరం ఇంకా అశ్రువులతో
తడిసే ఉంది
పొందవలసిన కాంతిలోకాల్ని
పోగొట్టుకున్న కాగితం
బావురుమంది నన్ను చూచి

ఎంత ప్రయత్నించినా
ఒక్క ఆవులింత కూడా రాత్రిని
ఆహ్వానించలేదు
ఒకటిరెండు పేజీలు ద్రాక్షోపనిషత్తు
పఠించి
శయ్యతో ఏ తర్కమూ పెట్టుకోకుండా
నా అవయవాల్ని దానికి స్వాధీనం చేశాను

వాజులో ఒక రెమ్మనానుకుని
విలాసంగా వెనక్కి వంగి నుల్చున్న గులాబీ
పంచమ స్వరానికి గొంతెత్తిన
గీతికలా ఉంది
ఆ తరుణంలో దాని ఒక్కో రేఖకు
వందేశి వ్యాఖ్యానాలు చెప్పవచ్చు
మనస్సు ఈ మెలికె సంతరించుకున్నవేళ
సంధ్యామహత్తు సాక్షాత్కరిస్తుంది

ఒక బరువైన క్షణం దాని రంగును
దాని రేఖను దాని వేదనను అదే ఎన్నుకుంటుంది
మనిషి అసహాయుడై ఆ క్షణపు నిరంకుశత్వానికి
లొంగిపోతాడు
అప్పుడు రెండు కళ్ళలోనుంచీ
గంగా యమునలు కారుతాయి

బాధలన్నీ ఖాళీ చేసుకున్న గుండె
ఇవాళ మళ్ళీ బాధలు నింపుకుంటోంది
నన్ను వదలి మరొకరిలో
లీనమవుదామనుకుంటే
తనను వదలి నాలో లీనమయ్యే మరొకరు
లభించలేదు
జీవన తపశ్శిఖరారోహణలో
మనిషి ఏకాకి అని
ఎవరికి తెలుసు
వాడి అవ్యక్త వాక్కే

వాడి శిలువ అని
ఎవరికి తెలుసు—

అన్ని అందాలకూ లొంగే దేశద్రిమ్మరిని
ఏ తోటలోకీ ఒంటరిగా అడుగుపెట్టను
ఏ వసంతం పట్టుకుంటుందో అన్న భయంతో
నేను పుస్తకాల్లో గుడ్లు పెడతాను
పుస్తకాల్లో గుడ్లు పొదుగుతాను
నేను అరుణోదయం ముందు
కూసే కోడిని !

నాకూ ఉంటుంది పక్షుల్లా పాడాలనీ
ఆకుల నీడల్లో గడపాలనీ
కానీ బ్రతుకు పంజాలో పడతానని
నాకేం తెలుసు
ఇక వసంతం మాట ఎత్తకు
మళ్ళీ కోకిలనై రాలేను
నా గొంతు విరిచి విరియని మొగ్గల్లో చల్లాను
అవి ఫలాలుగా మారేవరకూ
నా జీవితమొక నిరీక్ష!

ఈ భాష ఈ కాలం ఈ దేశం
నావి అని ఎలా చెప్పగలను—

ఇవి నేను కోరుకున్నవి కావు
వాటికోసం నేను పుట్టే ముందు
నా అంగీకారం ఎవరూ తీసుకోలేదు
నేను వాటి ఖైదీని

నేను ఎన్ని జిహ్వాలు ఎన్నియుగాలు
ఎన్ని దేశాలు తొక్కుతూ వచ్చానో
ఇవాళ నన్ను మావూరి వాడంటున్న
ఈ కుగ్రామానికి !
మా ఊళ్ళో ఇవాళ నన్నెరిగిన వాళ్ళు
నలుగురే.......
శిథిలమైన వంతెన గ్రామకాలువ
పాతగుడి ముసలి చెరువుగట్టు

సాయంకాలంపూట కొంచెంపాట
కొంచెం చీకటి కొంచెం మధువు
కొంచెం నిరీక్ష కావాలి
అప్పుడు తెలుస్తుంది జలపాతం
నీటి అధఃపతనం కాదనీ
కన్నీరు దుఃఖానికి సంకేతం కాదనీ

మంచినిద్ర కొంచెంపేపే
స్వప్న తుఫానులు వీచే
రాత్రి గడవడం రేపే
మనిషి నడక గమ్యంవైపే

కష్టసుఖాలు భరించే
జీవయాత్ర మరణం వైపే

నేను మీ జాబితాల్లో ఎక్కడున్నా
భూమ్యాకాశాల మధ్య ఎగురుతూనే ఉ న్నా
మనిషిననే మహాసముద్రాన్నయ్
నిరంతర ప్రయాణం చేస్తూనే ఉన్నా
ఎక్కడికీ చేరకుండా

చిల్లర దేవతలు సిద్ధాంతాలు చెపుతారు
నేను మధువందిస్తాను రండి నాతో కలిశి
నేనిచ్చే మధువు సేవించండి
దేవతల్లా ఆకాశంలో తిరగండి

ఇది వింశంతితమశతాబ్ద
పంచాశీతితమసంవత్సరాన (1985)
విప్లవభాషావిధాత కవిసేన మేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్య ప్రణీత మౌక్తికపర్వము
సర్వము సమాప్తము

# మయూఖ పర్వము

## ఒకటో సర్గ

సూర్యుడు ఎన్నో ఇతివృత్తాలతో
చేసిన ఒక వృత్తం
మనిషి ఎన్నో రంగుల గాలిపటాలు
ఇరుక్కుని వ్రేలాడే సంక్రాంతి వృక్షం
సుఖం బాణం తప్పించుకుని
పారిపోతున్న హరిణం
లోకం మనిషి సృష్టించుకునే
స్వప్నం——

ఇది ఒక సాయంకాలం చషకం–ఒక పలు వన్నెల పానీయం... ఒకటి కాదు ఇందులో; ఎన్నో పూల పరిమళాలు, ఎన్నో సంధ్యల కావి రంగులు పక్షుల రాగాలు ఎగిరిపోయే మేఘాలు మూర్ఛపోయే ఆకాశాలు వేదనలనుభవించే వేణువులూ షహనాయిలు కరిగిపోయే అకలుషిత హృదయాలు హద్దుల్లేని భూగోళాలు అంతరిక్షాలకు ప్రాకే ద్రాక్షతీగెలూ–ఇలా ఎన్నో

అదొక ద్రవరూపంలో చేతిలోకి ప్రవహిస్తూ వచ్చిన మరో ప్రపంచం...

ఎందుకు వస్తున్నాయి ఈ అందమైన భావాలు
నిశ్శబ్ద బంధురమైన నా మందిరంలోకి
ఈ అందాల అతిథులకు ఏ ఆతిథ్యం ఇవ్వగలను!
వెన్నెల బాటలు విడిచి వచ్చిన
అప్సరసల గుంపుల్లా వస్తున్నాయి
ద్వారాల్లేని ద్వారబంధాల్లేని ఈ మందిరంలోకి
ఆకాశపు నిర్మల నీలోదకాల తీరాలనుంచి
దిగి వచ్చే లేయెండల్లా
వస్తున్నాయి
విరిగిపోయిన కుర్చీల్లాంటి అనుభవాలు పడున్న
నా జీర్ణమందిరంలోకి
కొండల్లో కోనల్లో తిరిగే దేశద్రిమ్మరిగాలి
వేసవి అడవుల్లో రాలిన ఆకులమీద
చరచరా నడచి వచ్చినట్లు
ఎందుకువస్తున్నాయి, చెరిగిపోయిన స్వప్నచిత్రాలు
వ్రేలాడే ఈ శూన్యమందిరంలోకి——
గాలుల దాడికి కప్పెగిరిపోయిన ఈ శిథిల కుడ్యాల్లోకి—
ఏమివ్వగలను ఈ అతిథులకు
కనురెప్పల కొనల్లో మసలే ఒంటరి బాష్పంలాంటి
ఒక గీతిక తప్ప
యెదలు భగ్నమైన ఎండలు
శాంతి కోల్పోయిన గాలులు
విషాదం తొణికిసలాడే వానలు
విడిసే ఈ ఎడారి సత్రంలోకి
ఎందుకు వస్తారు మీరు, ——
నిర్జన ప్రదేశవాసిని, లోకాంతరాలనించి
వచ్చిన ప్రవాసినిని,

నన్నే ఎందుకు వరిస్తారు—
పోండి
నీలాకాశంలో తెలిమబ్బులై పోండి
సాగరాల్లో నావల తెరచాపలై పోండి
దూరతీరాలకు తరలిపోయే పవనాలయి పోండి
రేపటి గులాబీల తోటల్లో
ఉషస్సులై పోండి
పోండి...

కవిగా ఈ లోకానికి వచ్చిన ఒక శిశువు ప్రతి వస్తువునించీ
ఎంతో కొంత కవితను పిండుకుంటాడు
మామూలు కావ్యాలకంటే
అహోరాత్రాలు, మహాసముద్రాలు
మానవ ఝంఝా ప్రభంజనాలు
ఘోషించే కావ్యాలకు తలవంచుతాడు—కాళ్ళని
పంకెళ్ళకు, గుండెను గాలివానలకు అంకితం చేసుకుంటాడు
ఐతిహాసిక తీరాలనుంచి
మానవ సముద్రేక శిఖరాలనుంచి,
తరతరాల తరంగాలను, ఖిలమైన
శంఖాలను, చిరిగిపోయిన పేజీలను,
ఎగిరిపోయిన కర్పూర ధూపాలను,
ఆరిపోతున్న నాగరకతల హారతులను
పోగుచేసుకుంటాడు—అతడు
అంధకారంలో ఆక్రందన చేసే పసిపిల్లల కంఠస్వరాల
కవితకు నీరై పారిపోయినవాడు, హోరుగాలుల్లో
నిటారుగా నిలుచుని, వినదించే సరిపీ

చెట్ల సమూహాల్లో విన్న తన ఆదర్శాల గుసగుసలు
కవితలుగా అల్లుకున్నవాడు–
మనిషి తన కలను నిజంగా
మలచుకుంటున్నప్పుడు మానవుడు చేసే ఆత్మ హత్య,
గాఢాంధకారం కంటే ఘోరం అంటాడు.

ఇవాళ ఒక బాధా సూర్యుడు అస్తమిస్తే
రేపు మరొక బాధాసూర్యుడు
ఉదయిస్తున్నాడు;
నిదురించే కన్నుల లోకాల్లో నిప్పులు రగిలిస్తున్నాడు...
నిన్న నీటిబొట్లు కారుస్తున్న చెట్లు ఇవాళ
జ్వలించే పూలకత్తులు ఝళిపిస్తున్నాయి
నిన్న జీవం ఘనీభవించిన వాగుల్లో
ఇవాళ అలలు కన్న కలల్లా చేపలు శివాలాడుతున్నాయి
ఏ అదృశ్యహస్తం ప్రకృతి నిలా
చైత్రించిందో
గాయాల బొంగురు గొంతుల్లో
ఖడ్గాల్లాంటి గానాలు అలంకరిస్తోంది
విధుర మధుశాలగా మారిన
విశ్వసీమల్లో కూర్చుని నా మది
తిమిర కన్యలతో ఖేలలాడుతూ ఉంది
ఏకాంతంలో ఓలలాడుతూ ఉంది
జ్ఞాపకాల గవాక్షాలనించి చూస్తే
గాయాలు చేసుకున్న గడచిన రోజులు
రక్తాభిషేకం చేసుకున్న రాత్రులు

లోకంలో ఉన్న ప్రతి బాధా నా గుండె
ఎందుకు ఆశ్రయిస్తుందో!
నా కళ్ళ ముందు జరిగే ఈ విధ్వంసం
మానవత, గత చరిత్ర పేజీల్లో కలిసిపోంది
ఈ రోజుల
రక్త నాళాల్లో రక్తం కాదు
విషం ప్రవహిస్తోంది
నేను మాత్రం ఇదంతా మోస్తూ
ఉదయించని ఉషస్సార కోసం చూస్తూ
కఠిన శిలా శిఖరాలకు ప్రాకుతున్నాను.

నీవు నమ్ముతావా...
కాలచక్రం తిరిగి తిరిగి
జీవితాన్ని క్రాసుగా మనిషిని క్రైస్తుగా
మలిచిన ఈ రోజు
ఒక నూతన యుగ సూర్యుడు ఉదయిస్తున్నాడు
మనకు కానుక తెస్తున్నాడు ఒక నూతన గీతను
విప్లవాన్నీ వీర మరణాన్నీ ఉద్ఘోషించే
ఉచ్చైస్వర గీతను
ఇవాళ ఈ సాహసోపేత నూతన యుగం
సంకెళ్ళు ఛేదించి మహాశక్తిగా మార్చిన
మనిషి
అవనిమీద పెట్టిన అడుగులు చాలక
అనంతాన్ని ఆక్రమిస్తున్నాడు–
ఇనపరంగు ప్రత్యూషాలు తుపాకి మందు గంధాలు

కండల్లో నిదురించే రణకండూతిని మేల్కొలుపుతున్నాయి
ఒక యుగపు నినాదాలూ సిద్ధాంతాలూ—
ఆ యుగపు చెత్త అంతా—
చరిత్రతో కలిసి వెళ్ళిపోయాయి—
ఉద్రేక భావలావాల్లో పడి మానవుడు
నూతన తీరాలకు కొట్టుకుపోతున్నాడు
ప్రాక్పశ్చిమాల మధ్య వెలుగు చీకట్ల తీరాల మధ్య
ఇటూ అటూ కొట్టుకుపోతున్న
మండే సూర్యమండలంలా మానవుడు
తీరాన్నించి తీరానికి కొట్టుకుపోతున్నాడు
ఆ మనిషే ఈనాడు చరిత్ర పురాతన గుహల్లోంచి
ప్రతిధ్వనించే పొలికేకలా ఆకాశం మీదికి విరుచుకుపడుతున్నాడు
అసత్యాన్ని శిలువకు పంపిస్తున్నాడు !!

మనిషి కన్నుల సంధ్యల్లో ఉషస్సుల్లో
ప్రసరించే
శబల మహా స్వప్నకోమల తూలికలారా !
చూడండి, ఎలా తిమిరహస్తాలతో
కళ్ళు నులుముకుంటున్నాడో మనిషి !
ఏమిటి ఈ కాలం ఇంత నిష్ఫలం అవుతూ ఉంది
నిశ్శబ్దం నా గీతికల నిట్టూర్పుల్లో ఇలా
ఎందుకు నిద్రిస్తోంది?
ఉదాసీనంగా ఈ చేతులతో ఒక యుగానికి
ఉద్వాసన చెప్పవలసివస్తోంది
ఓ స్వప్నతూలికలారా !

మీ కోసం చూచే
మా కన్నుల రంగుల చేపల మీదికి
ఎందుకిలా కన్నీటి వలలు విసురుతారు
మనిషి కళ్లు తడిశాయి
దేవుడి కళ్ళు తడిశాయి
వచ్చే తరాల కళ్ళు కూడా ఎందుకు తడుపుతారు
మా యినప నరాల తీగెలు త్రెంపకండి
అందులో నిదురించే గొంతు జాగ్రతమైతే
మండే సూర్యుడు రెండు ముక్కలుగా విరిగి
మనిషి కళ్ళుగా మారుతాడు ఆకాశం కూలిపోతుంది
సముద్రాలు పారిపోతాయ్ ఎందుకు జాగు చేస్తారు
రండి మా గుమ్మానికి తోరణాలు కండి
మానవ జీవితా న్నొక మహోత్సవం చేయండి

మళ్ళీ వచ్చింది కోకిల తోటల్లో తిరిగే షోకిల
తెచ్చింది పాథేయంగా ఒక మూట
ఈ బాటసారికి ఒక తియ్యటి పాట—
ఎంత అందంగా పూచాయి ఈ అడివిచెట్లు
గిరులకురుల్లో గోమేధికాలు కురిశినట్లు
తెచ్చి పెంచుకోడానికి ఇల్లు లేదు
హృదయంలోనే పూలు పూయించుకుంటూ
విధి ముళ్ళదండ మెడలో వేశినా ఎందనిండా మధువు
నింపుకుంటావు
చిరునవ్వుతో ఎదురొస్తావు—
చిలిపి పక్షుల ఆటలు చెట్ల కొమ్మల్లో చూస్తావు
పువ్వులతో చిరునవ్వులు కలుపుతావు

వెన్నెల పూసుకుంటావు
వేడుక చేసుకుంటావు
పుప్పొడిలో పొర్లాడి వచ్చిన తుమ్మెదలా ఉంటావు
రాళ్ళని రొట్టెలుగా మార్చాలంటావు–
ఈ లోకపు కల విలువ నీవు మోశే శిలువ!
కానీ దేవుడెదురైౖ ఈ ఋతువులో ఏమికావాలి కోరుకో అంటే
పిడికెడు వసంతాలందరికీ భిక్ష పెట్టమంటావు
నీకు మాత్రం ప్రేమించే పెదవులు రెండు చాలునంటావు–

# రెండో సర్గ

ఉత్తరాలు విప్పాను పేజీల్లోనుంచి వెన్నెల రాలింది వాక్యాలు శారికలై చకోరికలై ఎగిరిపోయాయి నేనూ ధవళమూ మిగిలేము పేజీలమీద

ఇవాళ నా హృదయం ఒక కొత్త భావచ్ఛాయకు అతిథి అయింది తారల గ్రామాల్లోకి వెన్నెల మందలు తోలుకొచ్చాడు చంద్రుడు--

రాత్రి పాడుతోంది నా బాధల తాళమానానికి అనుగుణంగా; చప్పుడు చెయ్యకుండా నేనడుగుపెట్టిన తోటలో చెట్లమీద గుత్తులు గుత్తులు బత్తాయిలు అమాయక శిశువుల్లా పడుకుని నిద్రిస్తున్నాయి- చెట్టు నా చెవిలో గుసగుసలాడినట్లనిపించింది.

నీ నీడ తట్టుకుని నీవే పడిపోతున్నావు - కాలువలో రాలిన పూలు కొట్టుకొనిపోక నిలుస్తాయా? నీ ముఖాన్ని అలా మానవ ఉద్విగ్నతకు ఒక రూపకాలంకారంగా పెట్టకు......దేవతల్లాంటి నీ మాటలు లోకాల్ని పవిత్రం చేస్తాయి.

ఈ రహస్యం కలిగించిన సంతోషాతిరేకంలో ఎన్ని సంగీత శాస్త్రాలున్నాయో ఎలా చెప్పగలను.

బ్రతుకులో బాగా జలకమాడాను అనేక లోతుల్లోకి దూకాను అనేక ఎత్తులకు ఎగబ్రాకాను ఒక చోట నిలవలేదు ఒక చోటు చేరలేదు సముద్రాలు యాత్రించిన సాహసికుడ్ని - ఎన్నో కలల్ని పద్యాల పడవల్లో తెచ్చి మీ తీరాలకు చేర్చాను... పర్వతాల్ని పెకలించాయి యీ చేతులు - ఈ లోహదండాలు- ఖండ ఖండాతరాల్ని బంధించి లాక్కొచ్చాయి; ద్వీపాలను ద్వీపకల్పాలను కుక్కల్లా తిప్పాయి మీ ముందు !

నేను

ఇప్పుడు నా హృదయాన్ని ఆకాశవీధుల్లోకి ఎగరేశి నన్నొక జెండాగా ప్రతిష్టించుకున్నాను అదుగో చూడండి గాలుల్లో ఎగురుతున్న ఆ రంగుల పేలిక ! అది ఈ యుగానికి నాలిక-

రండి నేత్రాల ఊరేగింపులు తీసుకుని కేరళవృక్ష సమూహాల్లో పరుగులెత్తే రోడ్లమీదుగా వ్రజభూమి వేణువుల్లోనుంచి నిక్కి చూస్తున్న నగరాల మీదుగా రాజస్థాన్‌లో వెల్లకిలాపడుకొని ఉన్న ఎడారుల మీదుగా మధ్యప్రదేశ్ భూముల్లో గుంపులు గుంపులుగా గుమికూడిన అరణ్యాల మీదుగా మిలియన్ల ఊరేగింపులు తీసుకుని రండి--

నేను

నుల్చొ ఉన్నచోటికి - మీకు తెలీదు, మనిషి ముందు ఉంటా నేనెప్పుడూ; ముందున్న వస్తువుల్ని పట్టుకుంటా నా అదృశ్యకిరణాలతో; నాకు గ్రహణం రాహువుకాదు అసూయా విషబాహువు- నా శత్రువు నా రోజుల్లో ఊపిరి పీలుస్తున్న వాళ్ళు కారు, నాకాలం నాదేశం నాభాష వాటికి లొంగని నా అంతర్ జ్వాల--

భయపడకు ఓ శేషేన్ ఇవాల్టి ఉదయాన్ని రేపటి ఉదయం మరచిపోతుంది గుండె ఆడుతుందనీ ఏ కొమ్మలో చీల్చుకుని పూలు రాకమానవు

నేను

చెపుతున్నా ఇదుగో

వినండి నామాటలు – విని విని ఆలోచనా దంతాలతో నమిలి నమిలి నా మాటల లోతుల్లో మునిగిపోండి ! ఎవడు చచ్చి మన జీవితాల్లో పూలు పూయిస్తాడో వాడి భాష చిరంజీవి..........

జయపూర్లో మీరు చూచిన నేను కాదు, నేను నాగపూర్లో మీరు చూచిన నేను కాదు కేరళలో మద్రాసులో హైద్రాబాదులో మీరు చూచిన నేనుకాదు నేనిప్పుడు మీకు నా వాక్యాల్లోనే దర్శనమిస్తాను.

నేను

ఇవాళ ఉదయం ఒక విలాస నావనై నా శరీరంలో ఈదుతున్నాను వాక్యాలు తీగలుగా బిగించి నన్నొక వాద్యాన్ని చేసుకుని మీకు సమర్పించుకుంటున్నాను.

నేను

స్వరాన్నయ్ పోతున్నాను నా ప్రాణాలూ నా మూర్ఛనలూ తోడుకుని తాగండి నన్నొక రేవు చేరనీయండి నా స్వర్గాలన్నీ

ఇక్కడే కుమ్మరిస్తా

అగ్ని పర్వతాగ్రంలా భగ్నమైన ఓ శేషేన్
నీ కీర్తి పతాకంలో ఒక ఉజ్జ్వల ప్రేమగాథ
భాగం అయినట్టి మహాభాగుడివి రోజు నీవు
అభిశప్తుడివై ఓ శేషేన్ అంతరిక్షవీథుల నుంచి
రెక్కలు తెగి పడిపోయిన పక్షరహిత గంధర్వుడు నీవు
దివిని వీడి నీవొస్తుంటే నీ వెంబడి పరుగెత్తాయి

సుధాకలశమూ మహతీ కచ్ఛపి రంభామేనక లంభోజాక్షులు
వసంతరుతువూ వజ్రాయుధమూ ఐరావతమూ నందన
వనమూ–చివరకు.........
దేవలోకం వచ్చి భూమండలం మీద నీలగిరి
అనుకునే పేరుతో వాలింది
అది సూర్యుడి దరహాసం అది కొండల ఇతిహాసం
అది పక్షుల మధుర సమాసం అది వృక్షాల సమావేశం
అది నిశ్శబ్దాల ప్రవాసం
అది పువ్వుల చిరునామా అది సంధ్యాకాంతుల డ్రామా
అది రుతువుల రాజీనామా అది బాధలకొకకామా
ఇది దేవలోకాత్మ మానవాత్మగ మారి
దివినుండి భువికి చేశిన పాదయాత్ర
అమృతాన్ని విడిచి అశ్రువువైపు నడిచి
కవిజన్మ ఎత్తుటకు పెదవికెత్తిన పాత్ర
వచన దేవతలు అక్కడి పక్షులు
నీతోవచ్చిన రచనాధ్యక్షులు
శివుడికి కవికీ భాషలెక్కడివి
బ్రతుకును మనిషిని పిలికేవాళ్ళకు--
శబ్దరహిత భాషావాదులు వాళ్ళు!

అందరి భాషా కంఠంలో నుంచి వస్తే నీ భాష కన్నుల్లో నుంచి వస్తుంది నీవు హృదయాన్ని అక్షరాల్లో పెట్టిన పక్షివి నీ భాష శోకానికి రూపాంతరం; అర్థం కాదు కుడ్యాంతర అధ్యాపనకు- కనకనే....

వాదాలకు అనువాదాలకు నీవొక్కడివే గతి శేషేన్
భాషాంతర దేశాంతర కాలాంతర దేహాంతర
రూపాంతర వర్ణాంతర ఆత్మ కళే నీ అక్షర యాత్ర
ఏతద్భాషా వేదరహస్యం బోధించే గురుడెవరో తెలుసా?

కొమ్మ ఒక్కటే సర్వస్వంగా కూర్చుని ఉండే రెక్కలయోగి!

శేషేన్ క్యాలెండర్ తేదీలకంటే నీ జీవితంలో అనుభూతుల తేదీ లెక్కువ....కోర్కెల నక్షత్రాలన్నీ చితికిపోయి ప్రభాత రక్తిమ నీ దీపం మీదపడినప్పుడు తెలిసింది నిన్ను బంధించేదీలేదు నీచేత · బంధింపబడేదీ లేదు.

మమతల వలలో పోగులొకటొకటే ఊడిపోగా మిగిలాయి నీవూ నీ నీడా! జీవితం దిగివచ్చి ఇచ్చింది బృహద్దర్శనం ఎన్నో గాయాల స్వర్ణపతకాలు ధరించిన వీరుడివి ఈ చివరి పతకంతో శిఖరాగ్ర మెక్కావని చెప్పింది.

చివరకు తెలిసింది మనిషి కన్నీళ్ళు కార్చే జంతువని! అందుకే తపిస్తున్నావు మనిషిని ఆయుధాలు చేసే జంతువుగా మార్చాలని

సత్యంతో జీవితాన్ని చావగొట్టినావు నీవు
బాధావిషమొక ద్రాక్షపండుచేశిమింగినావు
రాగద్వేషాలు నిన్ను కన్నెత్తి చూడలేవు
శకునాలు చాదస్తాలు ఇకపై బెదిరించలేవు
నీవొక సత్యాగ్రహిగా నిలువెత్తున నిలిచినావు

ఎన్నిసార్లు నడిచాయో నీ కాళ్ళు ఈ బాట రూపొందడానికి ఎన్ని అనుభూతుల గుంపులు క్రిక్కిరిశాయో ఈ పాట ఒక్కటి నీ గుండెలో ఉదయించడానికి! నీవు ప్రేమ నిర్ఝరివై పారుతున్నావు దిక్కులొరుసుకుంటూ; వెతుకుతున్నావు తడిసిన కన్నులు తుడుద్దామని

శేషేన్ నీవు మట్టివి! కానీ నిన్నెరుగుదును నీవు సజీవంగా నిర్జీవంగా నానా రూపాలతో నానా భాషలతో పువ్వుగా పక్షిగా అడివిగా నదిగా కొండగా ఆకాశంగా రంగుల తిరునాళ్ళలో మత్తెక్కి ఎన్నాళ్ళో తిరిగావు అలసిపోయావు నీ రంగులు నీ పాటలు అన్నీ నిలిచిపోయాయి భూమండలం మీద – ఇక నీవు నీ మట్టిలోకి ప్రవేశించి విశ్రాంతి తీసుకో

ఓ శేషేన్ నీ పాటకు రోజా ఒక పునర్జన్మ
నీ పాటకు ఈ జగమే ఒక రూపాంతర చేతన
ఈ దేశాలీ ఖండాలోకే భూమి కుటుంబం
అనుకునేదెప్పుడనే నీ స్వాప్నిక యాతన-
ప్రేమే నీ మంత్రం హృదయం నీ పీఠం
ఓ శేషేన్ నీవే ఒక ప్రేమలోక దేవతవు
నీ కోసం ఒక కోవెల నిర్మించాలనుకుంటే
చెట్టునాటి కొమ్మమీద కోకిల పెడితే చాలు !

నీవొక పల్లెటూళ్లో మొలకెత్తిన ప్రేమ దేవతవు – నీ పేరు వింటే చాలు తన పాతాళంలో జలపాతం ఉరకని ఊర్వశి, నీ రూపు చూస్తే చాలు కలల్లో చలించి స్ఖలించని మేనక మరే ప్రేమ గాథల్లోనూ మనకు కనిపించదు

ఓ శేషేన్ ఇంగ్లండులో నీ పేరు ఎడ్వర్డ్
ఇటలీలో నీ పేరు రోమియో
అరేబియాలో నీ పేరు మజ్నూ
అరే ఇండియాలో దేవదాస్
నిజంగా నీకో ఊరూ లేదు నిన్నెరగని వారూ లేరు

కలియుగం వచ్చి కైలాసానికీ వైకుంఠానికీ నివాసాలు మార్చుకున్న దేవతల్నందర్నీ నీవు మళ్ళీ పిలిచి నీ జానెడు జీవితంలో విడిది ఇచ్చిన అల్పప్రాణివి : నందనవనాల్నీ నలకూబరుల్నీ భూమండలం మీద పునఃప్రతిష్ఠ చేసిన శిల్పజీవివి....

ఛలో శేషేన్ వెన్నెలవానల్లోపడి ఛలో-లక్సుబిళ్ళలా ఉన్న ఆ చంద్రుడు తారలన్నిటికీ యజమాని, ఆకాశనౌకాయాన నిపుణుడు....

నీవు గనక కన్నుమూస్తే నాకు తెలుసు భూమిమీద
కన్నీటి ప్రళయాలు ఎన్నెన్నో కురుస్తాయి
లక్నోలో ఢిల్లీలో రాజస్థాను ఎడారుల్లో

మేఘాలు దారులు తప్పి మెరుస్తూ అరుస్తాయి
సమ్రాట్టులు సీజీర్లూ ఫారోలు పాదుషాలు
విలాసవన సీమల్లో విహరించిన రోజులు నీ
ఇంద్రజాల మహిమచేత వచ్చినట్టులే వచ్చి
పుస్తకాల పుటల్లోకి పారిపోయి దాక్కుంటాయ్
హాల గాథాసప్తశతిలో పరిమళించిన మృదులపల్లీ
శాద్వల ప్రణయాల మధురిమ అలెగ్జాండర్ దండయాత్రలు
అరబ్బీ సైన్యాల గిట్టలు ఎగరగొట్టిన పురాధూళులు
అరే జయపూరు నగరుల నెమలిగుంపులు నిర్వహించిన
శబల వర్ణమాహాత్మ్యాలు-మొగలు తోటల్లో చరించే
సిగల్లో రోజా హసించే స్వప్నమాంసల శరీరాలు
ఎన్నో! అన్నీ నీ శరీరం మీద పడి రోదించు నెంతో

నాకు తెలుసు నీకు మృత్యువంటే ఒక పీపాడు మధువుతాగి హాయిగా కళ్ళు మూసుకోవడం మరునాడు కలలనే రంగుల గొడవల్లేని శాశ్వత శూన్యమైన ఒక ఉదయంలోకి మేల్కొనడం అనీ-

ఓ శేషేన్!

నీకు కవిత అంటే ఒక ద్రాక్ష ఒక ఉత్ప్రేక్ష కలిపి తాపీగా లేని గుండెల్ని కాపీ గొట్టడం అనీ

చక్కటి భోజనం తిని ఫ్రెంచి లిక్కరుతో గొంతు కడుక్కొని ఒక కోమలహస్తం మీద వాలి రాత్రి ముదురు ఘడియల్లోకి ప్రవేశించడమే నీకు ప్రేమేంద్రజాలం అని తెలుసు

నిద్రను కిటికీలో నుంచి అవతల పారబొయ్యడానికి ఉపయోగించే పట్నం నీకు హైద్రాబాద్ అన్నీ చిలకల్ని స్వప్నశాఖల్లోకి పిలవడానికి ఉపయోగించే పట్నం నీకు ఆగ్రా అనీ తెలుసు.

అందుకే పోతున్నావ్ ఆగ్రాకు ఒక వేణువ్ అయ్.. ....
ఎవడో ఋషి చెప్పాడని ఎందుకు తుంచేస్తావ్ ప్రేమని,
నీ రక్తం పారబోసి నింపుకోకు కమండల జలం.

బ్రతుకు అనే ఒక గ్లాసెడు మధువును మహాసముద్రమని వాడంటే నీవే నీ గడ్డంతో సహితం దూకు అందులో అని చెప్పు

నీవు కోర్కెలు అణచుకొని అది నీతి అనుకోవచ్చుగాని
కోర్కెలణచే నీతులన్నీ నీకు సిద్ధాంతాలుగావు
నీవమాయకమైన చేపవు వాడు ప్రవచనాల జాలరి పీకి పారెయ్ శరీరంలో పిరికి గుండెను ఉండనీకు కుళ్ళిపోయిన పండు మాదిరి గోడ అవతల పారవెయ్

పాపాలనుకుని చాల మజాలకు
మీరు దూరమవుతున్నారు.
నరకంలో ఉన్నన్ని మజాలు
స్వర్గంలోకూడా లేవు!
స్వర్గనరక పేజీలను బాగా తిరగేసిన రుషివోశేషన్
గడ్డంతో నీ నగ్న రుషిత్వం కొలుచు ఎంతటి మూఢత్వం
జీవితమంటే ఏమిటిరా అని
గడ్డాన్నడగడ మెందుకురా
మధుమాసంలో మామిడి కొమ్మను
గురించి బ్రాహ్మడ్నడక్కురా.
నన్ను అడుగు ఆ కోకిల నడుగు అన్యులనడుగుట వ్యర్థమురా.....
నీవొక గడ్డంలేని మహర్షివి
దేవుడులేని భక్తుడివి
ఎన్నిగుళ్ళ జేఘంటలు కాదని
ఏకగ్రీవంగా అననీ-
నీవెపుడూ నీ గానం చేస్తూ నిశ్చింతగ పో నవ్వేస్తూ జీవితమొక

షాంపెయిన్ బస్తా జిందాబాద్ నీ రాస్తా
నీ గొంతు వింటే చాలు
భూమిలో శతాబ్దాల
వెనక ఒదిగి నిదురించే
శిలలు లేచి కూర్చుంటాయ్
ఒంటిమీది శిల్పాలను
ఒకసారి చూచుకుంటాయ్
అజంతాలు ఎల్లోరాలు అంతఃపూర్వ కార్లే గుహలు
అన్నీ గుంజన్మంజుల నాదాలై ఘూర్ణిస్తాయ్

నీ వాక్యాలు హైదరాబాదు రాస్తాలు కాళ్ళున్నవాళ్ళు కాళ్ళు లేనివాళ్ళు అందరూ నడుస్తున్న అనుభూతుల కోస్తాలు–నిరంతర సుఖదుఃఖాల మేళా ఓ శేషేన్ నీ జీవితం ...జీవితమే ఒక సమరం అయితే పోరాడక విడిచిపెట్టకు

మనిషి జీవితంలో సుఖాలకంటే దుఃఖాలే దొరుకుతాయి. కంటికొసన అశ్రువు నిలిస్తేనే జీవితం నీతో హృదయం విప్పి మాట్లాడుతుంది. ఒక నిజమైన మాట నీ అధరం ఎక్కుతుంది–చూడు ఆకాశంలో శిధిలాల్లా పడిఉన్న మేఘాల్లోనుంచి సూర్యమండలం లేస్తోంది.

లే దుఃఖాలు నిన్ను వెతుక్కుంటూ నీ యింటికి వచ్చిన ఋషులు

నగరంలో మనిషి గోల అడవుల్లో పక్షిగోల–
కొండల్లో ఏకాంతం చేసే నిశ్శబ్దాల గోల–
బాష్పాల బారినుంచి పారిపోయినా కూడా
అడవిలో లేడికళ్ళ అశ్రువులెదురవుతాయి
దేవతలొక స్వర్గంలో ఉంటారనుకోబోకు
స్వర్గమే దేవతల్లో శరణార్థయ్ ఉంటుంది
ఒకే మంచంలోన ఇద్దరు ప్రేమికులు పవళించగలరే
ఒకే ప్రపంచంలో విరోధులు ఇద్దరెందుకు ఇముడలేరు
ప్రేమ కన్న ద్వేషంవైపే నడుస్తారు మనుష్యులంతా

సూర్యమండలాని కంటే సూర్యగ్రహణమే వింత!
నీవి ఎన్నో ఆగిపోతాయని జడుస్తూ నడుస్తున్న
ఓరిమిత్రా! నేడు కదలిన ఈ దినం మటుకాగబోదని
కనీసం ఒక భరోసా గలదీ అనిశ్చయ ప్రయాణంలో
ఓ శేషేన్
వీళ్ళది మిడి మిడి జ్ఞానం మిడతంభొట్ల సమానం
ఎదగని ఈ వెధవలతో నీకెందుకు-అవమానం,
తాగు తాగు
తాగు గోడలాడేలా తాగు భూమి ఆకాశం
తాళాలై మోగేలా తాగు తాగు వాస్తవాల కోరలూడిపడేలా
ఓరి తాగుబోతుకవీ ఇది నీ వాక్యాలను తింటూ
నిన్నే దూషించే లోకంః
అసలు తలే లేనివాడు మకుటానికి ఎగబడే
తెలుగు నేలమీదెవ్వడు తలకు విలువ ఇస్తాడు?
పాపం...
ఈదాలని ఆశేగాని
పాదాలూ చేతులు లేవు
ఓ శేషేన్ ఓ శేషేన్
నీ విద్యలు నిష్ఫలితం చేశిన ఈ దేశంలో
అన్నీ నీ శక్తులను అవతల పారేశి నేడు
మళ్ళీ నీవొక శిశువై మాయను అజ్ఞానాన్ని
ఆహ్వానించిన ఈనాడనిపిస్తుందొకటి నీకు--
శతాబ్దాల పర్యంతం జనం అన్నపానాలను
హతం చేయు బలమున్నవి ఇతిహాసాలనే రచన
లిరవై రాయుటకంటే చిన్న చిన్న ప్రేమ కథలు
చెప్పుకొనడమే మేలు--
కథలు అన్నీ చావులోనో కాకపోతే పెళ్ళిలోనో

ముగిసిపోవును
తరం మారును అనంతరము
కాని నీ కథ దేనిలోనూ ముగిసిపోవదు తరం మారదు
అది చరాచర సృష్టిగానమ్ అదే నరనారీ ప్రయాణం
నీ వు గాలిబ్ వేమీ కాదు బోదిలేరువు కాదు అసలే
వారిలా ఒక మాట చెప్పే ప్రతిభ ఉన్నా బలం లేదు
ప్రతిభ మాటకు బలం ఇవ్వదు।
బలం ఇచ్చే శక్తి కాలముః

నేనెక్కడున్నాని వెతుకుతుందీ లోకం :
నిషాలన్నీ విడిచిపెట్టి ఇప్పుడు ఏ నిషాలో
ఉన్నానో ఎలా తెలుసుకుంటుంది-

జేబులో ఏ జ్ఞాపకాలు వేసుకొచ్చానో
ఎవరికి తెలుసు? ఏ రాళ్ళ కుటుంబాల్లో
గుండె రెండు చేతులతో పుచ్చుకుని
కన్నీటి బిందువుల కోసం భిక్షాటనం
చేస్తున్నానో ఎవరికి తెలుసు-

బాధలన్నీ ఖాళీ చేసుకుని గుండెకి
మళ్ళీ బాధలు నింపుకుంటోంది;
నన్ను నేను వదలి మరొకరిలో
లీనమవుదామనుకుంటే తనను తాను వదలి
నాలో లీనమయ్యే మరొకరు
లభించకపోయారు-

నా ఆత్మ అగ్నుల్లోకి దూకి తప్త సువర్ణంగా
మారిన ఈనాడు నాశబ్దాలు అనుభూతుల

ఉష్ణోగ్రత పుక్కిలిస్తున్న ఈనాడు ఇక్కడ
అందర్నీ కోల్పోయి మరో దేశానికి మరో కాలానికి
ప్రయాణం చేస్తున్నాని ఎవరికి తెలుసు-

జీవన తపశ్శిఖరారోహణంలో ఎప్పుడూ
మనిషి ఏకాకి అని ఎవరికి తెలుసు-

వాడి అవ్యక్త వాక్కే వాడి శిలువ
అని ఎవరికి తెలుసు-

## మూడో సర్గ

చైత్రమాసపు గాలి వీచిందో లేదో చెట్లన్నీ పూయడానికి
నిర్ణయించుకున్నాయి పూలు పెదవులు విప్పాయి పుప్పొడి
రహస్యాలు వినిపించడానికి
ఇప్పుడు ప్రతి చెట్టూ ఒక దేవాలయం
పక్షులన్నీ ఎగిరే దేవతలు
కొమ్మ కొమ్మలో పాటల పోటీలు
గడ్డి పోచలో కూడా గంధర్వలోకాలు
సితారు సోకితే చాలు శబ్దాల అప్సరసలు :
ఈ పువ్వుల్ని ఎవరు లేపారో అవి నావెంట పడుతున్నాయి
ఏవో జ్ఞాపకాలకు నన్ను క్రూరంగా అప్పగిస్తున్నాయి
ఈ కోకిల్ని ఆమామిడి కొమ్మమీద ఎవరు పెట్టారో అది
లోకానికి నిద్రపట్టనీయడం లేదు.
వసంతాన్ని తెచ్చి కోకిల్ని ఊరుకోమంటే ఊరుకుంటుందా?

నేను ఋషినిగాను కోకిల గొంతు వినబడితే ఉలిక్కిపడ్డానికి–మా ఊరి మట్టితో చేసిన కండలు నా దేహానివి...

పచ్చగా పంచమంలో పాడే మామిడిచెట్టు నడవడం ఒక్కటి తప్ప చైత్రం కోసం ఏమైనా చేస్తానంటుంది;

వసంతం అంటే కోకిలల పాఠశాల పక్షుల సంగీత అకాడమీ–ఒక్కో పక్షి వెయ్యేసి పాటలుగా రూపాంతరాలు పొందే రుతువు

అందుకనే లోకం ఎప్పుడూ ఒక కొత్త వసంతం కోసమే నిరీక్షిస్తూ ఉంటుంది–

చైత్రం ఒక సాలెపురుగు
పువ్వులూ పూస్తుంది, గూళ్ళూ పెడుతుంది
పువ్వుల్లో రంగులు పోస్తుంది
గూళ్ళల్లో చరిత్ర అల్లుతుంది
ఏవో గుసగుసలతో ఏకాంతాన్ని
వేధిస్తుంది
ఎడారుల్ని దాటి దాటి పూలు పూచే భూముల కోసం
ప్రయాణాలు చేస్తాను కాలం మామిడిపండులా మధుర
వాసనలు చిమ్ముతూ ఉంటుందని; అక్కడ సాక్షాత్క
రిస్తుంది రాలే ఆకుకోసం భూమిచేసే నిరీక్షణ! ఎన్నాళ్ళయింది
నీవు నా గర్భం విడిచిపెట్టి, రా–రా–రా మళ్ళీ నాలోకి రా అని
పిలిచే దాని ఇంద్రియాతీత స్వరం వినిపిస్తూ ఉంటుంది
నన్ను నేనే మృత్యువు వైపు తరుముతూ
పరుగిడుతున్నాను
నాకు తెలుసు నా గంట నాలోనే పుట్టి
బయటికి ప్రవహిస్తుంది
మూర్ఖులే దాన్ని గోడకు
శిలువ వేస్తారు....

నేనూ చిలుకలూ కలిసి ఆగ్రాకు తీర్థయాత్ర వెళ్ళినప్పుడు ఆంధ్రదేశంలో వసంతం అడుగుపెట్టింది; అక్కడిపూలు నన్ను జ్ఞాపకం చేసుకుంటాయి నాస్మృతుల అడుగులమీద వాటి పరిమళాలు కుమ్మరిస్తాయి–

గ్రీష్మంవచ్చి నాలో పూలదీపాల్ని ఆర్పివేసినా మళ్ళీ వసంత పుష్పాలు వచ్చి ఎప్పుడూ నా లోపలి కాలాన్ని నిద్రలేపుతుంటాయి; అంతవరకూ నీళ్ళలో మునిగి తామరపువ్వు వెనక దాక్కుని ఉంటా

వసంతంలో నా భూమి పువ్వుల్లో అంతర్ధానమై పోతుంది అప్పుడు నాకు ఆకాశమే మిగులుతుంది; నా ఆకాశం దేగల రాష్ట్రం కాదు అది నా ఊహల ఊదాలోయ

వసంతంలో చెట్లు ఒకదానితో ఒకటి ఆడుకుంటూ ఎగరగొట్టిన తెల్లటి ఉల్లుబంతి ఆకాశంలో చంద్రుడు-

వసంతాన్ని గురించి నాకెవడు బోధించగలడు! ఆకులురాలే రుతువు రహస్యాలుంటే ఉపదేశించు అధ్యయనం చేస్తా.

ఆకాశంలో నక్షత్రాలుకూడా రద్దయిపోతాయి ఉషస్సుదాడికి; ఒకప్పుడు గుండెలో ప్రణయ జ్వాలలు రేపిన చంద్రుడే ఇప్పుడు ఒక గుడ్డి లాంతరులా పడిఉన్నాడు- ఎన్నిసార్లు గుండె పగలాలో ఒక్క సారి జీవితం దర్శనం ఇవ్వడానికి !

బాబూ ! పవిత్రమైన వేణువు వైపే ప్రవహిస్తోంది నా ఆత్మ అందుకే ఆగ్రాకు నా తీర్థయాత్ర....... ..

ఒకరాలిన గింజను మట్టిలో పూడ్చి పెడితే దానికి అంత్యక్రియలు చేసినట్టుకాదు దాని ప్రాణం భూమిని చీల్చుకుని బయటకు వస్తుంది. కొమ్మలు రెమ్మలు ధరించి పూస్తుంది కాస్తుంది రంగుల తుఫానులు వీస్తుంది.

రాలే ఆకు భూమిలో ఐక్యం అవుతుంది మృత.జీవుల శరీరాల ఎరువులోనుంచే నవజీవం రెండాకులు తొడుక్కుని బయటకు వచ్చి బ్రతుకు పండుగలో పాల్గొంటుంది- కొత్తజన్మ అంతా ఒక విప్లవజెండా!

లోయల ఉయ్యాలల్లో ఊగే పువ్వు గాలుల కెరటాలతో పోరాడుతూనే ఉంటుంది మట్టిలోనుంచి తప్పించుకుని కొమ్మల్లో చేరాను గదా

అనుకుంటున్న పువ్వుకు మళ్ళీ మట్టిలోకి పోవలసిన దినం నిర్ణయం అయ్యే ఉంటుందని తెలీదు-

ఒక పక్షి నక్షత్రాల్లోకి పరుగిడుతూనే ఉంటుంది కాంతులు వాంతులు చేసుకుంటూ-ఆయుస్సును ఉషస్సు బుస్సుమని కాటువేస్తుంది సర్పం తన తోక తానే తింటుంది; ఏ వస్తువుకు శాశ్వతత్వం వచ్చినా సర్పం దర్పం కోల్పోతుంది

వసంతం భూగోళం చుట్టూ తిరిగే ఒక పువ్వుల అగ్నిజ్వాల; వసంతాన్ని త్యాగం చెయ్యాలి దేశం కావాలంటే, దేశాన్ని త్యాగం చెయ్యాలి వసంతం కావాలంటే

దానికోసం అడివి మార్గాల్లో పరుగులెత్తాలి తోటనుంచి తోటకు కలసపోవాలి

నీ జీవితపు కన్నంలోనుంచి
ఒక ఆకాశ శకలం చూచి అందమైన
నీలిపువ్వు అని ఆనందించకు
వందలాది రోడ్లు నీ మీద
దాడిచేస్తున్నాయి
నీకు కాళ్ళే లేవుగానీ!
నీ గుండెలో అధైర్యం
గూడు అల్లుతూ ఉంది నీ గుండెకు
బూజు పడుతుంది
నీవొక సామ్రాజ్యానివి కావాలిగానీ
సామ్రాజ్య శిథిలాలు కాగూడదు
ఏకాకి ననుకోకు ఎప్పుడూ ఒక్క దీపం
అన్ని దీపాల్నీ వెలిగిస్తుంది
నిష్క్రియతా సమాధిలో ఉన్న ఓ మనిషీః ఏమి నిర్మిస్తావు

నీ యుగానికి; పక్షులు చూడు పిడికెడంత శరీరాలు
వాటివి, తమ అపరిరక్షిత అల్పప్రాణాల్ని క్రూర
గాడ్పులకి ఎదురొడ్డి ఆకాశాల్ని దాటుతున్నాయి
చంద్రుడు కూడా వెన్నెల మూటలు
భుజాన వేసుకుని ఆకాశపు ఎత్తులకు
ఎగబ్రాకుతున్నాడు
ఉషస్సు ఆకుల్లో పోసిన వెల్తురు తాగు
ఊరుకుంటే ఉదయం వచ్చి
నీ దీపంమీద పడుతుంది-

సూర్యోదయం వచ్చి ఎన్నాళ్ళకు తొలగిస్తుంది దీపాలు మోస్తున్న భారాన్ని - ఒకవీ మనమెప్పుడు ఊపిరి పీలుస్తాం ఒక కొత్త దేశంలో - నిర్మలదేవతలాంటి ఆకాశం నీలిమతో ఎప్పుడు కడుగుతుంది అన్ని వస్తువుల్నీ

ఎవరికీ నవుకర్లుగాని ఈ గాలుల్ని ఎవడు స్వాధీనం చేసుకోగలడు; పూలవాసనలు గాలులకే తెలుసు గాలులవాసనలు పక్షులకే తెలుసు- దిగంతాల్లోకి చూపులు సారించే ఓ పక్షులారా! చైత్రం పాత ఆకుల్ని ఊడ్చి ఎప్పుడు మనకు కొత్త ఆకులు తొడుగుతుంది.

కాలం గొప్ప గొప్ప హిట్లర్ల తలకాయలే తీసి చెత్త కుప్పలో పారేస్తుంటే ఈ దేశంలో వర్షాకాలం పోయిందని చెప్పారేగాని ఆకాశం ఇంకా ఉరుముతూనే ఉంది

ఓ గొర్రెల కాపరీ గొర్రెలకోసం ఎందుకు వెతుకుతావ్. నీ గొంతుకోసం వెతుక్కో ఇకనైనా; అధికారం అని చెప్పి అగ్నిప్రవేశం చేయించబడిన నీవు నీలో ఉన్న మనిషిని దర్శించుకోలేకపోతున్నావు.

రెండు చేతులతో రేడియోల నుంచి వార్తల పాలు పిండుకున్న స్వేచ్ఛాయోధులారా!మరచిపోకండి, ఇంకా బాధల అతుకుల బొంత

అనేనన్ను కప్పుకొని కాలం గడుపుతోంది పీడిత ప్రజల కవిత-

నా ఆత్మవక్షం మీద నుంచి జీవన రథచక్రాలు దొర్లిదొర్లి ఆత్మనలిగిన చందన శాఖలా మారింది ఇవాళ ఆకాశం నా ఆత్మ భాషను విడుదల చేసింది.

ఒరే శబ్ద వ్యాపార వాణిజ్య వేత్తలారా! భక్తులారా! మిమ్మల్ని భూమి పిలుస్తోంది పోండి మీ పద్యాలు మోసుకుని

నాకు మాత్రం ఈసారి ఉగాది నా వెన్నెముక; ఈసారి వసంత రుతువు నా కవితకు తర్జుమా!

నీ బాణానికి గురి ఎవడో శత్రువు నా బాణానికి గురి ఏదో హృదయం; గాలివాలు తెలిసి ఎగిరే పక్షివి నీవు గాలి కూడా భయపడే గమ్యం కోసం రగిలే పక్షిని నేను-

నాకు ఉంటుంది పక్షుల్లా పాడాలనీ ఆకుల నీడల్లో గడపాలనీ కానీ బ్రతుకు పంజాలో పడతానని నాకేం తెలుసు?

ఇక వసంతం మాట ఎత్తకు మళ్ళీ కోకిలనై రాలేను – అరే! ఇవాళ ఇది ఆకాశమా నక్షత్రాల ఖజానా? రా పాడుకుందాం కాలం మన ముందు కుంటేలా చేద్దాం.

నా గొంతు విరిసీ విరియని మొగ్గల్లో చల్లాను అవి ఫలాలుగా మారేవరకూ వా జీవితమొక నిరీక్ష....నిర్మలాకాశం ఎవరి అదృష్టమో? కాలమేఘాల్లో నుంచి బయటపడే నాలుగు కిరణాలే నా వాక్యాలు, ఝుంఝూమరుత్తులే వచ్చి రక్షించాలి మనల్ని--

ప్రతిభ అనే నేరం చేస్తే మీరు క్షమించరని నాకు తెలుసు కానీ నేను పుట్టేముందు నిర్దోషిగా పుట్టమని నాకెవ్వరు చెప్పారు? దొరికిన నాలుగు సెకండ్లే జేబుల్లో వేసుకునిపోయే మీరెంత మంచివారు, కాలాన్నే మార్చాలని ఖడ్గమై ఇంకా ఊపిరి పీలుస్తున్న నేనెంత చెడ్డవాడ్ని – సిగ్గువిడిచి ఏకాకినని చెప్పుకోకు ఒక్క కన్నీటి బిందువు కూడా భిక్ష వెయ్యరు నీకు; గంద్రడగొడ్డళ్ళు దొరికే గంధర్వలోకాలెక్కడున్నాయో వెతుక్కో మనిషికి

ఒక యుగాన్నయినా ఇస్తావు--

ఇన్ని దురదృష్టాల్లో కనిపించని నా సత్యాలకోసం నా లోతుల్లో దిగి స్నానం చేసే ప్రమాదం ఎవడు స్వీకరిస్తాడు? స్వీకరిస్తే వాడు సమకాలికుడెలా అవుతాడు?

నేను మీ జాబితాల్లో ఎక్కడున్నా భూమ్యాకాశాల మధ్య ఎగురుతూనే ఉన్నా, ఎప్పుడూ రెక్కలుజాపి, కొమ్మగానీ కొండశిఖరం గానీ దొరకని గరుత్మంతుడిలా – మనిషిననే మహాసముద్రాన్నయ్ నిరంతరం ప్రయాణం చేస్తూనే ఉన్నా ఎక్కడికీ చేరకుండా....

పాలబాటలో దిగి దోసిళ్ళతో నక్షత్రాలు ముంచుకొని ముఖం కడుక్కొ తామరపూల తోటల్లో తారట్లాడుతోంది ఉదయకిరణం

## నాలుగో సర్గ

మహాత్ములు ఎందరు భువిలో
 శ్వాస పీల్చి చాలించారో
భూమి మీద నిశ్శబ్దంగా
నడిచి నిష్క్రమించారో
మైకొక్కటి ముట్టలేదు
పత్రికలో మెట్టలేదు
వాళ్ళంతా నడిచిన దారులు
వార్తలుగా మారలేదు

మెరిసే మకుటం మినహా
శిరసే కనిపించవినూతన
రాజుల ఎంగిలి కూతలు
పేజీలైపోతుంటే
చప్పుడు చెయ్యని అడుగులు
చరిత్రలోకెక్కలేదు

క్రిక్కిరిసిన హొటల్లో
గుంపులున్న బాటల్లో

బ్రతుకు వరదల్లైై పారే
బస్టాండుల చోటుల్లో
ఫారోస్సైజు మనుష్యులు
హీరోదాత్త మనీషులు
ఎవరూ ఎరగని రుషులు
పల్లెటూరు కన్న మనిషి
మా నాన్న మహర్షి
మా బడిపంతులు మాత్రం
మరణం లేని మనీషి

బ్రతుకు యుద్ధరంగంలో
ప్రాణాలర్పించిన వీరులు
ఎందరెందరో శేషేన్!
అందరికీ జోహారులు

అత్యున్నత పర్వతమూ
అతి దీర్ఘ నదీప్రవాహము
అతి లోతైన సముద్రము
అతి దూరపు నక్షత్రము
ఉన్నప్పుడు అత్యుత్తమ
మానవుడెందుకు ఉండడు

ఎన్ని వాస్తవాలు లోకం
నుంచి కారిపోతాయో
అన్ని గొప్ప ఆదర్శాలు
అందులోకి చేరుతాయి

అసలు మనిషి కథ ఎందుకు
అవని మీద పుట్టింది

గగన తారలను చెట్లకు
తగిలించాలనే గదా

ఘనులైన మనుష్యులకోసం
దినపత్రిక వెతికే కళ్ళకు
సామాన్య ప్రపంచంలో
చవటలే కనిపిస్తారు

రాజకీయాలు వచ్చి
నాస్తికులైన జనాలను
చలనచిత్రసీమ వచ్చి
ఆస్తికులను చేశింది
పరారయిన దేవతల్ని
పట్టుకొచ్చి యిచ్చింది.

దేవతలే లేకుండా
బ్రతకలేని జాతి మనది--

పూజలనీ భజనలనీ అస్తమానమూభక్తులు పెట్టే బాధలు పడలేక దేవతలు మందిరాల్నించి పారిపోతున్నారు. నేడు భక్తుల్లో పెరుగుతున్న మహాభక్తి దేవతలకు జాతీయ సమస్యగా మారింది--

ప్రజలంటే ఎవరండీ
ఇజాలచే తాడితులు
కులమతాల భయంకర
కుష్ఠరోగ పీడితులు
సర్కారీ నవుకరీలు
చల్లార్చిన చవటలు
ధనికుల్లోనే సర్వం

దర్శించే దరిద్రులు – థూ

వీరంతా ఎన్నుకునే
వీరులే ఓ శేషేన్
నీ ప్రభువులు నీ కవులు
నీ సాహిత్య విమర్శకులు

దోమల సామ్రాజ్యంలో
ఈగలు డిక్టేటర్లు
ఒంటెల సౌందర్యానికి
వంతపాడు గాడిదలు
ఇక్కడ ప్రాకే చీమలు
హిమాలయ శ్రేణులు

అరే డజన్లమంది లెనిన్లు వచ్చి
ప్రజల్ని దున్ని పారెయ్యనీ
మదాంధులైన ధనాధికారుల
పదాక్రాంతులే ఈ ప్రజలు

ఎందరెందరు ఈ ప్రపంచం
ఎన్నిసారులు దున్నినారో
గింజ చేతికి దక్కకుండా
గేటుదాటి గతించినారో !

మిడిమిడిజ్ఞానంబు చేతనె
ఎగిరి పడతావేల మిత్రా
రకరకాలుగ ఎగురుతుందొక
ధ్వజం గాలున్నంత వరకు

నేలకు రాలే ఆపిల్ పండును
రాలే లా చెయ్ గగనంలో
వినా సేతువుగ నదీ నదాలను
పారే లా చెయ్ చేలల్లో

మనిషిని మనిషిగ మార్చడమన్నది
మాత్రం మజాకు కాదురా
కలలు కనే ఒక రెక్కల కళయే
మానవజాతిని మార్చునురా
కవి ఒకడే మన యావన్మందిని
కలల బానిసలు చేయునురా
కవిత్వమంటే స్వప్నవిద్య అని
ఉపదేశించే ఓ శేషేన్
కలల వర్తకపు క్యాపిటలిస్టువు
నీ పని కసితో నిందిస్తాన్

మనిషి ధనానికి బానిస అంటూ
మార్క్స్ చెప్పినది వాస్తవమే
మనిషి డబ్బుతో మారడమన్నది
మటుకీ శతాబ్ది జోకు సుమీ !

అరే ఈ గ్రామాలు ఈ పట్నాలు నీచత్వం నుంచి నీచత్వానికే ప్రయాణం చేస్తున్నాయి.

ఉత్పత్తి సాధనాలు ఊడబీకి తీసుకో
ఊపిరి పోతుందిగాని ఉత్తమలోకం రాదు
ఇదేగదా ఈ శతాబ్ది బోధించిన గుణపాఠం
సాధనాలు కావాలి సాధకుడూ కావాలి
మన అంతిమ సాధనమొక మనిషే అని తెలియాలి

వృక్షాలకు పళ్ళకు బదులు
పైసాలే ఫలియిస్తే
వ్యవసాయ క్షేత్రాలకు
రూపాయలు జన్మిస్తే
మనిషి విలువ తెలుస్తుంది
ధనం బ్రతుకు తెలుస్తుంది
అరే! బ్రతుక్కన్న బంగారం
బంగారం అవుతుందా?

ధన మనగా ఒక మానవత్వమే
దాన్ని మలచుటే ధర్మంరా
కనక ధనికులను అధికారులను
ద్వేషించే కళ నేర్పుము రా

విప్లవమంటే వేరే మరియొక
విద్య లేదురా ఈ భువిలో
ఇంత లోతులకు దిగితేనేగద
అంతు తెలుసుకుంటావురా!

నన్ను ధనికులు అధికారులు రాజకీయ నేతలు అవమానించారు. నా జీవితం కుక్కలు చింపిన విస్తరి చేశారు. వాళ్ళ రక్తం త్రాగాలన్న పిపాసే వాళ్ళ భక్తుల రక్తం ఈ దేశపు వీథుల్లో ప్రవహింపజేయాలన్న జిజ్ఞాసే నా యావత్ జీవిత ఏకైక స్వప్నం! నాటికీ నేటికీ నా కవిత ఆ పగ రూపాంతరమే ! పగ అన్న బీజాక్షరాలే ఈ ఇతిహాసంలో పర్యాంత గద్య-

నా స్వప్నం ఫలించని ఈ దేశంలో రోడ్లు ఒక కుక్క తమ మీద కాలు మోపితే గర్వకారణంగా భావిస్తాయి.

గర్జించు ఓ శేషేన్! నిర్భయంగా గర్జించు దిశలు బ్రద్దలయ్యేలా గర్జించు--

ఓ శేషేన్ ఓ శేషేన్
దేశకాల బంధాలను
ధిక్కరించి తెంచుకో
మానవ దేహాలయ దేవత
మనిషిని దర్శించుకో
నీ రగిలే గుండెలతో
నీరాజనమిచ్చుకో.

## ఐదో సర్గ

ఆ గులాబీ సైతం నీ చిరునవ్వు
కాపీ కొడుతోంది ఒక నాజూకు
శాఖ ఎక్కి——

నీ హృదయం ఒక జాబై నా చేతిలో
వాలుదా మనుకుంటోంది
ఒక రైలెక్కి——

నీకేం తెలుసు నా జీవితం ఇవాళ
ఒక అందమైన పార్కు కాదు

నా కథలో తేనెటీగ వాలడానికి
ఒక్క పువ్వు కూడా లేదు——

నీవు వెళ్ళిన తర్వాత ఎవరి పెదవుల నుంచీ ప్రతీకలు రాలడం లేదు
ఎవరి గొంతుల్లోనూ బింబాలు కదలడం లేదు

ఎందుకీ పక్షులు కొమ్మల్ని విడిచి పారిపోతున్నాయి ఆకాశాల బరువులు మోసుకుంటూ

ఎందుకీ చెట్లు ఇలా వలసపోతున్నాయి పువ్వుల భారాన్ని మోసుకుంటూ

ఎవరైనా వాటి నేత్రాల్లో ఉన్న శోక సముద్రాలు గుర్తించారా

దేశపు గొంతులో ఉన్న ఆక్రోశం ఎవరైనా విన్నారా--

నా చిరకాల యాత్రలో శిథిలమైన నా అవయవాలు గోడకు తగిలించిన అస్త్రాల్లా వ్రేలాడుతున్నాయి - తీవ్ర వేదనల తుఫానులు సాహస యాత్రల భావోద్వేగాలు అగ్నిపర్వత శ్రేణుల విస్ఫోటలు నా మనఃపంక్తుల నిండా గుంపులు గుంపులుగా క్రిక్కిరిసి ఉన్నాయి.

ఇవాళ నా మనస్సు కోరుతోంది – మహాసముద్ర మధ్యజలాల్లో ఒక తిమింగలంలా తేలుతూ ఉందామని, వెచ్చగా జలాల్లో నుంచి దూసుకొని వచ్చిన సూర్యరశ్మిలో.......

ఒక కోరిక ఆవేశిస్తుంది దాన్ని – ఇంద్రియజాలాన్ని దూరదూరాలకు విశిరేశి నేడు మిగిలిన రెండు మూడు క్షణాల్ని పట్టుకుందామనీ వాటితో పండుగ చేసుకుందామనీ--

ఒక చెట్టులా ఒక జంతువులా ఒక పిపీలికలా నిర్మలమైన సంపూర్ణ అజ్ఞానంలో క్రీడిద్దామనే ఉగ్రకామనకు లొంగిపోతుంది మనస్సు....సృష్టి తొలిజీవరాసుల్లో ఒక అల్పజీవిగా ఐక్యం కావాలంటుంది- అందుకే నన్ను పెనవేసుకుని నా మీద పెరిగిన జ్ఞానబోధ నంతటినీ విధ్వంసం చేద్దామనే ప్రయత్నంలోనే ఉన్నాను నేనిప్పుడు--

ఇక్కడే నామీద జరిగే కఠోర దైనిక వాస్తవాల దండయాత్రల్లో నేనొక విషాద నాటక శిథిలంలో కూలిపోయాను--

నీవు వెళ్ళావు – కానీ ఒక స్పర్శ విడిచి వెళ్ళావు నా పరిసర వస్తుజాలం మీద పునఃసృష్టి లాలస పూసిన ఒక ఆత్మస్పర్శ విడిచి వెళ్ళావు--

ఇవాళ నేను ఉదయాస్తమానాలు చూస్తూ కూర్చుంటాను వరండాలో, శాద్వలాన్నీ వృక్షాల్నీ ఆకాశంలో ప్రవహిస్తున్న పక్షుల సమూహాల్నీ కేవలం చూస్తూ....

ఆశ్చర్యం ! అవి ఇప్పుడు కొత్త రూపాలతో దర్శనమిస్తున్నాయి, ఎందుకంటే వాటిని ఒకప్పుడు నీతో కలిశి అనుభవించానని చెప్పడానికే కాబోలు !

ఇంత సత్యం నీ రైలు వెళ్ళిపోయిన తర్వాతగానీ స్ఫురించలేదు.

నీగుండె ఒక గాయాల లైబ్రరీ శేషేన్!
చిక్కుపడిన దారాలు జీవన మార్గాలు
నీవాళ్ళెవరు కారో నీకు తెలీనీవు
నీవు నిలబడ్డ భూమి కూడా
నిన్ను వంచించదని చెప్పలేవు
బాధితుల క్యూలో నుల్చుని
దర్శించు జీవితాన్ని
సిగ్గువిడిచి దేవుడికైనా మొక్కు
మొక్కిన చేతిని కూడా మింగే
మనిషికి మాత్రం మొక్కబోకు

అవమానించారని దుఃఖిస్తావెందుకు
బాధవస్తుందని భయపడతావెందుకు
ఈ సాయంకాలం ఒక ఎగిరిపోయే పక్షి
నీ కళ్ళతో ఒక్కక్షణం దాన్ని బంధించు
నీ బాష్పంలో అది శిల్పమై జీవిస్తుంది

దేవుడు మరెక్కడా లేడని
తెలిసిన నీకు
స్వర్గమెక్కడుందో
నరకమెక్కడుందో తెలీదా
హృదయముంది ద్రవించడానికి
కళ్ళున్నాయి శోకించడానికి
దూకు జీవన మైదానాల్లోకి
నీవు మహాకవివి

అన్ని గాలివానల్నీ గ్రహణాల్నీ
గురించి పంచాంగాలు చెపుతాయి గానీ
నీ గాలివానల్ని నీ గ్రహణాల్ని
గురించి చెప్పే పంచాంగాలు లేవు
రేపటి వాళ్ళు అర్థం చేసుకునే
గ్రంథం నీ జీవితం
ఇవాళ మాత్రం నీవు
ఏకాకివి

ఒక గానంలో ఎన్ని దృశ్యాలు ఎన్ని నదులు ఎన్ని అరణ్యాలు ఎన్ని ఆకాశాలు గుంపులు గుంపులుగా ముందుకు తోసుకుపోతున్నాయో ఇప్పుడే తెలుసుకున్నాను–

ఎలా వర్షబిందువులు స్వరాలుగా మారుతున్నాయో ఎలా సెలయేళ్ళు సితారు పలుకులుగా రూపులెత్తున్నాయో జన్మజన్మల తీరాలనుంచి కొట్టుకొచ్చిన ఒక ఆవారా గుండెకే తెలుసు–

ఒక్కొక్క స్వరవిరామంలో ఎన్ని బింబాలున్నాయో ఎన్ని ప్రతీకలు దాక్కున్నాయో – పెదవుల తీరాలు చేరడానికి ఒక స్వరం ఎన్ని గుండెల తుఫానులు దాటాలో ఎన్ని అప్రశాంత నౌకా ప్రయాణాలు చెయ్యాలో ఎన్ని సున్నిత అభివ్యక్తుల్ని మోసుకురావాలో –

ఆ కర్తకే తెలుసు.......

నేను నా కలలమ్ముకుని బ్రతికే
దేశద్రిమ్మరిని
బజార్లు ఎలా దోచుకోగలను–
ఈ దినం
పియానో మీద నర్తిస్తున్న వర్షరుతువు
చెట్ల సభల్లో చేరి మలిన ధ్వనులు
ఎలా చెయ్యగలను
ఊహల్లో హంసల్లా ఎగురుతున్నారు
రష్యన్ బేల్లరీనాలు
ఇవాళ పొలం ఎలా దున్నగలను
ఈ జీవితం ఇలాగే రాలిపోనీ
హేమంతపు ఆకుల జల్లులా–

మంచి నిద్ర కొంచెం సేపే
స్వప్న తుఫానులు వీచే
రాత్రిగడవడం రేపే

మనిషి నడక గమ్యంవైపే
కష్ట సుఖాలను మోసే
జీవయాత్ర మరణం వైపే

నిశ్చల జలాల్లోకి ప్రవేశించే హంస,నిద్ర-
జీవితంలో నిన్ను భ్రాంతులన్నీ విడనాడిన ఈ నాడు
మంత్రమొక్కటే మిగిలిన ఆస్తి
దాని ధ్యానమే నీ తలగడ

గాలి నిర్జీవ శరీరం లోకం మీద బరువుగా పడిపోయింది; పైకి లేవాలనుకున్న పాగ కండరాలన్నీ పుంజుకుని కష్టంమీద లేస్తోంది-

దినమంతా ఆకాశం కుమ్మరించిన ఎండ తాగి చెట్లు పూల రంగులు పుక్కిలిస్తున్నాయి తక్కిన ప్రాణులు అవయవాలు వాల్చేస్తున్నాయి.

రేడియో దుఃఖభారంతో ఏడుస్తోంది చీకట్లు ఇనప బాహువులు జాపి నా గొంతును నొక్కుతున్నాయి-

ఓహ్ ! ఈ బరువు మోయలేను ఈ బాధ సహించలేను ఈ బలాన్ని ఎన్నాళ్ళు ఈ రెండు చేతులతో పుచ్చుకుని ఈ పోరాటం సాగించేది-

నా శత్రువు కనిపించడు నాబాధలు కనిపిస్తాయి నా శరీరంలో

పంచభూతాలు గాలితో చేతులు కలుపుతున్నాయి-

గగన మైదానాల్లో ఈదుతున్న ఆ పడవ ఏమిటి? తెలిమబ్బు తునక కాదు...

నా వర్షరుతువుల్ని నాకొండల్ని నా చెరువుల్ని నా చేలని నా బాల్య సామగ్రిని అంతటినీ కలలుగా మార్చి దూరదూర దేశాలకు మోసుకుపోతున్న ఆ పడవేమిటి? అది కొంగ కాదు; అది మళ్ళీ నన్ను బాల్యంలోకి తీసుకుపోతున్న నావ!

ఎక్కడికో చేర్చింది నన్ను ఏ అమాయక సీమలకో చల్లటి మా అమ్మ ఒడిలోకి ఒక అనిర్వచనీయమైన మధుర అజ్ఞాన శీతలచ్ఛాయల్లోకి - ఎన్ని గాయాలు తగిలాయిరా నీకు అని తడిశిన కళ్ళతో ఓదార్చే చేతుల్లోకి - ఎక్కడికో పల్లెటూరి నీడలోకి, ఏ పిడికెడు నీడలో నా ఆత్మ పరవశించి నిదురిస్తుందో ఏ నీడలో కలుషిత రాజకీయ మార్గాలన్నీ రద్దయిపోతాయో క్రూర జంతువుల్లాంటి లారీలూ లౌడ్ స్పీకర్లూ మనిషిని వేటాడలేవో ఎక్కడ ఆత్మ అన్ని నాగరకతలూ మరచి అన్ని సిద్ధాంతాల బలాత్కారాలు తప్పించుకుని నిర్మల ఆకాశ నీలిమలో అన్ని వస్తువులతో కలిశి సమానంగా స్నానం చేస్తుందో అక్కడికి చేర్చింది నన్ను-

ఎండలు దండయాత్రలు చేయలేని ఆ నీడలో రాజకీయ రాక్షసుల చేతుల్లో అలిసిపోయిన ఆత్మ మోటబావి గట్టున కూర్చుని స్వప్నాల్లో లీనమవుతుంది.....చల్లటి నూతినీళ్ళు ఈనాడు కోల్పోయిన పరిమళము, అరిటాకులో వడ్డించిన వేడి కూరలు పప్పు అన్నము పోగొట్టుకున్న ఇంద్రియాల్ని లాలసలో ఓలలాడించే పరిమళము తిరిగీ అవి పొందాలని తహతహలాడుతుంది - మనిషి పోగొట్టుకున్న పరిమళాన్ని మనిషి పొందాలని ఆక్రోశిస్తుంది ఆత్మ-

ఆ నీడ చూడగానే నా కళ్ళలో నీళ్ళు నిలుస్తాయి పరుగెత్తుకెళ్ళి తల్లినిలా ఆ నీడని కౌగలించుకుంటాయి నా చూపులు; ఇది నాదేశం ఇది నా చెట్టు ఇది నా గ్రామం నా ఊరి కాలువ అని నా ఇంద్రియాలన్నీ పసిపిల్లల్లా పరుగులెత్తుతాయి నా లేత సంవత్సరాల్లోకి. ... ..

అప్పుడొక షహనాయీ దూరదూరాల్నించి ఒలకబోసే మంద మంద స్వరాలకు మది ఒక్కసారి కరిగిపోతుంది; ఒక్క కోమల కవితా పంక్తికే పారవశ్యం చెందుతుంది; అస్తమానమూ ఇంటిచాకిరి చేసే ఇల్లాలి మీద ప్రేమ సముద్రంలా పొంగిపోతుంది ఆకలితో పడి నిద్రపోయిన పసివాడి మీద కన్నులు అశ్రువులు రాలుస్తాయి నరాలన్నీ గుంజి బ్రతుక్కోసం రిక్షా లాగుతున్న అసహాయ మానవుడ్ని చూచి గుండె చెరువై పోతుంది అర్ధరాత్రి వీధి దీపం క్రింద ఎంగిలాకుల్లో మెతుకులేరుకుంటున్న నగ్న బాలబాలికల్ని చూస్తే పెద్ద పెట్టున ఏడుపొస్తుంది-

బ్రతుకులో అలిసిపోయిన ఈనాడు కరుణ అన్ని వస్తువుల మీదా కాంతి ప్రసరిస్తోంది-కన్నీళ్ళకు ఎంతబలముంది ! ఒక్కో బాష్పం ఒక్కో మహాసముద్రమా ఏమిటి? లక్ష లైబ్రరీలివ్వలేని జ్ఞానాన్ని ఒక్క అశ్రువు ఇస్తోంది ! ఈ జీవన యాత్రికుడికి.....

ఇవన్నీ నేను చూచిన రాస్తాలే
ఇవన్నీ నేను చేశిన రాస్తాలే
మది ఒంటరితనంలో ఖైదీ
ఐ
ఆర్తనాదం చేస్తున్న ఈనాడు
నా అలిశిపోయిన అడుగుల్ని
ఆహ్వానించే
రాస్తాయే లేదు !

నా శిరస్సుమీద ఇవాళ ప్రశాంత ఆకాశం లేదు
నా పాదాల క్రింద అందమైన భూగోళం లేదు
సుఖదుఃఖాల మైలురాళ్ళు లెక్కబెడుతూ
ఈ పొలిమేరలు దాటి నా జీవనయాత్ర లేదు

భాష్పం చేత మలినం కాని కాలం అనుభవించే
జాతి దేవతలైనా వద్దు
అడుగుపెడితే ఒక పాట గొంతు నలిగిపోతుంది
ఎక్కడికీ ఇక ప్రయాణం వద్దు
గగనంలో ఎగరేశాను అక్షరాలకు అమృతం తాగించి
కాగితాలకు ఊపిరి పోశాను మనిషిలో కలం ముంచి
నన్ను కత్తితో పొడువ్ రక్తం కాదు కవిత్వం కారుతుంది
పాడే నదిని పుడిశిట్లో ఖైదీ చెయ్
అది మౌనం కాదు స్వరాల భూకంపాలుగా మారుతుంది

విశిరెయ్ నాకలం
ఆకాశంలో నక్షత్రగుచ్ఛం అవుతుంది
తృణీకరించు నా గొంతు
కోకిలలే తలవంచుతాయి నా శరీరం ముందు

నా తనువు ఎక్కడ అగ్నిలో కలుస్తుందో
అక్కడ దైవీయ మధువు వర్షిస్తుంది
నేనిక్కడ కాందిశీకుడ్ని
నన్ను తారల సుగంధం పిలుస్తోంది

# ఆరో సర్గ

ఆయింట్లో ఒక తోట- ఆతోటలో ఒక నెమిలి-ఆ నెమిలిలో ఒక-కాదు నా గుండెలో ఒక యిల్లు-ఆయింట్లో ఒక తోట-ఆ తోటలో ఒక నెమిలి-ఆ నెమిలిలో ఒక ఏదో .......చెపుతా - నేనెక్కడుంటే అక్కడికి వస్తుంది ఆ నెమిలి. నేను వ్రాసుకుంటూనో, చదువకుంటూనో దాన్ని గుర్తించకపోతే, నా పైజమా తన ముక్కుతో లాగుతుంది, నా కాలివేళ్లని సున్నితంగా పొడుస్తుంది, నేను తలయెత్తి చూచేసరికి మెడజాపి మోర ఎత్తి ఆ చిన్న కళ్ళతో నావైపు చూస్తూ ఉంటుంది. పసిపిల్లవాడు తల్లిదగ్గర చేసినట్లు తినడానికి పెట్టమని. గొడవచేస్తుంది. కొక్కొక్కో అంటూ; ఆ పెట్టినవి జొన్నలో బియ్యమో నేలమీద వేస్తే తినదు; కొక్కొక్కో అంటూ వెనక్కి వెనక్కి అడుగులు వేస్తూ ఉంటుంది; చేత్తో పెడితే సంతోషంగా తింటుంది. కడుపు నిండిన తర్వాత - నేను వ్రాసుకుంటూ ఉంటే అక్కడే ఉంటుంది, ఆ పరిసరాల్లోనే తిరుగుతూ, అప్పుడప్పుడూ కొక్కొక్కో అంటూ, నేనిక్కడే ఉన్నాని జ్ఞాపకం చేస్తూ

నే నలసిపోయి ఇంటికి రాగానే ఎక్కడ్నించో వచ్చేస్తుంది నా దగ్గరకు ఆ నడిచే రంగుల విందు, మేఘ విపినాల్లోకి ఇంద్రధనుస్సు వచ్చినట్లు, పాపం మాట్లాడలేదు. తన భావం చెప్పలేదు, ఒక సముద్రం తనలో ఘోషిస్తోంది బంధాలు తెంచుకొని బయటపడ్డానికి; విఫలమై

ఉద్రేకిస్తుంది. ఆ జీవి ఎంత బాధపడుతుందో లోపల సృష్టికర్తను ఎంత నిందిస్తోందో తన వైకల్యానికి

ఒక రోజు నేను చచ్చిపోయాను, నా గదిలో అందరూ ఏడుస్తున్నారు. అదిగో నెమిలి, మెల్లగా బెదురుతూ వస్తూ వుంది మనుషులు గుంపులుగా కూడిన ఆ గదిలోకి, నాలుగు వైపులా మొహం తిప్పుతూ, ప్రాణభయంతో వస్తూ వుంది ఎంత ప్రాణభయమయినా గదిలోకి ఏదో తనని లాగుతూ ఉన్నట్లుగా నా వైపు వస్తూ వుంది. ఏది లాగుతూ ఉందో నాకు తెలుసు; చాలా మందికి తెలీదు. అదే ఈ లోకపు దురదృష్టం ! మృత్యుభయం దాన్ని నివారించలేకపోయింది; – నేను చచ్చిపోయాను! కాని ఈ విచిత్రం మాత్రం చూస్తున్నాను. చాలా మంది నా దేహం మీద పడి ఏడుస్తున్నారు.

తటాల్న మొహసా కథ "ప్రేమ" నా మనస్సులో మెరుపు తీగెలా మెరిసింది. ఆ కథలో వేటగాడు ఒక పక్షుల జంటలో ఆడపక్షిని తుపాకితో కాల్చివేస్తాడు. అది నేలమీద పడుతుంది. స్నేహితుడితో అంటాడు, "తుపాకి గురిచూస్తూ కూడా రెండో పక్షి తప్ప కుండా తుపాకి పరిథిలోకి వస్తుంది. ఇలాంటి జంటలో ఒకదాన్ని కొడితే రెంటినీ కొట్టినట్టే." అలాగే ఆకాశంలో వలయాలు చుడుతూ హృదయవిదారకంగా రోదన చేస్తూ నేలమీద రక్త ప్రవాహంలో పడి ఉన్న ఆడపక్షి వైపు వస్తూ ఉంది, ఆ రెండోది భయం అన్న మాట మరచిపోయి తుపాకి పరిధిలోకి వచ్చింది. రాగానే వేటగాడు వేటగాడే గదా తుపాకి పేల్చాడు. మగపక్షి ఆకాశం నుంచి రాలి పడిపోయింది నేలమీద ఆడపక్షి ప్రక్కన.

వెంటనే నాకు వినిపించింది! కఠోరంగా శపిస్తున్న పురాతన గొంతుక; నాకు తెలుసు అది వాల్మీకి. ఆ గొంతు మొపాసా వేటగాడ్ని తిడుతూ ఉంది. వాల్మీకి ఒక నిక్కరు బూట్లు వేసుకో ఉన్నాడు, తలమీద ఒక దొర టోపీ ఉంది; ముఖంలో నిశిత బాధా రేఖలు అలుముకో ఉన్నాయి. ప్రక్కన స్నేహితుడి చేతిలో తుపాకి పొగలు కక్కుతూ ఉంది.

నేను నా చావు సంగతి మరిచిపోయి దిగ్భ్రాంతుడ్నయ్యాను ఈ గొంతే మునుపు ఒక వేటగాడ్ని తిట్టింది. అప్పుడు మరొకడ్ని తిడుతూ ఉంది. ఈ గొంతు ఎప్పుడూ ఇలా తిడుతూనే ఉంటుందా అన్ని కాలాల వేటగాళ్ళనీ? మానవతకు గాయాలు చేసేవాళ్ళనీ, ద్వేషాన్ని, స్వార్థాన్ని రక్తాక్షరాల్లో రాసే వాళ్ళనీ... కాలపు రస్తాల్లో దాడులు జరిపే బందిపోటు దొంగల. నుంచి మానవతను రక్షించడానికి అహరహమూ పహారా కాచే పోలీసా ఏమిటి ఈ గొంతు ! విశ్వంలో మహనీయత శబ్దంగా మారుతుంది. ఆ శబ్దం శాశ్వతంగా లోకమంతటా పరిభ్రమిస్తూ ఉంటుంది; యుగం నించి యుగానికీ, దేశం నుంచి దేశానికీ, భాష నించి భాషకూ, అనంతంగా...

ఒక నాడు 21వ శతాబ్దం సాయంకాలం నేనూ, అల్బర్ట్ కేమ్యూ ఒక పార్కులో స్విమ్మింగ్ పూల్లో ఈదుతున్నాము. ఆ రక్తంలో తడిసిన మేము ఒక్కసారే ఉదయించిన రెండు అరుణబింబాల్లా ఉన్నాము. నేనన్నాను, కేమ్యూ, హింసాద్వేషాల నుంచి ఏ మహాకావ్యమూ ఉద్భవించదన్నావు. మరి మన మీదుతున్న ఈ రక్తపూరమేమిటి; మనిషిమీద ప్రేమచేతనే గదా ఈ రక్తం ప్రవహించింది? ఈ రక్తం పారకపోతే అదిగో ఆ పసిపిల్లలు అలా ఆ పువ్వుల్లో ఆడుకుంటూ ఉండేవాళ్ళు కారు. ఉదయాస్తమయాలు అందరికీ ఇన్ని రంగులు వెదజల్లేవికావు. కేమ్యూ మాట్లాడే లోపుగానే, గట్టుమీద పూచిన కుసుమలత ప్రక్కన కూర్చుని ఉన్న కాఫ్కా అన్నాడు, "ఈ రక్త ప్రవాహం కావాలి, కానీ అందులో కొందరు పడవలు వేసుకొని ప్రయాణాలు చేస్తున్నారు కీర్తిశిఖరాలకు, వాళ్ళ లక్ష్యం కీర్తిశిఖరాలే గానీ ఈ రక్తం ఎవరిదో ఎవరి కోసం పారిందో వారి క్షేమం కాదు. వాళ్ళు తమ రక్తం ఒక్కబొట్టుకూడా కార్చరు. పరాయివాళ్ళ రక్తం పారితే పాటలు రాస్తారు"

భవభూతితో కలిసి ప్లాటో ఏదో చిత్రం పరిశీలిస్తున్నాడు. "ఇది థాయ్‌లెండులో గీచిన హనుమంతుడి చిత్రం" అన్నాడు భవభూతి. "ఇది కాలాంబుధి ఈది వచ్చే మానవతా సందేశం" అన్నాడు ప్లాటో ఇంతలో

కాఫ్కా అన్నమాటలువిని, "ఫ్రాంజ్, ఈ పడవ ప్రయాణాల బందిపోటు దొంగలు ఎప్పుడూ ఉన్నారు. మా గురువు గారి చేత హాలాహలం త్రాగించిన వాళ్ళు వీళ్ళే, ఆయన చచ్చిన తర్వాత ఆయన మతానికి గురువులై కూర్చుందీ వీళ్ళే. చిత్తశుద్ధిలేని వాళ్ళు ఎప్పుడు లేరు? వాళ్ళలో వాడే గతసంవత్సరం సిస్టీన్ చాపెల్ లో ఉన్న పియేటా మాతృవిగ్రహం ముక్కూ చేతులూ విరగ్గొట్టాడు. హాలాహలం తాగేముందు మాగురువుగారు అన్న మాటలు ఇప్పటికీ ప్రతిధ్వనిస్తున్నాయి ;

"ఓ న్యాయాధికారులారా! మీరు సంతోషంగా ఉండండి... నేను వెళ్ళిపోవలసిన కాలం ఆసన్నమయినట్లు నాకు స్పష్టంగా తెలుస్తూ ఉంది. ఇక నేను మరణించడమే మంచిది; ఈ బాధనుంచి విముక్తుడ్నవుతాను.. నాపైన నేరారోపణ చేసినవాళ్ళమీదగానీ, నాకు శిక్ష విధించిన వాళ్ళమీదగానీ నాకు ఏమాత్రమూ కోపంలేదు. పాపం, వాళ్ళునాకు ఏ అపకారమూ చెయ్యలేదు; ఉపకారం చేద్దామన్న తలపు లేకపోవచ్చు. దానికి వాళ్ళని సున్నితంగా మందలిస్తాను.

కానీ వాళ్ళని నాకొక్క ఉపకారం చెయ్యమని కోరుతున్నాను. నా కొడుకులు పెద్దవాళ్ళయిన తర్వాత వాళ్ళనుకూడా ఇలాగే శిక్షించమంటాను; నేను మిమ్మల్ని విమర్శించినట్లు, వాళ్ళ అపసవ్యపు విలువల్ని వాళ్ళ మిథ్యాస్వరూపాన్ని ఖండించండి. మీరు నిజంగా ఈ పనిచేస్తే మీ చేతులతో నాకూ, నా పిల్లలకూ న్యాయభిక్ష పెట్టినవాళ్ళవుతారు." మా గురువుగారు తాగింది హాలాహలం కాదు; అది చిత్తశుద్ధికి నికషోపలం." తదేక ధ్యానంగా వింటున్న ఇక్బాల్ అన్నాడు.

"కాలానికి ముందుగా పుట్టి కాలానికి బలి
అయిపోయాడు, ఎన్నో అసంఖ్యాక నక్షత్రాలు

హతమయివ తర్వాతనే లోకానికి ఒక
అరుణోదయం కలుగుతుంది"

500 ఏళ్ళ తర్వాత ఆయనే క్రీస్తనే పేరుతో పుట్టాడు. క్రీస్తుగా పుట్టడానికి 100 ఏళ్ళముందు మహాకవి వర్జిల్ మనస్సులో మెరుపుతీగెలా మెరిశాడు. ఆ మహాకవి తన ఇకొలోగ్స్‌లో, "ఆ దివ్యజ్ఞాన గీతంలో చరమఘట్టం ఇప్పుడు వస్తుంది. మహాశకాల పరంపర మళ్ళీ పుడుతుంది. ఆ కన్య మళ్ళీ తిరిగివస్తుంది.. ఇప్పుడు ఒక క్రొత్తజాతి సువర్లోకంనించి భువర్లోకానికి అవతరిస్తుంది ఓ నిర్మల దేవతా, ల్యుసీనా, ఈ కొత్తగా పుట్టిన శిశువుమీద నీ కరుణామయ మందహాసాలు చిలుకరించు, ఈ శిశువుకాలంలో ఇనుపజాతి అంతరిస్తుంది, సువర్ణజాతి ఉదయిస్తుంది, ప్రపంచమంతటా వ్యాపిస్తుంది..." అని గానంచేశాడు. కనుకనే ఆయన్ని ఈనాడు క్రీస్తుకు పూర్వమే పుట్టిన క్రిస్టియన్ అంటారు.

ఒకనాడు టెలివిజన్‌లో మెక్‌డయార్మిడ్ ముఖం- ఆయన తన "థర్డ్ హిం టు లెనిన్" పాడుతున్నాడు.

"మైకేల్ రాబర్ట్స్, ఇంకా ఇతర దేవదూతలూ, ఓడెన్, స్పెండర్.. వీరెవరికీ కార్లయిల్‌కున్న ధైర్యంలో నీతిలో పదోభాగంలేదు. ఆ వంచకుల్లా కాక నేను శ్రామిక వర్గంలోవాడ్ని; శ్రామికుల కోసం కృషి చేస్తున్నానని గొప్పలుచెప్పుకునే వాళ్ళలో ఒకడ్నికాదు, శ్రామికుడ్నే.."

నేనన్నాను "బాబూ చాలా చక్కగా చెప్పావు బాగుంది, ఒక చిన్న సంఘటన చెపుతాను- మొన్న "19వ శతాబ్దపు ఫ్రెంచి కవిత" అనేది నాదోపుస్తకం పుస్తకాల అలమారులోంచి అదృశ్యమయింది. ఎవడో చెప్పకుండా పట్టుకుపోయాడే దొంగవెధవ అని కొన్నాళ్ళు వాపోయాను. కానీ ఒకనాడు అది కనిపించింది. ఒక ఆధునిక కుకవివచనకవితలో!"

"ఎవడండీ వాడు, మీ తెలుగువాడేనా ఏమిటి?" అన్నాడు పూర్

మెక్ డయార్మిడ్ -

రాత్రివచ్చిందోకల, ఒక్కొకల - అంతరంగంలో మల్టీడైమన్షన్ తెరమీద దృశ్యాలు. షా కోక్తో, నేనూ కూర్చుని నల్లమందు పొగతాగుతున్నాము. "వృక్షజాతి పదార్థాల్లో నల్లమందొకటే మనకు వృక్షస్థితిని సిద్ధింపజేస్తుంది. దాని మూలంగానే వృక్షజాలంలో ఉన్న ఒక అవ్యక్తమైన వేగం మనకు తెలుస్తుంది మామూలుగా నిశ్చలంగా కనిపిస్తాయి. కానీ వాటికున్న వేగం మన అసమర్థ ఇంద్రియాలు అనుమానించను కూడా లేవు" అన్నాడు కోక్తో. ప్రక్కనే పికాసో ఉన్నాడు, "నల్లమందు, వాసనా ప్రపంచంలో, చాలా తక్కువ అసహ్యత ఉన్న వాసన. ఆ వాసనతో పోల్చతగింది సర్కసువాసన గానీ లేక ఓడరేవు వాసన గానీ" కోక్తో "ఆ వాసన ఎంత ఇంద్రజాలం అల్లుతుందో చెప్పలేను. ఈగలు నాలుగు దిక్కుల్నుంచీ వచ్చి ముసురుకుంటాయి, వాటి తలల్లో స్వప్నాలు ముసురుకుంటాయి. బల్లులు గోడల కంటుకుని మూర్చపోతాయి. రాత్రి రాకకోసం నిరీక్షిస్తాయి"

నేనన్నాను. "నల్లమందు మా ఖండంనించి మీరు తెచ్చుకున్నారు కానీ దాని మర్మం మీకు తెలిసినంతగా మాకు తెలీదు". కోక్తో అన్నాడు 'యువ ఏషియా దానిపొగ ఇప్పుడు తాగదు ఎందుచేతనంటే వాళ్ళతాతయ్య తాగేడుకనక! యువయూరోప్ తాగుతుంది ఎందుకంటే వాళ్ళతాతయ్య తాగలేదుకనక! దురదృష్టం ఏమిటంటే యువేషియా, యువయూరోపును అనుకరిస్తూ ఉంది. కనక, నల్లమందు మా ద్వారానే మళ్ళీ తన జన్మస్థానం చేరుకుంటుంది."

ఇలా సంభాషణ సంచరిస్తూ ఉంటే. నామనస్సు కర్పూరపరాగంలా గాలిలో కలిసిపోతూ ఉంది. ఇలా ఉందేమిటి అన్నాను.

కోక్తో – "మేలుకోడానికి ప్రయత్నించకు. దాని మృదులాంగుళు ఉపలాలనకు లొంగు. ఒక్కసారి మేలుకున్నాడంటే వాడు వట్టి చవట- అంటే మేధావి అన్నమాట. నే నెక్కడున్నాను అంటాడు మూర్ఛపోయి తేరుకున్న ఆడదానిలా మేలుకొని ఉన్న కవిరాసే రాతలు చదవడం నిష్ప్రయోజనం."

నేనన్నాను "మరి కలల్లో తలమునిగిన కవి రాసే రాతలు ఎవరి కర్థమవుతాయి."

"రాజకీయవాది అయితే తప్ప కవి అయినవాడు తనని అర్థం చేసుకునే పాఠకుల సంఖ్యమీదనే ఆధారపడాలి. తనభాష గొంతుక పోల్చుకోగల్గినవాళ్ళు, తన భాష అంతరాత్మను పసిగట్టగలిగినవాళ్ళు తన పాఠకులు. ఎక్కువ మంది పాఠకుల కోసం ఆశించటం కవి లక్షణంకాదు" అన్నాడు కోక్తో.

ఇలియట్ అందుకుని "నేను నీతో ఏకీభవిస్తాను. రాజకీయ సంబంధం కవిత్వానికి తక్షణం గుర్తింపు తీసుకురాగలదు కానీ రేపు కూడా ఆ కవిత్వం చదవబడిందంటే ఆ రాజకీయ సంబంధం ఉందని కాదు లేకపోయినా చదవబడేదే, అది నిజంగా కవిత్వమయితే. ఎంచేతనంటే రాజకీయ పదార్థంకూడా మానవీకరింపబడి కవితగా మార్చబడకపోతే అది చదివి మరిచిపోవడానికి మాత్రమే అర్థమవుతుంది" అన్నాడు.

"సరే ఇలియట్, నీవు ఇడియట్ అవుతేగానీ కవిత్వం చెప్పలేవు. నల్లమందు పొగ తాగితే నీవు నీలో ఉండవు. నీ బాహువుల్లో నీ తలదాచుకో, భుజానికి చెవి జోడించు; ఇక చూడు–భూకంపాలు, విప్లవాలు, కర్మాగారాలు ప్రేలిపోవడం, సైన్యాలు సైన్యాలే పారిపోవడం, మహాప్రవాహాలు ముందుకు దూకడం- ఎన్నో చిత్రాలు నీ శరీ రాంతర్గతసీ మల్లో నక్షత్రాలు క్రిక్కిరిసిన రాత్రిలో నీ చెవి దర్శిస్తుంది."

అప్పటికే నాలో కాలమూ దూరమూ అంతర్ధానమయ్యాయి. శబ్దాలు సముద్రాలు వాటి సంగీతం విజృంభిస్తున్నాయి. ఆ అవ్యక్త మానసిక సముద్ర తరంగాల్లో తన "మచ్చూ పిచ్చూ" పద్యం పట్టుకుని పాబ్లో నెరూడా ఉదయించాడు. "ఉదయించు తమ్ముడా నాతో మరోసారి ఉదయించు" అని కేకవేశాడు. మరొకసారి కెరటాలమీద పాదఘట్టన చేస్తూ "నీవు ఇక్కడ పాతిపెట్టిన ఆ బానిసను తీసుకోనీ దళితజీవుల రొట్టెను ఈ భూమినించి లాగి వేసుకోని" అని ఆక్రోశించాడు.

నల్లమందు పొగ గదినిండా కమ్ముకుంది. గోడలమీద బల్లులు, ఈగలు, దోమలు కలల అలల్లో తేలిపోతున్నాయి. పసుపువన్నె కలలు ముసురుకుంటున్నాయి. గౌరవర్ణజాతుల కంఠాలు వినిపిస్తున్నాయి. ఇషికవాటకుబొకు తనలోతైన జపానీ గొంతుతోగానం చేస్తున్నాడు.. "నేనొక దుఃఖభాజనుడ్ని, నేను బలహీనుడ్ని కానీ నా చేతిలో ఒక అద్వితీయమైన భయంకర ఖడ్గం ఉంది. నేను యుద్ధం చేయకపోతే దాన్ని నేను సహించలేను. కానీ నేను జయించలేకపోతున్నాను. అంటే ఇక మరణమే నాకు శరణమన్నమాట. కానీ నాకు చావంటే పరమరోత. నాకు చావడం ఇష్టంలేదు. మరి బ్రతకడం ఎలా?"

ఏ ప్రేమ మానవతకు రూపాంతరమో, చిత్తశుద్ధి కీ , నీతికీ, ధైర్యానికీ మారుపేరో, ఏ ప్రేమ ఇద్దరు పరస్పర అజ్ఞాత వ్యక్తుల్ని విలీనంచేసి సృష్టి అనంతతతను ఆవిష్కరిస్తుందో, ఏ ప్రేమ సర్వమానవజాతినీ ఒక్క చరిత్ర మూసలో వేసి మానవతా హిరణ్యంగా మలిచివేస్తుందో, ఏ ప్రేమచేత మనిషి, తోటిమనిషి బాధచూచి ద్రవిస్తాడో, ఏ ప్రేమచేత మనిషి అన్యాయంమీద, దౌర్జన్యం మీద తన ఇనప పిడికిలి ఝుళిపిస్తాడో, ఏ ప్రేమవల్ల మనిషి న్యాయాన్ని నిరోధించే శక్తుల్ని తన పవిత్ర కర్కశ పరశువుకి బలిచేస్తాడో, గాయపడ్డ మానవతకి రక్తంతో తర్పణం చేస్తాడో, ఆ యుగయుగాల శిక్షా ఫలితంగా మానవుడు సాధించి రక్తకణాల్లో నిక్షిప్తం

చేసుకున్న సంపదను కాలితో తన్నేవాళ్ళు దేశంలో కవులుగా నేతలుగా పెరుగుతున్న ఈ రోజుల్లో మానవరక్తాన్ని, స్వేదాన్ని మకుటాలు చేసుకుని మస్తకాల మీద అలంకరించుకుంటున్న ఈ రోజుల్లో-

ఆకాశాలు తగిలే శిఖరాలు, విమలవాయువులు విహరించే ఆకాశాలు, పూల భాషలు మాట్లాడే అమాయక వాయువులు, కిరాతుల మీద జ్వలించే రంగులు ఉమిసే పువ్వులు, మానవతతో దోబూచులాడే రంగులు, కాంతీ కమనీయత మనిషిమనిషికి సమానంగా పంచి పెట్టాలని ఆక్రోశించే మానవత - ఇవన్నీ ఎవరిమనసులో వెన్నెల తిరునాళ్ళు చేసుకుంటున్నాయో, వాడు చచ్చిపోవడమే మేలు. నేను చచ్చిపోవడం మంచిదే అయింది. చచ్చిపోతే ఈ నీచుల తమాషా చూస్తూ ఉండవచ్చు- నాకేంకావాలి; నా పాటల్ని పూలూ పక్షులూ గానం చేస్తున్నాయి, గాలులూ ఆకాశాలూ దూరతీరాలకు మోసుకుపోతున్నాయి, పర్వతాలూ అరణ్యాలూ ప్రతిధ్వనిస్తున్నాయి, నదులూ సముద్రాలూ ఘోషిస్తున్నాయి, సంధ్యలు ప్రతిఫలిస్తున్నాయి ధ్వనులు జనులు జీవనాడులతో మేళవిస్తున్నారు. కనక కాగితానికి కలానికి ఇక గుడ్‌బై-

ఓ శేషేన్ వేణువుధరించి వచ్చావు మాతృగర్భంనుంచి ఈ లోకంలోకి
పాడుతున్నావు నీ స్వరమంతా పూరించి వేణువులోకి,
వినాలని దూరదూరాల నదీతీరాల్లో గోవులు మేపేవాళ్ళు
కొండకోనల్లో పిల్లనగ్రోవులు ఊదేవాళ్ళు
రాట్నాల సంగీతంలోనుంచి నూలు పిండేవాళ్ళు
ప్రాతఃకాలంలో పాలుపితికే వాళ్ళు
వినాలని నీస్వరం మొర ఆలకించాలని పాడుతున్నావు
నీ స్వప్నాలు ఫలిస్తాయి
నీ పాటలో ప్రజలు వాళ్ళ గొంతులు ఏరుకుంటారు
నీ పాట బజారుల్లో పడవరేవుల్లో పొలాల్లో సాహస బీజాలు చల్లుతుంది

నీ పాటలు కార్మికులు కర్షకులు సైనికులు నావికులు పాడుతారు
చెట్లు పూచేలా పాడుతారు వాయువులు పక్షుల్ని తూచేలా పాడుతారు
పర్వతాలు గర్విష్ఠి శిఖరాలు ఊపుతాయి
నీ స్వరాలు ఫలిస్తాయి
నీ పాటలు నిలుస్తాయి

# ఏడో సర్గ

చచ్చిపోయినవాడికి, బ్రతికున్నవాడికి కనిపించనివికూడా కనిపిస్తాయి. శబ్దాలు కనిపిస్తాయి- శతాబ్దాలు కనిపిస్తాయి- వినిపించే సంగీతాలు కనిపిస్తాయి- కనిపించే రంగులు వినిపిస్తాయి- కళ్ళపని చెవులు, చెవులపని కళ్ళుకాళ్ళపని చేతులు, చేతులపని కాళ్ళు ఇలా శరీరంలో ఒకదానిపని మరొకటి చేస్తే చావు సారాంశం బ్రతుకులో తెలుసుకోవచ్చు; బ్రతుకు సారాంశం చావులో తెలుసుకోవచ్చు. ఇదీ ఇప్పుడు నేననుభవిస్తున్న అసూయాజనకమైన అవస్థ.

షైకోక్తో ఈ అవస్థనే నల్లమందు ధూమపానంతో సిద్ధింప జేసుకోవాలనుకున్నాడు. ఆయన అంటాడు "అయిదుగుక్కలు పీలిస్తేచాలు, మనసులో భావం తలక్రిందులౌతుంది. ఒకనల్లటి ఈతగాడిలా హ్రస్వరూపం ధరించి, చైనీస్‌సిరాలా ఉత్కృష్ట వాంఛలు రేపుతూ దేహంలోని సరోవరజలాలంతటా మందమందంగా వ్యాపిస్తుంది; నల్లమందు అమూర్తమయిన వస్తువుకు మూర్తినిస్తుంది. ఊహను పదార్థంగా మార్చి పరిమాణం ఇస్తుంది." "మనకు కనిపించనివాటికి మనం కనిపించేలా చేస్తుంది! మనల్ని భూతాలనుచేసి మనకు కనిపించకుండా తిరిగే భూతాలకు భయం కలిగిస్తుంది. ఆ పొగ పీల్చిన తర్వాత దేహం ఆలోచిస్తుంది. మెదడు

కాదు దేహం కలలుకంటుంది; మృదులమవుతుంది, శకలాలవుతతుంది ఎగురుతుంది, ఎగిరిపోయి తననితానే ఆకాశంవించి పక్షిలా చూచుకుంటుంది."

ఏప్రిల్ మాసంవచ్చింది తోటలో వనజ్వాల ఎర్రగా విరగబూచింది, అప్పుడే వచ్చిన శ్రీ శ్రీ ఉత్తరం చదువుతున్నాను. నవుకరు కాఫీ తెచ్చాడు. నాకూ, ప్రక్కనే ఏదో చదువుకుంటున్న రేంబోకూ, ఇచ్చాడు. నేను కొంచెం చప్పరించి "ఏమిటి పవుడర్‌పాలు వేశావా" అన్నాను.

"అవునండీ, 10 గంటల్లోపుగా హైదరాబాదులో గేదెలుకూడా నిద్రలేవవు" అన్నాడు నవ్వుతూ.

రేంబో నవ్వి "శ్రీ శ్రీ ఏంరాశాడు"

ఒకలైను వినిపించాను- "మీ కవితలో మీరొక పరుసవేది కోసం వెతుకులాడుతున్న అన్వేషిగా కనిపిస్తారు నాకు.."

"మీ శ్రీ శ్రీ గారికి ఆల్కెమీ తెలుసా ఏమిటి" అన్నాడు రేంబో

"ఏమో"

నేను బెల్జియం, స్కాండినేవియా, ఇటలీ, సైప్రస్, అబిసీనియా ఇలా దేశదేశాలు తిరిగాను, మీరు స్వర్ణవిద్య అనే ఆల్కెమీకోసం."

"వేమన పద్యాల్లోలా మీ పద్యాల్లోకూడా అందుకేనేమో కొన్ని శబ్దాలు భావాలు అర్థంకావు," అన్నాను, రేంబో చిరునవ్వు నవ్వి ఏ పద్యం గురించి అంటున్నారు; ఎన్‌ఫాన్సేనా మీ మనస్సులో ఉంది?" అన్నాడు. "ఔను మరి" "సానెట్ దె వోయెల్స్‌లో" కూడా అలాగే అర్థం కానివి ఉన్నాయి," అన్నాను. "అది తంత్రాలకు సంబంధించిన వ్యవహారం; ప్రతిరంగుకూ ఒక శబ్దండుంది, ప్రతిశబ్దానికి ఒక నిర్దిష్టమైన రంగుఉంది." "నిజంగా?" "ఔను నాకలా కనిపిస్తాయి, వినిపిస్తాయి" అన్నాడు రేంబో

గంభీరంగా. నేను కాఫీ తాగుతున్నవాడ్ని నిలువునా నిర్వణ్ణుడ్నయి పోయాను. ఒక నిమిషం ఊరుకుండి, "వేమన్నను కలుద్దామా" అన్నాను. రేంబో "నిజంగా నాకు చాలా యిష్టం" అన్నాడు. "ఎక్కడ ఆయన ఆశ్రమం?" "ఎక్కడని చెప్పేది. అదొక విచిత్రమైన మనస్సు. అన్ని చెట్లు, అన్ని అడవులు, అన్ని ఊళ్ళు అన్నీ ఆయన ఆశ్రమాలే" "మరి ఎక్కడికని వెళ్ళాలి మనం." "ఏమో-అలా వెడుతూండటమే. మీరు సిద్ధమయితే ఈ సాహసయాత్ర సాగిద్దాం." సరే అని ఇద్దరం కాఫీలు ముగించాం. ప్రవేశించాం విశాల విశ్వంలోకి; ఊళ్ళూ, అడవులూ, పొలాలు, నదులు, నగరాలు గడుస్తూ నడుస్తూ వెళ్ళగా వెళ్ళగా ఒక ఊళ్ళో ఒక వీధిలో ఒక చెట్టుక్రింద ఒకకాలుజాపి, ఒక కాలుమడిచి, మడిచిన కాలిమీద గడ్డంపెట్టి, దృష్టి నేలమీద నిలిపి, కూర్చొనిఉన్న ఒకాయన అల్లంతదూరాన కనిపించాడు. రేంబోకుచెప్పాను, ఈయనే వేమన అని. సమీపించాం- గోచితప్ప ఏమీలేదు ఒంటిమీద. మేము దగ్గర ఉన్నా ఆయన ఎలా కూర్చొన్నాడో అలాగే ఉన్నాడు. కదలలేదు, మెదలలేదు, మావంక చూడలేదు. ఒక చిరునవ్వుమాత్రం ఆ వంగిన మొహంలో కనిపించి పోయింది. ఏదో చిన్న కర్రపుల్లతో నేలమీద రాస్తున్నాడు.రేంబో అన్నాడు "మీకు పరుసవేది సిద్ధించిందా?"- వేమన అలాగే పూర్వంలా కూర్చున్నాడు. ఆ నేలమీద రాసింది చదివాము. 'హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజత స్రజాం' అని వ్రాసిన అక్షరాలు కనిపించాయి. "మనం అడగబోయేది ముందే వ్రాశాడు. ఎలా గ్రహించాడు మన మనస్సులో ఉన్నది." అని రేంబో ఆశ్చర్యంగా అడిగాడు. "నీ ఊహ భూతభవిష్యద్వర్తమానాల్లోనూ ఉంటుంది. నీవిప్పుడు ఊహించి ఇప్పుడే ఊహించాననుకోడం అజ్ఞానం. ఊహ అమూర్తము అమూర్త వస్తువు కొందరికి కనిపిస్తుంది." అన్నాను నేను, నాకా విషయాలేమిటో తెలీకుండానే. అంటే మరొకరెవరో నా శరీరాన్ని ఉపయోగించుకుని నా నాలుకతో మాట్లాడుతున్నట్లు. మేము వెనక్కి తిరిగి వచ్చేశాం 'నాకు స్వర్ణంకాదు కావలసింది, స్వర్ణంకంటే విలువైన శక్తి పువ్వుల

భాషలు. నక్షత్రాలపాటలు వినగలగాలి. సంధ్యాకాశంతో సంభాషించాలి, నీలాకాశం క్రింద తుకతుకలాడె సముద్రపు గుండె చూడాలి, శతాబ్దాల గుండెలనించి దూసుకుపోయే మానవతావేగాన్ని త్రికాలాల్లో దర్శించాలి, శబ్దాలుచూడాలి. రంగులు వినాలి. దేశ కాలాతీతమైన అనంతాన్ని భ్రూమధ్యరేఖలో ధరించాలి. ద్రష్ట కావాలి అన్నాను- "అవును నేనూ దానికోసమే అన్వేషిస్తున్నాను, మళ్ళీవెడదామా' "ఇప్పుడెక్కడుంటాడో.. దొరుకుతాడో దొరకడో "

# ఎనిమిదో సర్గ

సూర్యుడు ఉదయించాడు, కాలదూరాలతో వలలల్లి జగజ్జనుల మీద విసిరివేస్తున్నాడు. మళ్ళీ తోట-వనజ్వాల - కాఫీ-రేంబో-ఇవాళ శేషేంద్ర అంతర్ముఖుడై ఉన్నాడు. చూపులు మాత్రం విరగబూచిన వనజ్వాలపూలమీద పరుగులిడుతున్నాయి. "ఏమిటా మౌనముద్ర" అన్నాడు రేంబో అంతే - శేషేన్ ఏదో ఒక గ్రీక్ ఆరెకిల్‌లా మాట్లాడసాగాడు "కవి అన్నవాడు ద్రష్టకావాలి ఎలా అవుతాడు. అన్ని పాపాలూ చేయాలి, ఎంతో మనోబలం కావాలి తనమీద తానే ఇంతహింస విధించుకోవాలంటే. అప్పుడు వాడొక ఘోరమైన నేరస్థుడౌతాడు, కిరాతకుడౌతాడు, ఋషి అవుతాడు! ఎందుచేతనంటే వాడు అవ్యక్త్యాన్ని చేరాడు. సామాన్య మానవులు సుఖలాలసులై ఉన్న చోటనే ఉండిపోగా, వీడుమాత్రం బాధాగ్నుల్లో దూకి ఒక నూతన సువర్ణంగా బయటికి వచ్చాడు. నాకు సువర్ణం దొరకడం చాలదు, నేను సువర్ణంకావాలి" రేంబో నన్నావహించాడు.

వనజ్వాలనించి ఒక పువ్వురాలింది. దాంట్లోనించి దిగి భోజుడు వచ్చాడు. మేము అభ్యుత్థానంచేసి ఆయన్ని కూర్చోబెట్టాము. ఆయన అన్నాడు, "అలా పువ్వుమీద ఎక్కి వెడుతూ మీ సంభాషణ వినివచ్చాను. విన్నారా, వాల్మీకి మొదట ఎన్నో పాపాలు చేశాడు, బాధలు అనుభవించాడు,

కిరాతుడయ్యాడు, అవ్యక్త్యాన్ని వ్యక్తం చేసుకున్నాడు. అనుభవంతో ఒక అందని బిందువు నందుకున్నాడు. అక్కడ ఆయన కిరాతుడూ కిరాతుడ్ని శపించేవాడు, వేటగాడూ వేటాడబడేవాడూ.

ఇత్థం విలప్య విపినే దయితాం విచిన్వన్
రామో న తత్ర ధృతిమాన్ న హి లక్ష్మణశ్చ
తాదృగ్విధామపి కథాం కథయన్ స్వవాచా
వల్మీకజన్మమునిరేవ కఠోర చేతాః

రేంబో ఇంకా చాలా ఆలోచనాపూరితుడయ్యాడు "బోదెలేర్ మహాకవి, ప్రథమద్రష్ట, రాజులకు రాజు, నిజమైన దేవుడు" అన్నాడు. నేనన్నాను, "రేంబో అటుచూడు. ఆ సూర్యోదయం, అదే సూర్యాస్తమయం అవుతుంది మరో తీరానికి. ఈ తీరాలు, ఈ సంధ్యలు ఇంద్రియాల ఇంద్రజాలం, ఈ ఇంద్రజాలం వలనుంచి తప్పించుకున్న వాడికి వాల్మీకే బోదిలేర్, బోదిలేరే వాల్మీకి. ద్రష్ట ఒక్కడే - త్రికాలాబాధ్యుడు."

నేను లేచాను, రేంబో భుజంమీద పాయంగా చేయివేసి ముందుకు నడుస్తున్నాను. ఏదో భారం నన్ను ముంచుకువస్తూ ఉంది. నా లాల్చీ అంతా చెమటతో తడిసిపోయింది. భుజంమీద శాలువా జారిపోయింది. అలా వెడుతూ ఉన్నాను వనజ్వాలవైపు; రేంబోకు అర్థంకాక అలాగే నిర్విణ్ణుడై నిలబడిపోయాడు. వెనక గుంపులు గుంపులుగా వస్తున్నారు భవభూతి. కోక్టో, లియోనార్డో, నెరూడా, మైకలేంజేలో, బోద్లైర్, మల్లార్మే, కాళిదాసు, ఇలియట్, పౌండ్, జార్జ్ శాంటాయనా, భాసుడు, గాలిబ్, కృష్ణరాయలు, సాదా, మీర్, ఎర్రన, శ్రీనాధుడు, లోర్కా, ఇక్బాల్, రోడే, రిల్కే, వర్జిల్, పికాసో, సోక్రటీస్, జీసస్, కవబాటా, కవఫీ, సెఫరీస్ ఎవరెవరో ఎందరో అలలు అలలుగా తలలు తలలుగా పరంపరలుగా రేఖలుగా కాంతులు ముసురుకున్నట్లుగా గుంపులుగా గుంపులుగా వస్తున్నారు.

నేను ముందున్న వనజ్వాలవైపు వెళ్ళుతున్నాను, వెళ్ళుతున్నాను, వనజ్వాల నన్ను అడ్డగించలేదు; అందులోకే వెళ్ళిపోయాను. నన్ను తనలోకి తీసుకుంది. నేను లేదు. వనజ్వాలఉంది. వెనకవస్తున్న గుంపులు, ఆ తలల పరంపరలు, నావెనకాలే వనజ్వాలవైపు క్రమక్రమంగా వచ్చి పువ్వు పువ్వులోనూ లీనమై పోయాయి మిగిలింది ఎర్రగా విరగబూచిన వనజ్వాల - ఎప్పటిలాగే ఏప్రిల్ మాసము - మిలియన్ల పూలు గొంతులువిప్పి కాకలీకంఠాలతో పాడుతున్నాయి.

"రండి, మా గుమ్మానికి తోరణాలుకండి
మానవ జీవితాన్నొక మహోత్సవం చేయండి"

"పిడికెడు వసంతాలు అందరికీ భిక్షపెట్టమంటావు
నీకుమాత్రం ప్రేమించే రెండు పెదవులు చాలునంటావు"

"పోండి
రేపటి గులాబీల తోటల్లో
ఉషస్సులై పోండి
ఉషస్సులై పోండి"

ఇది వింశతితమశతాబ్ద
పంచసప్తతితమ సంవత్సరాన (1975)
విప్లవభాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత
బుధజనవిధేయ శేషేంద్రనామధేయ
కవివర్యప్రణీత నేనూ నా నెమలీ
నామాంతరసమేత
మయూరపర్వముతో మహాకావ్యము
భారతీయ కర్షకేతిహాసోపేత
ఆధునిక మహాభారతము సమస్తము సమాప్తము